శ్రీః

శ్రీ పరదేవతాయై నమః

శ్రీవెంకటేశ దైవజ్ఞ విరచిత

# సర్వార్థ చింతామణి

(ప్రాచీన జ్యోతిష గ్రంథము)


ఆంధ్ర తాత్పర్య కర్త :

తర్కాచార్య, భాషాప్రవీణ

డా॥ శ్రీ కంభంపాటి రామగోపాల కృష్ణమూర్తి M. A. Ph. D.






ప్రకాశకులు :

ఫోన్:-6252

గొల్లపూడి వీరాస్వామి సన్
శ్రీ సీతారామా బుక్ డిపో,
కోటగుమ్మం-రాజమండ్రి-533101


 1991 వెల : 54-00

# పీఠిక

సర్వార్థ చింతామణి యీ గ్రంథము ప్రాచీనమైనది. అప్ప యార్యపుత్రుడును, పండితుడు అయిన "వెల్నాడు ఓరుగల్లు వెంకటేశ దైవజ్ఞు"నిచే చెప్పబడెను. జాతకఫలితములు తెలుసుకొనుటకు, యీ గ్రంథము విశేష ఉపయోగముగ యున్నది.

జ్యోతిషశాస్త్రమంతయు, యీ గ్రంథమున ప్రతివారికి సులభముగ తెలియునట్లు వ్రాయబడెను. జ్యోతిషశాస్త్రము నేర్చుకొను వారికిని జ్యోతిషశాస్త్రము బాగుగ అభ్యసించిన పండితులకు కూడ యీ గ్రంథము విశేషఉపయోగముగ నున్నది. అందువలననే యీ గ్రంథము విశేషప్రచారములో యున్నది.

ఈ గ్రంథములో మొదట సంజ్ఞాధ్యాయమంతయు విపులముగ చెప్పియుండెను. సంజ్ఞాధ్యాయము యింత విపులముగ ఏ యితర గ్రంథములలోను చెప్పబడియుండలేదు.

తరువాత తను, ధన, భాతృ, మాతృ, పుత్ర, శతృ, కళత్ర, ఆయుర్దాయ, భాగ్య, రాజ్య, లాభ, వ్యయభావములయొక్క ఫలితములు సులభముగ తెలుసుకొను విధానములు విపులముగ చెప్పెను. అనగా ద్వాదశభావ ఫలితములు, యీ గ్రంథము చదివి సులభముగ తెలుసుకొనవచ్చును.

తరువాత రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, రాహు, కేతు మహాదశల ఫలితములు, తెలుసుకొను విధానములు చక్కగ చెప్పబడెను.

తరువాత సాముదాయక అంతర్దశాఫలితములుకూడ విపులముగ చెప్పబడెను. ఆవిధముగ జాతకఫలితములు పూర్తిగ తెలుసుకొనుటకు వీలుగ ఈ గ్రంథములో సంజ్ఞాధ్యాయము, ద్వాదశభావ ఫలితములు, దశాఫలితములు, దశాంతర్దశాఫలితములు ప్రతివారికి సులభముగ బోధపడునట్లు తెలిపెను. అనగా జాతకభాగమంతయు యీ ఒక్క గ్రంథములోనే చెప్పబడెను.

ఈ గ్రంథము చదివినచో జాతకభాగమంతయు పూర్తిగ తెలియును. అందుచే దీనితో సమానమైన గ్రంథము వేరొకటిలేదు. పరాశర్యము, జైమిని మొదలగు పద్ధతులన్నియు క్రోడీకరించి, ఈ గ్రంథము వ్రాసినట్లు తెలియుచున్నది.

జ్యోతిష శాస్త్రము అతి ప్రాచీనమైన భారతీయ విజ్ఞానశాస్త్రము. ఈశాస్త్రము మన మతగ్రంథములైన వేదములలో చెప్పబడియున్నది. ఈ శాస్త్రము పురాతనమునుండియు శాఖోపశాఖలుగ విస్తరింపబడినదై, వివిధ విషయములను లోకహితముగ తెలియజేయుటకు సాధనముగ యున్నది. ఆకాశమందు సంచరించు గ్రహముల, నక్షత్రముల సంబార విశేషములను తెలుపునది సిద్ధాంతభాగము.

గ్రహములయొక్కయు, నక్షత్రములయొక్కయు రశ్మిప్రభావమువలన ప్రాణికోటిపై కలుగబోవు శుభాశుభ ఫలితములు తెలియజేయునది జాతక భాగమనబడుచున్నది.

మరియు భూమండలముపై పరిపాలకుల గురించియు; కలుగబోవు ప్రపంచ ఉపద్రవములను గురించియు, వర్షముల గురించియు, వాతావరణములగురించియు, సస్యముల వృద్ధి, క్షయములగురించియు, భూకంపము మొదలగు ఉపద్రవములను గురించియు, యింకను అనేక విషయములగురించి తెలియజేయు భాగము సంహిత జ్యోతిషభాగమనియు, యీ శాస్త్రము మూడుభాగములుగ విభజింపబడినది. ఈ శాస్త్రమునకు మన దేశమందేగాక, ప్రపంచములో సమస్త దేశములయందును విశిష్టస్థానము కలదు. దైవజ్ఞుడు లేని దేశములో ప్రభువు నివసించరాదు. ప్రజల సుఖముగోరు ప్రభువు, దైవజ్ఞులను తమ దేశము నందుంచుకొని, పోషించవలయునని చెప్పబడియున్నది.

జ్యోతిష శాస్త్రము, ఆయుర్వేదము, గణిత శాస్త్రము, వేదాంతము, మొదలగు శాస్త్రములు అభ్యసించుటవలన మానవులకు విజ్ఞాననేత్రము వికసించును. అట్టి విజ్ఞానశక్తితో పురుషార్థములైన ధర్మార్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములను సులభముగ సాధించవచ్చును. బహుశాస్త్ర పరిశీలనలేని జీవితము పశుజీవితముతో సమానమువంటిది. ఈ శాస్త్రజ్ఞానము లేనివారు కూపస్థమండూకము'' వలె నుందురు.

శ్రీ

# సర్వార్థ చింతామణి

## (హోరాశాస్త్రము)

## విషయసూచిక

## సంజ్ఞాధ్యాయము [1-38]

## 2. ద్వితీయాధ్యాయము [38-60]

[ తనుభావాధ్యాయము ]



## తృతీయాధ్యాయము [60-85]

[ ధనభావాధ్యాయము ]



## చతుర్థాధ్యాయము [86-93]

( సహజభావాధ్యాయము )

## పంచమాధ్యాయము [94-113]
## (బంధుభావము - చతుర్థభావము)



## షష్ఠాధ్యాయము [113-121]
## (సుతభావము - పంచమభావము)



## సప్తమాధ్యాయము [123-129]

## అష్టమాధ్యాయము [130-145]



## నవమాధ్యాయము [145-156]



3 

## దశమాధ్యాయము [156-163]



## ఏకాదశాధ్యాయము [163-168]



## ద్వాదశాధ్యాయము [168-170]



## త్రయోదశాధ్యాయము [170-176]

## చతుర్దశాధ్యాయము [176-187]



## పంచదశాధ్యాయము [187-199]



## షోడశాధ్యాయము [199-202]



## సప్తదశాధ్యాయము [202-214]



## అష్టాదశాధ్యాయము [214-216]



## ఏకోనవింశాధ్యాయము [216-224]

## వింశాధ్యాయము [224-231]



## ఏకవింశాధ్యాయము [231-238]



## బుధఫలాధ్యాయము [238-245]



## గురుదశాధ్యాయము [245-242]



## శుక్రదశాధ్యాయము (252-259)

— * —

శ్రీః

# సర్వార్థ చింతామణి

## 1. సంజ్ఞాధ్యాయము

1. శ్రీమద్వేంకటగిరీశ్వరాదినిలయం శ్రీవేంకటేశం హరిం
నత్వా వేంకటనాయకం గురువరం జాతోప్యహార్యాత్సుధీః।
జ్యోతిశ్శాస్త్ర మహాబ్ధిసారగహనే వస్తూన్యనేకాత్మకం
హోరాతంత్ర విచిత్ర హారికమిదే సర్వార్థ చింతామణిః॥

శ్రీ వేంకటగిరి నివాసుడగు హరిని, [illegible] శ్రీ వేంకటేశుడను విష్ణు మూర్తిని వేంకటనాయకుని గురువును నమస్కరించి, [illegible] పండితుడనైన నేను, వేంకటేశ [illegible], జ్యోతిశ్శాస్త్రమను [illegible] సారము పొందుటకు [illegible] సర్వార్థ చింతామణి అను గ్రంథమును హోరాతంత్రము తెలుసుకొను జ్యోతిష్కుల సంతోషమునకై చెప్పుచున్నాను.

2. రక్తాంబుజ వదనం దేవం సర్వారంభేషు సర్వదా।
ప్రణమంతి వయం దేవా స్తం నమామి గజాననం॥

ఎఱ్ఱతామరపువ్వు వంటి కాంతికల దేవుని, ఏ దేవుని సర్వారంభములందు ఎల్లప్పుడు దేవతలు నమస్కరింతురో, ఆ గజాననుని నమస్కరించుచున్నాను.

3. వాగ్విభూతిప్రదా దేవీ యాశ్వేతాంబురుహస్థితా।
కర్పూర ధవళాకారా స్వయంనృత్యతు వాచి మే॥

ఏ దేవి తెల్లతామర పద్మమందున్నదో, వాగ్విభూతినిచ్చునదో, కర్పూరమువలె తెల్లని దేహముకల ఆ వాగ్దేవి స్వయముగా నావాక్కునందు నాట్యము చేయుగాక :

4. మేషాది రాశయస్సర్వేదినేశ ప్రముఖాగ్రహాః।
యేచలోకోపకర్తారః పాంతుమామిహతే సదా॥

మేషాదిరాశులు, రవ్యాది గ్రహములన్నియు, ఎవరైతే లోకోపకారము చేయువారో, అట్టివారు నన్నెప్పుడు రక్షింతురుగాక।

5. యజ్జాతకేనిగదితంభువి మానవానాం
తత్రాప్యశేషమపినకలంకథయన్తి తజ్జ్ఞాః।
ప్రశ్నేఽపిజన్మసదృశో భవతిప్రభేదః
ప్రశ్నస్య చాత్రజననస్య న కశ్చిదస్తి॥

పండితులు జాతకమున ఏది చెప్పబడినదో, దానిని ప్రశ్నల్లో కూడ చెప్పుదురు. ప్రశ్న జన్మతో సమమే. ప్రశ్నకు జన్మకు భేదమేమియును లేదు.

తత్రాదౌరాశి, తదీశ్వరవివేకమాహ:-

6. సప్తవింశతి భంచక్ర మష్టోత్తరశతాంఘ్రికం।
నవాంఘ్రిరాశికం ప్రత్యఙ్ముఖం చలతి ఖే సదా॥

ఇరువదేడు నక్షత్రములు, వానికి 108 పాదములు, తొమ్మిది పాదము లొక రాశిగా, 12 రాశులుకల చక్రము ఆకాశమున ఎప్పుడును పడమటి ముఖముగా తిరుగు చుండును. సూర్యాదిగ్రహములు, అశ్విన్యాది నక్షత్రములును తూర్పున ఉదయించి, పడమరగా ప్రయాణించి, పడమర దిక్కున అస్తమించును.

7. తదధశ్శని గుర్వార సూర్యశుక్రబుధేందవః।
ప్రాగ్యాయినోఽపిచక్రేణ యాంతిభూమేః ప్రదక్షిణం॥

ఆ నక్షత్ర చక్రము క్రింద శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్రులు తూర్పుగా వెళ్ళుచున్నను, చక్రముతో వెళ్ళుచున్నందున, భూమికి ప్రదక్షిణము చేయుచు చక్రముతో వెళ్ళుచున్నారు.

8. భూతారాగ్రహగోళానాం ఖస్థానాం గుణసంక్రమాత్।
భౌతికానాం చ జంతూనాం భిద్యంతేహి గుణక్రియాః॥

ఆకాశమందున్న భూమి, నక్షత్రగ్రహ గోళముల యొక్క గుణములు సంక్రమించినందున భౌతికమైన ప్రాణుల యొక్క గుణములు, క్రియలు భేదించు చున్నవి.

9. తత్తత్కర్మ విపాకస్యసూచకం గోళలక్షణం।
జ్ఞాత్వాతదనుసారేణ జన్మాదిఫల మున్నయేత్॥

వారివారి కర్మపరిపాక సూచకమైన గోళ లక్షణమునెరిగి, తదనుసారముగా జన్మాదిఫలమును చెప్పవలెను.

10. తస్మాత్సూర్యాధిఖేటానా మధికారబలాదికం।
అనుక్తమన్యతోగ్రాహ్యం వక్ష్యమిప్రకృతోచితం॥

కావున, రవ్యాదిగ్రహములయొక్క అధికార, బలము మున్నగు దానిని ప్రకృతమునకు తగినది చెప్పుదును. ఇక్కడ చెప్పనిది మరొకచోట నుండి గ్రహింప దగినది.

11. భౌమఃకవిజ్ఞేంద్వినసౌమ్యశుక్ర, వక్రేజ్యమందార్కసుతామరేజ్యాః।
మేషాదిభానామధిపాః క్రమేణ, తదంశకానామపి తే భవేయుః॥

మేషాది రాసులకు తన్నవాంశలకును అధిపతులు— రవి—సింహము, చంద్రుడు-కర్కాటకము, కుజుడు-మేషవృశ్చికములు, బుధుడు-మిధునకన్యలు, గురుడు-ధనుర్మీనములు, శుక్రుడు—వృషభ తులలు, శని-మకర కుంభముల కధిపతులు-

12. మేషాదిమూర్ధావదనం గళోరో
హృత్కుక్షి వాసోభృత లింగగుహ్యం।
తతోరుజానుద్వయ మంఘ్రిపాదం
పాపాన్వితం యత్తదుపైతి నాశం॥

కాలపురుషునకు మేషము శిరస్సు, వృషభము ముఖము, మిధునము కంఠము, కర్కాటకము రొమ్ము, సింహము హృదయము, కన్య ఉదరము, తుల కటి, వృశ్చికము నాభిలింగములమధ్య ప్రదేశము—వస్తి; ధనుస్సు గుహ్యము, మకరము తొడలు; కుంభము జానుద్వయము-మోకాళ్లు, మీనము కాళ్ళు, జన్మకాలమున ఏరాశి పాపగ్రహయుక్తమో ఆ అవయవము దెబ్బతినును.

13. మేషస్తు మేషోవృషభస్సఏవ, కర్కీతుశీరంత్వథవృశ్చికోఽళిః।
వ్యత్యస్తమత్స్యద్వయ మశ్వజంఘశ్చాపోమృగాస్య స్సగదంసవీణం॥

రాశి స్వరూపములేవియనగ-మేషము గొఱ్ఱె, వృషభము ఎద్దు, మిధునము గద వీణలను ధరించిన దంపతులు; కర్కాటకము-పీత; సింహము-సింహమే, వృశ్చికము తేలు, ధనుస్సు—గుఱ్ఱపు పిక్కలు కలిగిన విల్లును ధరించినవాడు, మకరము-మృగముఖముకల మొసలి, మీనము-పరస్పరము పుచ్ఛముఖములుకల రెండు చేపలు.

14. నృయుక్ప్రుతన్వీ సకరాగ్ని సస్యా నౌస్థా తులామానధరేతివింద్యాత్।
ఘటీజలాదానకరోహరిస్తు సింహస్వనామానుగుణాహిరాశయః॥

కన్య-సస్యమును, దీపమును చేయులతో పట్టుకొని నావమీదనున్న కన్య, తుల-త్రాసును ధరించిన పురుషుడు, కుంభరాశి-భుజమందు కడవను ధరించిన పురుషుడు. ఇట్లు మేషాది రాశులు పేరునకు తగినట్లు గుణములు కలవై యుండును.

15. రాశీనా ముదయోలగ్నం జన్మని ప్రాశ్ని తేఽపివా।
నవీవప్రథమోవర్గ స్త్వస్యేవర్గా స్త దంశకాః॥

జన్మయందైనా, ప్రశ్నయందైనా అప్పటి కేరాశి యుదయించుచుండునో అదే లగ్నమనబడును. షడ్వర్గులో అదే మొదటి వర్గము. తక్కినవి తదంశలే.

16. యుగ్మేందు సూర్యౌభవనే రవీందూనాథావయుగ్మే భవనస్యచార్థే।
రాశింత్రిధాకృత్య దృకాణమాహు స్తదీశ పుత్రేశ శుభాధినాథా॥

రాశిని రెండు భాగములు చేయగా వాటికి హోర అనిపేరు. ఓజరాశి (బేసిరాశి- 1, 3, 5, 7, 9, 11) యందు ప్రథమ హోరకు రవి, ద్వితీయ హోరకు చంద్రుడును, యుగ్మ (సరిరాశులు, 2, 4, 6, 8, 10, 12) రాశులందు చంద్ర సూర్యులును హోరాధిపతులు. రాశిని మూడు భాగములు చేయగా దానిని ద్రేక్కాణము, దృకాణము అందురు. దేనిలోనైనను ప్రథమ ద్రేక్కాణమునకు దాని అధిపతియు, రెండవ దానికి పంచమాధిపతియు, మూడవ ద్రేక్కాణమునకు నవమాధిపతియు అధిపతులు.

17. రాశావాద్యాంరాశినాథస్యహోరాంవాంఛంత్యన్యేలాభనేతుర్ద్వితీయాం।
ద్రేక్కాణాశ్చ స్వాంత్యలాభాధిపానాం ప్రశ్నేతుస్యుశ్చాది మధ్యాంత్యభాగా॥

ప్రశ్న విషయమున-కొందరు ప్రథమ హోరకు తద్రాశ్యధిపతియు, ద్వితీయ హోరకు లాభాధిపతియు అధిపతులు. ద్రేక్కాణములకు-తద్రాశ్యధిప, ద్వాదశాధిప, లాభాధిపతులు క్రమముగా అధిపతులనీ చెప్పుదురు.

18. చరేస్వపుత్ర నవపాః, స్థిరేధర్మస్వపుత్రపాః।
ద్విదేహేపుత్ర ధర్మాత్మనాథా ద్రేక్కాణపాః క్వచిత్॥

కొందరి అభిప్రాయమున-చరరాశిలో స్వ, పంచమ, నవమాధిపతులును, స్థిర రాశిలో నవమ, స్వ, పంచమాధిపతులును, ద్విస్వభావమున-పంచమ, నవమ, స్వనాధులును ద్రేక్కాణాధిపతులని చెప్పుదురు.

19. సప్తాంశకాస్త్వోజగృహేతదీశాత్, యుగ్మేగృహేసప్తమరాశిపాత్స్యుః।
దశాంశకానామధిపా స్తదీశాదోజే సమేతన్నవమేశ్వరాద్యాః॥

రాశిని ఏడు భాగములు చేసిన సప్తమాంశయగును. ఓజ (విషమ-బేసి) రాశి యందు తద్రాశి మొదలుకొని, సమరాశియందు ఆ రాశికి సప్తమము మొదలుకొనిన్ని సప్తాంశాధిపతులగుదురు. రాశిని పది భాగములు చేసిన దశమాంశయగును. వాటికి ఓజ రాశియందు ఆ రాశి నుండియు సరిరాశియందు ఆ రాశికి నవమరాశి నుండియు గణింపవలెను. ఆ రాశ్యధిపతులే తదంశాధిపతులునుఅగుదురు.

20. నవాంశపేశాభవనత్రికోణ చరర్షతోర్క్యాంశకపావిలగ్నాత్।
త్రింశాంశకా భౌమశనీజ్యసౌమ్యశుక్రాభవంత్యోజగృహేసమేతు॥

21. విలోమతః పంచశరాష్టసప్తబాణాః క్రమాదూచు రనేకశాస్త్రే।
ఓజేకళానామధిపా స్తదీశాశ్చతుర్ముఖో విష్ణుహరాదినేశః॥

రాశిని తొమ్మిది భాగములుచేసిన, అదినవాంశ. దానికి చరరాశి నుండి కోణ రాశులకు లెక్కింపవలెను. అనగా మేష, సింహ, ధనుస్సులకు మేషాదిగాను, కర్క, వృశ్చిక, మీనములకు కర్కాటకాదిగాను, తులా కుంభ మిధునములకు తులాదిగాను, మకర, వృషభకన్యలకు మకరాదిగాను లెక్కింపవలెను. ఆ రాశ్యధిపతులే అంశాధిపతులును. రాశిని 12 భాగములు చేసిన, అది ద్వాదశాంశ. ఆ రాశినుండియే ద్వాదశ రాశులకు చూడవలెను. త్రింశాంశయనగా రాశిలో 30వ భాగము. దీనినే భాగ అందురు. ఇవి బేసి (ఓజ) రాశులలో- మే, మి, సిం, తు, ధ, కుంభములలో 1-5 కుజునికి, 6-10 శనికి, 11-18 గురునకు, 19-25 బుధునకు, 26-30 శుక్రునకు, ఆధిపత్యము కలవి. సరిరాశులలో—వృష, కర్క, కన్య, వృశ్చి, మ, మీనములలో- 1-5 శుక్రుడును, 6-12 బుధుడును, 13-20 గురుడును, 21-25 శనియు, 26-30 కుజుడు నధిపతులు.

22. యుగ్మే క్రమాద్వ్యుత్క్రమ మేవరాశౌ షష్ఠ్యంశకానామధిపా స్త్వయుగ్మే।
చతుర్ముఖః - బ్రహ్మాధిదేవతాకశ్శనిః, విష్ణుర్బుధః, హరఃకుజః, దినేశోరవిరితిగూఢార్థః॥

రాశిని పదారు భాగములు చేయగా షోడశాంశలగును. వాటికి- ఓజ రాశిలో ఆ రాశి మొదలుకొని ద్వాదశ రాశ్యధిపతులును, మిగిలిన నాల్గు భాగములకు శని, బుధ, కుజ, సూర్యులును అధిపతులు-

సమరాశియందు వ్యుత్క్రమముగా షోడశాంశాధిపతులగుదురు. అనగా మొదటి 12 భాగములకు ఆ రాశి మొదలు- వృషభము-మేషము-ఇట్లు వ్యత్యయముగా పండ్రెండు రాశ్యధిపతులే అధిపతులు. చివరి నాలిగిటికి పైన చెప్పినట్లేయని యెరుగునది.

## షష్ట్యంశాస్తు

23. ఘోరాంశకోరాక్షసదేవభాగ కుబేరరక్షోగణ కిన్నరాంశాః।
భ్రష్టఃకులఘ్నో గరళోఽగ్నిఘాతో మాయాంశకః ప్రేతపురీశభాగః।
అపాంపతిర్దేవగణేశభాగః కాలోఽహిభాగోఽహ్యమృతాంశఇందుః॥

24. మృద్వంశకః కోమల పద్మభాగౌ లక్ష్మీశవాగీశ దిగంబరాంశాః।
దేవేంద్రభాగౌ కలినాశభాగః క్షితీశ్వరాంశః కమలాకరాంశః॥

25. క్రమేణమందాత్మ జమృత్యుకాలదవాగ్నిఘోరాయమకంటకాంశః।
సత్యామృతాంశౌ పరిపూర్ణచంద్రో విషప్రదిగ్ధఃకులనాశముఖ్యః॥

వంశక్షయోత్పాతకకాలరూపా స్సౌమ్యంచమృద్వంశసుశీతలాంశౌ।
రాశిని 60 భాగము చేసిన, అది షష్ట్యంశము త్రింశాంశలో సగము.

దంష్ట్రాసితాబ్జేందు ముఖప్రపూర్ణః కాలాగ్ని దండాయుధ నిర్మలాంశాః।
శుభాశుభాంశావతిశీతలభాగస్సుధాపయోధిర్ద్యుమణీందు రేఖః।
జ్ఞేయంక్రమాద్వ్యత్యయమేవయుగ్మే శుభాన్వితాంశో యదిశోభనాః।

ఓజరాశిలో షష్ట్యంశాధిపతులు సమరాశిలో విపర్యయము

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఘోరాంశ | 60 | 31. | మృత్యంశ | 30 |
| 2. | రాక్షసాంశ | 59 | 32. | కాలాంశ | 29 |
| 3. | దేవాంశ | 58 | 33. | దవాగ్న్యంశ | 28 |
| 4. | కుబేరాంశ | 57 | 34. | ఘోరాంశ | 27 |
| 5. | రక్షోగణాంశ | 56 | 35. | యమకంటకాంశ | 26 |
| 6. | కిన్నరాంశ | 55 | 36. | సత్యాంశ | 25 |
| 7. | భ్రష్టాంశ | 54 | 37. | అమృతాంశ | 24 |
| 8. | కులఘ్నాంశ | 53 | 38. | పరిపూర్ణచంద్రాంశ | 23 |
| 9. | గరళాంశ | 52 | 39. | విషప్రదిగ్ధాంశ | 22 |
| 10. | అగ్నిఘాతాంశ | 51 | 40. | కులనాశాంశ | 21 |
| 11. | మాయాంశ | 50 | 41. | ముఖ్యాంశ | 20 |
| 12. | ప్రేతపురీశాంశ | 49 | 42. | వంశక్షయాంశ | 19 |
| 13. | అపాంపత్యంశ | 48 | 43. | ఉత్పాతకాంశ | 18 |
| 14. | దేవగణేశాంశ | 47 | 44. | కులరూపాంశ | 17 |
| 15. | కాలాంశ | 46 | 45. | సౌమ్యాంశ | 16 |
| 16. | సర్పాంశ | 45 | 46. | మృద్వంశ | 15 |
| 17. | అమృతాంశ | 44 | 47. | సుశీతలాంశ | 14 |
| 18. | చంద్రాంశ | 43 | 48. | దంష్ట్రాంశ | 13 |
| 19. | మృద్వంశ | 42 | 49. | సితాబ్జాంశ | 12 |
| 20. | కోమలాంశ | 41 | 50. | ఇందుముఖాంశ | 11 |
| 21. | పద్మాంశ | 40 | 51. | పూర్ణాంశ | 10 |
| 22. | లక్ష్మీశాంశ | 39 | 52. | కాలాగ్న్యంశ | 9 |

| | | | |
|---|---|---|---|
| 23. వాగీశాంశ | 38 | 53. దండాయుధాంశ | 8 |
| 24. దిగంబరాంశ | 37 | 54. నిర్మలాంశ | 7 |
| 25. దేవాంశ | 36 | 55. శుభాంశ | 6 |
| 26. ఇంద్రాంశ | 35 | 56. అశుభాంశ | 5 |
| 27. కలినాశాంశ | 34 | 57. అతిశూలాంశ | 4 |
| 28. క్షితీశ్వరాంశ | 33 | 58. సుధాపయోధ్యంశ | 3 |
| 29. కమలాకరాంశ | 32 | 59. ద్యుమణ్యంశ | 2 |
| 30. మందాత్మజాంశ | 31 | 60. ఇందురేఖాంశ | 1 |

**28.** ఏకద్విత్ర్యంశకాస్సప్తనవాంశ ద్వాదశాంశకాః।
త్రింశాంశాఇతివిజ్ఞేయాగ్రహాణాం సప్తవర్గకాః॥

లగ్న, హోరా, ద్రేక్కాణ, సప్తాంశ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశలు గ్రహములకు సప్త వర్గములు,

**29.** మూలత్రికోణ కేన్వోచ్చే స్వక్షేత్రేఽపిచ కేంద్రకే।
చత్వారఉత్తమాంశాస్స్యు రమీశుభఫలాధికాః॥

మూలత్రికోణము, ఉచ్చ, స్వక్షేత్రము, కేంద్రము-ఈనాలుగు ఉత్తమాంశలు; ఇవి శుభ ఫలము అధికముగా కలవి.

**30.** సప్తవర్గోద్భవాంశాశ్చసాధిమిత్రాంశకాఅమీ।
సోత్తమాంశకషష్ట్యంశావర్గాః ప్రోక్తాః త్రయోదశ॥

అధి మిత్రాంశంతో కూడ సప్తవర్గలును, ఉత్తమాంశతో కూడిన షష్టివర్గను మొత్తము 13 వర్గములు.

**31.** ఉత్తమంతు త్రివర్గైక్యే చతుర్వర్గేతుగోపురం।
సింహాసనం పంచవర్గే ద్వివర్గేపారిజాతకం॥

**32.** పారావతంషట్శుభత్వే దేవలోకస్తు సప్తకే।
అష్టవర్గ శుభత్వేతు కుంకుమాంశ ఇతీరితః॥

**33.** నవవర్గశుభత్వేతు భవేదైరావతాంశకః।
దశవర్గే వైష్ణవం స్యాదేకాదశశుభేశివః॥

**34.** ద్వాదశానాంశుభత్వేతు భాస్వదంశ ఇతీరితః।
త్రయోదశానాంవర్గాణాంశుభే వైశేషికాంశకః॥

మూడు వర్గలు శుభమైన ఉత్తమాంశ, నాల్గువర్గలైన గోపురాంశ, అయిదు వర్గలైన సింహాసనాంశ, ఆరువర్గలైన పారావతాంశ, రెండవర్గలైన పారిజాతాంశ,

ఏడువర్గులైన – దేవలోకాంశ, ఎన్మిదివర్గులైన – కుంకుమాంశ, తొమ్మిది వర్గులు శుభములైన – ఐరావతాంశ, పదివర్గులైన – వైష్ణవాంశ, 11వర్గులైన శివాంశ, 12 వర్గులైన భాస్వదంశ, 13 వర్గులు శుభములైన వైశేషికాంశ యనబడును.

జన్మకాలమునకు గ్రహములను, భావములను స్ఫుటము చేసికొనవలెను. అది పంచాంగమును బట్టి ఎక్కువ శ్రమయగును. కాని ఎఫిమెరీస్ రీత్యా చూచు కొనిన స్ఫుటము చేయుట గంటపట్టదు. రాశి, భాగ, కలవరకు సూక్ష్మముగా గతి తెలియును. కాన వాని ప్రకారము చేసికొనుమని నా సలహా. ఎట్లయినను స్ఫుటము చేసికొనుట ఆవశ్యకము. అప్పుడు షడ్వర్గములో సప్తవర్గులో, ద్వాదశవర్గులో, షోడశ వర్గులో తేలికగా సాధించవచ్చును. లగ్న, హోరా, ద్రేక్కాణ, నవాంశ, ద్వాద శాంశ, త్రింశాంశలు షడ్వర్గులు. సప్తమాంశముతో కలిసిన–సప్తవర్గులు లగ్న, హోరా, ద్రేక్కాణ, చతుర్థాంశ, పంచమాంశ, షష్ఠాంశ, సప్తమాంశ, అష్టమాంశ, నవాంశ, దశాంశ, ఏకాదశాంశ, ద్వాదశాంశ–ఇవి ద్వాదశవర్గులు. లగ్న, హోరా, ద్రేక్కాణ, చతుర్థాంశ, సప్తమాంశ, నవాంశ, దశమాంశ, ద్వాదశాంశ, షోడశాంశ, పంచచత్వారింశాంశ, షష్ట్యంశ–ఇవి షోడశవర్గులు. వీటి ప్రమాణములు, అధిపతులు పథకములవలన తెలియదగినది.

ఉదా :- స్ఫుట రవి 2-17-21 అనుకొనుము. 2 రాసులు దాటి మూడవ రాశి మిధునములో ఉన్నాడు.

| రాశి వర్గులు భాగలు | లగ్న మిధునం | హోర 16–30 2 వది | ద్రేక్కాణ 11–20 2 వది. |
|---|---|---|---|
| అధిపతులు | బు | చం | శు |

| సప్తమాంశ 17–01–21–15 5 వది | నవాంశ 16-41–20–0 6 వది | ద్వాదశాంశ 15–1–17–30 7 వది | త్రింశాంశ 18 వది |
|---|---|---|---|
| శు | గు | గు | గు |

35. అస్తనీచారిశాంశస్థాయదిసర్వేగ్రహా స్తదా ।
ప్రేతాంశయోగ ఆఖ్యాతస్సర్వాపద్ఘోరమృత్యుదః ॥

గ్రహములకు– అస్తంగతు డగుట, నీచ యందుండుట, శత్రు స్థానమున నుండుట– ఇవి కల్గిన ప్రేతాంశయోగ మనబడును. ఇది ఆపత్కారము, మృత్యు ప్రదముసైన దుర్యోగము.

36. గండాంతత్రితయే పాతే చంద్రేలగ్నేపిసంధిగే ।
సద్యోమృత్యంశకోనామభూయాత్తత్కాలగోచరః ॥

గండాంత త్రితయ మనగా— లగ్న గండాంతము, నక్షత్ర గండాంతము, తిధి గండాంతము. లగ్న గండాంతము- మీన మేషములకు, కర్కాటక సింహములకు, ధనుర్వృశ్చికములకు మధ్య— మొదటి దాని చివర నవాంశ, రెండవ దాని మొదటి నవాంశయు గండాంతము. నక్షత్ర గండాంతము- అశ్విన్యాది, రేవత్యంతం, ఆశ్రేషాంత్యం, మఘాది, జ్యేష్ఠాంత్యం మూలపూర్వకమును. నక్షత్ర గండాంతము 8 గడియలు, రాశి గండాంతము 1 గడియ, తిథ్యంతమున 2 గడియలు, వ్యతీపాత యందును, లగ్న సంధి, చంద్రుడు సంధిలో నుండగాను పుట్టిన వారికి సద్యోమృత్యంశకమను తత్కాల గోచరమగు దుర్యోగము. శిశువునకు సద్యోమరణ ప్రదము.

37. దర్శాంతసంధౌ విషనాడికాయాం కుహ్వాంవిషాంశేయదిలగ్నచంద్రౌ।
సూర్యోపరాగేగరళాంశమాహుర్బంధార్తిరోగామయమృత్యుమూలం॥

అమావాస్య చివర సంధియందు విష ఘటికలోను, చంద్రుడు కనిపించని అమావాస్యను కుహూ అందురు, దాని విషాంశలోను, లగ్న చంద్రులుండగాను. సూర్యగ్రహణ కాలమున పుట్టిన వారికి గరళాంశ మందురు. దీనిలో పుట్టిన వానికి బంధనము, ఆర్తి, రోగము, మృత్యువు కలుగును.

ఈ గండాంత దోషమును గురించి బృహత్పారాశరహోర 93 అధ్యాయము- తిధి గండాంతము— అమావాస్యా పాడ్యమిల మధ్య, పంచమి షష్ఠిల మధ్య, దశమ్యేకాదశుల మధ్య, పూర్ణిమా పాడ్యమిల మధ్య—4 గడియలున్ను, రేవతీ అశ్వినుల మధ్య, ఆశ్రేషా మఘల మధ్య, జ్యేష్ఠా మూలల మధ్య—2 గడియలున్ను, మీన మేషముల మధ్య, కర్కాటక సింహముల మధ్య, వృశ్చిక ధనుస్సుల మధ్యన- ఒక గడియయు గండాంతము. జ్యేష్ఠ చివర 5 గడియలు, మూలాదిలో 8 గడియలు గండాంత మని విశిష్య చెప్పబడినది.

38. లగ్నంక్రమాత్సార్థఘటీద్వయంతన్మేషాద్దినేశస్థితకోణభానాం ।
రాశీశ్వరాః ప్రాణపదంక్రమేణఘటీచతుర్థాంశముశంతితజ్ఞాః ॥

క్షణిక గ్రహములను చెప్పుచున్నాడు- లగ్నము క్రమముగా 2½ గడియల కొకటి చొప్పున అగును. ఇట్లు పగలు, రాత్రి 30+30=60 గడియలకు 12 రాశులు 2 సార్లు తిరుగును. ఆ లగ్నమునకు మేషము నుండి సూర్య స్థితరాశికి

కోణరాశులైన పంచమ నవమ రాశ్యధిపతులు అధిపతులు. ఘటీ చతుర్థాంశము ప్రాణ పదము.

చాపాద్విపర్యేతిరవిస్తుసార్థఘటీద్వయంరాత్రికరోపితస్మాత్ ।
క్రమేణసార్థద్వయనాడికాలః కుజోవృషాద్వ్యత్యయనాడియుగ్మం ॥ 39

రవి ధనుస్సు నుండి వ్యత్యయముగా ఒక్కొక్క రాశియందు 2½ గడియల కాల ముండును. చంద్రుడు కూడ అదే రాశి నుండి క్రమముగా రాశికి 2½ గడియల కాల ముండును. కుజుడు వృషభము నుండి వ్యత్యయముగా రాశికి 2 గడియల చొప్పున ఉండును.

40. చాపాద్బుధోవ్యత్యయనాడిమాత్రంమీనాదధఃపంచఘటీంద్రపూజ్యః।
క్రమేణయుగ్మాద్భృగునందనస్తుఘటీప్రమాణందిననాథపుత్రః॥

బుధుడు ధనుస్సు నుండి వ్యత్యయముగ రాశికి గడియ చొప్పునను, గురుడు మీనము నుండి వ్యత్యయముగ రాశికి 5 గడియల చొప్పునను, శుక్రుడు మిథునము నుండి 5 గడియల చొప్పునను, శని మిథునము నుండి క్రమముగా 1 గడియ చొప్పునను తిరుగుదురు.

వ్యత్యాసమార్గేణదినప్రమాణంఘటీప్రమాణంగదితంయథాప్రాక్।
మేషాదగుస్సార్థఘటీద్వయంస్యాత్ మీనాదికేతన్మదగోవిలోమాత్॥ 41

రాహువు మేషము నుండి క్రమముగా 2½ గడియల చొప్పునను, కేతువు మీనాదిగా వ్యత్యయముగా 2½ గడియల చొప్పునను తిరుగుదురు. దిన ప్రమాణము గురించి వ్యత్యాస మార్గమున ఘటీ ప్రయాణము మునుపెట్లు చెప్పబడినదో అట్లే క్షణిక గ్రహములను సాధించవలెను.

క్షణిక గ్రహములు గ్రంథాంతరములందు మరొక రీతిగా సాధింపబడినవి. ఎట్లనగా- సూర్యోదయాదిగా పగలు, రాత్రి కూడ అన్ని గ్రహములకు చెప్పబోవు రీతిగా గణించవలెను. రవికి- ధనుస్సు నుండి- రాశికి 2½ గ॥ వ్యత్యయముగాను, చంద్రునకు మిథునము నుండి, రాశికి 2½ గ॥ వ్యత్యయముగాను, కుజునకు పగలు వృశ్చికము నుండియు, రాత్రి మేషము నుండియు రాశికి 2½ గ॥ వ్యత్యయముగాను, బుధునకు- పగలు కన్య మొదలుకొని, రాత్రి మిథునము మొదలుకొని, గురునకు- పగలు ధనుస్సు మొదలుకొని, రాత్రి మీనము మొదలుకొనియు; శుక్రునకు- పగలు తుల నుండియు, రాత్రి వృషభాదిగాను, శనికి- పగలు మకరాదిగాను, రాత్రి కుంభాది

గాను- అందరును రాశికి 2½ గడియలు, వ్యత్యయముగాను తిరుగుచుందురు. వ్యత్యయ మనగా- మేషము నుండి మీనమునకుగా- క్షణిక రాహువు- ప్రతి జాము (8 గంటలు) నందు శయన రాహువు యొక్క దృక్కు, యోని, పుచ్ఛములందు క్రమముగా తిరుగును. పగలు - రాత్రియు సమముగానే తిరుగును. ప్రతి రాశి యందును 2½ గడియ లుండును. గడియ కొక నవాంశ చొప్పున- మేష, సింహ, ధనుస్సులందు ధనుస్సు నుండి మేషము వరకు 9 అంశలున్ను, వృషభ, కన్యా, మకరము లందు మకరాది వృషభాంతము 9 అంశలు; మిథున తులా కుంభము లందు తులాది కుంభాంతము 9 అంశలున్ను, కటక, వృశ్చిక, మీనములందు కర్కాటకాది వృశ్చికాంతము 9 అంశలున్ను విలోమముగానే తిరుగును. ద్వి స్వభావ రాశులందు రాహు సంచారము లేదు.

**42.** శాస్త్రాంతరేతత్ఫలమాహురార్యాయత్ప్రశ్నితేనష్టవిధౌప్రదిష్టం ।
బాలాద్యవస్థాఃక్రమశోగ్రహాణామోజేనమేతద్వివరీతమాహుః ॥

ప్రశ్నయందు, నష్ట విధియందును చెప్పబడిన క్షణిక గ్రహ ఫలమున శాస్త్రాంతరమున మునులు చెప్పిరి. దాని కిక్కడ ప్రయోజనము లేదు. కాన చెప్పలేదు.

గ్రహములకు బాలాద్యవస్థలు ఓజరాశులయందు (1,3,5,7,9,11) క్రమము గాను, సరి రాశులందు (2,4,6,8,10,12) వ్యత్యయముగాను ఉండును.

**43.** బాలఃకుమారస్తరుణశ్చవృద్ధోఽలసోమృతశ్చేత్యృతుభిఃక్రమేణ ।
బాలాద్యవస్థానుగుణంప్రవజంతితత్పాకకాలేదిననాథముఖ్యాః ॥

గ్రహములకు బాలాద్యవస్థల చెప్పుచున్నాడు. గ్రహములకు- బాల, కౌమార, తరుణ, వృద్ధ, అలస, మృతావస్థ లని ఆరు అవస్థ లున్నవి. తమ తమ దశా కాలమున అవస్థాను గుణముగనే ఫల మిత్తురు.

**44.** చం-26 రుద్ర-22 జయ-18 వైద్య-14 నయాం-10 తేనా-6 ఖునా-2 వినిహతేదినమానే ।
నాగ-30 లబ్ధమితమాందిఘటీస్యాద్తలగ్నసదృశీస్ఫుటరీతిః॥

మాందీగ్రహ నయనమును చెప్పుచున్నాడు. దిన ప్రమాణము 30 గడియ లున్నపుడు భానువారాది క్రమమున- 26, 22, 18, 16, 10, 6, 2- ఈ సంఖ్యల ఘడియల మీద మాంది యుదును. ఇది దిన ప్రమాణము 30 ఘడియ లున్నప్పుడు. హెచ్చు తగ్గు లున్నప్పుడు- ఈ సంఖ్యలను దిన ప్రమాణముచే హెచ్చించి, 30 చే

భాగించగా వచ్చిన లబ్ధ గడియలపై మాంది యుండును. ఆ స్ఫుట ఘటికల వేళ లైన లగ్నమందు మాంది యుండును. అప్పుడైన నవాంశయే మాంది నవాంశ.

45. మేషోజరాశిః క్రియభాగబస్తాః వృషోక్షగోతాపురుశౌక్రభంచ ।
బౌధంనృయుగ్మంజితుమంతృతీయంచాంద్రంకుళీరంతుచతుర్థరాశిః ॥

రాశి సంజ్ఞలు- మేషము, అజము, క్రియ, భాగము, బస్తము- ఇవి మేష రాశి పేర్లు. వృషము, ఉక్షము, గోమ, తాపురు (తాబురి), శౌక్రభము- ఇవి వృషభ రాశి పేర్లు. బౌధము, నృయుగ్మము, జితుమము, తృతీయము-ఇవి మిథునము పేర్లు. చాంద్రము, కుళీరము- ఇవి కర్కాటము పేర్లు.

46. సింహాస్యకంఠీరవలేయసంజ్ఞాఃపాథోనషష్ఠావబలాచకన్యా ।
జూకోవణిక్సప్తమతౌళిసంజ్ఞాః కౌర్ప్యష్టమం వృశ్చికకీటకౌజాః॥

సింహము, కంఠీరవము, లేయము- ఇవి సింహ రాశి పేర్లు. పాథోనము, షష్ఠము, అబల, కన్య- ఇవి కన్యా రాశి పేర్లు. జూకము, వణిక్కు, సప్తమము, తౌళి- ఇవి తుల పేర్లు. కౌర్పి, అష్టమము, కీటము, కౌజము- ఇవి వృశ్చికము పేర్లు.

47. జైవంధనుస్తౌక్షికచాపసంజ్ఞాఆకోకిరంనక్రమథోమృగాస్యం ।
హృద్రోగకుంభౌఘటరాశిసంజ్ఞా మీనోఝుషోంత్యశ్శఫరద్వయాఖ్యం ॥

జైవము, తౌక్షికము, చాపము- ఇవి ధనుస్సు పేర్లు. ఆకోకెరము, నక్రము, మృగాస్యము- మకరము పేర్లు, హృద్రోగము, ఘటము- కుంభరాశి పేర్లు. ఝుషము, అంత్యము, శఫరద్వయము- ఇవి మీనరాశి పేర్లు.

48. హోరాతనుర్మూర్త్యుదయంశిరశ్చవిత్తంకుటుంబంముఖమక్షిసంజ్ఞం ।
సహోత్థదుశ్చిక్యగళంతృతీయంశౌర్యంచకర్ణంసుఖమంబుబంధు॥

హోర, తనువు, మూర్తి, ఉదయము, శిరము- ఇవి తనుభావము (1) పేర్లు, విత్తము, కుటుంబము, ముఖము, అక్షి, ధనము- ఇవి ద్వితీయ భావము పేర్లు. సహోత్థము, దుశ్చిక్యము, గళము, శౌర్యము, కర్ణము- ఇవి తృతీయము పేర్లు.

49. రసాతలంవైహిబుకంచవేశ్మ పాతాళహృద్వాహనమాతృగండాః ।
బుద్ధిప్రతాపాత్మజతోషసంజ్ఞాఃవివేకశక్తిహ్యుదరప్రదేశః ॥

సుఖము, అంబు, బంధువు, పాతాళము, హిబుకము, వేశ్మ, రసాతలము, హృదయము, వాహనము, మాతృగండము- ఇవి చతుర్థము పేర్లు. బుద్ధి, ప్రతాపము, సుతుడు, తోషము, వివేకశక్తి, ఉదర ప్రవేశము- ఇవి పంచమము పేర్లు.

50. రోగక్షతారివ్యసనానిచోరస్థానం భవేద్విఘ్నమిహాహురార్యాః ।
చిత్రోత్థకామౌమదనశ్చభర్తృస్థానంకళత్రందధినూపసంజ్ఞం ॥

రోగము, క్షతము, అరి, వ్యసనము, చోరము, విఘ్నము- ఇవి షష్ఠము పేర్లు. చిత్తోత్థము, కామము, మదనము, మదము, పతి, కళత్రము, దధి, సూపము, క్షీరము- సప్తమము పేర్లు.

51. ఛిద్రంగుదంమూత్రకృశాభిధానంగుహ్యంచరంధ్రంమరణంతదాయుః।
ధర్మాదయఃపైత్యకభాగ్యదేవాగురుస్తపోలాభశుభానిచాహుః ॥

గుదము, మూత్రము, కృశము, గుహ్యము, రంధ్రము, మరణము, ఆయువు ఇవి అష్టమము పేర్లు. ధర్మము, పిత, భాగ్యము, దేవుడు, గురువు, తపస్సు, శుభము- ఇవి నవమము పేర్లు.

52. ఆజ్ఞాచమానందశమంచకర్మరాజ్యంచలాభోపచయాయసంజ్ఞః ।
అంత్యస్యరిప్ఫవ్యయనాశసంజ్ఞాలగ్నాదిభావాఃకథితామునీంద్రైః॥

ఆజ్ఞ, మానము, కర్మ, రాజ్యము- ఇవి దశమము పేర్లు. లాభము, ఉపచయము, ఆయము- ఇవి ఏకాదశము పేర్లు. రిఃఫము, వ్యయము, నాశము- ఇవి ద్వాదశము పేర్లు. ఈ సంజ్ఞలను మునులు భావములకు చెప్పిరి.

53. దుష్టాశ్చనాశప్రదతాంభజంతేషష్ఠాష్టరిప్ఫానుగతా స్తథైవ ।
ఉద్యంతిపృష్ఠేనవృషాజచాపకుళీరనక్రాబలినస్త్రియుగ్మాః ॥

ఆ ద్వాదశ భావములలో 6,8,12 అందున్న గ్రహములు, అశుభులును, దుష్టులు, నాశప్రదులు. మేష, వృషభ, ధనుః, కర్కాటక, మకరములు- పృష్ఠోదయ రాశులు. మీనము ఉభయోదయము. పృష్ఠోదయములు, మిథునమును రాత్రి బలము కలవి.

54. తేరాత్రికాలేహ్ని బలాస్తుశేషాఃశీర్షోదయామీనఉదేత్యుభాభ్యాం ॥
ధూమోర్కోవిశ్వభాగశ్రుతిభవనయుతోమండలాచ్చోదితోసౌ ।
పాతష్షడ్రాశియుక్తఃపరిధిరథరవౌశోధితశ్చాపనామా ॥
శైలాశాభాగయుక్తంధనురథచశిఖీపంచతేప్యప్రకాశాః ।
ప్రాదుర్భావేచతేషాంఫలమిహకథితంజాతకప్రశ్నయోస్స్యాత్॥

మిథున, సింహ, కన్యా, వృశ్చిక, కుంభములు శీర్షోదయ రాశులు. సింహ, కన్య, వృశ్చిక, కుంభ, మీనములు పగటివేళ బలము కలవి.

ఇక అప్రకాశ గ్రహములను సాధించుటను చెప్పుచున్నాడు.

1) స్ఫుటరవికి- 4-13-20 కూడిన ధూమ గ్రహము వచ్చును. 2) ధూమ గ్రహమును 12 రాశులలో తీసివేయగా వ్యతీపాత గ్రహము వచ్చును. 3) వ్యతీపాతకు 6 రాశులు కలిపిన పరిధి వచ్చును. 4) పరిధిని 12 రాశులలో తీసివేసిన

ఇంద్రచాపము వచ్చును. 5) ఇంద్ర చాపమునకు 16-40 కలిపిన కేతువు వచ్చును. దీనికి ధనువు, శిఖి అనియు పేర్లు. ఈ అయిదున్ను అప్రకాశములైన ఉపగ్రహములు. ఇవి కనిపించకపోయినను, జాతకమున, ప్రశ్నయందును ఇవి ఏ రాశిలో నుండునో, దానికి హాని కల్గునని మునులు చెప్పిరి.

ఉదా :- స్ఫుటరవి- 2-17-21. దీనికి 4-30-20 కలుపగా = 7-0-41 ధూమగ్రహము. 12-0-0-7-0-41=4-29-19 వ్యతీపాత. దీనికి 6 రాశులు చేర్చగా 4-29-19+6-0-0=10-29-19 పరిధి లేక పరివేషము. దీనిని 12 రాశుల నుండి తీసివేయగా 12-0-0—10-29-19=1-0-41 ఇంద్రచాపము. దీనికి 16-40 కలిపిన 1-0-41+0-16-40=1-17-21 కేతువు లేక శిఖి. కేతువునకు ఒక రాశి కలపగా స్ఫుటరవి. 1-17-21+1-0-0=2-17-21.

**55.** **వ్యోమాస్తహితాశవిలగ్నభానాంవదంతినామానిమునీంద్రముఖ్యాః॥**

ఇక కేంద్రాది సంజ్ఞలు చెప్పుచున్నాడు- లగ్న, చతుర్థ, సప్తమ, దశమ భావములకు చెప్పబోవు పేర్లు వర్తించును.

**56.** **స్యాత్కంటకంకేంద్రమథోచతుష్టయంవర్గోత్తమాఖ్యస్స్వనవాంశకస్స్యాత్ ।**
**విప్రాదికంవర్ణచతుష్టయంతుక్రమేణమీనాదిపునఃపునస్స్యాత్ ॥**

పైన చెప్పిన నాలుగు భావములకు- కంటకము, కేంద్రము, చతుష్టయము అని పేర్లు. స్వనవాంశ వర్గోత్తమాంశ అనబడును. మీనము మొదలు 12 రాశులు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర జాతులు. మీన, కర్క, వృశ్చికములు బ్రాహ్మణ జాతి, మేష, సింహ, ధనుస్సులు క్షత్రియ జాతి, వృషభ, కన్యా, మకరములు వైశ్య జాతి, మిథున, తులా, కుంభములు శూద్ర రాశి.

**57.** **ఓజోపియుగ్మంత్వజతఃక్రమేణచరంస్థిరంచేత్యుభయంక్రమాత్స్యునః ।**
**పూర్ణార్థపాదాజలకానిమీనాన్మహుర్మహూరాశిచతుష్కమాహుః ॥**

మే, మి, సిం, తు, ధ, కుంభములు ఓజో రాశులు బేసి రాశులు (1,3,5,7,9,11). తక్కినవి యుగ్మ (సరి) రాశులు (2,4,6,8,10,12). మేషాదులకు క్రమముగా చర, స్థిర, ద్వి స్వభావము లని పేర్లు, అనగా- మే, కర్క, తు, మకరములు చరములు; వృష, సిం, వృశ్చి, కుంభములు స్థిరములు; మి, కన్య, ధనుర్మీనములు ద్వి స్వభావములు, మీన, కర్క, వృశ్చికములు పూర్ణ జల రాశులు. మే, సిం, ధనుస్సులు అర్ధ జలములు. వృష, కన్య, మకరములు పాద జలములు. మి, తులా, కుంభములు నిర్జల రాశులు.

58. కేంద్రంపణపరంచాపోక్లిబంలగ్నాత్క్రమాదియం ।
సంజ్ఞాద్వాదశభావానాంవిజ్ఞాతవ్యాపునఃపునః ॥

లగ్నము నుండి ద్వాదశ రాశులకు కేంద్ర, పణపర, ఆపోక్లిబములు లని సంజ్ఞ. అనగా- 1,4,7,10 కేంద్రములు; 2,5,8,11 పణపరములు 3,6,9,12 ఆపోక్లిబము.

లగ్నేనృరాశిస్సుఖభేజలేచరఃకీటోమదేమానగతఃపశుశ్చ ।
బలాధికస్స్యాత్ఫలమన్యజాతకే ప్రశ్నేపిచో క్తంబహుభిర్మునీంద్రైః ॥ 59

నరరాశులగు- మిథున, కన్యా, తులా, ధనుః పూర్వార్థ, కుంభములు లగ్న మయినప్పుడును, జలచర రాశులగు- కర్కాటక, మకరోత్తరార్ధ, మీనములు, చతుర్ధ భావమైనప్పుడును, కీటరాశియైన వృశ్చికము సప్తమ భావమైనప్పుడును, చతుష్పాద రాశులగు- మేష, వృషభ, సింహ, ధనుర పరార్ధ, మకర పూర్వార్ధములు దశమ భావమయినప్పుడును బలవంతములు. జాతక ప్రశ్నలలో దీని ఉపయోగ ముండును.

60. తత్సప్తమేతద్విబలంప్రదిష్టం సంజ్ఞాస్తథాన్యాగదితాశ్చబోధ్యాః ।
మేషోక్షనక్రాన్సుదతీకుళీరమీనాస్తులోచ్చారవిపూర్వకాణాం ॥

రాశులు బలవంతములైన రాశికి సప్తమమున బలహీనములు.

61. అత్యుచ్చభాగానయ 10 గాన 3 జార 28 మాన్యం 15 మన 5
స్పార 27 నరాః 20 క్రమేణ ।
స్యాత్సప్తమంతస్యచతస్యనీచముచ్చోక్తభాగాఃకిలనీచభేపిః ॥

ఉచ్చరాశు లేవనగా- రవికి మేషము. అందు పరమోచ్చ 10 వ భాగ. చంద్రునకు వృషభము- 3 భాగ. కుజునకు మకరము- 28. బుధునకు కన్య- 15. గురునకు కర్కాటకము- 5. శుక్రునకు మీనము- 27. శనికి తుల- 20 భాగ. ఉచ్చరాశికి సప్తమరాశి నీచరాశి. పరమోచ్చ భాగల సంఖ్యయే పరమ నీచ భాగ సంఖ్యయు. రవికి మేషము ఉచ్చ- 10 భాగ. దానికి సప్తమము తుల నీచ- 10 వ భాగ పరమ నీచ. ఇట్లే తక్కినవి,

62. సింహోక్షమేషాస్సుదతీచచాపస్త్రాశిశ్చకుంభోరవిపూర్వకాణాం ।
మూలత్రికోణంక్రమశోవదంతిభాగాస్తదీయోచ్చసమాభవేయుః ॥

గ్రహములకు మూల త్రికోణములు చెప్పుచున్నాడు. రవికి సింహము, చంద్రునకు వృషభము, కుజునకు మేషము, బుధునకు కన్య, గురునకు ధనుస్సు,

శుక్రునకు తుల, శనికి కుంభము మూల త్రికోణములు. పరమోచ్చ భాగలే మూల త్రికోణ భాగ లగును.

63. నీచోనంతు గ్రహంభార్ధాధికేచక్రాద్విశోధయేత్ ।
భాగీకృత్యగ్రహైర్భక్తలబ్ధముచ్చబలంభవేత్ ॥

స్ఫుట గ్రహము రాశ్యాదిని నీచ రాశ్యాది నుండి తీసివేయగా, 6 రాశులకన్న తక్కువయైన అట్లే ఉంచేది, ఎక్కువయైన 12 రాశుల నుండి తీసివేసి, లబ్ధమును భాగలుగా సవర్ణము చేసి 7 చే భాగించిన వచ్చిన లబ్ధము ఉచ్చ బల మగును.

64. దివాబలిష్ఠానరరాశయస్స్యుః రాత్రౌబలాఢ్యాః పశవశ్చకీటాః ।
సంధ్యాద్వయేంభాత్మృభవాస్పదానాం సషష్ఠభానాముపచాయకత్వం ॥

నరరాశులు పగటివేళను, చతుష్పదరాశులు రాత్రివేళను, కీట, జలచరరాశులు సంధ్యవేళల బలిష్టములు. 3, 6, 10, 11 స్థానములకు ఉపచయ (వృద్ధి) మని పేరు.

65. రక్తఃశ్వేతఃశ్యామకాంతిస్తురక్తోధూమ్రశ్చిత్రఃకృష్ణకాంతిస్సువర్ణః ।
స్వర్ణాభస్స్యాత్కర్బురోబభ్రు వర్ణస్స్వర్ణోవర్ణోవర్ణితోజాదిభానాం ॥

రాశుల వర్ణములు— మేషాదులు క్రమముగా ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ, పాటల, పాండుర, విచిత్ర, నలుపు, పసుపుపచ్చ, చిరుపసుపు, కపిల, చేప రంగు.

66. వేశిస్థానంసూర్యయుక్తాత్ ద్వితీయంచక్రార్ధేస్మిన్మానమాహు ర్మునీంద్రాః ।
వేదఘ్నంస్యాద్బాణసంఖ్యాదికంచవైలోమ్యాద్వాజూకరాశిక్రమేణ ॥

సూర్యు డున్న రాశికి ద్వితీయమునకు వేశి స్థానమని పేరు. మేషాది 6 రాశులకు క్రమముగా 5,6,4,8,9,10 సంఖ్యలు. తులాదుల కీ సంఖ్యలు వ్యత్యయ ముగాను— దానిని 4 చే గుణించగా ఆ యా రాశుల హ్రస్వదీర్ఘప్రమాణము లగును. మీన మేషములకు రాశి ప్రమాణమును 10 చే గుణించగా విఘడియ లగును—200, వృషభ కుంభములకు—240, మిథున మకరములకు—280, కర్కాటక ధనుస్సులకు —320, సింహ వృశ్చికములకు—360, కన్యా తులలకు—400 అగును. వీనిని 60 చే భాగించిన గడియలు వచ్చును. దీని ప్రయోజనము— కాల పురుషాంగములలో జన్మ లగ్నము మొదలుకొని చూడగా దీర్ఘరాశియం దున్నది దీర్ఘముగాను, హ్రస్వ రాశియం దున్నది హ్రస్వముగాను ఉండునని తెలియునది. అదిగాక, చోరప్రశ్నలో చోరుని మార్గ ప్రమాణము నివి తెల్పును.

67. దినేశచంద్రౌ నరపాలకాఖ్యౌ నేతా కుజస్సోమసుతః కుమారః ।
శుక్రేంద్రపూజ్యౌ సచివౌ శనిస్తు ప్రేష్యశ్చ తద్వ్యాప్తిము పైతి జాతః ॥

గ్రహాధికారములు— రవి చంద్రులు రాజులు, కుజుడు సేనాపతి, బుధుడు యువరాజు, గురు శుక్రులు మంత్రులు, శని భృత్యుడు. జాతకుని వృత్తి నిర్ణయమున ఇది ఉపయోగించును.

68. ఆత్మా రవిశ్శీతకరో మనస్తు సత్వం కుజో భాషణమబ్జసూనుః ।
వాచాం పతిర్జ్ఞానసుఖే మదేశశ్శుక్రోఽథ వేదర్కసుతస్తు దుఃఖం ॥

సూర్యుడు ఆత్మ, చంద్రుడు మనస్సు, కుజుడు సత్యము, బుధుడు వాక్కు, గురుడు జ్ఞాన సుఖములు, శుక్రుడు మన్మథుడు, శని దుఃఖము.

69. సూర్యోహేళిర్భానుమార్తాండరశ్మిచండాంశుస్స్యాద్భాస్కరోహస్కరశ్చ ।
అబ్జస్సోమశ్చంద్రమాశ్శీతరశ్మిశ్శీతాంశుస్స్యాద్గ్లౌర్మృగాంకః కళంకీ ॥

గ్రహ పర్యాయ పదములు— సూర్యుడు, హేళి, భానుడు, మార్తాండుడు, రశ్మి, చండాంశుడు, భాస్కరుడు, అహస్కరుడు ఇవి సూర్యుని పేర్లు. అబ్జుడు, సోముడు, చంద్రుడు, శీతరశ్మి, శీతాంశుడు, గ్లౌ, మృగాంకుడు, కళంకి ఇవి చంద్రుని పేర్లు.

70. ఆరో వక్రశ్చావనేయః కుజస్స్యాద్భౌమః క్రూరో లోహితాంగో ధరాజః ।
విట్ జ్ఞస్సౌమ్యో బోధనశ్చేందుపుత్రశ్చాంద్రిః ఖ్యాతః శ్యామగాత్రోఽతి దీర్ఘః ॥

ఆరుడు, వక్రుడు, ఆవనేయుడు, భౌముడు, క్రూరుడు, లోహితాంగుడు, ధరాజుడు ఇవి కుజుని పేర్లు. విట్, జ్ఞ, సౌమ్య, బోధన, ఇందుపుత్ర, చాంద్రి, ఖ్యాత, శ్యామగాత్ర, అతిదీర్ఘ ఇవి బుధుని పేర్లు.

71. జీవోంగిరా దేవగురుః ప్రశాంతో వాచాంపతిస్స్యాత్త్రిదశేశవంద్యః ।
భృగుస్స్వజిద్భార్గవ ఉశనాశ్చ సుఖీ కవిర్దైత్యగురుస్సితశ్చ ॥

జీవుడు, ఆంగిరసుడు, దేవగురుడు, ప్రశాంతుడు, వాచస్పతి, త్రిదశేంద్ర వంద్యుడు ఇవి గురుని పేర్లు. భృగువు, స్వజిత్తు, భార్గవ, ఉశనసుడు, సుఖి, కవి, దైత్యగురుడు, సితుడు ఇవి శుక్రుని పేర్లు.

72. ఛాయాత్మజః పంగుయమార్కసూనవః కోణో సితస్సౌరిశనీచ నీలః ।
క్రూరః కృశాంగః కపిలాక్షసర్పౌ తమోసురశ్చాపి చ సైంహికేయః ॥

ఛాయాత్మజుడు, పంగువు, యముడు, అర్కసూనుడు, కోణుడు, అసితుడు, సౌరి, శని, నీలుడు ఇవి శని పేర్లు. క్రూరుడు, కృశాంగుడు, కపిలాక్షుడు, సర్పము, తమస్సు, అసురుడు, సైంహికేయుడు,

73. ఛాయాగ్రహశ్చాపివిధుంతుదశ్చ స్వర్భానురుక్తోగురఘీచరాహుః ।
కేతుశ్శిఖీస్యాత్ ధ్వజనామధేయోనవాపిఖేటాశ్చఖగాగ్రహాస్స్యుః॥

ఛాయాగ్రహము, విధుంతుదుడు, స్వర్భానుడు, అగువు, అఘి ఇవి రాహువు పేర్లు. కేతువు, శిఖి, ధ్వజుడు ఇవి కేతువు పేర్లు. ఖగము, గ్రహము, ఖేటము ఇవి గ్రహముల పేర్లు.

74. శనేస్సుతస్స్యాద్గుళికోథమాందీయమాత్మజః ప్రాణహరోతిపాపీ ।
అర్థప్రహారీయమకంటకస్స్యాదుత్క్రాంతిసంజ్ఞః ఖలుకాలనామా॥

శని సుతుడు ఇది గుళికుని పేరు. మాంది, యమాత్మజుడు, ప్రాణహరుడు, అతిపాపి ఇవి మాంది పేర్లు. అర్థప్రహారి యమ కంటకము పేరు. ఉత్క్రాంతి కాలము పేరు.

75. సపాపవిట్క్షీణశశీనభౌమమందాస్తమఃకేతుయమాత్మజాశ్చ ।
క్రూరాఇమేపూర్ణశశాంకసౌమ్యదేవేజ్యశుక్రాశ్శుభదాశ్చసౌమ్యాః ॥

పాపయుతు డగు బుధుడు, క్షీణచంద్రుడు, రవి, కుజ, శనులు, రాహు, కేతు, మాంది గ్రహంబులు పాపులు, క్రూరులు అని చెప్పబడును. పూర్ణ చంద్రుడు, పాపయుతుడు కాని బుధుడు, గురు శుక్రులు సౌమ్యులు, శుభులు సని చెప్పబడును.

76. భానుర్మహోగ్రోంకితవర్తులాంగశ్శ్యామస్సరక్తోపిచపింగళాక్షః
పిత్తోష్ణమూర్తిస్సమగాత్రయష్టిరారోగ్యవాంత్సత్వగుణోల్పరోమా ॥

గ్రహముల సహజ గుణములు- రవి- అతి తీక్షణ స్వభావము, చిహ్నకల గుండ్రని శరీరము, చతుష్కోణమై సమమైన గాత్రము, ఎరుపు నలుపు కలిసిన రంగు, తేనె కన్నులు, పైత్యము, వేడితత్వము, ఆరోగ్యవంతుడు, సత్వగుణము, స్వల్పమైన వెంట్రుకలు కలవాడు.

77. చంద్రస్సితాంగస్సమగాత్రవక్త్రో వాగ్మీపరిష్వంగవివేకయుక్తః ।
క్వచిత్కృశశ్శీతళవాతయుక్తస్సత్వాశ్రయోమానసమోదయుక్తః ॥

చంద్రుడు:- తెల్లని దేహము, సమమైన శరీరము, ముఖము కలవాడు, వక్త, కౌగిలించుకొను స్వభావము; కొంచెము చిక్కినవాడు, శీతవాత ప్రకృతి, సత్వ గుణుడు, మనస్సులో సంతోషము కలవాడు.

78. కోపాగ్నినేత్రస్సితరక్తగాత్రఃపిత్తాత్మకశ్చంచలబుద్ధియుక్తః ॥
తుల్యాంగయుక్తామసబుద్ధిశక్తిర్భౌమఃప్రతాపీబహువీర్యలోలః ॥

కుజుడు- కోపముచే ఎర్రని కన్నులు, ఎరుపు తెలుపు కలిసిన దేహ కాంతి, పైత్య స్వభావము, అతి చపలబుద్ధి, సమమైన అవయవములు, తామస గుణము, ప్రతాపము, వీర్యమందు లోలత్వము కలవాడు.

79. శ్యామాంగకస్సోమసుతోతివిద్వాన్రజోగుణఃప్రస్తుతవాక్యజాలః ।
హాసప్రియఃపిత్తకఫానిలాత్మాసద్యఃప్రతాపీబహుపుంశ్చలీశః ॥

బుధుడు- చామనఛాయ శరీరము, విద్వాంసుడు, రాజసము, ప్రస్తుతింప దగిన వాక్యములు మాట్లాడువాడు, హాస్యప్రియుడు, పైత్య శ్లేష్మ వాత ప్రకృతి, సద్యః ప్రతాపి, కు[illegible]ప్రియుడు.

80. బృహస్పతిస్థూలతనుస్సుపుణ్యఃకఫాత్మకోవాక్కుశలశ్చవిద్వాన్ ।
సత్వాశ్రయస్సర్వగుణాభిరామఃపింగాక్షకేశశ్చగురుఃకలావాన్ ॥

గురుడు- స్థూలదేహుడు, పుణ్యాత్ముడు, శ్లేష్మ ప్రకృతి, వాక్యములందు సమర్థుడు, విద్వాంసుడు, సత్వగుణుడు, సర్వగుణాభిరాముడు, తేనెవంటి కేశములు, కన్నులు కలవాడు, విద్యావంతుడు.

81. స్వల్పాశనస్స్త్రీప్రజిదర్థకామస్సుఖీబలీకాంతియుతశ్చసుందరః ।
ఆనీలవక్రాంచితరోమయుక్తోరజోగుణస్సర్వగుణాభిరామః ॥

శుక్రుడు- స్వల్పాహారుడు, అర్థకామవంతుడు, సుఖి, బలవంతుడు, కాంతి యుక్తుడు, సుందరుడు, నల్లని, వంకరయిన జుట్టు కలవాడు, రాజసగుణము, సద్గుణవంతుడు.

82. జడస్తుమందఃకృశదీర్ఘగాత్రఃపింగేక్షణఃక్రూరకచోతిభీమః ।
స్థూలద్విజస్తామసబుద్ధియుక్తోవాతాత్మకోవాక్కఠినోతిదీనః ॥

శని- జడ స్వభావుడు, బక్క చిక్కిన పొడవైన శరీరము, పచ్చని కన్నులు, గరుసు జుట్టు, భయంకర రూపము, పెద్ద పళ్ళు (దంతములు), తామస బుద్ధి, వాత ప్రకృతి, కఠినవాక్కు, అతి దీనుడు.

83. మాందిర్వికారీభయసన్నిపాతవిషస్వభావోబహుపాపమూర్తిః ।
బలేననిశ్చిత్యవదేద్గ్రహాణాంతత్ప్రశ్నకేజన్మనితద్గుణాంస్తు ॥

మాంది- వికారచేష్టుడు, భయము, విష స్వభావుడు, పాపరూపుడును. ప్రశ్న లగ్నమునకుగాని, జన్మ లగ్నమునకు గాని బలానుసారము ఫలము చెప్పవలెను.

84. విప్రౌ శ వేతాంగురుదానవేడ్యౌ దినేశభౌమౌ నరపాలముఖ్యౌ ।
సోమశ్చవిడ్వైశ్యకులప్రసూతౌ దినేశపుత్రస్తుచతుర్థవర్ణః ॥

గ్రహము జాత్యాదులు— గురు శుక్రులు బ్రాహ్మణులు, రవి కుజులు క్షత్రియులు, చంద్ర బుధులు వైశ్యులు, శని శూద్రుడు.

85. చండాలజాతిః కిలసైంహికేయః కేతుశ్చసాంకర్య ముపైతి మాందీ ।
ధూమాదయోన్యేతువిలోమజాతయోవర్ణాభిమానిత్వకృతోహివర్ణః॥

రాహువు చండాలుడు, కేతుమాందులు సంకరజాతులు. ధూమాదిగ్రహములు విలోమ సంకరులు. గ్రహముల కాయాజాతియం దభిమానమనియేకాని, వారి కా జాతి లేదు.

86. రక్తశ్శ్వేతోతిరక్తోహరితకనకభాశ్చిత్రనీలాదినాథాః ।
వహ్న్యాప స్త్వగ్నిజాతోహరిసురగణరాడింద్రభార్యాబ్జజాతాః ॥

గ్రహముల రంగులు, అధిదేవతలు: రవ్యాదులు-క్రమముగ ఎరుపు, తెలుపు, అతియెరుపు, తెలుపు, పసుపు, చిత్రవర్ణము, నలుపు, అగ్ని, ఉదకము, స్కందుడు విష్ణువు, ఇంద్రుడు, శని, బ్రహ్మ-వీరధిదేవతలు.

87. భానుఃకావ్యోథరాజ స్త్వహిశనిశశిసస్సోమపుత్రామరేడ్యౌ ।
జ్ఞేయా స్త్విం ద్రాదినాథాః క్రియవృషమిథునారాశయస్సైన చాంద్రాః ॥

రవ్యాదులు క్రమముగా తూర్పు, వాయవ్యము, దక్షిణము, ఉత్తరము, ఈశాన్యము, ఆగ్నేయము, పడమర, నిరృతి, కధిపతులు.

రాశులు-మేషసింహధనుస్సులు-తూర్పునకు, వృషభకన్యా, మకరములు దక్షిణమునకు, మిధున, తులా, కుంభములు, పడమరకు, కర్కాటక, వృశ్చిక, మీనములు ఉత్తరమునకు అధిపతులు.

88. నపుంసకౌసౌమ్యదినేశపుత్రౌ నార్యౌసితేందూచనరాస్తుశేషాః ।
సూతౌబలాస్త్వత్ప్రవదంతితజ్ఞాః ప్రశ్నాదికానాంబ హవోవికల్పాః ॥

బుధశనులు నపుంసకులు, శుక్రచంద్రులు స్త్రీలు, రవికుజగురువులు పురుషలు; జాతకునికి బలవద్గ్రహములు తమ ప్రభావముచూపుననియు, ప్రశ్నాదులలో అనేక వికల్పములును దీనికి ప్రయోజనము.

89. భౌమస్యమజ్జాచవసాగురోస్తు శుక్లంభృగో స్త్వ క్శశినంద నస్య ।
చంద్రస్యరక్తందినపస్యచాస్థి స్నాయుశ్శనైర్థాతువ శాదుపాధిః॥

కుజునకు మజ్జ (ఎముకలలో నుండు ధాతువు) గురునకు మెదడు, శుక్రునకు శుక్రము, బుధునకు చర్మము, చంద్రునకు రక్తము, రవికి ఎముక, శనికి నరము

సారవంతము. జన్మకాలమున బలవద్గ్రహము యొక్క ధాతువు బలముగాను, బలహీనుని ధాతువు బలహీనముగాను ఉండును. రోగప్రశ్నాదులందు బలవద్గ్రహములకు చెప్పబడిన తత్వములకు వ్యాధిపీడ కలదనియు తెలియదగును.

**90.** తద్ధాతుకామస్మరణం ప్రయాతి రంధ్రస్థితానామిహ ఖేచరాణాం।
రోగోద్భవేవా మరణస్య హేతౌ శరీరపుష్టౌచవిచింత్యమేతత్

జాతకుడు అష్టమమందున్న గ్రహముల ధాతుప్రకోపముచే మరణము నందును. రోగోత్పత్తిలోను, మరణ కారణమున, శరీరపుష్టిలోను ఈ విషయము గమనింపదగినది.

**91.** దేవస్థానంభాస్కరస్యాంబువాస శ్చంద్రస్యాగ్ని స్థానమంగారకస్య।
క్రీడాస్థానంసోమపుత్రస్యకోశస్థానంజీవ స్యైవమాహుర్ద్విగోస్తు॥

రవ్యాదిగ్రహముల స్థానములు- రవికి దేవాలయము, చంద్రునకు నీరున్న చోటు, కుజునికి అగ్నిస్థానము, బుధునికి-క్రీడాస్థానము, గురునకు-ద్రవ్యస్థానము; శుక్రునకు శయనస్థానము.

**92.** సుప్తిస్థానంభానుజస్యౌషధంతుసర్పస్థానంసైంహి కేయస్యచైవం।
వధ్యస్థానంమందసూనోః ప్రదిష్టం స్థానాన్యన్యాన్యేవమూహ్యాని
సద్భిః॥

శనికౌషధస్థానము, రాహువునకు సర్పస్థానము, మాందికి వధ్యస్థానము, ఇవి ప్రశ్నములలో అవసరమగుచోట్ల ఉపయోగించునది.

**93.** జీర్ణంశనేర్వాసరనాయకస్యస్థూలంగురోర్మధ్యమకంభృగోస్తు ।
కాఠిన్యమబ్జస్యతుసూతనంచ శ్వేతంకుజ స్యాగ్నింహతచరక్తం॥

గ్రహముల వస్త్రములు-రవికి ముదుగుగుడ్డ, శనికి ప్రాతబట్ట, చంద్రునకు క్రొత్త వస్త్రము, కుజునకొకవైపుకాలిన ఎఱ్ఱనిబట్ట.

**94.** కంథాఫణీంద్రస్యతుచిత్రవాసః కేతోర్మహాకచ్ఛరమేవమాందేః ।
మహార్ఘమాహుర్బలినోబలస్యహీనంబుధావర్ణ వివర్జితంచ॥

రాహువునకు బొంత, కేతువునకు రంగురంగులగుడ్డ, మాందికి మురికి గుడ్డ; బలముకల గ్రహమునకు ఖరీదైనదియు, దుర్బలునకు వెలతక్కువదియు ఉండును.

**95.** తామ్రంమందినేశస్యనిశాకరస్యమణిర్హిరణ్యంతుధరాసుతస్య ।
శుక్తిర్విదోదేవగురోస్తురౌప్యంముక్తాభృగోరాయసమర్కసూనోః॥

గ్రహములకు లోహములు-రవికి రాగి, చంద్రునకు మణి, కుజునకు బంగా

రము, బుధునకు ఇత్తడి-కంచు, గురునకు-వెండి; శుక్రునకు ముత్యము, శనికి ఇనుము, సీసము.

96. రాహోస్తుసీసం శిఖినశ్చనైల్యం ధరామణింతత్క్షయంతితజ్ఞాః ।
మందాత్మజస్యాపిచమిశ్రదగ్ధంలోహస్యకిట్టంత్రపురామనంతి॥

రాహువునకు సీసము, కేతువునకు నల్లని మణి, మాందికి మిశ్రదగ్ధమైన ఇనుప చిట్టము; తగర సీసములని చెప్పుదురు.

97. భృగోర్వసంతః క్షితిసూనుభాన్వోర్గ్రీష్మశ్శశాంకస్యఋతుఃప్రవర్షః ।
విదశ్శరద్దేవగురోస్తు హేమంతర్తుశ్శనేస్యాచ్ఛిశిరస్యకాలః॥

గ్రహములకు ఋతువులు-వసంతర్తువు శుక్రునకు, గ్రీష్మము రవి కుజులకు, వర్షర్తువు చంద్రునకు, శరదృతువు బుధునకు, హేమంతర్తువు గురునకు, శిశిరర్తువు శనికిని కాలములు.

98. ద్రేక్కాణపైస్తద్యృతువస్తువాచ్యం ప్రశ్నేప్రసూతౌ వపినష్టసంజ్ఞే ।
చీనాంబరందేవగురోర్భృగోస్తుక్షౌమాంబరంభాస్కరస్యేంద్ర
గోపం ॥

ప్రశ్నలయందు, జాతకమందు, నష్టప్రశ్నయందును లగ్నద్రేక్కాణాధి పతులచే ఋతువులు చెప్పవలెను.

గురునకు చీనీ చీనాంబరము, శుక్రునకు పట్టువస్త్రము, రవికి ఎర్రపట్టు వస్త్రమును.

99. శుక్లందుకూలంతునిశాకరస్యసౌమ్యస్యవస్త్రం మృదుళంమ హార్ఘం ।
రక్తంసచిత్రంధరణీసుతస్యశనేస్తునీలంబహుచిత్రరమ్యం ॥

చంద్రునకు క్షీరాబ్ధి పట్టుబట్టయు, బుధునకు మృదువైన ఎక్కువ ఖరీదైనదియు, కుజునకు ఎర్రనిది అద్దకమున్నదియు, శనికి నీలము, బహుచిత్రరమ్యమైనదియు.

100. జీర్ణంసచిత్రంతమసశ్చకేతోర్నష్టాదిచింతాసుమతాంతరోక్తం ।
మందాత్మజస్యాపిచశావమాహుశ్ఛిన్నంశ్మశానేసపురీషకంవా ॥

రాహువునకు-చినిగిన బట్టయు, కేతువునకు రంగు రంగుల బట్టయు, మాందికి శవముమీది బట్టయు, లేదాశ్మశానమున మలముతోకూడినబట్ట. వీటిని నష్టాది ప్రశ్నలలో ఉపయోగింపవలెను.

101. భానోఃకటుర్భూమి సుతస్యతిక్తం సోమస్యలావణ్యమథేందుసూనోః॥
మిశ్రీకృతంవస్తుసురేజ్యశుభృగ్వోర్మాధుర్యమామ్లంచశనేఃకషాయః॥

రవ్యాదులకు రసములు-రవికి కారము, చంద్రునకు ఉప్పు, కుజునకు చేదు, బుధునకు అరురుచులును, గురునకు తీపి, శుక్రునకు పులుపు, శనికి వగరు, రుచులు. జాతకునికి బలవత్తరగ్రహము యొక్క రుచిపై అభిరుచి కల్గును.

102. ఋతుత్రయంవానరనాయకస్యక్షణంశ శాంకస్యదినంకుజస్య ।
విదోరుతుర్దేవగురోస్తుమాసఃపక్షోభృగోర్వత్సరమర్కసూనోః ॥

గ్రహముల కాలనిర్ణయము-రవికి 6 నెలలు, చంద్రునకు క్షణము, కుజునకు దినము, బుధునకు 2 నెలలు, గురునకు 1నెల; శుక్రునకు 1 పక్షము=15 దినములు శనికి 1 సంవత్సరము.

103. అష్టాచమాసాస్తువిధుంతుదస్య కేతోస్తుమాసత్రయమేవకాలః
సార్ధాబ్దమూహుర్త్యమనందనస్యప్రశ్నాదిచింతాసువి చింత్యమేతత్ ॥

రాహువునకు 8 నెలలు, కేతువునకు 3 నెలలు, మాందికి 11½ సంవత్సరము ఈ కాలమును ప్రశ్నాదులలో ఉపయోగించుకోవలెను.

104. ధాతుగ్రహారాహుశనీందుభౌమా మూలగ్రహౌశుక్రదినాధినాథౌ ।
జీవగ్రహౌజీవశశాంకసూనూ మేషాదిదస్రాదియథాక్రమేణ॥

గ్రహములకు మూలాది నిర్ణయము-రాహుశని చంద్రకుజులు ధాతువులును, రవిశుక్రులు మూలములును, గురుబుధులు జీవగ్రహములు, ఈ ధాతుమూల జీవములు అశ్విన్యాది నక్షత్రములకును, మేషాది రాశులకు నున్నది.

105. అథోర్ధ్వదృష్టిదిననాథభౌమౌదృష్టిఃకటాక్షేణకవీందుసూన్వోః।
గురోశ్చశాంకస్యసమైవదృష్టిరర్ధోక్షిపాతస్త్వహినాథశన్యోః॥

గ్రహదృష్టి నిర్ణయము- రవి కుజులకు ఊర్ధ్వదృష్టి, శుక్రబుధులకు క్రీగంటి చూపు, గురుచంద్రులకు సమదృష్టి, శనిరాహువులు సగము కన్నుమూసిన చూపును కల్గియుందురు.

106. పశ్యత్యసౌఖానుసుతస్తృతీయం మానంచపూర్ణంచతురశ్రమారః ।
జీవస్త్రికోణంమదనంచసర్వేపశ్యంతిదృష్ట్యాచరణాభివృద్ధ్యా॥

శని తానున్న రాశి నుండి తృతీయ దశమములను, గురుడు పంచమ, నవమములను, కుజుడు చతుర్థ, అష్టమములను, అందరు సప్తమమును పూర్ణదృష్టితో చూచెదరు. స్థానమును చూతురన్న, అందలి గ్రహములను చూతురని అర్థము. కొందరు గ్రహములన్నియు సప్తమమును పూర్ణ దృష్టితోను, శని 3,10లను పాద దృష్టితోను చూచునని అందుచేతనే 'చరణాభివృద్ధి' అనుట సరిపోవునని చెప్పుదురు.

107. భానోస్తుమిత్రాణికుజేందుజీవాస్సమోబుధశ్శుక్రశనీసపత్నౌ ।
ఇష్టాశశాంకస్యదినేశసౌమ్యౌశ్శేషాస్సమాభూమిసుతస్యమైత్రాః॥

గ్రహముల మిత్రత్వశత్రుత్వములు – రవికి–కు,చం,గురువులు మిత్రులు, బుధుడు సముడు. శనిశుక్రులు శత్రువులు, చంద్రునకు–ర, బుధులు మిత్రులు–మిగిలిన వారు సములు. శత్రులు లేరు.

108. రవీందుజీవాశ్చ బుధస్తుశత్రు స్సమౌదినేశాత్మ జదానవేడ్యౌ।
సౌమ్యస్యమిత్రేదిననాథశుక్రౌ శేషాస్సమారాత్రికరస్సపత్నః॥

కుజునకు–ర,చ,గురువులు మిత్రులు, బుధుడు శత్రువు, శనిశుక్రులు సములు బుధునకు –రవిశుక్రులు మిత్రులు; చంద్రుడు శత్రువు, కు,గు, శనులు సములు.

109. శుక్రేందుజౌ దేవగురోస్సపత్నౌమిత్రాణిసర్వే రవిజస్తుమధ్యః
శనీందుజావిష్ట కరౌభృగోస్తు శేషాస్సపత్నౌశ్చసమౌకుజేజ్యౌ॥

గురునకు– ర,చం, కుజులు మిత్రులు, శుక్రబుధులు శత్రువులు, శని సముడు, శుక్రునకు–శనిబుధులు మిత్రులు, కుజగురువులు సములు; రవిచంద్రులు శత్రువులు.

110. సౌరస్యమిత్రేభృగుపుత్రసౌమ్యౌ సమోగురుస్తేనిఖిలాస్సపత్నాః ।
రాహోస్తుమిత్రాణికవీజ్యమందాః కేతో స్తథైవప్రవదంతితజ్ఞాః॥

శనికి–శుక్రబుధులు మిత్రులు, ర,చం,కుజులు శత్రువులు, గురువు సముడు. రాహువునకు శు,గు,శనులు మిత్రులు. కేతువునకంతేఅని మునులు చెప్పుదురు, ఇది నైసర్గికమైన మిత్రశత్రుత్వము.

111. భవంతితాత్కాలికమిత్రభూతాస్సర్వేచవాక్పోదరబంధుయుక్తాః ।
వ్యస్వాత్క్రిమాద్వ్యత్క్రిమత స్తథైవమన్యస్థితా స్తత్సముపారిభూతాః॥

అన్ని గ్రహములు తామున్నరాశి నుండి 1,2,3,4,10,11,12 స్థానముల నున్న గ్రహములు తాత్కాలిక మిత్రులు. 5,6,7,8,9 స్థానములందున్న గ్రహములు తాత్కాలిక శత్రువులు.

112. తత్కాలమిత్రంతు నిసర్గమిత్రం ద్వయంభవేత్తత్వధిమిత్రసంజ్ఞం ।
తథైవశత్రు స్త్వధిశత్రుసంజ్ఞ ఏకత్రశత్రుస్సమతాముపైతి॥

ఏ గ్రహమైనా నైసర్గిక మిత్రుడు, తాత్కాలిక మిత్రుడునైన–అధిమిత్రుడగును. నైసర్గిక శత్రువు, తాత్కాలిక శత్రువు అయిన–అధిశత్రువగును. ఒక శత్రుత్వము, ఒక మిత్రత్వము కల్గిన సముడగును. సముడు శత్రువైన శత్రువే, మిత్రుడైన మిత్రుడే.

113. మానాదిబంధ్వంతగతాఃఖగస్యతత్కాలమిత్రాణిభగాభవంతి ।
సహస్థఖేటస్యతుశత్రుతుతోక్తా కైశ్చిచ్చనష్టాదిషుమిత్రతోక్తా॥

గ్రహస్థితి రాశికి దశమాదిచతుర్థాంతరాశులందున్నవారు తాత్కాలికమిత్రులు. తృతీయ గ్రహము శత్రువని, సష్టాదిప్రశ్నలందు మిత్రులని కొందరు చెప్పిరి.

114. స్వోచ్చేసుహృద్భేస్వ నవాంశకేపిస్వర్క్షేదృగాణేద్విరసాంశకేపి ।
త్రింశాంశకేచాథకళాంశకేచయాన్యంతితేస్థానబలంగ్రహేంద్రాః॥

గ్రహములకు షడ్బల నిర్ణయము – స్వోచ్చ, మిత్రరాశి, స్వనవాంశ, స్వరాశి, స్వద్రేక్కాణ, ద్వాదశాంశ, త్రింశాంశ, షోడశాంశలందున్న గ్రహము స్థానబలము కల్గియుండును. ఇది స్థానబలము.

115. లగ్నేబుధేజ్యౌబలినౌతుపూర్వే వీర్యాయమేతద్దశమేర్కభౌమౌ ।
అస్తేర్కసూనుర్బలవాన్ జలేశే బంధౌనిశానాథకవీకుబేరే॥

బుధగురులు తూర్పున-లగ్నగతులై బలవంతులు, రవికుజులు దశమమున దక్షిణ దిక్కునను, శని పశ్చిమమున-సప్తమమునను, చంద్రశుక్రులు ఉత్తరమునను చతుర్థమున నుండియు బలవత్తరులు.

116. తత్సప్తమేదిగ్బలశూన్యమాహుస్తదంతరేచేత్యనుపాతఏవ ।
స్వమానహోరాదినవత్సరేషు వీర్యాన్వితాభాను ముఖాగ్రహేంద్రాః॥

ఏ గ్రహమైనా దిగ్బలము కల్గిన రాశికి సప్తమమున దిగ్బలం శూన్యమగును. మధ్యనఉన్న అనుపాతమున బలము తెలియదగినది. ఇది దిగ్బలము. రవ్యాది గ్రహములు స్వమాస, హోర, దిన, సంవత్సరములందు కాలబలము కల్గియుందురు.

117. రాత్రౌబలాస్స్యుశ్శనిచంద్రభౌమాస్త్రయోగ్రహాశ్చాహ్నిరవీజ్యశుక్రాః ।
సదాబలీవిత్సిత కృష్ణపక్షయో స్సౌమ్యాస్తథాన్యేసబలాఃక్రమేణ॥

శనికుజచంద్రులు రాత్రియందును, రవిగురుశుక్రులు పగటియందును, బుధుడు రేయింబవళ్లును బలవంతులు. శుక్లపక్షమున శుభగ్రహములు, కృష్ణ పక్షమున పాపగ్రహములు కాలబలము కలవారు. ఇది కాలబలము.

118. శుభేక్షితాఃపూర్ణబలాస్తుదృష్టే ర్బలంహిపాదంరుఖలైశ్చదృష్టే ।
దృగ్దృశ్యయోర్దగ్రిష్ఠురపీహచాంతరం యథానుపాతంఖ లుదృగ్బలాయ॥

శుభగ్రహములచే చూడబడిన గ్రహములు పూర్ణబలులు, పాపగ్రహములచే

చూడబడిన వారు పాదబలులు. దృగ్బలము తెలియుటకై మధ్యనున్న గ్రహములకను పాతము ద్వారా తెలియునది.

**119. సౌమ్యాయనేత్వతిబలీదివసాధినాథశ్చంద్ర స్తదన్యనమయేబలపూర్ణ తావాన్ ।**

**వక్రాన్వితాః క్షితి సుతా దిఖగాస్సమస్తాఃయుద్ధేజయీాధనపదిద్గతి కాంతియు క్తః॥**

ఉత్తరాయణమున రవి, దక్షిణాయనమున చంద్రుడు, కుజాది పంచ గ్రహములు వక్రగతిలోను బలవంతులు. గ్రహయుద్ధమున, గోళమున ఉత్తరమునఉండి జయించిన గ్రహము, కాంతియుక్తుడై బలవత్తరము. ఇది చేష్టా బలము.

**120. మందారసౌమ్యగురుశుక్రశశాంకసూర్యానైసర్గికాఖ్యబలినఃఖచరాః క్రమేణ ।**

**తత్ స్థానదిక్కాలదృగు క్తచేష్టానైసర్గికంషడ్బలమేవము క్తం॥**

శని, కుజ, బుధ, గురు, శుక్ర, చంద్ర, రవులు ఉత్తరోత్తరము బలవంతులు. ఇది నైసర్గిక బలము: 1స్థాన, 2. దిగ్బల, 3. కాల, 4. దృగ్బల, 5. చేష్టా, 6. నైసర్గికబలములు—మొత్తము 6. ఈ షడ్బల సాధనము అత్యావశ్యకము.

**ఇక్కడ శ్రీపతి పద్ధతి మంచిది. అదియెట్లనగా—**

1. స్థాన బలమున స్వోచ్చబల గణితము—ఆయాస్ఫుట గ్రహములో ఆ గ్రహపరమనీచను తీసివేసి—శేషము 6రాశులకు తక్కువగానున్న, దానినే లిప్తలుగా మార్చవలెను. 6 కంటె ఎక్కువైన 12 రాశులలో తీసివేసి మిగిలిన శేషమును లిప్తలుగా మార్చవలెను. దానిని 10800 చే భాగించగా వచ్చినది రూపమగును. రూపమనగా 1 బలము (or ఒక బలము = రూపము), శేషమును 60చే గుణించి, మరల 10800చే భాగించగా విరూపములు వచ్చును. (1 రూపము=60 విరూపములు).

2. స్థానబలములోనే మూలత్రికోణాదిస్థిత గ్రహబలము—మూలత్రికోణ స్థానముననున్న గ్రహమునకు 0-45 విరూపములును, స్వక్షేత్రమున 0—30న్ని, అధిమిత్ర క్షేత్రమున 22—30యు, మిత్రక్షేత్రమున—0—15న్ను, సమక్షేత్రమున 7—30యు, శుత్రుక్షేత్రమున 3—45న్ను, అధిశత్రు క్షేత్రమున 1—52—30యు, ఇట్లు బలముండును. ఆ గ్రహములుండు స్థానములబట్టి బలము లెక్కింపవలెను. (60 పరలు=1పర; 6 పరలు=1 విరూపము, 60 విరూపములు 1 రూపము).

3. స్థానబలములోని-ఓజ యుగ్మరాశి గత బలము—సరిరాశులందుగాని, ఏ రాశులలోనైనా సరిరాశుల నవాంశలందున్న చంద్రశుక్రులకు0—15 (¼ రూపం)

పరిరాశులందున్నందుకున్ను, సరిరాశ్యంశలందున్నందుకు 0–15న్ను, రవి, కుజ, బుధ, గురు, శనులు ఓజరాశులందున్న 0–15న్ను,ఓజరాశ్యాంశలందున్న 0–15న్ను బలముకల్గి యుందురు.

4. కేంద్రాది బలసాధన–కేంద్రమందున్న గ్రహమునకు–1–0యు, పణ పరమున 0–30న్ని, ఆపోక్లిమమున 0–15న్ను బలముంతును. పురుషము ఏ రాశిలోనైనా ప్రథమ ద్రేక్కాణమునసున్న 0–15న్ను, మధ్యమ ద్రేక్కాణమున నున్న నపుంసక గ్రహమునకు 0–15న్ను, అంత్యద్రేక్కాణమున ఉన్న స్త్రీగ్రహ మునకు 0–15 బలమున్ను కల్గును. ఈ నాల్గు బలములను కలిపి స్థానబలముగా లెక్కింపవలెను.

దిగ్బలసాధన– లగ్నమున బుధగురులు తూర్పునను, దశమమున రవికుజులు దక్షిణమునను, సప్తమమునశనిపశ్చిమమునను, చతుర్థమునచంద్రశుక్రులు ఉత్తరము నను పూర్ణ బలవంతులు. దానికి సప్తమమున బలహీనులు. తక్కినరాశులందున్న త్రైరాశికము చేయవలయును. ఎట్లనగా– రవికుజుల బలమునకు –వారి స్ఫుటములో చతుర్థభావమును తీసివేసి, శేషము 6 రాశులకు తక్కువగఉన్న–దానినే, ఎక్కువగా ఉన్న 12 రాశులలో తీసివేయగా మిగిలిన దానిని, లిప్తలుచేసి, దానిని 10800చే భాగించగా లబ్ధము రూపము. శేషమును 60చే గుణించి, మరల భాగించగా విరూపము వచ్చును. బుధగురుల బలమునకు వారిస్ఫుటములో సప్తమ భావమును తీసివేసియు, శనిబలమునకు లగ్నమును తీసివేసియు, పైన చెప్పిన రీతిని బలము నెరుగవలెను.

కాలబలములో దివారాత్రబలము–చంద్రకుజశనులర్ధరాత్రమున పూర్ణబలులు. మధ్యాహ్నమున బలహీనులు. ఇతర కాలమున త్రైరాశికము చేయవలెను. రవి గురుశుక్రులు మధ్యాహ్నమున పూర్ణబలులు; అర్ధరాత్రమున బలహీనులు. తక్కిన కాలమున అనుపాతమున బలము నెరుంగునది. బుధుడు సర్వదా పూర్ణబలుడు.

నతగడియలను అసువులుచేసి 180చే భాగించగా రాత్రిబల గ్రహములకు విరూపములును, ఉన్నతగడియల నసువులుచేసి 180చే భాగించగా పగటి బలగ్రహ ములకును బలము వచ్చును. అసువులుచేయుటయనగా–విగడియలను 6చేగుణించుట. బుధునకెప్పుడైనను 1 రూపము బలముండును.

1. నతోన్నతసాధమున– పగలు జననమైన- దినపూర్వ భాగమైన జనన ఘడియలను దినార్ధములో తీసివేసిన పూర్వనతము,పరభాగమైన–జనన ఘడియలలో దినార్ధమును తీసివేయగా అపరనతమగును. రాత్రియందు జననమైన–అర్ధరాత్రము నకు పూర్వమైన–సూర్యాస్తమయాది జననకాలమును దినార్ధములో చేర్పగా అపరనత

మగును. రాత్రి అపర భాగముననయిన-జననకాలాదిసూర్యోదయ పర్యంత ఘటిక లను దినార్ధములో చేర్చగా పూర్వనతమగును. ఏనతమైనా 30 గడియలలో తీసి వేయగా ఉన్నత గడియలగును.

2. పక్షబలసాధనము-స్ఫుటచంద్రుని స్ఫుటరవిలో తీసివేసిన శేషము 6 రాశులకన్నా ఎక్కువగాఉన్న 12రాశులలో తీసివేసి,తక్కువగా ఉన్నట్లుంచి, దానిని లిప్తలుచేసి 10800చే భాగించగా శుక్లపక్ష రూపాదిబలము. శుక్లపక్ష బల విరూపములను 60 విరూపములలో తీసివేయగా కృష్ణపక్ష బలమగును.

శుభులకు శుక్లపక్ష బలము, పాపులకు కృష్ణపక్ష బలమును కాలబలములో కలుపవలెను. పక్షబల విషయమున చంద్రగురుశుక్రులు శుభులు. ర,కు,శనులు పాపులు. పాపయుక్త బుధుడుపాపి, క్షీణచంద్రుడు పాపి. చంద్రుడు శుక్లపాడ్యమి మొదలు శుక్లదశమి వరకు మధ్య బలుడు, ఏకాదశి మొదలు బహుళ పంచమి వరకు పూర్ణబలుడు. అది మొదలు అమావాస్య వరకు అల్ప బలుడు. కొందరు పక్షబల విషయమున చంద్రునికి క్షీణపూర్ణత్వముతో పనిలేదని, కొందరు శుక్లాష్టమి మొదలు కృష్ణాష్టమి వరకు పూర్ణుడని చెప్పుదురు.

3. దిన-రాత్రి బలసాధనము-దినప్రమాణమును 3 భాగములు చేయగా 1 భాగమున బుధునకు 1 రూపము, 2 భాగమున రవికి 1 రూపము, 3 భాగమున శనికి 1 రూపము బలము; రాత్రిప్రమాణమును మూడు భాగములు చేయగా 1 భాగమున చంద్రునకు 1రూ. 2 భాగమున శుక్రునకు 1రూ. 3 భాగమున కుజు నకు 1 రూపము; ఆరు భాగములలో ఎప్పుడైన గురునకు 1 రూపము బలము కల్గును.

4, అబ్దమాస బలము-జనన సంవత్సరాధిపతికి అబ్దబలము ¼రూ. జనన మాసాధిపతికి మాసబలము ½రూ. జనన వారాధిపతికి వారబలము ¾రూ. జననకాల హోరాధిపతికి హోరబలము 1రూ. ఇది కాలబలములో చేర్చవలెను. కాలహోరాధి పతి విషయము కాలామృతమున కలదు. సంవత్సరాదినా దే వారమగునో ఆ వారాధి పతి సంవత్సరాధిపతి, మాసశుక్లపక్ష ప్రతిపత్తు ఏ వారమున అగునో ఆ వారాధిపతి మాసాధిపతియు నగుదురు.

5. కుజాదులకు సంస్కారము. రవితో చంద్రాది గ్రహములుచేరిన అస్తంగతత్వమును, చంద్రునితో కుజాదులు చేరగా సమాగమమును, కుజాదులలో రెండేసి కలిసిన గ్రహయుద్ధ ముకల్గును. కుజునకు ముందున్న గ్రహము-ఎక్కువ భాగలు భుక్తియైన గ్రహము జయము పొందినది. వెనుకనున్న గ్రహము పరా జయము పొందినది.

నైసర్గిక బలసాధనము-

శనికి 1 రూపమును, కుజునకు 2 రూపములను, బుధునకు 3 రూపములను, గురునను 4 రూపములను, శుక్రునకు 5 రూపములను, చంద్రునకు 6రూపములును, రవికి 7 రూపములను 7చే భాగించగా వారి వారి నైసర్గిక బలము వచ్చును. అట్లు భాగించగా- శని 1/7, కుజుడు 2/7, బుధుడు 3/7, గురుడు 4/7, శుక్రుడు 5/7, చంద్రుడు 6/7, రవికి 7/7 = 1 రూపము బలమగును.

దృగ్బల సాధనము-

చూడబడు గ్రహము (దృశ్య)లో చూచెడి (ద్రష్ట) గ్రహమును తీసివేయుగా శేషము, 6 రాశులకన్న ఎక్కువైన 10 రాశులలో తీసివేసి, దానిని లిప్తలుగా మార్చి, దానిని రాశి చతుష్కలిప్తలైన 7200చే భాగించగా దృష్టివచ్చును. వెనుకటి శేషము 5 రాశుల కెక్కువ 63 తక్కువయైన, అందు 5 రాశులను తీసివేసి, లిప్తలుగా మార్చి 1800చే భాగించగాను, 4 రా. కెక్కువగాను 5కి తక్కువగాను ఉన్న, 5 రాసులలో తీసివేసి, శేషమును లిప్తలుచేసి, 3600చే భాగించగాను, 3 రా. కెక్కువ, 4 రా.కి తక్కువగా ఉన్న, 4 రాసులలో తీసివేసి, లిప్తలుచేసి, 3600 కలిపి, 7200చే భాగించగాను, 2 రా. కెక్కువ, 3 రా.కి తక్కువగాను ఉన్న, అందు 2 రాశులను తీసివేసి, శేషమును లిప్తలుచేసి, అందు 300 చేర్చి, 36 చే భాగించగాను, ఒక రాశి కెక్కువగాను 2 రాసులకు తక్కువగాను ఉన్న, అందు 1 రాశిని తీసివేసి, లిప్తలుచేసి 7200చే భాగించగాను దృష్టివచ్చును. పది రాసుల కన్న హెచ్చుగాను, 1 రాశికి తక్కువగాను ఉన్న- దృశ్యగ్రహముమీద దృష్టి వ్యాపించదు.

ఏ గ్రహముమీదికైనను శనిదృష్టి సాధించునపుడు (త్రిదశస్థానముల విశేష దృష్టి యున్నందున) 2 రా. కెక్కువ, 3 రాసుల వరకుండునపుడును, 9కి పైన 10 వరకు ఉండునపుడును ముందు సాధించిన శని దృష్టిలో త్రిపాదదృష్టిని- అనగా 0-45 విరూపములను కలుపవలెను. గురుదృష్టి సాధనలో (పంచమ నవమ ముల విశేషదృష్టి కనుక) 4 రా. కెక్కువ 5 వరకు ఉన్నప్పుడును, 8కి మించి, 9 వరకు ఉన్నప్పుడును- అర్ధదృష్టిని అనగా 0-30 విరూపములను గురుదృష్టిలో కలుపవలెను. అట్లే కుజదృష్టిలో (చతుర్థ అష్టమముల విశేషదృష్టికాన) 3 రా. కెక్కువ 4 వరకున్నప్పుడును, 7 కెక్కువ 8 వరకున్నప్పుడుమ 1/4 పాదదృష్టిని- అనగా 0-15 విరూపములను కుజదృష్టిలో కలుపవలెను.

ఇట్లు సాధించిన గ్రహదృష్టులను వేర్వేరుగా 4చే భాగించి, లబ్ధమును శుభ

దృష్టియైన గ్రహబలమున చేర్చవలెను. పాపదృష్టియైన వారి బలములో తీసివేయవలెను. ఆ గ్రహముమీద పడిన పాపదృష్టిలో నాల్గవభాగమును వేరుగాను, శుభదృష్టిలో నాల్గవభాగమును వేరుగాను ఉంచి, వాటిలో ఎక్కువదానిలో తక్కువది తీసివేసి, పాపగ్రహ దృష్టి మిగిలిన- శేషదృష్టి చతుర్భాగమనియు, శుభదృష్టి మిగిలిన- శేషదృష్టి చతుర్భాగమనియు గుర్తు వ్రాసికొనవలెను. ఇదే దృగ్బలము. ఆయా గ్రహముల పంచబలములతో పాపదృష్టిని తీసివేయగాను, శుభదృష్టి కలుపగాను, స్ఫుటబలములు వచ్చును. ఇట్లు స్థానాది షడ్బలములను సాధించవలెను.

121. లగ్నస్యవీర్యమధిపస్యబలంతునర్వంముఖ్యావదంతిఖలుషడ్విధ వీర్యమేవం ॥

లగ్నంనృభంచేద్బలమత్రరూపం బలం చతుష్పాదభమర్ధ నంజ్ఞం ।
చేత్కీటలగ్నంకిమపీహనాస్తిస్ఫుటంవిలగ్నస్య బలం తదాహుః ॥

లగ్నాధిపతియొక్క స్థానాది షడ్విధ బలమే లగ్నబలమని చెప్పుదురు. లగ్నమున రాశియైన లగ్నబలము 1 రూపము, చతుష్పాదరాశియైన ½ రూ., కీటరాశియైన శూన్యము.

ఈ విషయమున శ్రీపతి గ్రంథోక్తక్రమము ఏదనగా- లగ్న స్ఫుటములో లగ్నమును చూచెడి గ్రహస్ఫుటమును తీసివేసి, దృష్టిసాధనలో చెప్పిన ప్రకారము దృష్టులను సాధించవలెను. లగ్నములో బుధగురుదృష్టులను కలుపవలెను. ఇతర గ్రహములలో పాపగ్రహదృష్టి చతుర్భాగమును, శుభగ్రహదృష్టి చతుర్భాగమును వేర్వేరుగా ఉంచి, ఎక్కువలో తక్కువను తీసివేసి మిగిలినది పాపదృష్టియైన లగ్నబలములో తీసివేయవలెను. శుభదృష్టియైన లగ్నబలములో కలుపవలెను. లగ్నము నరరాశియైన 1 రూపము, చతుష్పాత్తైన ½ రూ. కలుపవలెను. అప్పుడు లగ్న స్ఫుట బలము వచ్చును. శ్రీపతి ప్రకారము మి, కన్యా, తు, కుంభ, ధనుః పూర్వార్థములు నరరాశులు. మే, వృష, సింహ, ధనురుత్తరార్ధములు మకర పూర్వార్ధమును చతుష్పాత్తులు. కర్క, మీన, మకరోత్తరార్ధములు జలచరరాశులు. వృశ్చికము కీటరాశి. ఇది జన్మలగ్న కేంద్ర బలసాధనము.

తక్కిన కేంద్రబల సాధనము: చతుర్థ కేంద్రమున జలచరరాశులు బలవంతములు. చతుర్థము జలరాశియైన 1 రూపము. భావాధిప బలములో కలుపవలెను. దానికి సప్తమమగు దశమమున బలము శూన్యము. దశమభావమున చతుష్పద రాశియైన ఆ భావాధిప బలములో 1 రూపము చేర్చగా దశమకేంద్ర బలము. దశమమునకు సప్తమమైన చతుర్థము బలశూన్యము. సప్తమము కీటకరాశియైన, ఆ భావాధిపుని

బలములో 1 రూ. చేర్చగా అది సప్తమ కేంద్రబలము. సప్తమమునకు సప్తమము లగ్నము. అది బలశూన్యము. అది నరరాశియైన 1 రూపబలమును లగ్నాధిపతి బలములో చేర్చగా అది లగ్నబలమగును. తక్కిన రాశులబలమును త్రైరాశికముచే నెరుగవలెను.

ఏ భావమునకు బలసాధన చేయవలెనో, ఆ భావాధిపతి షడ్బలముల మొత్తమునే ఆ భావబలముగా బెట్టి, దానికి లగ్నబలము విధముగానే, బుధగురుల దృష్టి చేర్చి, తక్కిన గ్రహదృష్టులలో శుభపాప దృష్టుల భేదము శుభదృష్టియైన కలిపి, పాపదృష్టియైన తీసివేసి బలమును స్ఫుటము చేయవలెను.

**122.** సార్ధానిషట్తీక్ష్ణ కరోబలీయాన్ చంద్రస్తుషట్వంచ వసుంధరాజః ।
సప్తేందుసూసూరవివద్గురుస్స్యా త్సార్ధానిపంచాథసితోబలీస్యాత్ ॥

రవి షడ్బలము మొత్తము 6 రూ. 30 విరూ. ఉన్నను, చంద్రుడు 9-00 ఉన్నా, కుజుడు 5-00 ఉన్నా, బుధుడు 7-0 ఉన్నా, గురుడు 6-30 ఉన్నా, శుక్రుడు 7-30 ఉన్నా-

**123.** మందస్తుపంచైవతుషడ్బలానాం సంయోగ ఏవా పరధాన్య ధాస్యుః ।
రూపత్రయంబలముశంత్యథపాదహీనం స్థానేతు దిగ్బలమథాంఘ్రి విహీనరూపం ॥

శని 7-0 ఉన్నా, బలవంతులు. ఇంతకు తక్కువబలమున్న, పూర్ణ బలవంతులు కారని యెరుగునది. ఈ పూర్ణబల విషయమున మరొక రీతియు ఉన్నది. స్థానబలమున 3-0 లేక 2-45; దిగ్బలము 0-45;

**124.** ఋత్వంశహీనబలమత్రతుచేష్టితాఖ్యమష్టాంశ హీనయుగమే వతు కాలవీర్యం ।
పూర్ణాబలై రవిశశాంక సుతామరేజ్యాః స్వార్ధంబలంత్వయనజంహి పృథగ్విభాగే॥

చేష్టాబలము 5 విరూపములును, కాల బలము 1-52-30న్ని, ఉన్న రవి బుధ గురులు పూర్ణబలులు. వారికి అయన బలము ప్రత్యేకముగ 0-30 ఉండవలెను.

**125.** రసాంశహీనందిశివీర్యమాహుఃస్థానేతు పాదాధికయుగ్మరూపం ।
కాలేబలంత్ర్యంశవిహీనయుగ్మమర్ధం భవేచేష్టిత వీర్యమేవ ॥

చంద్ర శుక్రులకు 0-50 దిగ్బలము, 2-15 స్థానబలము, 1-40 కాలబలము, 0-30 చేష్టా బలమును,

**126.** త్ర్యంశోనమేకంత్వయనం బలంస్యాత్పితాంశు దేవేంద్రదన
పత్నిగుర్వోః।
చేష్టాబలంత్ర్యంశకహీనమేకం సాష్టాంశరూపంసమయే బలంశ్యాత్ ॥

0-40 అయన బలమును ఉన్నచో చంద్రశుక్రులు పూర్ణ బలవంతులు. కుజ శనులకు— 0-40 చేష్టాబలము. 1-7-30 కాలబలమును.

**127.** దిశ్యర్ధరూపంబలమాయనంతు త్ర్యంశ్యంఘవేత్ స్థానికధర్మయుగ్మం।
దినేశపుత్రస్య వసుంధరాయాః సూనోఃక్రమాద్వీర్యముదాహరంతి ॥

0-30 దిగ్బలమును, 0-20 అయన బలమును, 2-30 స్థానబలమునుఉన్న కుజ శనులు పూర్ణబలులు.

**128.** ఆరోహవీర్యాప్రభవంతిభావ సమానపర్యంత మథచ్యుతాస్యుః।
స్వోచ్చేసుహృత్క్షేత్రగతోగ్రహేంద్రః షడ్బిర్బలై ర్ముఖ్యబలాన్వితోపి॥

ఫల పరిమాణ జ్ఞానము– గ్రహములు స్ఫుటమున ఆయా భావసమాన పర్యంతమున్న - అనగా పూర్వభావ ఉత్తరసంధి మొదలు ఉత్తర భావసమాన పర్యంతము ఉన్నపుడు– భావారోహణ బలవంతులు. అనంతరము - అనగా భావముయొక్క ఉత్తరార్ధమున ఉన్నపుడు భావచ్యుతులగుదురు– ఆరోహణ భావ బలహీనులగుదురు. స్వోచ్ఛ స్వక్షేత్రాది స్థిరగ్రహము షడ్బలముతో ముఖ్య బలముగలదైనా భావసంధి యందున్నచో నిష్ఫలప్రదము.

కాన భావసంధులను వివేచన చేసి, ఆయా గ్రహదశాభుక్తులందు ఫలము చెప్పవలెను.

ద్వాదశ భావ, తత్సంధులనెట్లు సాధించవలెననగా–

ముందుగా జనన సమయమును గడియారమురీత్యా (ఈ కాలమున మరొక పద్ధతులక్కరలేదు కనుక) నిశ్చయముగా చూచుకొని, దానికి సరిగా గ్రహములను పంచాంగరీత్యాగాని, ఎఫిమిరీస్‌రీత్యాగాని స్ఫుటములను చేయవలెను. ద్వాదశ భావములను స్ఫుటముచేసిన పిమ్మటనే షడ్బలసాధన చేయవలెను. షడ్బలసాధన చెప్పబడినదే.

ముందు లగ్నస్ఫుటము చేసికొని– దానినే 'తను భావ' మనవలెను. దానికి 6 రాశులు కలుపగా సప్తమమగును. నతోన్నత సాధన చెప్పబడినది కదా: నతముచే సాధితమైన రాశ్యాదిని, పూర్వనతమైన తాత్కాలిక సాయన స్ఫుట రవిలో తీసివేయవలెను. అపరనతమైన స్ఫుటరవిలో కలుపవలెను. అది సాయనమధ్య లగ్నమగును/ అందు అయనాంశలు తీసివేయగా మధ్యలగ్నమగును. అనగా దశమభావ మగును.

దానిలో 6 రాశులు చేర్చగా చతుర్థమగును. ఇట్లు లగ్న, చతుర్థ, సప్తమ, దశమములు రాగా, చతుర్థములో తనుభావము తీసివేసి, మిగిలిన దానిని 3చే భాగించగా లబ్ధ మును తను భావమున చేర్చగా ధన భావమగును. 3చే భాగించిన లబ్ధమును 2చే గుణించి, తను భావములో చేర్చగా సహజ భావము వచ్చును.

ఇట్లే సప్తమ భావములో చతుర్ధ భావమును తీసివేయగా శేషమును 3చే భాగించగా వచ్చిన లబ్ధమును చతుర్ధమున కలుపగా పంచమ భావము వచ్చును. ఆ లబ్ధమును 2చే గుణించి, చతుర్ధమునకు కలుపగా షష్టభావము వచ్చును. దశమ భావములో సప్తమమును తీసివేసి, వచ్చిన దానిని 3చే భాగించి, లబ్ధమును సప్తమము నకు కలిపిన అష్టమ భావము వచ్చును, 2చే గుణించి కలిపిన నవమ భావము వచ్చును. తను భావములో దశమమును తీసివేసి, 3చే భాగించగా వచ్చిన లబ్ధమును దశమములో కలుపగా ఏకాదశము, 2చే గుణించి కలుపగా ద్వాదశము వచ్చును. భావమనగా మధ్యప్రదేశము కనుక లగ్నభావమనగా లగ్నమధ్య ప్రదేశమని అర్థము.

భావసంధి సాధనము — లగ్నధన భావములందలి 2చే భాగించగా సంధి యగును. అది లగ్న భావమున కంత్యము, ధన భావమున కాదియును. అట్లే తక్కిన భావసంధులను గుర్తించునది. సంధిలోనున్న గ్రహము ఏ భావముయొక్క ఫలమునియ్యక నిష్ఫలమగును. సంధికి వెనుకనున్నది పూర్వ భావఫలమును, సంధిని దాటిన గ్రహము తరువాతి భావఫలము నిచ్చును. భావమున ఉన్న గ్రహము పూర్ణ ఫలము నిచ్చును. పూర్వమందున్నా, పరమందున్నా పూర్తి ఫలమియ్యదు. అను పాతము వలన ఎంత ఫలము నిచ్చునో తెలియదగినది.

భావాది ఫలస్థానము జాతకమున చాల ముఖ్యమైనది కనుక జాతకమున ద్వాదశ భావములను; సంధులను, స్ఫుటగ్రహములను, గ్రహషడ్వర్గ బలమును లెక్కకట్టి తెలిసికొని, ఆ పైన ఫలములు చూచుట మంచిపని. ఏవియుచూడక కేవ లము చక్రము చూచి చెప్పిన ఫలితములు పనిచేయవు. దానివలన చెప్పెడివానికేకాక, శాస్త్రమునకే అపఖ్యాతి వచ్చుచున్నది.

ఇక శ్లోక ఉత్తరార్ధ భావము. జన్మ లగ్నము సందిగ్ధమైనపుడు ప్రశ్నకాల, చంద్ర, మాందీగ్రహములవలన జన్మలగ్న సాధన చెప్పబడినది. ఎట్లన-ప్రాణ రాశికి పంచమ నవమములందైనా, మాంది ఉన్న రాశికి పంచమ నవమములందైనా జన్మలగ్నమగునని మహర్షి వాక్యము.

130. మాంద్యంశకాత్కోణగతం విలగ్నం తదంశకాత్సప్తమరాశికోణే ।
శశాంకసంయుక్తభకోణరాశౌ తదంశకాత్తన్మదకోణభేచ ॥

సందిగ్ధలగ్న-నిర్ణయము:-ప్రశ్నకాలమున మాంది గ్రహమున్న నవాంశ రాశికి నవమ, పంచమములందుగాని, లేదా ఆ నవాంశానికి సప్తమరాశికి కోణములందుగాని, లేక చంద్రస్థితి రాశికి కోణములందు జన్మలగ్నమగును. ప్రాణరాశియనగా చంద్రుడున్న రాశి కావచ్చును.

131. ప్రశ్నే పితజ్జన్మ సమానకాలే లగ్నస్య నిశ్చాయకమత్రతజ్ఞాః ।
తయోర్బలేనాపి వికల్పమాహుర్లగ్నాబ్జయోరిత్థముదాహరంతి ॥

జన్మసమాన కాలమైన ప్రశ్నయందును పూర్వోక్త ప్రకారమే లగ్ననిశ్చయమని పండితులు చెప్పుదురు. లగ్నచంద్రుల బల వికల్పముచే నిర్ణయమును చెప్పుదురు.

132. లగ్నే బలే మాందివశాద్విలగ్నం చంద్రే బలే చంద్రవశాద్విలగ్నం ।
ఓజే తదంశే పురుషస్య జన్మ లగ్నే స్త్రియస్తద్విపరీతభాగే ॥

ప్రశ్నలగ్నము బలమైన మాందీవశమున పూర్వోక్త ప్రకారము జన్మలగ్ననిర్ణయము, ప్రశ్నకాల చంద్రుడు బలవత్తరుడైన చంద్రునివలన జన్మలగ్న నిర్ణయము చేయదగును. ఓజరాశియందు ఓజ నవాంశయైన పురుషుడును, యుగ్మరాశియందు, యుగ్మనవాంశలో స్త్రీయు పుట్టుదురు.

133. క్రమాద్గ్రహాః పాచకబోధకశ్చ సకారకో వేధకసంజ్ఞకస్తు ।
మందారజీవామరశత్రుపూజ్యాశ్శుక్రారసూర్యాత్మజవాసరేశాః ॥

రవ్యాదిగ్రహములకు పాచక, బోధక, కారక, వేధక, సంజ్ఞాగ్రహముల జెప్పుచున్నాడు-రవ్యాదులకు చెప్పబోవు గ్రహములు క్రమముగా పాచక బోధక కారక వేధకులగుదురు. రవికి శని, కుజ, గురు, శుక్రులును, చంద్రునకు శుక్ర కుజ శనిరవులును.

134. రవీందుసూర్యాత్మజచంద్రపుత్రాశ్శశాంకజీవా స్సృణిదావనేయాః ।
సూర్యాత్మజారేందుదినాధినాథా స్సౌమ్యార్కదేవేజ్యదినేశపుత్రాః ॥

కుజునకు-రవి, చంద్ర, శని, బుధులును, బుధునకు-చంద్ర, గురు, శుక్ర, కుజులును, గురునకు-శని, కుజ, చంద్ర, రవులును, శుక్రునకు-బుధ, రవి, గురు, శనులును.

135. శుక్రేందుదేవేజ్యధరాసుతాస్తు భవంతి తత్పాక ముఖా గ్రహేంద్రాః ।
స్థానాని వక్ష్యే క్రమశో గ్రహాణాం షట్సప్తధర్మాయగతాః క్రమేణ ॥

శనికి—శుక్ర, చంద్ర, గురు, కుజులును పాచక, బోధక, కారక, వేధకులగుదురు. ఏ స్థానమందున్న ఆ సంజ్ఞల పొందుదురో, ఆ స్థానముల చెప్పుదును. రవికి 6,7,9,11 స్థానములనున్న, పూర్వోక్తగ్రహముల సంజ్ఞను పొందుదురు. అనగా రవికి షష్ఠమందున్న శని పాచకుడును, సప్తమమందున్న కుజుడు బోధకుడును, నవమమందున్న గురుడుకారకుడును, లాభమందున్న శుక్రుడు వేధకుడు అగునని తెలియునది.

136. భానోశ్శశాంకాత్మజభాగ్యలాభ యుక్తాస్తృతీయేథ ధరాసుతస్య ।
ధనారిలాభాంత్యగతాబ్జసూనో ర్ద్వితీయబంధ్వాత్మజసోదరాశ్చ ॥

చంద్రుడున్నరాశికి-5,8,11, టన ఉన్న శుక్ర కుజ శని రవులును, కుజుడున్న రాశికి – 2,6,11,12లఉన్న రవి చంద్ర శని బుధులును, బుధునకు—2,4, 5,3లందున్న చంద్ర గురు శుక్ర కుజులును—

137. గురోస్తుషష్ఠాష్టమకామరిప్పా శ్శుక్రాద్ధనారివ్యయబంధుయుక్తాః ।
తృతీయలాభారిక ళత్రగాస్తు దినేశసూనోః ప్రవదంతితజ్ఞాః॥
అస్యార్థవివరణంతు॥— సూర్యస్యషట్సప్తధర్మాయుగతాః।
మందారజీవామరశత్రుపూజ్యాః॥క్రమేణపాచకబోధకకారకవేధక సంజ్ఞాం భజంతే ।
తథాచ సూర్యాత్ షష్ఠస్థితఃమందః సూర్యఫలపాచకోభవతి ।
సూర్యాత్సప్తమస్థితఆరః సూర్యఫలబోధకోభవతి ।
సూర్యాత్ నవమగతఃజీవః సూర్యఫలస్యకారకోభవతి ।
సూర్యాత్ఏకాదశస్థితఃశుక్రః సూర్యఫలస్యవేధకోభవతి ।
ఏవంక్రమేణత త్తద్గ్రిహాణాం పూర్వోక్తస్థానక్రమేణ పూర్వోక్త గ్రహక్రమ మనుసృత్య సంజ్ఞాఃపరికల్ప్యాః॥

గురునకు-6,8,7,12లందున్న శని కుజ చంద్ర సూర్యులును, శుక్రునకు-2,6,12,4లందున్న బుధ రవి గురు శనులును, శనికి-3,11,6,7లందున్న—శుక్ర చంద్ర గురు కుజులును పాచక, బోధక, కారక, వేధకులగుదురు.

138. శత్రుర్దినేశస్యతుపాచకస్స్యాత్ మిత్రాణిశేషాశ్శశినస్తువైరీ ।
తథైవభౌమస్యతువేధకశ్చ శత్రుర్బుధస్యాత్మకరోగురోస్తు॥

రవిచంద్రులకు పాచకగ్రహము శత్రువు, తక్కిన గ్రహములు మిత్రులు. కుజునకు-వేధక గ్రహము శత్రువు; బుధునకు బోధక గ్రహము శత్రువు.

139. పాకగ్రహో వేధకసంజ్ఞితశ్చ శత్రుర్గురోర్వేదాస్పదితశ్చవైరీ ।
నకారకో వేధకసంజ్ఞితశ్చ శనేస్తుతత్కారకఖేచరోరిః॥

గురునకు పాచక, వేధక గ్రహములు శత్రువులు, శుక్రునకు కారక, వేధక గ్రహములు శత్రువులు. శనికి కారకుడు శత్రువు.

140. అథ పాచకాదిసంజ్ఞితయోగానాం ఫల్యానపి సూచీకటాహన్యాయేనా త్రైవాహ॥ పాచకయోగఫలం॥-
మృష్టాన్నపానాంబర భూషణాప్తిం రాజ్యార్థభూలాభమతీవసౌఖ్యం ।
ధైర్యంమహోత్సాహమతీవశక్తిం కుర్యాద్గ్రహఃపాచకసంజ్ఞకోయం॥

పాచకాది యోగములకు ఫలములు సూచీకటాహన్యాయమున ఇక్కడనే చెప్పుచున్నాడు-పాచకయోగఫలము:-మృష్టాన్నము, గోక్షీరపానము, వస్త్ర, భూషణములు, రాజ్య, ధన, క్షేత్రప్రాప్తియు, సుఖము, ధైర్య, ఉత్సాహములు, సామర్థ్యములను పాచక గ్రహము జాతకునకు కల్గజేయును.

141. మిత్రేయథాన్యాయ ఫలంతదన్యే గ్రహేతదన్యత్ఫలమాతనోతి॥
అథ బోధకసంజ్ఞాయోగఫలమాహ॥-

142. సమగ్రరాజ్యంబహురాజపూజాం విద్యావినోదాంకితగద్యపద్యం ।
యశస్తపఃప్రాప్తిమతీవభాగ్యం కుర్యాద్గ్రహో బోధకసంజ్ఞితోయం ॥

143. గ్రహేచతస్మిన్నఫలంవదంతి మిత్రేవిపర్యాసఫలంతదన్యే॥

పాచక గ్రహము మిత్రుడైన పూర్వోక్తఫలము నిచ్చును. శత్రువైన-దానికి వ్యతిరేకముగా ఫలమిచ్చును. బోధక గ్రహఫలము:- సమగ్రమైన రాజ్యము, రాజపూజ్యము, విద్య, వినోదముతో కూడిన గద్యపద్యములు; కీర్తి, తపస్సు, ఎక్కువ భాగ్యమును కల్గజేయును.

బోధక గ్రహముకూడ మిత్రుడైనప్పుడే ఆ ఫలము; శత్రువైన విపర్యయమే. కారక ఫలమేమన-ఒకప్పుడు భాగ్యము, ఒకప్పుడు క్షీణఫలము, భార్యాపుత్ర బంధు ధనములకు వ్యాధి పీడయు కల్గజేయును.

అథ కారకసంజ్ఞాఫలమాహ॥-
భాగ్యంక్వచిత్ క్షీణఫలంక్వచిచ్చ దారార్థబంధ్వాత్మజరోగపీడాం॥

144. చోరాగ్నిపీడాంకలహంజనైశ్చ నకారకోమిత్ర సమోయదిస్యాత్ ।
నకారకో వైరిసమోనతత్తు వదంతివైలోమ్యఫలంవిశేషాత్ ॥

కారక గ్రహము మిత్రసమమైన చోరాగ్నిబాధ, జనులతో కలహముకల్గ

జేయును. శత్రువైన-పూర్వోక్తమునియ్యక, విపరీత ఫలమును విశేషముగా కల్గ జేయును.

అథ వేధకసంజ్ఞాఫలమాహ॥-

145. చోరాగ్నిశత్రుక్షితిపాలసంఘై రతీవదుఃఖంస్వపదచ్యుతించ ।
విదేశయానంధననాశనంచ వదేద్గ్రహేతత్ఫలమన్యథాస్యాత్॥

వేధక ఫలము:-వేధకగ్రహము మిత్రుడైన-జాతకునకు చోరాగ్ని శత్రురాజాదులచే అధిక దుఃఖమును, స్థానచలనమును, విదేశప్రయాణమును, ధననాశనము కల్గజేయును. శత్రువైన-విపరీత ఫలము-అనగా శుభఫలము నిచ్చును.

146. పాకేశాత్పషిరాంత్యశత్రుభవనేయుక్తోపహారేశ్వర ।
స్తచ్ఛత్రుర్భవతీహలాభభవనేస్వోచ్చాత్మజేబంధుభే॥
ఖాగ్యేవాదశమేనమన్వితఖగస్తచ్ఛోభనాఖ్యగ్రహ ।
స్తత్కాలాన్వితఖేచరస్తుశుభదఃప్రోక్తోగ్రహాణాంక్రమః॥

సమిష్టిగా శుభాశుభఫల నిర్ణయము:- దశానాధునకు 6,8,12 లందున్న అంతర్దశానాధుడు దశానాధునికి శత్రువు. 11,5,4,9,10 స్వోచ్చయందున్న గ్రహము శుభగ్రహము. ఆయా దశా ప్రవేశాదికాలములందు శుభస్థానములందున్న గ్రహము శుభఫలప్రదమగును.

147. పాకక్రియాదినహితద్యుచరస్తుశత్రుః।స్యాత్థానతోతిశుభదస్త్వతిశోభనాఖ్యః।
స్థానానురూపఫలమత్రవిచింత్యమార్గం।జ్ఞాత్వావదంతిమునయోజగతాంప్రసిద్ధ్యై॥

పాచకాదియోగ గ్రహము శత్రువై పూర్వోక్త శుభస్థాన మందున్న అతిశుభ ఫలప్రదమగును. స్థానానురూపమైన ఫలమును ఆలోచించి మునులు లోక ప్రసిద్ధికై చెప్పిరి.

148. స్పుటగ్రహాన్లగ్నముఖాంశ్చభావాన్। ససంధికాన్ దృక్సమతాత్ప్రసిద్ధాన్।సంపాద్యపూర్వోక్తవిచారసిద్ధ।బలేనసంజ్ఞాదిఫలంవిమృగ్యం॥

జన్మకాలమునకు దృక్సిద్ధములైన రవ్యాది స్పుట గ్రహములను, సంధిసహితమైన లగ్నానికి ద్వాదశ భావములను, సిద్ధపరచుకొని, షడ్బల విచారముచేసి ఫలము చెప్పదగినది

| సంజ్ఞ | రవికి | చం.కి | కుజ | బుధ | గురు | శుక్ర | శనికి |
|---|---|---|---|---|---|---|---|
| పాచక | 6.శ | 5.శు | 2 ర | 2చం | 6 శ | 2బు | 3శు |
| బోధక | 7.కు | 9 కు | 6 చ | 2 గు | 8 కు | 6 ర | 11చం |

| కారక | 9 గు | 11 శ | 11శ | 5శు | 7చం | 12గు | 6 గు |
|---|---|---|---|---|---|---|---|
| వేధక | 11శు | 3 ర | 12బు | 3కు | 12ర | 4 శ | 7 కు |

149. సంజ్ఞాధ్యాయోవర్ణితస్సర్వశాస్త్రా త్సారంబుధ్వాసర్వలోకోపకారం ।
యద్యత్సర్వంవేంకటేశేనబుధ్వా తత్తత్పాకేయోజయేత్తత్ఫలాని॥

వేంకటేశుదనను నాచే సర్వలోకోపకారముగా సర్వశాస్త్రసారము నెరిగి సంజ్ఞాధ్యాయము వర్ణింపబడినది. దీనిని తత్తద్దశలందు యోజనచేసి, ఫలము చెప్పదగినది.

ఇది శ్రీ శాండిల్యగోత్ర, కంభంపాట్యుపపదరామగోపాల కృష్ణమూర్తి విరచిత ఆంధ్ర తాత్పర్యమున ప్రథమాధ్యాయము.



# ద్వితీయాధ్యాయము

1. భావోద్భవానివివిధాన్యుచితానియస్మా చ్ఛాస్త్రాంతరాదృషిగణాద్యత
బుద్ధయస్తే ।
యానీహతాన్గ్రహయోగవశాద్వదంతి బుధ్ద్వాసమీక్ష్య విదుషాంహి
ముదేకరోమి ॥

పెద్దలు ఋషిప్రోక్తములైన శాస్త్రాంతరములవలన వివిధభావముల కుచితములైన యే ఫలముల చెప్పిరో; వాటినన్నిటిని బుద్ధితో సమీక్షించి, విద్వాంసుల సంతోషమునకై ఈ గ్రంథమున పొందుపరచుచున్నాను.

2. భావాస్సర్వేశుభపతియుతా వీక్షితావాశుభేశైః ।
తత్తద్భావాన్సకలఫలదాః పాపదృగ్యోగహీనాః ।
పాపాస్సర్వే భవనపతయశ్చే చ్ఛుభాస్స్యుస్తథైవం ।
సర్వంఖేటైశ్శుభమపిఫలం నీచమూఢారిహీనైః ॥

శుభగ్రహము అధిపతిగా ఉన్నా, కూడియున్నా, చూడబడినా భావము సకల ఫలముల నిచ్చును. పాపగ్రహయుక్తములుకాని, చూడబడినవి కాకున్న శుభఫలదములు. పాపగ్రహములు కూడ శుభస్థానాధిపతులైన(కేంద్రకోణపతులైన), శుభము నిత్తురు. నీచస్థ, అస్తంగత, శత్రురాశిస్థములు కాకున్న శుభఫలమునిచ్చును.

3. లగ్నాది భావాద్రిపురంధ్రరిప్ఫే పాపగ్రహాస్తద్భవనాధినాథాః ।
సౌమ్యాస్తునాత్యంతఫలప్రదాస్త ద్భావాదికానాంఫలమేవమాహుః ॥

లగ్నము నుండి షష్టాష్టమద్వాదశము (6,8,12) లందున్న రవ్యాది పాప గ్రహములు, ఆ భావాధిపతులును పాపఫలప్రదులు. ఆ 6,8,12 స్థానములకు శుభ గ్రహము లధిపతులైనను; ఆ భావములందున్నను మిక్కిలి శుభప్రదులు కాజాలరు.

4. యద్భావనాథోరిపురంధ్రరిప్ఫే దుస్థానపోయద్భవన స్థితోవా।
తద్భావనాశం కథయంతితజ్ఞా శ్శుభేక్షితేతద్భవనస్యసౌఖ్యం॥

ఏ భావాధిపతి 6,8,12 లందుండునో, ఆ 6,8,12ల అధిపతి ఏ భావమం దుండునో, పండితులా భావమునకు నాశము చెప్పుదురు. శుభదృష్టియున్న, ఆ భావ మునకు శుభము కల్గును.

5. తత్తద్భావాత్త్రికోణేస్వసుఖమదనభేచాస్పదేసౌమ్యయుక్తే।
పాపానాం దృష్టిహీనే నపతినహితేపాపఖేటైరయుక్తే।
భావానాంపుష్టిమాహుస్సకలశుభకరీచాన్యథాచేత్ప్రణాశో ।
మిశ్రంమిశ్రగ్రహేంద్రైస్సకలమపిఫలంమూర్తిభావాదికానాం ॥

ఏ భావాధిపతులు పంచమ నవమములందు లగ్న చతుర్ధ సప్తమదశమము లందు(కేంద్ర కోణములందు) ఉందురో, శుభగ్రహ యుక్తములై, పాపగ్రహదృష్టి, యుతిలేని, నవమాధిపతితో కూడిన ఆ భావములకు పుష్టిని చెప్పుదురు. అవి శుభము చేయును. అట్లుగాక, పాపస్థానములందు తద్భావాధిపతులున్నా, వాటియందు పాప గ్రహయుతి, దృష్టియున్నా నాశమే. శుభపాపులు కలిసియున్న, ఫలమును మిశ్ర మముగానే యుండును.

6. నాశస్థానగతో దివాకరకరైర్లుప్తస్తుయద్రాశిపో ।
నీచారాతిగతోథవాయదిశుభేత్సైర్నయుక్తేక్షితః ।
తద్భావస్య వినాశనంమునిగణాశ్శంసంతిఖేటైర్యుత ।
శ్చేత్తత్రాపిఫలప్రదోనహితదాలగ్నాదిభావానాంక్రమః ॥

ఏ భావాధిపతి, అష్టమమున ఉన్నవాడు, అస్తంగతుడు, నీచ, శత్రుస్థాన గతుడు, శుభసంబంధము (యుతి, దృష్టి) లేనివాడో, ఆ భావమునకు నాశనము కల్గునని మునులు చెప్పుదురు. అట్టి గ్రహము శుభగ్రహములతో కూడియున్నను శుభఫలము నియ్యలేదు. ఇదేరీతి ద్వాదశ భావములకును చూడదగినది.

7. అర్థాప్తింకథయేద్విలగ్నశశినోః ప్రాబల్యతః ఖేచరైః ।
మానస్థైః పితృమాతృశత్రునసుహృద్భ్రాతృత్రాదిభిస్స్యాద్ధనం ।

భృత్యాద్వాదిననాథలగ్నశశినాంమధ్యేబలీయస్తతః ।
కర్మేశస్యనవాంశరాశిపవశాద్వృత్తింజగుస్తద్విదః ॥

జన్మలగ్న చంద్రులకు దశమమందున్న గ్రహములచే ధనప్రాప్తిని చెప్ప వలెను. లగ్నమునకుగాని, చంద్రునకుగాని దశమమున- రవియున్న తండ్రివలనను, చంద్రుడున్న తల్లివలనను, కుజుడున్న శత్రువు—లేక జ్ఞాతివలనను, బుధుడున్న- మిత్రునివల్లను, గురుడున్న -సోదరుని వల్లను, శుక్రుడున్న- స్త్రీ మూలకముగాను, శనియున్న భృత్యశూద్రాదులవల్లను, ఆయాగ్రహదశాంతర్దశలలోధనప్రాప్తియగును. లగ్నచంద్రులకు దశమమున గ్రహములేనియెడల లగ్నచంద్రులలో ఏది బలవత్తరమో, దానికి దశమాధిపతి యొక్క నవాంశరాశివలన వృత్తిని చెప్పవలెను.

8. భైషజ్యచామీకరతోయయాన పణ్యేనముక్తామణివిక్రవలంభాత్
ద్యూతాగమాన్న్యాయకవృత్తిమార్గా జ్జీవత్యసౌవాసరనాయకాంశే ॥

లగ్నచంద్రుల దశమ స్థానాధిపతియున్న నవాంశరాశ్యధిపతి రవియైన- ఔషధము, బంగారము, ఉదకము, యుద్ధప్రయాణము, ఓడవర్తకము, క్రయవిక్రయములు, ముత్యములు, మణులు- వీని వివాదమువలనను, జూదము, న్యాయమైన వృత్తిచే(న్యాయవాదవృత్తిచే) జాతకుడు జీవించును.

9. మంత్రోపదేశరసవాద వినోదమార్గైః రావృత్తిభిస్సకలశాస్త్ర
పురాణమార్గైః ।
జ్ఞానోపదేశనిపుణః క్షితిపాలపూజ్యోజీవత్యసావిశివదేద్ధినవాయకాంశే ॥

ఇంకను (రవ్యంశలోనే) మంత్రోపదేశము, రసవాదము, వినోదములు, ఆవృత్తులు, సకలశాస్త్ర పురాణములు, జ్ఞానము నుపదేశించుటలో నిపుణుడై రాజ పూజ్యుడై జీవించును.

10. జలోద్భవానాంక్రయవిక్రయేణ కృషేస్సముత్పన్న వినోదమార్గాత్ ।
రాజాంగనాసంశ్రయవృత్తిరూపా న్నిశాకరాంశేవసనక్రియాయాః ॥

చంద్రుని అంశయైన- నీటినుండి పుట్టిన శంఖములు, ముత్యములు, చేపలు- వీటి క్రయవిక్రయములచేతను, వ్యవసాయము, వినోదమార్గము, రాజస్త్రీని ఆశ్రయించగా వచ్చిన వృత్తిచేతను, వస్త్రవ్యాపారమున జీవించును.

11. ధాతోర్వివాదేనరణప్రహారా త్తప్తాభివాదాత్కలహప్రియాద్వా ।
జీవత్యసౌసాహసమార్గరూపా ద్ధరాసుతాంశేయదిచోరవృత్త్యా ॥

కుజాంశయైన- స్వర్ణ, రజత, తామ్ర, కాంస్యాదులు, మనశ్శిలా హరితాలా దులు ధాతువులు. ధాతువుల క్రయవిక్రయముచేతను, కత్తులు మున్నగు ఇనుప

ఆయుధములు తయారుచేయుట, అమ్మట మున్నగువానిచేతను, వానిని ధరించుట చేతను, నిప్పుతోచేయు పనిచేతను, తగాదాలు పెట్టుటవల్లను, సాహసకృత్యములు, మల్లయుద్ధములు మున్నగువానిచేతను దొంగతనముచేగాని జీవించును.

12. శిల్పాదిశాస్త్రాగమకామ్యమార్గా జ్జ్యోతిర్గతిజ్ఞానవశాద్బుధాంశే।
పరార్థ్యవేదాధ్యయనాజ్జపాచ్చ పురోహితత్వాజ్జవశాచ్చవృత్తిః ॥

బుధాంశయైన- శిల్పాది శాస్త్రములు, ఆగమములు, కామ్యమార్గములు, జ్యోతిశ్శాస్త్రజ్ఞానము, శ్రేష్ఠమైన వేదాధ్యయనము, జపము, పురోహితత్వము చేయుట వలనను జీవించును.

13. జీవాంశకేభూసురదేవతానా ముపాస్తికాధ్యాపకమార్గరూపాత్।
పురాణశాస్త్రాగమనీతిమార్గా ద్ధర్మోపదేశేనచవృత్తిమాహుః ॥

గురుని అంశయైన- దేవబ్రాహ్మణోపాసన, అధ్యాపకవృత్తి, పురాణములు, శాస్త్రములు, ఆగమములు, నీతిమార్గములు, ధర్మము ఉపదేశించుటచేత జీవించును.

14. సువర్ణమాణిక్యగజాశ్వమూల్యా ద్గవాంక్రయాజ్జీవనమాహురార్యాః।
శుద్ధోదకక్షీర దధిక్రయేణ స్త్రియఃప్రలోభేన భృగోర్నవాంశే॥

శుక్రాంశమైన- సువర్ణము, మాణిక్యములు, గజములు, అశ్వములు, గోవులు, పువ్వులు- వీని క్రయవిక్రయముల ద్వారాను, శుద్ధోదకము, క్షీరము, పెరుగు- వీని వ్యాపారముచేతను, స్త్రీ మూలకముగాను జీవించును.

15. శన్యంశకేకుత్సితమార్గవృత్యా శిల్పాదిభిర్భారుమయైర్వధాద్యైః।
విన్యస్తభారాజ్జనవిప్రలంభా దన్యోన్య వైరోద్భవ మార్గమూలాత్॥

శన్యంశయైన- కుత్సితమార్గముచేతను, కర్రబొమ్మలు, ప్రాణివధ చేతను, బరువులు మోయుట, జనులను మోసగించుట, అన్యోన్యకలహములు పెట్టుటవలనను ధనప్రాప్తి యగును.

లగ్నచంద్రులకు దశమమున ఉన్న గ్రహములుగాని, అక్కడ గ్రహములు లేకున్న- దశమాధిపతియున్న నవాంశాధిపతికాని, మిత్రక్షేత్రవర్తులైన మిత్రుల వలనను, శత్రుక్షేత్రవర్తులైన శత్రువులద్వారాను, స్వక్షేత్రవర్తులైన స్వజనుల వలన, స్వగృహమువలనను ధనప్రాప్తియగును. ధనప్రదుడైన రవి ఉచ్చస్థుడైన జాతకుని ప్రతిభచే ధనప్రాప్తియగును. అదిగాక, ఏకాదశమున ఉన్న, లగ్న ద్వితీయము లందున్న గ్రహములచే అనేకరీతుల ధనాగమము జరుగును. శుభగ్రహములయిన కోరుకున్నరీతిగా ధనము ప్రాప్తించును. ఈ విషయమునగార్గి-

ధనదాజన్మసమయే మిత్రారి స్వగృహోపగాః।
యస్యతస్య ధనం దద్యా న్మిత్రారి స్వగృహోద్భవం॥
ధనదో భాస్కరోయస్య తుంగే బలసమన్వితః।
భవేజ్జన్మనితస్యాస్వా ద్విత్తమాత్మోద్యమార్జితం ॥
లాభార్థ లగ్నగైస్సౌమ్యై ర్యేనయే నైవకర్మణా।
ధనార్జనం ప్రారయతే తేనయత్నాత్సమశ్నుతే॥ అన్నాడు. దీని అర్థము పైన చెప్పినదే.

16. స్వక్షేత్రే స్వనవాంశకేసుహృద్దివా స్వాత్యుచ్ఛభాగేయథా।
స్వద్రేక్కాణచతుష్టయేషునహితా మూలత్రికోణేషువా।
తత్తత్కాల బలాన్వితాస్తు ఖచరా స్తత్తన్నవాంశాధిపాః॥
తేసర్వేశుభదాస్స్వపాపసమయే ష్వంతర్దశాధీశ్వరాః॥

స్వక్షేత్రమందు, స్వనవాంశయందు, మిత్రక్షేత్రమందు, స్వకీయపరమోచ్ఛ భాగమందు, స్వద్రేక్కాణమందు, మూలత్రికోణమందు; కేంద్రకోణములందు ఉన్న గ్రహములు, ఆ నవాంశాధిపతులు ఏరీతిగా బలయుక్తులైయుందురో, ఆయా ప్రకారము గ్రహములన్నియు అంతర్దశాధిపతులై స్వస్వదశాకాలములందు శుభఫలములనిత్తురు.

17. యేఖేటాస్తేషువాచ్యంప్రబల ఖగబలం పాకకాలే బుధైస్తు।
ద్భావేంశేవాభవనగుణయు క్తుల్యయోగస్యవాపి।
ఖేటస్యాహుఃఫలమపిదృగీ శస్యయోనిప్రభేదే।
యోగ్యంవాచ్యం జననసమయే ప్రాశ్నికేచానుహేయః॥

ఏ గ్రహము లే యే భావములందు ఏయే గ్రహములతో కూడి, చూడబడి యుండునో, ఆయా గ్రహము లాయా భావంబులందు, ప్రబలమైన గ్రహము నను సరించి, ఫలము నాయా గ్రహదశాకాలమందు ఫలమునిచ్చును. ఆయా గ్రహము తానున్న భావము, అంశ, రాశి గుణములకు తుల్యమైన ఫలమును, ఏ రాశ్యధిపతియైన గ్రహము ఏ భావమునుండి చూచుచుండునో, ఆ గ్రహభావగుణానురూపమైన ఫలము నూహించి చెప్పవలెను.

18. యోవానీచార్యత్త గేహస్థితోవా యోవాఖేటో బిందుశూన్యర్గయుక్తః।
తత్తత్పాకే మూర్తివిత్తాదికానాం నాశంబ్రూయాద్దైవ
విత్ప్రాశ్నికాయ॥

ఏ గ్రహము నీచ, శత్రుక్షేత్ర వర్తియై, అస్తంగతమై యుండునో, అష్టక వర్గులో బిందు శూన్యరాశియందుండునో, ఆ గ్రహదశాకాలమున, లగ్న ధనాది భావ ములకు నాశనము కల్గునని చెప్పవలెను.

19. మందమాంద్యగుళురేళరంధ్ర పాత్తన్నవాంశ పతయోథయేగ్రహాః।
తేషుదుర్బలదశాస్మృతి ప్రదా కష్టఖేచరతి సూర్యనందనే॥

శని, మాంది, రాహు, గుళికులు, అష్టమాధిపతి, వీరి నవాంశాధిపతులు మృతి ప్రదులు. అందు దుర్బలదశ శని అష్టమమున సంచరించుచుండగా (గోచారరీత్యా) మృతి ప్రదమగును.

20. ధనాధిపః పాపఖగోయదిస్యా చ్ఛన్యారభోగీంద్ర దినేశ్వరాణాం।
అంతర్దశాయాంధననాశమాహుః పాపాన్వితేత ద్భవనేతథైవ॥

ధనాధిపతి పాపగ్రహమై పాపగ్రహముతో కూడి ధనస్థానమున నున్న శని, కుజ, రాహు, రవుల అంతర్దశలయందు ధననాశము చేయును.

21. ధనాన్వితఃపాపఖగ స్తదీశః స్యాచ్చేద్దశాయాం క్షితిపాలకోపాత్।
మానార్థనాశో నిగళంనరాణాం స్థానచ్యుతిః స్వేష్టజనైర్విరోధః॥

ధనాధిపతి పాపగ్రహమై ధనస్థానమున ఉన్న అతని దశలో రాజకోపము వలన ధన, కీర్తినాశము, బంధనము, స్థానభ్రంశము, ఇష్టబంధువిరోధము కల్గును.

22. పాపగ్రహాణామపహారకాలే పాపగ్రహాణాంవిదశావిపాకే।
భూమ్యర్థమానాత్మజసోదరాణాం నాశంసమాయాతిశుభైర్నదోషః॥

పాపగ్రహముల అంతర్దశ, పాపవిదశాకాలమందు భూమి, ధనము, మానము, పుత్ర, సోదరనాశము కల్గును. శుభగ్రహములైన దోషము కల్గదు.

23. విత్తేశుభేశోభనఖేచరేశే తత్పాకకాలేధనలాభమేతి।
శుభగ్రహాణామపహారకాలే తదాభవేదాత్మజవాగ్విలాసః॥

ధనస్థానమున శుభగ్రహముండి, ధనాధిపతి శుభుడుకాగా, అతని దశాకాలమున ధనలాభము పొందును. పుత్రుల వాగ్వినోదము కల్గును. అనగా పుత్రోదయమగును.

24. పాపగ్రహేవిత్తగృహాధినాథే పాపాన్వితేపాప వియచ్చరాణాం।
అంతర్దశాయా మనలాస్త్రచోరై ర్దుఃఖంసమాయాత్యశుభప్రదోపి॥

ధనాధిపతి పాపగ్రహమయి పాపగ్రహముతోకూడియున్న, పాపగ్రహాంతర్దశ యందు చోరాగ్ని శస్త్రములచే దుఃఖము కల్గును.

25. క్షితిపకోపానలచోరభూతై ర్దుఃఖం మనోజాడ్యమతీవకష్టం।
అర్థేశపాపగ్రహదాయకాలే శుభేక్షితేతాదృశమత్రనాస్తి

పాపగ్రహమైన ధనాధిపుని దశలో రాజకూపుల కోపము, అగ్ని, చోర, పిశాచములచే దుఃఖము, మనోజాడ్యము, ఎక్కువ కష్టము కల్గును. శుభగ్రహ వీక్షణమున్నచో దోషము కల్గదు.

26. దుశ్చిక్యభావాధిపదాయకాలే సౌమ్యేతరాణా మపహారకాలే ।
నాశంవదేత్తత్రసహోదరాణాం భవేద్విరోధస్సహ తైశ్చమిత్రైః ॥

తృతీయ భావాధిపతి దశలో పాపగ్రహముల అంతర్దశలో సహోదరులకు కష్టము కల్గును. సోదరులతోను మిత్రులతోను విరోధము కల్గును.

27. క్షేత్రాధిపస్యైవశుభేతరస్య పాపగ్రహాణామపహారకాలే ।
స్థానచ్యుతింబంధువినాశమేతి నీచాస్తగానామపహారకాలే ॥

పాపుడైన చతుర్థాధిపతి దశలో పాపగ్రహములయొక్క అంతర్దశలో నీచస్థ, అస్తంగత గ్రహముల విదశలో- స్థానభ్రంశము, బంధునాశము కలుగును. భావాధిపతి శుభుడైన దోషము కలగదు.

28. బుద్ధిభ్రమంకుత్సితభోజనంచ పాపగ్రహాణాంసుతభేశకాలే ।
అంతర్దశాయాం ప్రవదేన్నరాణాం శుభగ్రహశ్చేన్న తథాఫలంతు ॥

పాపుడైన పంచమాధిపతి దశలో- పాపగ్రహముల అంతర్దశలో బుద్ధిభ్రమ, కుత్సితాన్న భోజనము కలుగును. శుభగ్రహమైన మత్ఫలము కలగదు.

29. రాజాగ్నిచోరైర్వ్యసనంవ్రణేశ దశావిపాకేతుశుభేతరాణాం ।
అంతర్దశాయామతికష్టమేతి ప్రమేహగుల్మక్షయపిత్తకాసైః ॥

షష్ఠాధిపతి దశాకాలమున పాపుల అంతర్దశలో- రాజాగ్ని, చోరులవలన బాధ, మేహ, గుల్మ, క్షయ, కాస బాధ కల్గును.

30. దారేశపాపగ్రహదాయకాలే స్త్రీయా విరోధంమరణంచతస్యాః ।
విదేశయానంచ పురీషమూత్ర కృచ్ఛ్రంభవేద్భూపతి కోపమత్ర ॥

పాపుడైన సప్తమాధిపతి దశలో- భార్యావిరోధము, భార్య మరణము, విదేశ యానము, మూత్ర పురీష కృచ్ఛ్రము, రాజకోపము కలుగును.

31. రంధ్రేశదాయేఫణినాథభౌమ శనైశ్చరాణామపహారకాలే ।
ఆయుర్యశోవిత్త వినాశనంచ దారాత్మబంధ్విష్ట సహోదరాణాం ॥

అష్టమాధిపతి దశలో శని కుజ రాహువుల అంతర్దశలో- ఆయుష్య, కీర్తి, ధనముల నాశము, భార్యా, బంధు, మిత్ర, సోదరులకు హాని కలుగును.

32. స్థానచ్యుతింబంధువిరోధతాచ విదేశయానంసహతైర్విరోధః ।
భవేచ్ఛుభేశస్యదశావిపాకే శనైశ్చరారాహిదినాధిపానాం ॥

పాపుడైన నవమాధిపతి దశలో- శనికుజ రాహురవుల అంతర్దశలో- స్థాన భ్రంశము, బంధువిరోధము, విదేశగమనము, సోదరవిరోధము కలుగును.

33. కారాగృహప్రాప్తి మనేకదుఃఖం దుస్స్వప్నశోకానల దగ్ధ దేహః।
కర్మేశ్వరస్యాంతరభుక్తికాలే పాపగ్రహాణా మపకీర్తిమేతి॥

పాపుడైన కర్మాధిపతి దశలో- పాపగ్రహముల అంతర్దశలో-కారాగారప్రాప్తి, దుఃఖము, దుస్స్వప్నము, శోకము, నిప్పున శరీరముకాలుట, అపకీర్తి కలుగును.

34. దశావిపాకేత్వథలాభపస్య భుక్త్యంతరేద్రవ్యవినాశనంచ।
రవ్యారభోగీంద్రదశనైశ్చరాణాం కార్యార్థకృచ్ఛ్రం క్షితిపాలకోపాత్॥

లాభాధిపతి దశలో-రవికుజ రాహు శనుల అంతర్దశలో-ద్రవ్యనాశము, రాజకోపమున కార్యవిఘ్నము, దుఃఖము కలుగును.

35. వ్యయేశదాయే రవిసూనుభుక్తౌ దినేశ భూమ్యాత్మజయోర్విరోధః।
బలక్షయంమానధనక్షయంచ రాహోస్తుభుక్తావహి చోరపీడా॥

వ్యయాధిపతి దశలో- రవిశనికుజుల అంతర్దశలో- విరోధము, బలనాశము, మాన, ధనహాని, రాహు అంతరమున సర్పచోరభయము కలుగును.

36. తత్కాలశత్రుః ప్రభవంఫలంత న్మిత్రంయదిస్యాత్ఫలమర్థమాహుః।
అన్యోన్యషష్టాష్టమదాయకాలే స్థానచ్యుతిర్వామరణంవిశేషాత్॥

పైన చెప్పిన ఫలములు దశానాధునకు అంతర్దశానాధుడు తాత్కాలిక శత్రువైనపుడు కలుగునవి. తాత్కాలిక మిత్రుడయినచో అందులో సగమే దోషము కలుగును. దశాంతర్దశానాధులు పరస్పరము షష్టాష్టమస్థితి కలిగియున్న స్థానభ్రంశము, మరణము.

37. ఉద్యోగ భంగంస్వజనస్యకష్టమాకస్మికందూషణమేతినిత్యం।
స్పష్టీకరిష్యంతిదశావిభాగం విస్తారమార్గేణమునీంద్రజాలాః॥

ఉద్యోగభంగము, తనవారికి కష్టము, కారణములేని దూషణము కలుగునని మునులు చెప్పిరి.

38. ఆపాతతస్సంక్షుచితార్థవాక్యై రుక్తాగ్రహాణాం పరిపాక సంజ్ఞా।
నిషేకలగ్నా ద్దినపస్తృతీయే రాశౌ యదాచార వశాదుపైతి॥

గ్రహముల దశాంతర్దశా ఫలములు స్థూలముగా చెప్పబడినవి. ఆధాన లగ్నమునకు తృతీయమందు చారవశమున రవి వచ్చినపుడు-

39. ఆధానలగ్నా దథవాత్రికోణే రవౌయదాజన్మవదే న్నరాణాం।
ఆధానలగ్నాత్సుత ధేతుజన్మ లగ్నం వదేచ్ఛాస్త్రవిదో వదంతి॥

ఆధాన లగ్నమునకు పంచమ నవమ రాశులకు రవి వచ్చినపుడుగాని జన్మ కలుగును.

40. ఆధానలగ్నే శుభదృష్టియుక్తే దీర్ఘాయురైశ్వర్యధనాన్వితస్స్యాత్ ।
ధర్మాస్తపుత్రేషు నిషేకలగ్నాద్దృష్టేషు సౌమ్యైః పురుషగ్రహైర్వా॥

ఆధాన లగ్నము శుభగ్రహములచే చూడబడిన-జాతకుడు దీర్ఘాయుష్మంతుడు, ధనైశ్వర్యవంతుడు అగును. ఆధాన లగ్నమునకు పంచమ, నవమ, సప్తమ రాశులు శుభదృష్టములైనను పురుషగ్రహదృష్టమయినను పురుషుడు పుట్టును. స్త్రీ గ్రహములచే చూడబడిన స్త్రీజన్మ కలుగునని భావము.

41. పుత్రాంశకేవాపి నిషేకకాలే పున్జన్మబాలాజననంవిలోమాత్ ।
నిషేకలగ్నేశ తృతీయనాథౌ లగ్నస్థితౌచే ద్యమళోద్భవస్స్యాత్॥

ఆధాన లగ్నమునకు నవాంశరాశి ఓజరాశియైనను పురుషజన్మ కలుగును. కానిచో స్త్రీజన్మము. స్త్రీరాశి-యుగ్మరాశియయిన కన్య కలుగును. ఆధానలగ్న, తృతీయాధిపతులు లగ్నమందున్న కవలలు కలుగుదురు.

42. తృతీయనాథేనయుతేనిషేక లగ్నేశ్వరస్తత్సహజేతథైవ ।
నిషేకలగ్నేశశినందనోవా రవ్యాత్మజోవాయదిపాపదృష్టః ॥

ఆధాస లగ్నాధిపతి, తత్తృతీయాధిపతితో కలిసినా, తృతీయమందున్నా కవలలు పుట్టును. ఆధానలగ్నమున బుధుడుగాని, శనిగాని ఉండి పాప గ్రహముచే చూడబడిన-

43. పిండాకృతేర్జన్మవదేత్తదానీం శుభేతరశ్చేన్న తథావిదంతు ।
లగ్నేశ్వరేకర్మ గతేవిలగ్నే భోగీంద్రయుక్తే సతి పాదజాతః॥

స్త్రీరూపము, పురుషరూపముగాని పిండము కలుగును. బుధశనులుకాక, మరి యే పాప గ్రహమున్నను అట్టి పిండజన్మ కలుగదు. ఇంతవరకు ఆధానలగ్నమును బట్టి ఫలము చెప్పినాడు. నిజమునకు మనకు ఆధానలగ్నము తెలియదు. కాన ఫలమునుబట్టి తత్కాల గ్రహస్థితి నూహించవలసినదే.

ఇక జన్మలగ్నాధిపతి దశమమందుండి, లగ్నమందు రాహువున్న పాదజాతుడు (ఎదురు కాళ్ళను పుట్టును) 'భోగీంద్రయుక్తే' అనుపాఠమున-చంద్రరాహువులున్న పాదజాతుడగునని అర్థము గ్రహింప వలెను, 'పాపజాతః' అనియు పాఠాంతరము. కష్టముగా పురుడు వచ్చునని చెప్పుకోవచ్చును.

44. రంధ్రేశ్వరే రాహుయుతేవిలగ్నే జాతోరగైర్వేష్టితసంభవస్స్యాత్ ।
కేంద్రేదేవరాహౌగుళికేనయుక్తే లగ్నేశ్వరేవానిధనేశయుక్తే ॥

అష్టమాధిపతి రాహువుతోకూడి లగ్నమునఉన్న సర్పవేష్టితుడై పుట్టును.

(అది నేను విసలేదు. ప్రేపు మెడకు చుట్టుకొని కావచ్చును.) రాహుపుగూడికాని, లగ్నాధిపతి అష్టమాధిపతితో కూడిగాని కేంద్రమందున్నా-

45. కూరగ్రహాణాంచదృగాణలగ్నే జాతోరగై ర్వేష్టితసంభవస్స్యాత్।
లగ్నత్రిభాగోందజసర్పసంజ్ఞ స్తన్నామయుక్తశ్చతథాత్రిభాగః॥

లగ్నముయొక్క పాపగ్రహద్రేక్కాణమున పుట్టినవాడు సర్పవేష్టితుడగును. ద్రేక్కాణములలో పక్షి, సర్పసంజ్ఞ కల వాటిలో జన్మించినను-

46. శుభగ్రహాణాంచ దృశావిహీనే జాతోరగై ర్వేష్టిత సంభవస్స్యాత్।
ఛాగోక్షకంఠీరవలగ్నభూతే భౌమాన్వితేవార్కి విశేనయుక్తే॥

శుభగ్రహ దృష్టిలేకున్నా సర్పవేష్టి తమగును. మేష, వృషభ, సింహములు లగ్నములై, అక్కడ శనిగాని కుజుడుగాని యున్నా-

47. రాశ్యంశకాభ్యాంహినమానదేహే నాళేనసంవేష్టిత జాతఏవ।
లగ్నేసపాపే బహుపాపదృష్టే రాహుధ్వజాభ్యాంసహితేథవాత్ర॥

జన్మలగ్న, నవాంశరాశులలో సమానమైన అవయవమున ప్రేపుచే చుట్టబడి జన్మించును. (రాశుల అంగములు సంజ్ఞాధ్యాయము 12 శ్లోకమున చెప్పబడినవి) లగ్నము పాపసహితమై అనేక పాపదృష్టమైనను, రాహుకేతువులతో కూడినను-

48. పాపగ్రహాణాంతువిలగ్నభేవా జాతోనరోనాళ వివేష్టితాంగః।
పరస్పరక్షేత్రసమాగతౌవా దేహాంబుపౌజన్మపదే త్తదానీం॥

పాపరాశియైన లగ్నమున జన్మించినను, జాతకుడు నాళవేష్టితుడై పుట్టును. (ఇక్కడ నాళవేష్టనమును వేరుగా చెప్పినాడు. మరి సర్పవేష్టనమేమిటో?) లగ్న చతుర్థాధిపతులు పరస్పర క్షేత్రములందున్నా నాళవేష్టనుడై పుట్టును.

49. లగ్నేశ్వరోవాహిబుకేశ్వరోవా ధ్వజాహియుక్తో జననంపశోస్తు।
పాపాబలాఢ్యావిబలాస్తుసౌమ్యా నపుంసకౌ కేంద్రగతౌతదానీం॥

లగ్నాధిపతిగాని, చతుర్థాధిపతిగాని రాహు కేతువులతో కూడినా, పాపగ్రహములు, బలవంతములై శుభగ్రహములు బలహీనములైన నపుంసకులైన శని బుధులు కేంద్రమందున్నా పశుజననమగును.

50. దృష్టిస్తయోర్వాథవియోనిలగ్నే చతుష్పదాంజన్మ వదంతితజ్ఞాః।
పాపాబలాఢ్యాస్స్వగృహంప్రపన్నా స్సౌమ్యాశ్చస్వగేహేతరరాశి యుక్తాః॥

పాపులు బలవంతులై శుభులు బలహీనులైన యోగమున శని బుధులదృష్టి లగ్నమునకున్నా పశు జన్మ కలుగును. 2- పాపగ్రహములు బలవంతులై స్వక్షేత్ర

వర్తులై, శుభగ్రహము పితక్షేత్రవర్తులై యుండగా శాస్త్రపారగులు పశుజన్మ కలుగునందురు.

51. చతుష్పదాంశజన్మతదామహాంతో వదంతిశాస్త్రాంతర పారగాఢ్యాః ।
లగ్నేదృగాణేతుపతత్రసంజ్ఞే బలాన్వితేనైవగ్రహేణదృష్టేః॥

లగ్నమున పక్షి ద్రేక్కాణము లగ్నమై బలవత్పాప గ్రహదృష్టమైనా-

52. రాశౌచరేవా యదితన్నవాంశే వియోని జన్మేతివదేద్బుధాంశకే ।
శుక్రేక్షితేగోజననంమహిష్యా స్సౌర్యాత్మజేనాపియుతస్తుదృష్టః॥

ఆ లగ్నము చరరాశిలో చరనవాంశగాని, బుధనవాంశగానియైన వియోని (పక్ష్యాది) జన్మకలుగును. 4. శుక్రదృష్టమై యుండగా గోజన్మము, శనియుక్తమైనా, దృష్టమైనా దున్నపోతు జన్మమనియు చెప్పవలెను.

53. రాహుధ్వజాభ్యాంసహితేథదృష్టే మేషస్తుజాతో నృపశుస్తథాన్యైః।
లగ్నే బుధక్షేత్రగతేరినాథే లగ్నస్థితేసోమసుతేక్షితేవా॥

అట్టిలగ్నము రాహుకేతువులతో కూడియున్నా, చూడబడినా, గొఱ్ఱెజన్మము కలుగును. కొందరు నరపశువు పుట్టునందురు. ఈ వియోని (పశు) జన్మయోగము లలో ప్రతి దానిలోను పాపగ్రహములు బలవంతములు, శుభగ్రహములు బలహీనములుగా ఉండవలెను. పక్షిద్రేక్కాణము లేవనగా-మిధున ద్వితీయము, సింహప్రథమము, తులాద్వితీయము, కుంభప్రథమమును. ఇక, కర్కాటక తృతీయము, మీన తృతీయమును సర్పపాశద్రేక్కాణములు, మకర ప్రథమము నిగళద్రేక్కాణము. ఇక్కడ చెప్పని వియోని జన్మలను బృహజ్జాతకము వియోని జన్మద్యాయమున చూచి తెలిసికోదగును.

ఇక నపుంసక యోగములు చెప్పుచున్నాడు—జన్మలగ్నము బుధక్షేత్రమై షష్టాధిపతితో కూడియుండి, బుధునితో కూడినా, చూడబడినా, -భార్యతోసహా నపుంసకుడగును.

54. జాతస్తుసస్త్రీకనపుంసకస్స్యా చ్ఛన్యార యోగా త్పురుషస్తుషండః।
అన్యోన్యదృష్టౌశశివాసరేశౌ యుగ్మౌజగావిందుజ భానుపుత్రౌ॥

ఆ జాతకుడు, భార్యయు నపుంసకులే-నిర్వీర్యులే. ఆ లగ్నము బుధయుత, దృష్టముగాక, శని కుజయుక్తముగాని, దృష్టముగాని అయిన జాతకుడు మాత్రమే నపుంసకుడగును. 1. సరిరాశిలో చంద్రుడు, విషమరాశిలో రవి ఉండి పరస్పరము చూచుకొన్నా, 2. బుధుడు సమరాశిలోను, శని విషమ (ఓజ) రాశిలోను ఉండి పరస్పర దృష్టి కలవారైనా-

55. ఓజర్షగో భూమి సుతో దినేశం పశ్యత్యథో యుగ్మ గతంతథైవ ।
ఓజేవిలగ్నే కుముదాత్మబంధు స్తత్రస్థితో యుగ్మగభౌమదృష్టః॥

3. ఓజరాశియందున్న కుజుడు సమరాశి గతుడైన రవిని చూచినా 4. సమరాశి గతుడైన కుజునిచే, ఓజరాశియైన లగ్నమును ఉన్న చంద్రుడు చూడబడినా-

56. యుగ్మౌజగావిందు బుధౌకుజేన దృష్టౌవిలగ్నంచ నిశాకరంచ ।
షట్ క్లీబయోః పురుషాంశయుక్తాః ప్రోక్తామహద్భిర్బహుశాస్త్రవిద్భిః॥

5. సమరాశిలోనున్న చంద్రుడు, ఓజరాశిలోఉన్న బుధుడును కుజునిచే చూడబడినా, 6. సమరాశియైన లగ్నమును, విషమరాశి గతుడైన చంద్రుని కుజుడు చూచినా-ఈ ఆరు యోగములందు నపుంసకులు పుట్టుదురు. ఈ నపుంసక యోగము కలుగజేయు గ్రహములు పురుష నవాంశను పొందియుండవలెను. పూర్వము చెప్పిన స్త్రీ పురుష యోగములు లేనప్పుడే ఇవి జరుగును. అవి ఉన్నపుడు బలీయములుకాను అవే జరుగును.

57. లగ్నేశ్వరశ్చంద్రసుతేనయుక్తో షండోభవేత్సౌమ్యఖగై రదృష్టః।
దుస్థానగౌకర్మ శుభాదినాథౌ బలీవిలగ్నాధిపతి స్తదానీం॥

లగ్నాధిపతి బుధునితో కూడియుండి, శుభగ్రహములచే చూడబడకున్న నపుంసకుడు పుట్టును. నవమ దశమాధిపతులు దుష్టస్థానము లందుండి (6,8,12) లగ్నాధిపతి బలవంతుడైన-

58. సీమంతకర్మాదివినైవజాతో భవేన్నరఃప్రాథమికోపితత్ర।
లాభేనపాపేత్వథతద్గ్రహేవా జాతోనరః ప్రాథమికోపి తత్ర ॥

అట్టి సమయమున, జ్యేష్ఠుడైనను సీమంతా శుభకర్మలు చేయకుండగనే పుట్టును. లాభస్థానము పాపయుక్తమై, లాభాధిపతియు పాపయుక్తుడైన జాతకుడు జ్యేష్ఠుడగును.

59. సింహోదయేద్వారయుగంగృహంత త్కన్యోదయే నీచగృహేపి జన్మ ।
నవాంత్యపుత్రాధి పతిస్థరాశే ర్ద్వారం జగుర్లగ్నదృగాణనాథైః॥

సింహలగ్నమున జన్మమయిన రెండు ద్వారములుకల గదియనియు (పురుడు వచ్చిన యిల్లు), కన్యాలగ్నమైన తక్కువ (నీచ) యిల్లనియు, ఆయాగ్రహస్థితిని బట్టి, ఆయాగ్రహ స్వభావాను గుణమయిన ఇంటియందు పురుఘు జరుగునని తెలియవలెను.

లగ్న ప్రథమ ద్రేక్కాణమయిన నవమాధిపతిఉన్న రాశినిబట్టియు, ద్వితీయ ద్రేక్కాణమయిన ద్వాదశాధిపతియు, తృతీయ ద్రేక్కాణమయిన పంచమ భావాధిపతి యున్న రాశినిబట్టియు ద్వారమును చెప్పవలెను.

**60. ద్వారంవిలగ్నాధిపతిస్థరాశేః కేంద్రస్థితైర్వీర్యసమన్వితైర్వా ।**
**గ్రహైర్థనాంత్యాన్యదవేశ్మగైర్వా వాచ్యాస్తదానీముపసూతికాస్తు ॥**

లగ్నాధిపతి స్థితరాశికి కేంద్రమందే గ్రహముండునో ఆ రాశికే దిక్కో ఆ దిక్కున సూతికాగృహ ద్వారముండును. అనేక గ్రహములున్న బలాధిక గ్రహమునుబట్టి చెప్పవలెను. బలాధిక గ్రహములెక్కువగానున్న అన్ని ద్వారము లుండును. కేంద్రమందే గ్రహములు లేని యెడల చక్రములో బలవత్తర గ్రహమును బట్టి చెప్పవలెను.

బృహజ్జాతకమును, లఘుజాతకమును, పరాశరహోరలోను సూతికా గృహ ద్వార, సూతికోప సూతికా సంఖ్య, మంచస్వరూపము, కోణ పరిస్థితి, దీపస్థితి మొదలైనవి విపులముగా చెప్పబడినవి.

జన్మలగ్నము శీర్షోదయ రాశియైన జాతుని శిరోదయమగుననియు, పృష్ఠో దయ రాశియైన శిశువు ఎదురు కాళ్లన (పాదములు ముందుగా) జన్మించుననియు ఉభయోదయ రాశియైన చేతులు ముందుగా వచ్చుననియు చెప్పవలెను.

కొందరు-లగ్నాధిపతిగాని, నవాంశాధిపతిగాని, లగ్నగత గ్రహముగాని వక్రించిన, ఇప్పుడు చెప్పిన దానికి వ్యతిరేకముగా ప్రసవమగునందురు.

"లగ్నాదిపేంశకపతే లగ్నస్థే వక్రితే గ్రహేప్యథవా।

విపరీత గతో మోక్షో వాచ్యో గర్భస్య సంక్లేశః" అని. అర్థము పైన చెప్పినదే.

"క్లేశో మాతుఃక్రూరైః బంధ్వ స్తగతైశ్శశాంకయుక్తైర్వా" అని. చంద్రునికి సప్తమ, చతుర్థములందు పాపగ్రహములున్నను, చంద్రుడు పాపగ్రహయుక్తుడైనను తల్లికి ప్రసవవేదన హెచ్చుగా నుండునని.

పగలు రవిగాని, రాత్రి శనిగాని బలవంతుడైన తండ్రియింట, పగలు శుక్రుడుగాని, రాత్రి చంద్రుడుగాని బలవంతుడైన తల్లియింట, ప్రసవమగును.

"మందేబ్జగతే విలగ్నగే బుధసూర్యేందు నిరీక్షితే క్రమాత్।

క్రీడాభవనం సురాలయం ప్రసవే సోషరభూమి మాదిశేత్" అనగా-జలరాశి గతుడైన శనిని బుధుడు చూచిన క్రీడాగృహమందును, రవి చూచిన దేవాలయ మందును, చంద్రుడు చూచిన ఊషర ప్రదేశమునను, ప్రసవమగును.

"నృలగ్నగం(ప్రేక్ష్యకుజః శ్మశానే రమ్యేసితేందూ గురురగ్నిహోత్రే।
రవిర్నరేంద్రామల గోకులేషు శిల్ప్యాలయేజ్ఞః ప్రసవం కరోతి ॥

లగ్నము నరరాశియై (మిధున కన్యా తులా ధనుః పూర్వార్ధ కుంభములు) అందున్న శనిని కుజుడు చూచిన శ్మశానమందును, శుక్రచంద్రులు చూచిన అందమైన యింటిలోను, రవి చూచిన రాజగృహ, దేవాలయ, గోశాలలందును, బుధుడు చూచిన శిల్పశాల యందును ప్రసవమగును.

జన్మలగ్న నవాంశరాశి బలయుక్తమయిన, తదధిపతియయిన గ్రహముతో సమానమయిన శరీరముకలవాడగును. నవాంశరాశి బలహీనమయిన లగ్నకుండలిలో బలవద్గ్రహతుల్యమయిన రూపము, ప్రకృతి కలుగును.

లగ్నాది ద్వాదశ భావములను జాతకుని అవయవములుగా చూచి, తత్తద్భావస్థ గ్రహములబట్టి తత్తదవయవముల వృద్ధిక్షయము, వైకల్యము మున్నగునదెరుంగవలెను. అవయవ విభాగము : లగ్నము శిరము, ద్వితీయము ముఖము, తృతీయము రొమ్ము, చతుర్ధము హృదయము, పంచమము కడుపు, షష్ఠమము కటిప్రదేశము, సప్తమము వస్తి(నాభికి క్రింద-గుహ్యమునకు పైన): అష్టమము గుహ్యము, నవమము తొడలు, దశమము మోకాళ్ళు, ఏకాదశము పిక్కలు, ద్వాదశము పాదాలు. ఈ అవయవములు రాశి, గ్రహముల బలానుసారముండునని తెలియునది.

జాతకునికి వ్రణాదుల నెరుగుటకు లగ్నద్రేక్కాణమువలన అంగవిభాగము చేయవలెను. ఎట్లనగా- ప్రథమ ద్రేక్కాణమున శిరస్సుమొదలు కంఠమువరకున్ను, ద్వితీయ ద్రేక్కాణమున కంఠాది- నాభి పర్యంతమును; తృతీయ ద్రేక్కాణమున నాభిక్రింది అవయవములును.

ఇక కుడియెడమల నెట్లనగా-చక్రదృశ్యార్థము- లేక ఉదితరాశులు లగ్నభోజ్య గడియలు 12,11,10,9,8 రాసులు. అదృశ్యార్థము-లేక అనుదిత రాశులు- లగ్నభుక్త గడియలు 6,2,3,4,5 రాసులు సప్తమమున గత ఘడియలును. అనగా ఆకాశముపై కనిపించు రాశులు దృశ్యార్థము, కనిపించనివి అదృశ్యార్థము. ఉదిత రాసులు వామభాగము, అనుదితరాసులు దక్షిణభాగమును. లగ్నప్రథమద్రేక్కాణము జననమయిన రాశి శిరస్సు, ద్వితీయం కుడికన్ను, ద్వాదశం ఎడమకన్ను, తృతీయం కుడిచెవి, ఏకాదశము ఎడమచెవి, చతుర్థం కుడిముక్కు, దశమము ఎడమముక్కు, పంచమం కుడిచెంప, నవమంఎడమచెంప, షష్టమము కుడిహనువు-చెక్కిలి పార్శ్వం, అష్టమము ఎడమ హనువు; సప్తమం నోరు; లగ్నద్వితీయద్రేక్కాణము జననమైన- లగ్నము కంఠము, ద్వితీయం కుడిభుజశిరస్సు- చేతుల పైభాగము. ద్వాదశము

ఎడమమూపు; తృతీయం కుడిచెయ్యి; ఏకాదశము ఎడమచేయి, చతుర్థము కుడి ప్రక్క; దశమము ఎడమప్రక్క, పంచమం హృదయమున కుడిభాగము, నవమం యెడమ భాగము, షష్ఠమము కడుపున కుడివైపు, అష్టమం ఎడమవైపు; సప్తమము నాభి; తృతీయ ద్రేక్కాణము జననమైన- లగ్నము వస్తి (నాభిక్రింద పొత్తికడుపు) ద్వితీయము గుహ్యము, ద్వాదశం గుదము; తృతీయైకాదశములు వృషణములు; చతుర్దశమములు తొడలు, పంచమ నవమములు మోకాళ్ళు, షష్ఠాష్టమములు పిక్కలు; సప్తమం రెండుకాళ్లు- ఇట్లు విభజించవలెను. ఈ అర్థమున శ్లోకములు-

"కంఠగ్రీవ వస్తిప్రముఖాః తులాద్రిశైరాగసంఖ్యాత్రివిధాద్యకాణైః।
క్రమేణకాలావయవాఃప్రదిష్టాః సవ్యాపసవ్యైస్స్వహలగ్నభాగాత్॥
మూర్థాలోచన కర్ణగహనా గండీ హనూచాననం
గ్రీవాస్కంధభుజంతుపార్శ్వహృదయ క్రోడాని నాభిః పునః।
వస్తిర్లింగ గుదేచ ముష్కయుగళం చోరుద్వయం జానునీ
జంఘేపాదయుగం విలగ్న భవనా త్సవ్యద్వయే కల్పితాః॥

ఏ రాశి పాపగ్రహయుక్తమై ఉండునో ఆ అవయవము వ్రణ, చిహ్న యుక్తమై యుండునని తెలియవలెను.

జన్మలగ్నమునకు ద్వితీయ ద్వాదశైకాదశ స్థానములందున్న గ్రహములచే ప్రసవకాలమున ఉన్న ఉపసూతి కలుగుదురు.

61. తత్రస్థితేభానుసుతేతుశూద్రీ రవౌస్థితేక్షత్రియభామినీస్యాత్।
రాహుధ్వజాభ్యామథజాతిహీనా అన్యైర్గ్రహైర్జాతి సమాప్రదిష్టా॥

2,11,12 లందు శనియున్న పురుడుపోసిన స్త్రీ శూద్రవనితయు, రవియున్న క్షత్రియస్త్రీ అనియు, రాహుకేతువులున్న జాతిహీనురాలు, ఇతర గ్రహములున్న గ్రహసమానజాతి స్త్రీయని చెప్పవలెను.

62. తత్స్థానపైస్సంయుతఖేచరేంద్రైః కేచిత్తు వాచ్యాహ్యుపసూతికాస్స్యుః।
గుర్విందుపుత్రాసురపూజితైస్తు తత్రస్థితైర్విప్రమృగాభిరామాః॥

కొందరు 2,11,12 స్థానాధిపతులచేతను, వారితోకూడిన గ్రహముల చేతను ఉపసూతికలను చెప్పుదురు. గురు, బుధ, శుక్రులున్న బ్రాహ్మణస్త్రీ ఉండును.

63. ఏతేషుపాపగ్రహసంయుతేషు తాసాంతువైధవ్యముదాహరంతి।
రాహుధ్వజాభ్యాంసహితేషుశూద్రీం స్త్రియంవదేత్తత్రశనేస్తు యోగాత్॥

ఆ గురు బుధ శుక్రులతో పాపగ్రహమున్న ఆమె విధవయగును. రాహు కేతువులున్న శూద్రస్త్రీ యనియు, శనియున్న పొట్టిది, నల్లనిదైన విధవయని చెప్పు దురు.

64. కృష్ణాచతుష్టావిధవాభవేత్సా యోగాద్గ్రహాణాం ప్రవదేచ్చ సంఖ్యాం।
బహిః ప్రదేశేగృహమధ్యభాగే దిశ్యర్థభాగస్థిత ఖేచరేంద్రైః॥

2,12,11 లందున్న గ్రహసంఖ్యచే ఉపసూతికల సంఖ్య నెరుగునది. దృశ్య చక్రార్థమున 8,9,10,11,12 ఉన్న గ్రహములచే పురుటింటికి వెలుపలనున్నూ, 6,5,4,3,2 లందున్న గ్రహములచే పురిటింటిలోపలనున్ను ఉపసూతిక లుందురు.

65. సంఖ్యాంవదేత్తత్రతదన్యయుక్తై రేకర్ష గేష్వత్ర బహుత్వమాహుః।
దీపాదిచాంచల్యముదాహరంతి చరేస్థిరేచేద్ధృతమత్రవాచ్యం॥

గ్రహసంఖ్యనుబట్టి ఉపసూతికా సంఖ్యను చెప్పవలెను. చరరాశియైన చేతితో పట్టుకొని త్రిప్పెడి దీపమున్ను, స్థిరరాశియైన కదప వీలులేని దీపము నుండునని తెలియునది.

66. లగ్నేశ్వరః క్రూరసమన్వితశ్చే ద్దేహస్యసౌఖ్యాదివినాశమాహుః।
తాదృక్ఫలంనాశగతస్తుసోపి శుభేక్షితశ్చేద్ఫలమన్యథాస్యాత్॥

లగ్నాధిపతి పాపగ్రహయుక్తుడైన దేహసౌఖ్యముండదు. లగ్నాధిపతి అష్టమ మందున్నను సుఖముండదు. శుభగ్రహదృష్టుడైన దోషముండదు. అనగా సుఖ ముండును.

67. దుస్థానపేనాపివిలగ్ననాథే యుతేవిలగ్నేతనురోగ భాక్స్యాత్।
పాపేవిలగ్నేతుబలైర్విహీనే లగ్నేశ్వరో రోగనిపీడితస్స్యాత్॥

లగ్నాధిపతి 6,8,12 అధిపతిలోకూడిన వ్యాధికలుగును. లగ్నమున పాపు డుండి, లగ్నాధిపతి బలహీనుడైయున్నను వ్యాధిపీడితుడగును. పాపగ్రహమనగా– 6,8,12 అధిపతి.

68. బలైర్విహీనేనతిలగ్ననాథే కేంద్రత్రికోణేనతిరోగభాక్స్యాత్।
లగ్నేశ్వరాధిష్ఠితరాశినాథో దుస్థానగోదుర్బలదేహభాక్స్యాత్॥

లగ్నాధిపతి బలహీనుడై కేంద్రకోణము లందున్నను(1.4.7,10,5,9) రోగ యుక్తుడగును. లగ్నాధిపతి ఉన్న రాశినాధుడు 6-8-12 లందున్నను దుర్బలమైన దేహము కలవాడగును.

69. తత్తద్గ్రహాధిష్ఠితరాశినాథై ర్దుస్థైర్విలగ్నాదివినాశమాహుః।
పాపేవిలగ్నేగుళికేత్రికోణే కేంద్రాదినాథేగుళికేనయుక్తే॥

ఏ భావాధిపతులున్న రాశ్యధిపతులు 6,8,12 లందుందురో, ఆ భావములు నాశము పొందును. జన్మలగ్నమున పాపగ్రహమును, పంచమ నవమములందున్న గుళికునితో కేంద్రాధిపతితో కూడగా-

70. లగ్నేశ్వరే పాపయుతే విలగ్నే రాహుర్యదా వంచనచోరభీతిః ।
శనేస్తు యోగాత్ప్రవిలోకనాద్వా భీతిర్ధ్రువా వంచన చోరభూపైః॥

లగ్నాధిపతి పాపగ్రహయుక్తుడై, లగ్నమున రాహువున్న యెడల, వంచన వలన, చోరులవలన భయము కలుగును. శని కూడినా, చూచినా మోసము, చోర, రాజ భయము తప్పదు.

71. రాహుర్విలగ్నే సకుజేర్క పుత్రే స్థితే బృహద్బీజముదాహరంతి ।
లగ్నేశ్వరే మృత్యుగతే నరాహౌ రంధ్రేన పాపేతుత దైవబాధా ॥

లగ్నమున రాహువుండి, శనికుజసహితుడై బృహద్బీజము(బుడ్డ) కలవాడగును. లగ్నాధిపతి అష్టమమున రాహుయుక్తుడై మరొక పాపగ్రహమున్నను అదే బాధ కలుగును.

72. లగ్నే న రాహౌ గుళికే త్రికోణే కేంద్రే కుజే మాందియుతే తథైవ ।
లగ్నేశ్వరాక్రాంత తదంశనాథో రాహ్వారమాంద్యాదిభిరన్వితశ్చేత్ ॥

లగ్నము రాహుయుక్తమయి, గుళికుడు కోణమున, కేంద్రమున కుజుడు మాందియుక్తుడై యున్నా, లగ్నాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి రాశిచక్రమున రాహుకుజ మాందిలతో కూడియున్నా బృహద్బీజము కలుగును.

73. అస్మిన్ బృహద్బీజ మిహాష్టమేశ నవాంశ యుక్తరాశ్యంశపతిస్సరాహుః ।
లగ్నేశ్వరే భూమిసుతే తనుస్థే పాపాన్వితే పాపవిలోకితేవా ॥

పూర్వయోగమున, లగ్నాధిపతి స్థితనవాంశరాశ్యధిపతి రాహుకుజమాంద్యాలతో కూడకున్నా, అష్టమాధిపతి స్థితనవాంశ రాశ్యధిపతి రాహుయుక్తుడైనా బృహద్బీజము కలుగును. లగ్నాధిపతియైన కుజుడు పాపయుక్తుడైనా, పాపదృష్టుడైనా-

74. శిలాప్రహారైర్వ్రణముత్తమాంగే మసూరికిర్వా కథయంతితజ్ఞాః ।
శనౌ తథా చేద్వ్రణముత్తమాంగే దావాగ్ని శస్త్రైః పతనేనవాపి॥

రాతిదెబ్బలచేగాని, మసూరి వ్యాధిచేగాని తలయందు వ్రణములు కలుగును. శని లగ్నాధిపతియై లగ్నమందుండి పాపగ్రహముతో కూడినా, చూడబడినా, దావాగ్నివలన గాని, ఆయుధములచేగాని, పైనుండి పతుటచేగాని తలయందు వ్రణము(దెబ్బ) కలుగును.

75. యదాశవేత్పంచ ఘటీవిలగ్నే శుభంయదా దేహ కృశత్వమాహుః।
శుష్కేఖగేలగ్నగతేవిలగ్నే శుష్కేణఖేటేన నిరీక్షితేవా॥

అయిదు గడియలు ప్రమాణముకల లగ్నమున పుట్టుట శుభము. లగ్నప్రమాణము సమముగా ఉన్నందున దేహాది సమత్వముండునని తాత్పర్యమును. శుష్కగ్రహము లగ్నమున ఉన్నా, చూచినా శుష్కదేహాడగును. శుష్కగ్రహమనగా పాపగ్రహము.

76. లగ్నేశ్వరేశుష్కగతేతథైవ శుష్కగ్రహాణాంశవనే స్థితేవా
లగ్నాధిపేనాశగతేపిశుష్క రాశౌతనోఃకృచ్ఛ్రమతీవకష్టం॥

లగ్నాధిపతి శుష్కగ్రహయుక్తుడైనా, శుష్కగ్రహరాశిలో ఉన్నా- శరీరము బక్కగా ఉండును. లగ్నాధిపతి శుష్కగ్రహరాశియయినా అష్టమమందున్నా దేహ కార్శ్యము కలుగును. శుష్కక్షేత్రమనగా నిర్జలరాశి.

77. లగ్నాధిపస్థాంశపరాశినాథ శ్శుష్కగృహస్థస్తనుశుష్కమాహుః।
శుష్కేవిలగ్నే బహుపాపయుక్తే తత్రాపి దేహస్యకృశత్వమాహుః॥

లగ్నాధిపతి యున్న నవాంశరాశ్యధిపతి శుష్కరాశిలో ఉన్న, దేహకృశత్వము కలుగును. శుష్కరాశియైన లగ్నము బహు పాపగ్రహయుక్తమయినను శరీరం బక్కగానుండును.

78. లగ్నేజలర్క్షేశుభఖేచరేంద్రైర్ యుక్తేతనోః స్థౌల్యముదాహరంతి ।
లగ్నాధిపేతోయఖగేబలాఢ్యే సౌమ్యాన్వితే చేత్తనుపుష్టిమాహుః॥

జన్మలగ్నము జలరాశియై శుభగ్రహయుక్తమయిన స్థూలదేహము కలుగును. లగ్నాధిపతి జలగ్రహమయి బలవంతుడై శుభగ్రహయుక్తుడైన దేహపుష్టి (స్థూల దేహము) కలుగును.

79. లగ్నాధిపేచేజ్జలరాశిసంస్థే శుభాన్వితేతోయఖగైః ప్రదృష్టే ।
లగ్నేశుభక్షేత్రగతేపిచైవం లగ్నేశ్వరస్థాంశపతౌజలర్క్షే ॥

లగ్నాధిపతి జలరాశియందుండి, శుభులతోకూడియుండి, శుభులచే చూడబడినా, లగ్నము శుభక్షేత్రమయి, లగ్నాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి జలరాశి యందున్నా స్థూలదేహముండును.

80. లగ్నేగురౌతేన నిరీక్షితేవా జలర్క్షగేణాపి జలేవిలగ్నే ।
సౌమ్యాన్వితేశోభన ఖేచరేంద్ర దృష్టేత్వతిస్థూల ముదాహరంతి॥

లగ్నమున గురుపుండినా, జలరాశిగతుడైన గురునిచే లగ్నము చూడబడినా, జలరాశియైన లగ్నము శుభగ్రహయుక్తమయినా, చూడబడినా, స్థూలదేహము కలుగును.

81. లగ్నే శనౌరాహు యుతేథవాస్యా త్పిశాచబాధాం ప్రవదంతిసంతః।
లగ్నే రవిర్భూమి సుతేనదృష్టే శ్వాసక్షయో విద్రధిగుల్మమూలాత్॥

లగ్నమున శనిగాని రాహువుగాని యున్న పిశాచపీడితుడగును. లగ్నస్థ రవి కుజునిచే చూడబడిన- శ్వాసము, క్షయ, విద్రధి, గుల్మరోగము కలుగును.

82. భౌమేవిలగ్నే శనిసూర్యదృష్టే మసూరికిః పాలిత దేహభాక్స్యాత్।
శనౌవిలగ్నే బహుపాపదృష్టే పిశాచచోరై ర్భవతిప్రపీడా॥

కుజుడు లగ్నమున ఉండి రవిశనులచే చూడబడిన, మసూరి రోగయుక్తుడగును. లగ్నమున శనియుండి, చాలమంది పాపులచే చూడబడిన- పిశాచ, చోరపీడ కలుగును.

83. లగ్నేశ్వరే తద్భవనేశ్వరేవా చరేస్థితే సంచరతి ప్రజాతః॥
సంచార శీలశ్చరభేవిలగ్నే లగ్నాంశకేచైవ ముదాహరంతి॥

లగ్నాధిపతిగాని, లగ్నాధిపతియున్న రాశ్యధిపతిగాని చరరాశిగతుడైన జాతకుడు సంచారశీలుడగును. చరలగ్నమునగాని, చరరాశియైన నవాంశయందుగాని జన్మించినవాడు సంచారశీలుడగును.

84. విదేశభాగ్యశ్చరభేవిలగ్నే చరేతదీశేచరఖేటదృష్టే।
స్థిరే స్వదేశే బహుభాగ్యయుక్త స్థిరగ్రహైర్భూమిధనాన్వితస్స్యాత్॥

జన్మలగ్నము చరమయి, లగ్నాధిపతి చరరాశియందుండి, చరగ్రహములచే చూడబడిన జాతకుడు విదేశ భాగ్యవంతుడగును. లగ్నము స్థిరమయి లగ్నాధిపతి స్థిరరాశియందుండి స్థిరగ్రహములచేచూడబడినను, కూడినను స్వదేశమున బహుభాగ్య యుక్తుడై, భూధనాన్వితుడైయుండును. కుజగురుశనులు స్థిరగ్రహములు; చంద్రబుధ శుక్రులు చరగ్రహములు.

85. మిత్రగ్రహైస్సంయుతభాగ్యకీర్తిః స్యానేతదేశ ప్రచురఃక్రమేణ।
లగ్నేశ్వరేవీర్యయుతేస్వతుంగే గంభీరగామీపురుషోయదాస్యాత్॥

మిత్రగ్రహాలతో కూడినా, చూడబడినా కీర్తి, భాగ్యము కలవాడగును. లగ్నాధిపతి బలహీనుడైన జాతకుడు బలహీనుడగును. లగ్నాధిపతి బలయుక్తుడై ఉచ్చయందున్న పురుషుడు గంభీరగుణములు కలిగి, గంభీరముగా ప్రవర్తించు వాడగును.

86. హీనేతదీశేనబలైశ్శుభేస్తుద్దృష్టేయుతేవాన తథావిధంతు।
లగ్నే శుభేశోభన దృష్టియుక్తే కాన్త్యేసుఖీస్యా న్నహిపాప యోగాత్॥

లగ్నాధిపతి హీనబలుడై శుభులైన బలగ్రహములచే చూడబడినా, కూడినా,

గంభీరగామి కాజాలడు. లగ్నము శుభ్రగహరాశియై శుభ్రగహయుతమయినా, దృష్టి యున్నా, బాల్యమున సుఖవంతుడగును. పాపగ్రహసంబంధమున్న సుఖముండదు.

87. దుఃఖీభవేత్పాప బహుత్వయోగా ల్లగ్నే తుబాల్యా న్మరణాంతకాలః।
వర్గోత్తమాంశేయదిలగ్ననాథే స్వోచ్చాంశ కేవాస్వసుహృద్దృగాణే।
శుభాన్వితేవా శుభదృష్టియుక్తే నరోభవేదామరణాంతసౌఖ్యః॥

లగ్నమున అనేక పాపగ్రహములున్నందున జాతకుడు బాల్యమునుండి మరణాంతము వరకు దుఃఖమునే పొందును. లగ్నాధిపతి వర్గోత్తమాంశయందున్నా ఉచ్చాంశయందున్నా, స్వద్రేక్కాణమందున్నా, మిత్రద్రేక్కాణమయినా, శుభులతో కలిసియున్నా, చూడబడినా ఆజీవితాంతము సుఖవంతుడగును.

88. లగ్నాంత్యలాభే శుభఖేచరేంద్రే లగ్నేశ్వరే కేంద్ర గతేబలాఢ్యే।
సింహాసనాంశే సతిదేవపూజ్యే జాతోభవేదామరణాంతసౌఖ్యః॥

లగ్న, ఏకాదశ, ద్వాదశములందు శుభ్రగహములుండి, లగ్నాధిపతి బలవంతుడై కేంద్రగతుడు కాగా, గురుడు సింహాసనాంశయందుండెనేని జాతకుడు యావజ్జీవము సుఖవంతుడగును.

89. లగ్నార్థరిప్పైః శుభదృష్టియుక్తై ర్లగ్నేశ్వరే శోభన కేచరేంద్రే।
పారావతాంశే యదిదానవేజ్యే జాతోభవేదంతి మబాల్యసౌఖ్యః॥

లగ్నద్వితీయ వ్యయములు శుభదృష్టికలవై, లగ్నాధిపతి, శుభ్రగహమయి, శుక్రుడు పారావతాంశయందున్న- జాతకుడు బాల్యమున-అంత్యమున సుఖించును.

90. బాల్యేసుఖీస్యాత్త్రి దశేంద్రపూజ్యే కేంద్రేయదాలగ్నగతేబలాఢ్యే।
ఐరావతాంశే యదిలగ్ననాథే స్త్రీపుత్రమిత్రార్థ సుఖాన్వితస్స్యాత్॥

గురుడు బలవంతుడై లగ్నమునగాని, కేంద్రమునగాని ఉండి, లగ్నాధిపతి ఐరావతాంశయందున్న జాతకుడు భార్యాపుత్రమిత్రాన్వితుడై సుఖించును.

91. దేవలోకాంశగేశుక్రే లగ్నేశే గోపురాంశగే।
లగ్నేశుభ గ్రహైర్దృష్టే మధ్యాంతే సౌఖ్యమాప్నుయాత్॥

శుక్రుడు దేవలోకాంశమున, లగ్నాధిపతి గోపురాంశమున ఉండి, లగ్నము శుభ్రగహదృష్టయయిన జాతకుడు మధ్య-అంత్య వయస్సులందు సుఖవంతుడగును.

92. లగ్నేశుభేధనేపాపే కేంద్రేపాపనమన్వితే।
లగ్నేశ్వరే చోత్తమాంశే హ్యాదౌదుఃఖం తతస్సుఖం॥

లగ్నమున శుభ్రగహము, ధనరాశిలో పాపగ్రహము, కేంద్రమున పాపగ్రహ

ముండి, లగ్నాధిపతి ఉత్తమాంశయందున్న- బాల్యమున దుఃఖమును, తర్వాత సుఖమును పొందును.

93. లగ్నేపాపేధనేసౌమ్యే భాగ్యేనతిశుభగ్రహే ।
లగ్నేశే దేవలోకస్థే బాల్యేసౌఖ్యం దరిద్రతా ॥

లగ్నమున పాపగ్రహం, ద్వితీయమున శుభగ్రహం, నవమమున మరొక శుభగ్రహం ఉండి, లగ్నాధిపతి దేవలోకాంశయందున్న- బాల్యమున సౌఖ్యమును, తర్వాత దరిద్రం కలుగును.

94. లగ్నేశ్వరే కర్మగతే తదీశేలగ్నసంస్థితే ।
శుభైర్దృష్టేస్వ తుంగేవా సత్కీర్తిం లభతేనరః॥

లగ్నాధిపతి దశమమున, దశమాధిపతి లగ్నమందుండి, శుభగ్రహములచే చూడబడినా, స్వ, ఉచ్చస్థానములందున్నా- జాతకుడు మంచి కీర్తిని పొందును.

95. పాపేవిలగ్నేంశ పతౌసరాహౌ కేంద్రస్థితేకర్మణి పాపభేతు ।
నీచగ్రహేలగ్న గతేర్కదృష్టే దుష్కీర్తియుక్తస్సభవేత్తదానీం॥

లగ్నమున పాపగ్రహముండి, నవాంశ లగ్నాధిపతి రాహుయుక్తుడై కేంద్ర మందు, దశమమందు మరొక పాపగ్రహమున్నా, నీచగ్రహము లగ్నగతుడై రవిచే చూడబడినా, జాతకుడు దుష్కీర్తియుక్తుడగును.

96. ఆరోహలగ్నేతు విలగ్ననాథే భాగ్యాధిపేతాదృశవీర్యయుక్తే ।
విఖ్యాతకీర్తిప్రభవోనరస్తు శుభగ్రహేణాపి సమన్వితేస్యాత్ ॥

లగ్నాధిపతి లగ్నపూర్వార్థమున ఉండి శుభగ్రహముతో కూడగా, నవమాధి పతి నవమభావపూర్వార్థస్థితుడయిన (ఆరోహణదశలోనున్న) జాతకుడు ప్రసిద్ధుడు, కీర్తిమంతుడగును.

97. ఆదౌవయసిపూర్వార్థే సౌఖ్యంలగ్నేభృగోస్సుతే ।
దుఃఖంత్వపరభాగేచ బంధౌపాపేసుతేతథా ॥

లగ్నపూర్వార్థమున శుక్రుడుండగా జన్మించినవాడు. బాల్యదశలో సుఖవంతు డగును. లగ్నోత్తరార్థమున శుక్రుడుండి, చతుర్థ పంచమములందు పాపగ్రహము లున్న బాల్యమున దుఃఖమనుభవించును.

98. లగ్నాధీపేశుభయుతేయదితుంగభాగే కేంద్రత్రికోణసహితే శుభదృష్టి యుక్తే
కర్మాధిపేనసహితేయదివాత్మ గేహే సద్భాగ్యకీర్తి ధనధాన్య చిరాయురేతి ॥

లగ్నాధిపతి శుభగ్రహముతోకూడి, తన ఉచ్చాంశలో ఉండి, కేంద్ర త్రికోణస్థుడై, శుభగ్రహదృష్టికలిగి, స్వక్షేత్రస్థితుడయిన జాతకుడు భాగ్యము, కీర్తి, ధనము, ధాన్యము, చిరాయువును పొందును.

99. లగ్నాధిపోతిబలవానశుభైరదృష్టః కేంద్రస్థితశ్శుభఖగైరవలోక్యమానః।
మృత్యుంవిధూయవిధధాతి సుదీర్ఘమాహ్వా స్సార్థంగుణైర్బహుళి
రూర్జితయాచలక్ష్మ్యాః ॥

లగ్నాధిపతి బలవంతుడై, పాపులచే చూడబడక, శుభగ్రహదృష్టి కలవాడై, కేంద్రములందున్న, మృత్యువును త్రోసివేసి; దీర్ఘాయువును, గుణములను, సంపదను కలుగజేయును.

100. కేంద్రత్రికోణనిధనేషునయన్యపాపా లగ్నాధిపస్సురగురుశ్చ
చతుష్టయస్థా ।
భుక్త్వాసుఖానివివిధానిన పుణ్యకర్మా జీవేచ్ఛ వత్సరశతంన
విముక్తరోగః ॥

కేంద్ర త్రికోణ, అష్టమములందు పాపులులేక, లగ్నాధిపతి, గురుడును చతుర్థమందున్న జాతకుడు బహువిధసుఖముల ననుభవించి, పుణ్యకార్యములు చేసి రోగములు లేనివాడయి నూరేండ్లు జీవించును.

101. లగ్నేశే ధనరాశిస్థే లగ్నేశస్థాంశపేపివా।
తథాస్థితే లాభనాదేవింశద్వర్షాత్పరంసుఖీ ॥

లగ్నాధిపతిగాని, లగ్ననవాంశాధిపతిగాని, ధనస్థానమున ఉండి, లాభాధిపతియు, అక్కడ ఉండగా పుట్టినవాడు జన్మాది ఇరువది సంవత్సరములు దాటిన పిమ్మట సుఖము పొందును.

102. లగ్నేశస్థాంశనాథేతు కేంద్రస్వర్క్షోచ్ఛసంయుతే ।
లాభేశే వాతథాభూతేత్రింశద్వర్షాత్పరంసుఖీ ॥

లగ్నాధిపతియున్న నవాంశరాశ్యధిపతి గాని, లాభాధిపతిగాని కేంద్ర, స్వక్షేత్ర, ఉచ్చస్థానస్థితులుకాగా జాతకుడు ముప్పదిసంవత్సరములకుపైన సుఖము పొందును.

103. లగ్నేశే శుభరాశిస్థే శుభేశేసుతసంయుతే ।
గోపురాంశగతేవాపి షోడశాబ్దాత్పరంసుఖీ ॥

జన్మలగ్నాధిపతి నవమమున ఉండి, నవమాధిపతి పంచమమున ఉన్నా, గోపురాంశగతుడయినా పదారు సంవత్సరములపైన సుఖము పొందును.

104. గ్రహయోగేక్షణాభ్యాంతు బలాబలవశాదపి ।
అగ్నస్యైవం ఫలంప్రోక్తం శ్రీమద్వేంకటశర్మణా ॥

గ్రహయోగ, దృష్టులచేతను, బలాబలవశమునను, లగ్నమున కీరీతిగా శ్రీమద్వేంకటశర్మచే ఫలము చెప్పబడినది.

ఇది సర్వార్థచింతామణి తెనుగుతాత్పర్యమున ద్వితీయాధ్యాయము.



# తృతీయాధ్యాయము

1. కౌటుంబాద్వ త్తవ్యం ముఖంచవాగ్దక్షిణాక్షి పూర్వార్థాః ।
హృద్యాఃఖు క్తివిశేషాః విద్యామంత్ర ప్రభేదంచ ॥

ద్వితీయభావమువలన కుటుంబము, ముఖము, వాక్కు, కుడికన్ను, పూర్వార్థము, ఇష్టములైన భోజ్యములను, విద్య, మంత్ర భేదములను చెప్పవలెను.

2. లగ్నేశ్వరేణసహితో యదివిత్తనాథో దుస్థోక్షినాశన మథా
న్నృణిదిందుయుక్తే ।
నేత్రేశ్వరేతనుగతేయదినైశికోంధః స్వోచ్చే శుభగ్రహయుతేన
తథావిధంతు ॥

నేత్రవిషయము చెప్పుచున్నాడు- ద్వితీయాధిపతి లగ్నాధిపతితో కలిసి 6,8,12 లందున్న నేత్రహాని కలుగును. ద్వితీయాధిపతి శుక్రచంద్రయుక్తుడై లగ్నమున ఉన్న-రేజీకటికలుగును. శుభగ్రహయుతుడయినా; ఉచ్చయందున్నా ఆ దోషము రాదు.

3. భానౌచలగ్నపతినాసహితేతదీశేజాత్యంధకోభవతిరంధ్రషడంత్యగోపి ।
తిష్ఠేధరాసుతగతేనయనంహివామం నాశం తదార్కజతిసూర్యసుతే
తదన్యత్ ॥

రవి లగ్నాధిపతితో కూడియుండి ద్వితీయాధిపతి 6,8,12 లందు ఉన్న జాత్యంధు (పుట్టుగ్రుడ్డివాడు) అగును. కుజుడు వ్యయమందున్న ఎడమకన్ను, శని యున్న కుడికన్ను చెడిపోవును.

4. చంద్రార్కనంయుక్తరవీందులగ్నే శనాఖ్యరదృష్టేక్షివినాశమాహుః ।
శుభాశుభైర్బుద్బుదలోచనస్స్యాచ్ఛుభైర్న దోషస్సహి తేక్షణాభ్యాం ॥

సింహకర్కాటకములు లగ్నమై అందు రవిచంద్రులుండి, శని కుజులచే చూడబడిన నేత్రనాశనమగును. ఈ యోగము సింహలగ్నమునకేగాని కటకమునకు కాదని మరొక ప్రతిలో నున్నది. ఈ యోగముననే శుభాశుభగ్రహములచే చూడబడిన బుద్బుద నేత్రములు (చికిలికళ్ళు కావచ్చును) కలుగును. కేవలం శుభగ్రహ యుక్తుడయినా, చూడబడినా దోషముండదు.

5. నిమీలితాక్షస్తుధనేనపాపే తదీశ్వరే శోభనదృష్టియుక్తే ।
లగ్నాధిపే పాప బహుత్వయోగే యమేనదృష్టే నతునేత్రరోగః ॥

ద్వితీయమున పాపగ్రహముండి, ద్వితీయాధిపతి శుభగ్రహదృష్టుడయిన జాతకుడు నిమీలిత నేత్రుడు (మూసినకన్నులు కలవాడు-మూసినట్లున్న కన్నులు కావచ్చు). ఈ యోగముననే లగ్నాధిపతి అనేక పాపగ్రహయుక్తుడై శనిచే చూడబడిన- నేత్రవ్యాధి కలుగును.

6. బలాన్వితేకారకఖేచరేంద్రే నేత్రేశుభేతద్భవనేశ్వరేవా ।
సౌమ్యాన్వితేకారకఖేచరేంద్రే లగ్నేశ్వరేణాపి యుతేథదృష్టే ॥

నేత్రకారకుడు బలవంతుడై, ద్వితీయమందు శుభగ్రహమున్నా, ద్వితీయాధిపతి శుభగ్రహయుక్తుడయినా, నేత్రకారకుడు లగ్నాధిపతితో కూడినా, చూడబడినా- జాతకుడు విశాలమైన దృష్టి కలవాడగును.

7. విశాలదృష్టిస్సనరోవిశేషా చ్ఛన్యార్కయోగేగుళికేనయుక్తె ।
నేత్రేశ్వరస్థాంశపతౌన పాపే పాపగ్రహే క్షేత్రగతే తథైవ ॥

ద్వితీయాధిపతిగాని, ద్వితీయ భావముకాని కుజశనిగుళికులతోకూడిన నేత్ర వ్యాధి కలుగును. ద్వితీయాధిపతి ఉన్న నవాంశరాశ్యధిపతి పాపగ్రహయుక్తుడై, చతుర్థమున్న పాపగ్రహయుక్తమయిన నేత్రవ్యాధి కలుగును.

8. నేత్రాధిపేవానరనాథకేతు ధరాసుతైర్వాగుళి కార్కిదృష్టే ।
ఉష్ణోద్భవేనహ్యథపిత్తకాచై ర్నేత్రన్యరోగైర్భవతి ప్రమాదః ॥

ద్వితీయాధిపతి రవికేతు కుజులతో కూడినా, గుళికశనులచే చూడబడినా, ఉష్ణాధిక్యముచే, పైత్యకాచవ్యాధులచేగాని కలిగిన నేత్రరోగములచే నేత్రముపోవును.

9. అవ్యాజరోగైర్న యనస్యరోగః తత్స్థానపేదుష్ట గతేనసౌమ్యే।
నహోదరాత్మో ద్భవబంధుశత్రు కళత్రపుత్రాది భవే త్తథైవ ॥

ద్వితీయాధిపతి 6,8,12 లందుండి, అతడు పాపగ్రహమైన- కారణముచేని

రోగములచే నేత్రరోగము కలుగును. ఇట్లే భ్రాతృ, పుత్ర, బంధు, శత్రు, కళత్రాదులకును ఆయా భావములబట్టి నేత్రరోగాదికము చెప్పదగినది.

**10.** రవ్యారయుక్తేనతినేత్రనాథే దృష్టేతుతాభ్యాం నయనాంతరక్తః ।
సౌమ్యగ్రహౌకారకభావనాథౌ దృష్టౌశ్శుభంస్యాచ్ఛుభదృష్టియుక్తౌ॥

ద్వితీయాధిపతి రవికుజులతో కూడినా, చూడబడినా కనుకొలకులలో ఎరుపు రంగు కలుగును. ద్వితీయాధిపతి, నేత్రకారకుడును శుభులై శుభగ్రహదృష్టి కలిగియున్న జాతకుని నేత్రములకు శుభమైన మంచిదృష్టి కలుగును.

**11.** పాపగ్రహాణామశుభదృష్టియోగా త్పిత్రాదికానాం ఫలమేవమాహుః ।
కుటుంబరాశే రధిపస్సౌమ్యః కేంద్రస్థితస్స్వోచ్చసుహృద్గృహేవా।
సౌమ్యర్క్షయుక్తోయదిజాత పుణ్య కుటుంబసంరక్షణవాగ్విభూతిః॥

ద్వితీయాధిపతి, నేత్రకారకుడును పాపగ్రహదృష్టి కలిగియున్న నేత్రములకు మంచిదృష్టి యుండదు. క్రూరదృష్టి యుండును. తండ్రి మున్నగువారిని ఆయా భావములకున్న గ్రహస్థితినిబట్టి నేత్రఫలము చెప్పవచ్చునని మహర్షులు చెప్పిరి. కుటుంబపోషణ—జన పోషణను చెప్పుచున్నాడు- ద్వితీయాధిపతి శుభగ్రహయుక్తుడై స్వక్షేత్ర, ఉచ్చ, మిత్రరాశి, కేంద్రములందున్నా, పుణ్యాత్ముడై, కుటుంబరక్షణ, వాగ్విభూతి కలవాడగును.

**12.** స్వోచ్చస్థితేశోభనఖేచరేంద్రే కుటుంబరాశౌ శుభవీక్షితేవా ।
అనేకసంరక్షణ జాతపుణ్యో లగ్నేశ్వరేవీర్య యుతేస్వతుంగే ॥

లగ్నాధిపతి బలవంతుడై, స్వ, ఉచ్చయందున్న, శుభగ్రహము ఉచ్చయందుండినా, ద్వితీయము శుభదృష్టమైనా అనేకజనులను రక్షించు పుణ్యాత్ముడగును.

**13.** గురౌకుటుంబేస్వపతౌయదిస్యా ద్భృగౌబుధేతాదృశభావనాథే ।
స్వోచ్చేసుహృత్క్షేత్రగతేథబంధౌ పరోపకారీ జనరక్షకస్స్యాత్॥

గురు, బుధ, శుక్రులు, ద్వితీయాధిపతులై, స్వక్షేత్ర, ఉచ్చ, మిత్రక్షేత్రగతులైనా, చతుర్థమందున్నా—జాతకుడు పరోపకారి, బహుజనపోషకుడు అగును.

**14.** పాపేతుత్రాశిపతౌతదానీం పాపేక్షితేపాపయుతేస్వతుంగే ।
లగ్నేశ్వరేహీనబలేనపాపే స్వజీవనోపాయ వహాయకేన ॥

ద్వితీయాధిపతి పాపగ్రహమై పాపగ్రహముతో కూడినా, చూడబడినా, ఉచ్చయందున్నా, లగ్నాధిపతి బలహీనుడై పాపయుక్తుడయిన అన్యసహాయముచే స్వజీవనము గడపువాడగును.

15. పాపేబతేహ్యుతుకుటుంబరాశౌ పాపేక్షితేహీన బలేతదీశే ।
దుస్థేవిలగ్నాధి పతౌనపాపే స్వజీవనంనాస్తి సుఖేనతస్య॥

ద్వితీయమున చాల పాపగ్రహములుండి, ద్వితీయాధిపతి బలహీనుడై పాప గ్రహముచే చూడబడిన, లగ్నాధిపతి పాపయుక్తుడై 6,8,12 అందున్నవానికి కష్ట జీవనమే కాని సుఖజీవనము లేదు.

16. పతౌకుటుంబస్య తృతీయరాశౌ స్థితేయదాపుంగ్రహసౌమ్యదృష్టే ।
సుఖస్థితేఖేచరనాయకేతు స్వతుంగగేసర్వ జనావనేశః ॥

ద్వితీయాధిపతి తృతీయమున ఉండి, శుభులైన పురుష గ్రహములచే చూడ బడి, రవి ఉచ్చస్థుడై చతుర్థమందున్న జనరక్షకుడగును. రవి నవమమందు ఉచ్చ సుడై యుండవలెనని పాఠాంతరము.

17. స్వోచ్చేత్రికోణాయగతే కుటుంబ రాశేః పతౌలగ్న పతౌబలాఢ్యే ।
కుటుంబనాథస్థితరాశినాథే కేంద్రేతదాసర్వజనావనేశః ॥

ద్వితీయాధిపతి ఉచ్చస్థుడై పంచమ, నవమ, లాభములందుండి లగ్నాధిపతి బలవంతుడై ద్వితీయాధిపతియున్న రాశికి కేంద్రమునఉన్నా జాతకుడు సర్వజన రక్షకుడగును.

18. తన్నాథేగోపురాంశస్థే కుటుంబస్థాంశపేశుభే ।
సింహాసనాంశ కేవాపి పంచాశజ్జన రక్షకః ॥

ద్వితీయాధిపతి గోపురాంశలో ఉండి, ద్వితీయ భావసవాంశాధిపతి శుభ గ్రహమై, ద్వితీయము సింహాసనాంశకమయినా జాతకుడు ఏబదిమందిని పోషించు వాడగును.

19. ద్వితీయేపాపరాశిస్థే కుటుంబేశేతథాస్థితె ।
పాపగ్రహేణసందృష్టే దుర్ఘటేనచ జీవనం ॥

ద్వితీయ పాపగ్రహ రాశియై, ద్వితీయాధిపతి పాపక్షేత్రవర్తియై, పాపగ్రహ ముచే చూడబడిన జాతకుడు జీవనము గడుపుట దుర్ఘటముగా నుండును.

20. వింశతేస్సచరక్షిస్యా త్కుటుంబేశేశుభైర్యుతే ।
పారావతాంశకేతస్మిన్ ధనేచంద్ర సమన్వితే ॥

ద్వితీయాదిపతి శుభులతో కూడి, ద్వితీయము పారావతాంశమయి, అక్కడ చంద్రుడున్న 20 మందిని రక్షించువాడగును.

21. స్వోచ్చేసుహృద్భే స్వగృహేతదీశే సింహాసనేతద్భవనేశ్వరేవా ।
పారావతాంశే గురుదృష్టియుక్తె శతత్రయంకానతిజాతకస్య ॥

ద్వితీయాధిపతి స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రము లందుండి, సింహాసనాంశను పొంది, ద్వితీయాధిపతి స్థితరాశ్యధిపతి పారావతాంశను పొంది, గురుదృష్టి కలిగి యున్న - జాతకుడు మూడువందలమందిని పోషించువాడగును.

22. కుటుంబనాథే పరమోచ్చయుక్తే దేవేంద్రపూజ్యేన సమీక్షితేవా।
తథావదేతద్భవనేపిజాతః సహస్ర సంరక్షణ పుణ్యభాక్స్యాత్ ॥

ద్వితీయాదిపతి పరమోచ్చ యందుండి, గురునిచే చూడబడినా, కూడియున్నా ఉచ్చస్థితుడయిన గ్రహము ద్వితీయమందుండి గురుదృష్టికలిగియున్నా- జాతకుడు వెయ్యిమందిని పోషించు పుణ్యాత్ముడగును.

23. సింహాసనాంశే త్రిదశేంద్రపూజ్యే శుక్రేయదాగోపుర సంయుతేతు।
ఐరావతాంశేధనపేబలాఢ్యే జాతస్త్వసంఖ్యం జనరక్షకస్స్యాత్ ॥

గురుడు సింహాసనాంశయందుండి, శుక్రుడు గోపురాంశయందుండి, ద్వితీయాధిపతి బలవంతుడై ఐరావతాంశయందున్న- జాతకుడు అసంఖ్యాక జనమును పోషించును.

24. ఉపజీవంతితంసర్వే తదీశేగోపురాంశగే।
వర్థంతేముదితాస్తత్ర గురౌపారావతాంశగే।

ద్వితీయాధిపతి గోపురాంశయందుండి, గురుడు పారావతాంశయందున్న, జాతకుని ఆశ్రయించి ఎంతోమంది జీవించి సంతోషింతురు.

25. నాస్తిచేద్రాజయోగస్తు పురస్కృత్యనరంజనాః।
ఉపజీవంతితన్నాథే పారావతగతేతథా।

ద్వితీయాధిపతి పారావతాంశను పొందిన జాతకునకు రాజయోగము లేకున్న అతని నాశ్రయించుకొని ఎంతోమంది జీవింతురు.

26. ముఖేశే కేంద్రభావస్థే శుభగ్రహనిరీక్షితే।
ముఖేసౌమ్యయుతేవాపి సుముఖస్సనరోభవేత్ ॥

ముఖవర్చస్సును చెప్పుచున్నాడు-ద్వితీయాధిపతి కేంద్రమందుండి శుభగ్రహ దృష్టియున్నా - ద్వితీయమున శుభగ్రహమున్నా జాతకుడు అందమయిన ముఖము కలవాడగును.

27. ప్రఫుల్లవదనఃశ్రీమాన్ కేంద్రేముఖపతౌసతి।
స్వోచ్చే మిత్రస్వవర్గస్థే తన్నాథే గోపురాంశగే ॥

ద్వితీయాధిపతి కేంద్రమందు స్వ, ఉచ్చ, మిత్రక్షేత్ర, స్వవర్గమందున్నా,

ద్వితీయాధిపతి స్థితరాశ్యధిపతి గోపురాంశము పొందియున్నా- జాతకుడు శ్రీమంతుడు, సద్వ్రముఖము కలవాడునగును.

28. పాపైర్యుతేముఖస్థానేతన్నాథేపాపసంయుతే।
నీచరాశిగతేవాపిదుర్ముఖః పాపవీక్షితే।

ద్వితీయమందు పాపులుండి, ద్వితీయాధిపతి పాపగ్రహయుక్తుడైనను, నీచగతుడయినను, పాపగ్రహదృష్టుడయినను దుర్ముఖుడు(అందవిహీనమయిన ముఖము కలవాడు) అగును.

29. క్రోధయుక్సనరః పాపేతదీశే గుళికాన్వితే।
పాపయోగబహుత్వేస్మిన్ నీచశత్రుంశకేస్థితే॥

ద్వితీయాధిపతి పాపగ్రహమై; గుళికునితో కూడినా, అనేక పాపులతో కూడినా, నీచ, శత్రునవాంశలందున్నా- జాతకుడు కోపశీలు(కోపిష్టి) డగును.

30. వాక్స్థానపేదేవపురోహితేన యుక్తేతథానాశ గతేత్రమూకః।
పిత్రాదికానా మయమేవరీతి రుక్తాముసీంద్రైర్బహు శాస్త్రవిద్భిః॥

మూకయోగము-ద్వితీయాధిపతి గురునితో కూడి అష్టమమందు ఉన్న జాతకుడు మూగవాడగును. పిత్రాదులకును తత్తద్భావములనుబట్టి ఇట్లే ఫలితమూహింపవలెను.

31. వాక్స్థానపేసౌమ్యయుతేత్రికోణేకేంద్రస్థితేతుంగసమన్వితేవా।
శుభేక్షితేపుంగ్రహసౌమ్యయుక్తేవాగ్మీభవేద్యుక్తి సమన్వితోసౌ॥

పక్తృత్వ యోగములు- ద్వితీయాధిపతి శుభగ్రహయుక్తుడయి, దృష్టుడయి ఉచ్ఛ, స్వక్షేత్ర, కేంద్ర కోణములందున్నా గురుయుక్తుడయినా జాతకుడు యుక్తియుక్తముగా మాట్లాడు వక్తయగును.

32. వాచాటకః కేంద్రగతేతదీశే పారావతాంశే పరమోచ్ఛభాగే।
సింహాసనేదేవగురౌభృగౌవావర్గోత్తమే సోమసుతేనయుక్తే॥

ద్వితీయాధిపతి కేంద్రమున, పరమోచ్ఛ భాగమున ఉండి, పారావతాంశను పొందినా గురుడుగాని, శుక్రుడుగాని సింహాసనాంశస్థితులయినా బుధుడు వర్గోత్తమాంశలో ఉన్న జాతకుడు శాస్త్రప్రవక్తయగును.

33. వాగీశస్థాంశపేసౌమ్యేస్వోచ్ఛే వాటుక వీక్షితే।
గోపురాంశ యుతేవాపి వాగ్మీపటుతరోభవేత్॥

ద్వితీయాధిపతి స్థనవాంశాధిపతియైన బుధుడు ఉచ్ఛయందుగాని, గోపురాంశ

యందుగాని ఉన్న శుభగ్రహముచే చూడబడిన— జాతకుడు సమర్థుడయిన వక్త యగును.

34. వాగీశోపిబలాన్వితశ్శుభయుతో వర్గోత్తమాంశేపివా ।
వాగ్మిస్స్యాద్భవనేశ్వరో గురుయుతః పారావతాంశేపివా ।
తన్నాథే భృగుజాబుధేనసహితేత్త్వైరావతాంశేపివా ।
స్వోచ్చస్వర్క్ష సుహృద్గృహే ధనపతావాస్థానకోలాహలః ॥

గురుడు బలవంతుడై శుభయుక్తుడై, వర్గోత్తమాంశయందున్నా, ద్వితీయాధిపతి గురుయుక్తుడయి పారావతాంశయందున్నా వక్తయగును. ద్వితీయాధిపతి శుక్రునితో గాని, బుధునితోకాని కూడియుండి, స్వ, ఉచ్చ, మిత్రరాశిగతుడయి, ఐరావతాంశను పొందియున్న జాతకుడు కోర్టులో కోలాహలముగా మాట్లాడగల వక్తయగును.

35. సభాజితోవాగధిపస్సపాపఃకర్మస్థితో నీచగతోర్కయుక్తః
మాంద్యన్వితేతద్భవనేర్కయుక్తే పాపైస్సుదృష్టేసజడోత్రజాతః ॥

ద్వితీయాధిపతి పాపయుక్తుడై, దశమస్థుడై, నీచగతుడై, రవితో కూడియున్న జాతకుడు సభలో జయింప(ఓడింప) బడును. ద్వితీయము మాందితోను, రవితోను కూడి పాపగ్రహదృష్టమయిన మూఢుడగును.

36. కేంద్రేబుధేవాగధిపేబలాఢ్యే శుక్రేధనేత్రిభాతృగ తేచసౌమ్యే।
స్వోచ్చేధనే దానవపూజితే వాజ్యోతిర్విదాంశ్రేష్ఠత మోనరస్స్యాత్ ॥

కేంద్రమున బుధుడు, శుక్రుడు ద్వితీయమున, తృతీయమున శుభగ్రహము ఉండి, ద్వితీయాధిపతి బలవంతుడుకాగాగాని, శుక్రుడు తన ఉచ్చయైన ద్వితీయమున ఉన్నా జాతకుడు జ్యోతిషిక శ్రేష్ఠుడగును.

37. గణితజ్ఞోభవేజ్జాతో వాగ్భావేభూమినందనే ।
ససోమేబుధదృష్టేవా కేంద్రేవాసోమనందనే ॥

ద్వితీయమున కుజుడుండి అక్కడ చంద్రుడున్నా, బుధునిచే చూడబడినా, కేంద్రమందు బుధుడున్నా జాతకుడు గణితశాస్త్రజ్ఞుడగును.

38. వాగ్భావపేబుధేస్వోచ్చే లగ్నే దేవేంద్రపూజితే ।
శనావష్టమ సంయుక్తే గణితజ్ఞోభవేన్నరః ।

ద్వితీయాధిపతి బుధుడు ఉచ్చస్థుడుకాగా (సింహలగ్నముకే) లగ్నమున గురుడు, అష్టమమున శనియున్న గణితశాస్త్రజ్ఞుడగును.

39. కేంద్రత్రికోణగేజీవేశుక్రేస్వోచ్చస్థితేసతి ।
వాగ్భావపేసోమపుత్రే గణిత జ్ఞోభవేన్నరః ॥

గురుడు కేంద్ర కోణములందు, శుక్రుడు ఉచ్ఛస్థుడయినా, ద్వితీయాధిపతి బుధుడు ఉచ్ఛస్థుడయినా జాతకుడు గణితజ్ఞుడగును.

40\. వాగ్భావపేరవౌభౌమేగురుశుక్రనిరీక్షితే ।
పారావతాంశకే చైతచ్ఛాస్త్రదృష్టి పరాయణః ॥

రవిగాని కుజుడుగాని ద్వితీయాధిపతియై, గురుశుక్రులచే చూడబడి, పారావతాంశయందున్న జాతకుడు శాస్త్రదృష్టి కలవాడగును.

41\. గురుశుక్రాధనేశాచేద్రవిభౌ మనిరీక్షితౌ ।
మూలత్రికోణే తుంగేవాతర్కశాస్త్ర విదాంవరః ॥

గురుశుక్రులు ద్వితీయాధిపతులై, రవికుజులచే చూడబడి, మూలత్రికోణమునగాని, ఉచ్ఛయందుగాని యున్న జాతకుడు తర్కశాస్త్ర పండితుడగును.

42\. సంపూర్ణబలసంయుక్తే గురౌతద్భవనేశ్వరే ।
దినేశేగురుసంయుక్తే శాబ్దికోయం సకోభవేత్ ॥

సంపూర్ణ బలవంతుడయిన గురుడు ద్వితీయాధిపతియై, రవితోకూడియున్న-వ్యాకరణ శాస్త్రజ్ఞుడగును.

43\. వాగ్భావపేబుధే స్వోచ్ఛే గోపురాంశగతేశనౌ ।
సింహాసనేగురావాపివేదాంత జ్ఞోభవేన్నరః ॥

ద్వితీయాధిపతియైన బుధుడు ఉచ్ఛస్థుడై, శని గోపురాంశను పొందియున్నా, గురుడు సింహాసనాంశను పొందియున్నా వేదాంతశాస్త్రజ్ఞుడగును.

44\. వేదాంతపరిశీలస్స్యాత్కేంద్రకోణేగురౌనతి ।
బుధేన భృగుణాదృష్టేశనౌ పారావతాంశగే ।

కేంద్రకోణములందున్న గురుని బుధశుక్రులు చూచిన, శని పారావతాంశయందున్నా వేదాంత పరిశీలకుడగును.

45\. ఉత్తమాంశేభృగౌలగ్నే కేంద్రేవాసంగతేభృగౌ ।
దేవలోకంగతే చంద్రేవేదాంత జ్ఞోభవేన్నరః ॥

శుక్రుడు ఉత్తమాంశగతుడై లగ్నమునగాని, కేంద్రమునగాని ఉండగా, చంద్రుడు దేవలోకాంశను పొందెనేని వేదాంతశాస్త్రజ్ఞుడగును.

46\. షట్ శాస్త్రవల్లభః కేంద్రేదేవేపే దానవపూజితే ।
సింహాసనే గోపురాంశేవాగ్భావస్థాంశగేబుధే ॥

గురుశుక్రులు కేంద్రగతులై సింహాసన, గోపురాంశగతులై యుండగా బుధుడు ద్వితీయభావనవాంశయందున్న-జాతకుడు షట్ఛాస్త్రజ్ఞుడగును.

47. విప్రలంభోధనేశ స్థరాశీశస్థాంశపేశనా ।
సపాపేకేంద్రకోణేవా భామేప్యేవం వినిర్దిశేత్ ॥

ద్వితీయాధిపతి ఉన్న రాశ్యధిపతి ఉన్న నవాంశరాశ్యధిపతి శనికుజులలో నొకరై, పాపయుక్తుడై కేంద్రకోణములందున్న - అసత్యవాదియగును.

48. పరిహాసకరోనిత్యం భానుస్థితనవాంశపే ।
వాగ్భావస్థేబలాఢ్యేతుతస్మి న్వైశేషకాంశగే ॥

రవియున్న నవాంశాధిపతి ద్వితీయమందుండి బలవంతుడైన, వైశేషికాంశను పొందిన జాతకుడు పరిహాసముగా మాట్లాడువాడగును.

49. గురౌబలాఢ్యేధనరాశియుక్తే తదీశ్వరాక్రాంత నవాంశనాథే ।
కేంద్రేత్రికోణేశుభవీక్షితేవా వేదాంతవిచ్ఛాస్త్ర పరాయణశ్చ ॥

గురుడు బలవంతుడై ద్వితీయమున ఉన్నా, ద్వితీయాధిపతి ఉన్న నవాంశ రాశ్యధిపతి కేంద్రకోణములందున్నా, శుభగ్రహదృష్టుడయినా జాతకుడు వేదాంతజ్ఞుడు, శాస్త్రపరాయణుడు నగును.

50. లగ్నేశ్వరేధనస్థేతులగ్నేవా సౌమ్యసంయుతే తుంగే ।
పారావతేతదీశే జాతో నిగమాంతవిద్వ్యయేశుక్రే ॥

లగ్నాధిపతి ద్వితీయమునందుండినా లేక ఉచ్చయైన లగ్నమున శుభగ్రహమున్నా, లగ్నాధిపతి పారావతాంశయందున్నా, శుక్రుడు వ్యయమందున్నయెడల జాతకుడు వేదాంతవేత్తయగును.

51. లగ్నేశ్వరస్థాంశపతిస్థరాశి నాథస్థితాంశాధి పతౌబలాఢ్యే ।
వైశేషికాంశే యదితుంగభాగే ధనాధిపేతుస్థపతిత్వమేతి ॥

లగ్నాధిపతి స్థనవాంశరాశ్యధిపతి స్థనవాంశరాశ్యధిపతి బలవంతుడై ఉచ్చాంశమందుండి, వైశేషికాంశను పొందియుండి ద్వితీయాధిపతియైన- జాతకుడు బృహస్పతిసవము చేసిన స్థపతియగును.

52. లగ్నేశ్వరేణసహితేధనరాశినాథే కేంద్రస్థితే పరమతుంగనవాంశకేపి।
వైశేషి కాంశకయుతే శుభదృష్టియుక్తే జాతస్యభూరి ధనలాభ
మిహాహురార్యాః ॥

లగ్నాధిపతి, ద్వితీయాధిపతి కలిసి కేంద్రమునఉండి, పరమోచ్చ నవాంశయందుండి, వైశేషికాంశను పొంది, శుభగ్రహయుక్తుడయిన అధిక ధనలాభము కలుగును.

53. కర్మాధిపేనసహి తేధనరాశినాథే లగ్నేశ్వరస్థితనవాంశ పతీశ్వరేణ ।
దృష్టేచతుష్టయగతేశుభదృష్టియుక్తే జాతోనరః ఫలితమేత్య
చిరేణబాల్యే ॥

లగ్నాధిపతి దశమాధిపతి కలిసి, లగ్నాధిపతి స్థనవాంశరాశ్యధిపతిచే చూడబడి, కేంద్రమందుండి, శుభదృష్టమయిన జాతకుడు బాల్యమునుండి ధనయోగము కలిగియుండును. ఈ యోగమునకు ద్వితీయాధిపతి నవమాధిపతితో కలిసి యుండవలెనని పాఠాంతరము.

54. లగ్నార్థలాభ భవనేశుభఖేచరేంద్రే స్వోచ్చేసుహృద్గృహగతేపి
విశేషకాంశే ।
తుంగాంశ తేధనపతిస్థనవాంశనాథదృష్టే ధనాధిబహులాభముపైతి
బాల్యే ॥

లగ్న, ద్వితీయ, లాభములందు శుభగ్రహములుండి, ఆ శుభగ్రహము స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రమున, వైశేషికాంశను పొందగా, ద్వితీయాధిపతి స్థనవాంశ రాశ్యధిపతిచే చూడబడగా- జాతకుడు బాల్యముననే ధనలాభము పొందును.

55. లగ్నేశే ధనరాశిస్థే ధనేశేలాభరాశిగే ।
లాభేశేవావిలగ్నస్థే బహుద్రవ్యార్జితం భవేత్ ॥

లగ్నాధిపతి ద్వితీయమందు, ద్వితీయాధిపతి లాభమందుగాని, లాభాధిపతి లగ్నమందుగాని ఉన్న జాతకునకు బహుధనలాభము కలుగును.

56. సర్వగ్రహాదతిబలీయదిలగ్ననాథే కేంద్రస్థితే త్రిదశపూజిత
సంయుతశ్చేత్ ।
వైశేషికాంశకయుతేధనరాశినాథోవిత్తం స్వవీర్యబలసాధిత
మాహురార్యాః ॥

లగ్నాధిపతి అన్ని గ్రహములకన్న బలిష్ఠుడై, గురునితో కలిసి కేంద్రమందున్న, ద్వితీయాధిపతి వైశేషికాంశను పొందియున్న- జాతకుడు స్వార్జిత విత్తము కలవాడగును.

57. లగ్నేశసంయుత నవాంశపతిస్థ రాశినాథో బలేనసహితో
ధనపస్యమిత్రం ।
కేంద్రత్రికోణసహితః స్వగృహేథవాపి జాతస్స్వవీర్యధనమేతి
బహుప్రకారైః ॥

లగ్నాధిపుడున్న నవాంశరాశ్యధిపతి ఉన్న రాశినాథుడు బలవంతుడై ద్వితీ

యాధిపతికి మిత్రుడై కేంద్ర, కోణ స్వక్షేత్రమునగాని ఉన్న -జాతకుడు అనేకరీతుల స్వార్జితధనము కలవాడగును.

58. లగ్నేశ్వరస్య ధనరాశిపతిస్త్రికోణే కేంద్రేథవా బలయుత శ్శుభఖేచరేంద్రః ।
ఉచ్చస్థఖేచరయుతః పరమోచ్చకే వాజాతస్స్వ వీర్యధనమేతి బహుప్రకారైః ॥

లగ్నాధిపతికి ధనాధిపతి త్రికోణముసగాని, కేంద్రముసగాని ఉన్నా- ద్వితీయాధిపతి శుభగ్రహమై ఉచ్చస్వగృహయుక్తుడయినా జాతకుడు అనేక ప్రకారముల స్వార్జితధనము కలవాడగును.

59. విత్తేశ్వరో లాభవిలగ్న పాభ్యాం యుక్తస్త్రికోణే యదికేంద్రరాశౌ।
శుభేక్షితః కాలబలాన్వితశ్చే జ్జాతస్స్వవీర్యార్థ నమేతిమధ్యే ॥

ద్వితీయాధిపతి లాభలగ్నాధిపతులతో కూడి, కేంద్రకోణములందుండి, శుభగ్రహదృష్టుడై కాలబలము కలవాడయిన జాతకుడు మధ్యయస్సున స్వంతముగా ధనము నార్జించును.

60. అంతేధనంయాతిధనేశయుక్త రాశౌవిలగ్నేశయుతేనసౌమ్యే ।
తదీశ్వరేలగ్నగతే బలాఢ్యేలాభేశ్వరాదేవ ముదాహరంతి ॥

ద్వితీయాధిపతికాని, లాభాధిపతిగాని ఉన్న రాశిలో లగ్నాధిపతి శుభగ్రహ యుక్తుడయినా, లగ్నాధిపతి స్థరాశ్యధిపతి లగ్నగతుడై బలవంతుడయినా జాతకుడు అంత్యవయస్సున ధనవంతుడగును.

61. తృతీయరాశౌ ధనలగ్ననాథౌ బలాన్వితౌసద్గ్రహదృష్టియుక్తౌ ।
తదీశ్వరేణాపియుతౌ ప్రదృష్టౌ భ్రాతుర్ధనంయాతివిశేషకాంశే॥

తృతీయమందు లగ్నధనాధిపతులుండి, బలసంతులై, శుభగ్రహయుక్తులై తృతీయాధిపతితో కూడినా, చూడబడినా, వైశేషికాంశయందున్న జాతకుడు సోదరుని ధనమును పొందును.

62. తృతీయభావాధిపతౌ ధనస్థే తత్రస్థితేకారక ఖేచరేంద్రే ।
దృష్టేయుతేవాతనుపేనజాతో భ్రాతుర్ధనంయాతి విశేషికాంశే।

తృతీయ భావాధిపతి ధనస్థుడై, ధనకారక గ్రహముకూడ అక్కడే ఉండి, లగ్నాధిపతితో కూడినా, చూడబడినా తృతీయాధిపతి వైశేషికాంశయందున్న జాతకుడు సహోదరధనమును పొందును.

63. పరస్పరం విత్తవిలగ్ననాథౌ నిరీక్షితౌ కేంద్రగతౌ శుభాంశే।
నిరీక్షితౌలాభశుభేశ్వరాఖ్యాం జాతో ధనంయాతి బహుప్రకారైః॥

లగ్న ద్వితీయాధిపతులు శుభాంశయందు, కేంద్రములందుండి, పరస్పర దృష్టికలిగి, కోణాధిపతులచే చూడబడిన జాతకుడు బహుప్రకారముల ధనమార్జించును.

64. విత్తేశ్వరంపశ్యతిలగ్ననాథే యుక్తస్స్వవీర్యాద్ధనమేతిజాతః।
తృతీయభావాధిప కారకాభ్యాం దృష్టేయుతేత్వీదృశవిత్తమేతి॥

లగ్నాధిపతి ధనాధిపతిని చూచినా, అతనితో కూడినా, జాతకుడు స్వశక్తిచే ధనమార్జించును. ద్వితీయాధిపతి తృతీయాధిపతితోను, భ్రాతృకారకుడైన కుజునితోను కూడినా, చూడబడినా- భ్రాతృధనము పొందును.

65. దృష్టేయుతే విత్త పతౌ బలాఢ్యే సుఖేశ్వరేణాపి ధనంజనన్యాః।
బంధోస్సకాశాదథవాకృషేర్వా ధనంప్రయాత్యత్ర విశేషికాంశే॥

ధనాధిపతి బలవంతుడయి, చతుర్థాధిపతిలో కూడినా, చూడబడినా తల్లిధనము కలియును. ఈ యోగమున చతుర్థాదిపతి వైశేషికాంశను పొందిన బంధువులవలన గాని, కృషిమూలకముగాగాని ధనము కలుగును.

66. పుత్రేశతత్కారకఖేచరాభ్యాంతథావిధేవిత్తపతౌబలాఢ్యే।
వైశేషికాంశేయదిలగ్ననాథేజాతస్స్వపుత్రార్జిత విత్తమేతి॥

ద్వితీయాధిపతి బలవంతుడై పంచమాధిపతితోను, పుత్రకారకునితోను కూడినా, చూడబడినా, లగ్నాధిపతి వైశేషికాంశయందున్న- జాతకుడు పుత్రార్జిత ధనమును పొందును.

67. షష్ఠేశతత్కారకఖేచరాభ్యాంతథావిధేవిత్తపతౌబలాఢ్యే।
శత్రోస్సకాశాచ్చ ధనంప్రయాతి వైశేషికే లగ్నపతౌ బలాఢ్యే॥

బలవంతుడయిన ద్వితీయాధిపతి శత్రుస్థానాధిపతి తత్కారకులచే చూడబడినా, కూడినా లగ్నాధిపతి వైశేషికాంశయందున్న- శత్రుధనమును పొందును.

68. కళత్రతత్కారకయోస్తథైవవిత్తంకళత్రాల్లభతేహిజాతః।
పితుర్ధనంకారకభావపాభ్యాం గురోస్సకాశాదపి ధర్మమూలాత్॥

బలవంతులైన ద్వితీయాధిపతి కళత్రాధిపతితోను, కారకుడైన శుక్రునితోను కూడినా, చూడబడినా, లగ్నాదిపతి బలవంతుడయిన కళత్రమూలక ధనము కలియును. బలవద్ద్వితీయాధిపతి నవమాధిపతితోను, కారకుడయిన రవితోను గూడినా, చూడబడినా, లగ్నాధిపతి బలవంతుడయిన పితృధనమును పొందును. గురువువలన గాని, ధర్మమూలకముగాగాని ధనమును పొందును.

69. కర్మేశదృష్టితత్కారకదృష్టియోగాద్ధనంస్వదాన గ్రహణాత్స్వకీర్త్యా।
లాభేశతత్కారకదృష్టియోగాదేవంపదంత్యత్రధనేబహుత్వం॥

ద్వితీయాధిపతి బలవంతుడై కర్మా(10)ధిప తత్కారకులతో గూడినా, చూడబడినా దానగ్రహణమువలనను, కీర్తివలనను ధనప్రాప్తి కలుగును. ద్వితీయాధిపతి బలవంతుడై లాభాధిప, తత్కారకుల యుతి, దృష్టివలన లాభమువచ్చు క్రియల మూలమున ధనాగమమగును.

70. ధనాయ యేగ్రహాః ప్రోక్తాః బలాఢ్యాస్తే తథాభవేత్ ।
నీచారి మూఢభావస్థైర్దృగ్యోగా త్తైచరైరపి ॥

ధనప్రాప్తికి చెప్పిన గ్రహములు బలముకలవైన చెప్పినరీతిగా ధనము కలుగును. లేక నీచ, శత్రురాశులందున్నా అస్తంగతులైన గ్రహములతో కూడినా, చూడబడినా ధననాశము కలుగును.

71. తత్తద్భావాధిపైర్విత్తనాశనంతస్యప్రతిర్భవేత్
సహోదర బంధుపుత్రాదికళత్రాదేరయం క్రమః ॥

ఏ భావాధిపతులు నీచ, అస్త, శత్రుక్షేత్రవర్తులయిన గ్రహములయుతి, దృష్టి కలిగియుందురో ఆయా భావములద్వారా ద్రవ్యహాని చెప్పనగును. ఇట్లే సోదర, బంధు, పుత్ర, కళత్రాదులకును చెప్పవలెను.

72. విత్తాధిపేతోయ భగే బలాఢ్యే విత్తేశ్వరేణాపి ధనాంశనాథే।
లగ్నేజలర్క్షేయదిభావభేశేద్వీపాంతరాదేష్యతి వస్తులాభః ॥

ధనాధిపతి జలగ్రహమై బలవంతుడై, ధనభావనవాంశరాశ్యధిపతితో కూడినా, చూడబడినా, జలరాశియైన లగ్నమున లాభాధిపతి ఉన్న - జాతకుడు ద్వీపాంతరము నుండి వస్తులాభమును పొందును.

73. లగ్నాధిపేహీనబలేనపాపేరిప్పేధనేశేదిననాథయుక్తే।
నీచస్థితేవాశుభదృష్టిహీనేజాతస్యవిత్తంహరతి క్షితీశః ॥

లగ్నాధిపతి బలహీనుడై, పాపునితో కూడియుండగా, ద్వితీయాధిపతి రవితో కూడి ద్వాదశమందున్నా లేక నీచరాశియందు శుభదృష్టి లేకయున్నా - జాతకుని ధనమును రాజు లాగివేయును.

74. వ్యయేశేధననాశిస్థేరిప్పగే లాభనాయకే।
దుస్థేధనేశేనీచే వారాజదండా ద్ధనక్షయః ॥

వ్యయాధిపతి ధనమునఉండి, లాభాధిపతి వ్యయమునఉండి, ధనాధిపతి 6,8, 12 అందుగాని, నీచయందుగాని ఉన్న - రాజశిక్షవలన ధననాశమగును.

75. ధనేశేనాశరాశిస్థేన పాపేనీచ రాశిగే ।
రాజకారక సంయుక్తే రాజదండాద్ధనక్షయః ॥

ధనాధిపతి అష్టమమున ఉండి, పాపగ్రహయుక్తుడై, నీచయందున్నా, రాజ కారక గ్రహయుక్తుడైన రాజదండనవలన ధననాశము.

76. ధనవ్యయే శౌవ్యయవిత్తసంస్థౌ లగ్నేశ్వరేణాపి నిరీక్షితౌచేత్ ।
లగ్నాధిపేనాశగతేన పాపేరాజ్ఞాంప్రకోపాద్ధననాశమాహుః ॥

ధనాధిపతి వ్యయమున, వ్యయాధిపతి ధనమున ఉండి పాపగ్రహ యుక్తుడై అష్టమస్థుడైన లగ్నాధిపతిచే చూడబడిన- రాజనిగ్రహమున ధననాశమగును.

77. కర్మేశ్వరేనాశగతేవి లగ్ననాథేనయుక్తేయమకంటకాంశే ।
దంష్ట్రాకరాళాంశగతేథవాపిరాజ్ఞాం ప్రకోపాద్ధననాశమాహుః ॥

దశమాధిపతి అష్టమమున ఉండి, లగ్నాధిపునితో గూడి, యమకంటకాంశ యందయినా, దంష్ట్రాకరాళాంశ యందైనా ఉన్న- రాజదండనవలన ధననాశము.

78. కర్మేశ్వరే నాశగతేనపాపేక్రూరాదిషష్ట్యంశయుతేవిశేషాత్ ।
ధనేశ తత్కారకయుక్తదానీం లోకోపకారాద్ధననాశమాహుః ॥

దశమాధిపతి అష్టమస్థుడై పాపగ్రహయుక్తుడై, క్రూరషష్ట్యంశ గతుడై, ధనాధిప, ధనకారకులతో గూడియున్న - లోకోపకారమునకై ధనము వ్యయమగును.

79. విత్తాధిపే భూమిజదృష్టియుక్తే క్రూరాంశగే హీనబలేనపాపే ।
చోరేశ తత్కారక దృష్టియుక్తే చోరాగ్ని భూపైర్ధననాశమేతి ॥

ధనాధిపతి కుజునిచే చూడబడి, బలహీనుడై, పాపగ్రహయుక్తుడై, క్రూరాది షష్ట్యంశ గతుడై, చోరాధిపతియగు షష్ఠాధిప, తత్కారక గ్రహయుక్తుడుగాని, దృష్టుడుగాని యైన, చోర, అగ్ని- రాజులద్వారా ధననాశమగును.

80. విత్తేశసంయుక్తనవాంశనాథ యుక్తాంశకస్థానపతౌనపాపే ।
దుఃస్థేవిలగ్నేశ్వర దృష్టియుక్తే చోరాగ్నిభూపైర్ధననాశమేతి ॥

ధనాధిపతియున్న నవాంశరాశ్యధిపతి యున్న నవాంశరాశ్యధిపతి పాపగ్రహ యుక్తుడై 6,8,12 లందున్న, లగ్నాధిపతిచే చూడబడిన- చోర, అగ్ని- రాజుల మూలకముగా ధననాశమగును.

81. ధనేశ యుక్తాంశపతిర్దుస్థోవా పాపయుగ్భవేత్ ।
క్రూరాంశకగతేవాపి నిర్ధనోయంభవేన్నరః ॥

ధనాధిపతి స్థనవాంశరాశ్యధిపతి 6,8,12 లందున్న, పాపగ్రహయుక్తుడైనా క్రూరాది షష్ట్యంశగతుడయినా జాతుడు నిర్ధనుడగును.

82. ధనే క్రూరాళిసంయుక్తే ధనేశే పాపసంయుతే ।
తథైవ లాభరాశీశే ధనహీనో భవేన్నరః ॥

ధనమున పాపగ్రహముండి, ధనాధిపతి పాపయుక్తుడై, లాభాధిపతియు పాప యుక్తుడయిన- జాతకుడు నిర్ధనుడగును.

83. వ్యయేశసంయుక్తనవాంశనాథో యుక్తో ధనేశేన నిరీక్షితో వా ।
నీచార్కగో హీన బలస్సపాపః కేంద్రస్థితశ్చేదపి నిర్ధనస్స్యాత్ ।

వ్యయాధిపతియున్న నవాంశరాశ్యధిపతి ధనాధిపతితో కూడినా, చూడబడినా, నీచగుడయినా, రవితో కూడినా, చూడబడినా, పాపయుక్తుడై కేంద్రమందున్నా- నిర్ధనుడగును.

84. ధనేశస్థితరాశీశ సంయుక్తాంశ పతౌ యదా ।
కాలదండాద్యంశయుక్తే నిర్ధనోయం భవేన్నరః ॥

ధనాధిపతియున్న రాశ్యధిపతి, ధనాధిపతి స్థనవాంశరాశ్యధిపతియు కాల దండాది క్రూరాంశయుక్తులైన- జాతకుడు నిర్ధనుడగును.

85. యత్కించి ద్ధనసంయుక్తో ధనేశే కేంద్రకోణగే ।
క్రూరషష్ట్యంశసంయుక్తే నీచస్థేర్కయుతేపివా ॥

ద్వితీయాధిపతి కేంద్రకోణములందుండి, క్రూరషష్ట్యంశయుక్తుడై, నీచ యందున్నా, రవియుక్తుడయినా స్వల్పధనము కలవాడు అగును.

86. యత్కించి ద్విత్తమాప్నోతి లాభేశస్థాంశరాశిపే ।
గురుణాళ్ళ గుణాదృష్టే క్రూరషష్ట్యంశ సంయుతే ॥

లాభాధిపతి స్థనవాంశరాశ్యధిపతి గురుశుక్రులచే చూడబడుచు క్రూరషష్ట్యంశ లందున్న - స్వల్పధనము కలవాడగును.

87. లాభలగ్న ధనేశానాం యుక్తాంశాః క్రూరసంస్థితాః ।
క్రూరషష్ట్యంశసంయుక్తే లాభేశే వార్థనాశభాక్ ॥

లాభ, లగ్న, ధనాధిపతులు క్రూరషష్ట్యంశలందుండినా, లాభాధిపతి క్రూర షష్ట్యంశయందున్నా- ధననాశమగును.

88. వైశేషికాంశే ధనపేస్వోచ్చ మూలత్రికోణగే ।
కేంద్రత్రికోణసంయుక్తే ఉత్పన్నధనికో భవేత్ ॥

ధనాధిపతి వైశేషికాంశయందుండి, స్వ, ఉచ్చ, మూల త్రికోణవర్తియై కేంద్ర కోణములందున్న జాతకుడు ఉత్పన్న ధనికుడు (క్రొత్తగా వచ్చి చేరిన సంపదకల వాడు) అగును.

89. ఉత్పన్నధనికో లగ్ననాథే వైశేషికాంశగే ।
ధనేశే సౌమ్య షష్ట్యంశేచోభౌ కేంద్రగతౌయదా ॥

లగ్నాధిపతి వైశేషికాంశయందుండి, ద్వితీయాధిపతి శుభషష్ట్యంశగతుడై- వారిద్దరును కేంద్రగతులయిన- జాతకుడు ఉత్పన్న ధనవంతుడు అగును.

90. సద్యోధనీధనేశేనకర్మనాథయుతేసతి ।
కర్మేశస్థాంశపతినా లాభనాథ స్తథావిధః ॥

ధనాధిపతితో దశమాధిపతి కూడినా, దశమాధిపతి స్థితనవాంశరాశ్యధిపతితో లాభాధిపతి కూడినా సద్యో ధనవంతుడు (నడిమంత్రపుసిరి) అగును.

91. లగ్నేశే ధనరాశిస్థే లాభేశే కర్మనంయుతే ।
ధనేశస్థాంశపే సౌమ్యేశుభదృష్టేధనీభవేత్ ॥

లగ్నాధిపతి ధనమందుండి, లాభాధిపతి దశమమందుండి, ధనాధిపతి స్థిత నవాంశరాశ్యధిపతి శుభగ్రహమై శుభగ్రహముచే చూడబడిన- జాతకుడు ధనవంతు డగును.

92. లాభలగ్న ధనేశానాం యుక్తాంశా స్సౌమ్యసంజ్ఞితాః ।
సౌమ్యషష్ట్యంశనంయుక్తే హ్యుత్పన్నధనికోభవేత్ ॥

లాభ, లగ్న ధనాధిపతులు శుభనవాంశలందుండి, శుభ షష్ట్యంశగతులయిన- జాతకుడు ఉత్పన్న ధనికుడగును.

93. నహస్రనిష్కభర్తాస్యాద్ధనేశే హ్యుత్తమాంశగే ।
లాభాధిపేననందృష్టే గురుణావానిరీక్షితే ॥

ధనాధిపతి ఉత్తమాంశయందుండి, లాభాధిపునిచేగాని, గురునిచేగాని చూడ బడిన- సహస్రాధిపుడు(వేయి బంగారు నాణెములు కలవాడు) అగును.

94. నహస్రనిష్కభర్తాస్యాల్లగ్నేశస్థనవాంశపే ।
గోపురాంశగతేకర్మనాథేనయదివీక్షితే ॥

లగ్నాధిపతి స్థనవాంశరాశ్యధిపతి గోపురాంశగతుడై దశమాధిపతిచే చూడ బడిన జాతకుడు వేలకధికారి యగును.(పూర్వము వేలన్న చాల గొప్ప)

95. కర్మేశనంయుక్తనవాంశనాథ నంయుక్త నప్తాంశ పతౌబలాఢ్యే ।
శుక్రేణ దేవేంద్ర పురోహితేనదృష్టే నహస్రద్వయ నిష్కభర్తా॥

దశమాధిపతి స్థితనవాంశరాశ్యధిపతియున్న సప్తాంశాధిపతి బలవంతుడై శుక్ర గురులచే చూడబడిన జాతకుడు రెండువేల కధికారి యగును.

96. సౌమ్యషష్ట్యంశసంయుక్తే ధనేలాభేబలాన్వితే ।
తదీశేపితథాభూతే సహస్రత్రయనిష్కభాక్ ॥

ధనలాభములు బలవంతములై శుభషష్ట్యంశయుక్తములయిన, ఆ భావాధి పతులు బలవంతులై శుభషష్ట్యంశయందున్న జాతకుడు మూడువేల కధికారియగును.

97. వైశేషికాంశే విత్తస్యనాథ గుర్వీందుభాస్కరాః ।
తథావిధేభవేశేపి బలాఢ్యేహితధాధనీ ॥

ద్వితీయాధిపతి గురు చంద్ర సూర్యులును లాభాధిపతియు వైశేషికాంశలోఉన్న జాతకుడు ధనవంతుడగును.

98. ధనేశస్యదృగాణేశ సంయుక్తనవభాగపః ।
సర్వోత్తమ బలోపేతో హ్యష్టసాహస్రనిష్కయక్ ॥

ధనాధిపతియున్న ద్రేక్కాణాధిపతియున్న నవాంశరాశ్యధిపతి సర్వోత్తమ బలవంతుడయిన ఎన్మిదివేల నిష్కముల కధికారియగును.

99. లగ్నేశస్యదృగాణేశ సంయుక్తమునిభాగపః ।
వైశేషికాంశకగత స్త్వయుతంధనమాప్నుయాత్ ॥

లగ్నాధిపతియున్న ద్రేక్కాణాధిపతిఉన్న సప్తమాంశాధిపతి వైశేషికాంశ నుండెనేని జాతకుడు పదివేల కధికారియగును.

100. వ్యయేశుక్రేధనేజీవే స్వాంశే వైశేషికేసతి ।
లగ్నేశేపి తథాయుక్తే తదూర్ధ్వ ముపయాతిసః ॥

వ్యయమున శుక్రుడు, ధనమున గురుడు, స్వాంశయందు వైశేషికాంశయందు ఉండగా, లగ్నాధిపతియు వైశేషికాంశయందున్న జాతకుడు పదివేలకన్న ఎక్కువ ధనమును పొందును.

101. గురౌలగ్నేశ సంయుక్తే ధనేవైశేషికాంశగే ।
కేంద్రత్రికోణగేవాపి తదూర్ధ్వంవిత్తమాప్నుయాత్ ।

గురుడు లగ్నాధిపతితో కూడియుండి, ధనభావము వైశేషికాంశయై కేంద్ర కోణములందుండగా పదివేలకన్న ఎక్కువ ధనాధిపతియగును.

102. కర్మేశస్థదృగాణస్థ నాథసంయుక్తసప్తపః।
కేంద్రత్రికోణగోవీర్య స్త్వథవాగధినాయకే ॥

దశమాధిపతియున్న ద్రేక్కాణాధిపతియున్న సప్తమాంశాధిపతి కేంద్ర కోణములందుండి, ద్వితీయాధిపతి బలవంతుడై వైశేషికాంశ పొందియున్న జాతకుడు లక్షాధికారి యగును.

103. వైశేషికాంశగశ్చేత్తు ధనంలక్షమవాప్నుయాత్ ।
లక్షద్వయం ధనంయాతి చతుష్కేంద్రే శుభాన్వితే ॥

లగ్నాది నాలుగు కేంద్రములు (1, 4, 7, 10) శుభగ్రహములతో కూడి యున్న—

104. సింహాసనేధనేశేతు సతిపారావతాంశగే ।
లక్షత్రయాధి కారీస్యాల్లాభ లగ్నధనాధిపాః ॥

ధనాధిపతి సింహాసనాంశయందున్న జాతకుడు రెండులక్షల కధికారి యగును. లగ్నలాభ ధనాధిపతులు పారావతాంశను పొందియున్న మూడులక్షల కధికారి యగును.

105. వై శేషికాంశకగతో మృద్వంశాదిగతో పివా ।
విత్తనాథ స్తదూర్ధ్వంహిధనీలాభాధిప స్తథా ॥

ధనలాభాధిపతులు వైశేషికాంశగతులుగాని, మృద్వంశగతులుగాని అయిన జాతకుడు మూడులక్షలకుపైన ధనవంతుడగును.

106. వృద్ధికేంద్రగతౌవిత్త కారకౌబలినౌతథా ।
భాగ్యనాథ స్త భాధూత స్స్వభేశోపితథావిధః ॥

ధనాధిపతి, ధనకారకులు బలవంతులై దశమకేంద్రమందున్నా, నవమ చతుర్థాధిపతులును దశమకేంద్ర గతులైనా,-

107. విలగ్నార్థాయభాగ్యేశాః పరమోచ్చాంశ సంయుతాః ॥
వై శేషికాంశేలాభేశః తదాకోటీశ్వరోభవేత్ ॥

లగ్న, ధన, లాభ, భాగ్యాధిపతులు పరమోచ్చాంశగతులై, లాభాధిపతి వైశేషికాంశను పొందెనేని జాతకుడు కోటీశ్వరుడగును.

108. భాగ్యేశేస్వోచ్చ భావస్థే సింహాసనగతేపివా ।
వర్గోత్తమాంశేలాభేశే దినేశే సుఖకేంద్రగే ॥

భాగ్యాధిపతి ఉచ్చయందైనా, సింహాసనాంశయందైనా ఉండి, లాభాధిపతి వర్గోత్తమాంశయందున్న, రవి చతుర్థమున-

109. లగ్నేశే ధనభావస్థే కేంద్రస్థే ధనఖేచరే ।
శుభేశుక్రే కేంద్రభావే కోటివిత్తం సమాప్నుయాత్ ॥

లగ్నాధిపతి ధనమందు, ధనాధిపతి కేంద్రమందు, శుభకేంద్రమైన దశమమున శుక్రుడున్న జాతకుడు కోటీశ్వరుడగును.

110. ఋణప్రదోవిలగ్నేశ సంయుక్తనవభాగపః।
దృష్టోదేవేంద్రగురుణా మృద్వంశాది సమన్వితః ॥

లగ్నాధిపతియున్న నవాంశాధిపతి మృద్వంశయందుండి, గురుదృష్టుడైన జాతకుడు లోకుల కప్పులిచ్చువాడగును.

111. విత్తలాభేశ సంయుక్తత్ర్యంశ తేశనవాంశపః।
విశేషాంశే కేంద్రగతో ఋణదాతా భవేన్నరః ॥

ధనలాభాధిపతులున్న ద్రేక్కాణాధిపతియున్న నవాంశాధిపతి కేంద్రగతుడై వైశేషికాంశయందున్న - జాతకుడు ఋణములనిచ్చువాడగును.

112. లాభేశే లగ్ననాథేపి క్రూరషష్ట్యంశసంయుతే।
లాభేశస్థిత లాభేశనాథే దుస్థేఽ ఋణాన్వితే ॥

లాభాధిపతిగాని, లగ్నాధిపతిగాని క్రూరషష్ట్యంశను పొంది, లాభాధిపతి యున్న రాశికి లాభస్థానాధిపతి లగ్నమునకు 6, 8, 12 లందున్న ఋణగ్రస్తుడగును.

113. ధనేశేనాశరాశిస్థే క్రూరషష్ట్యంశసంయుతే।
పాపాన్వితే ధనేరంధ్రే ఋణగ్రస్తో భవేన్నరః ॥

ధనాధిపతి అష్టమమున, క్రూరషష్ట్యంశగతుడై, ధన, అష్టమములు పాప గ్రహాన్వితములుకాగా ఋణగ్రస్తుడగును.

114. వాక్స్థానపేషష్ఠగతేనరాహౌ రాహుస్థితర్క్షాధిపసంయుతేవా।
దంతవ్యరోగః పతనంచ తేషాం భుక్త్యాతయోర్వాప్రవదంతితజ్ఞాః ॥

ద్వితీయాధిపతి రాహువుతోకూడి షష్ఠమందున్నా, రాహు స్థితరాశ్యధిపతితో కూడి ధనాధిపతి షష్ఠమందున్నా, దంతవ్యాధి, ఆగ్రహాంతర్దశలలో దంతము లూడి పోవుట జరుగును.

115. వాగ్భావపేనాపి యుతర్క్షనాథ స్తద్భావపస్థాం శపయుక్తనాథః।
షష్ఠేశ్వరేణాపియుతస్తుభుక్త్యాదంతవ్యరోగః పతనం చతేషాం ॥

ధనాధిపతితో షష్ఠాధిపతి కలిసియున్నా, ద్వితీయాధిపతి స్థితనవాంశరాశ్యధి పతి స్థరాశ్యధిపతి షష్ఠాధిపునితో కూడియున్నా ఆ గ్రహముల అంతరములందు దంతరోగము, దంతములూడుట జరుగును.

116. వాక్స్థానపేనాపియుతోర్కపుత్రః పాపైర్యుతోవాతభయాత్ప్రమాదః।
సూర్యస్తుకోపాద్భవతి ప్రమాదోరాజ్ఞాం ఋణశ్చోష్ణభయాత్తురోగః ॥

ద్వితీయాధిపతి శని కలిసి పాపగ్రహయుక్తులైన వాతవ్యాధివలన భయము

కలుగును. ద్వితీయాధిపతితో రవి కూడిన రాజకోపభయము, కుజుడు కూడిన ఉష్ణ వ్యాధి భయము చెప్పవలెను.

**117.** తదీశ్వరేణాథయుతేతుసౌమ్యేసరాహుకేతౌ వరిభావయుక్తే ।
రాహుస్థితస్యాధిపసంయుతస్యభుక్తౌతదాతాలుభవస్తురోగః ॥

ద్వితీయాధిపతితో బుధుడు కూడి, రాహు కేతు యుక్తుడై షష్ఠమమందున్న రాహువున్న రాశ్యధిపతి అంతరమున రాలు వ్యాధి భయము కలుగును.

**118.** రాజ్యారినాథౌతనుభావసంస్థౌ స్యాచ్చార్థపోభూమిపతేఃప్రకోపాత్ ।
ఉత్పాటితంనేత్రముశంతితజ్ఞాః నీచాంశగౌపాపయుతౌతథైవ ॥

దశమ షష్ఠాధిపతులు లగ్నగతులై, ద్వితీయాధిపతి సంబంధమున్న జాతకుని నేత్రము రాజ కోపము పెరుకబడిన దగును. దశమ షష్ఠాధిపతులు లగ్నమందు పాపగ్రహ యుక్తులై నీచాంశగతులైనా రాజ కోపమున నేత్రము పెకలింపబడును.

**119.** రాజ్యారినాథస్థితభాంశేశౌ దుస్థావిలగ్నేశయుతౌతథైవ ।
సహాక్షిహానాశగతౌతథైవశుభైర్నదృష్టేనయనప్రమాదః ॥

దశమ షష్ఠాధిపతులు ఉన్న నవాంశ రాశ్యధిపతులు లగ్నాధిపతితో కలిసి 6, 8, 12 లందున్న రాజ కోపమున కన్నులు పెరుకబడును. దశమ షష్ఠాధిపతులు ద్వితీయాధిపతితో కలిసి అష్టమ మందున్నను కన్నులు తీయబడును. ఈ నాలుగు యోగములందును శుభగ్రహ దృష్టి యున్నా, కూడియున్నా దశమ షష్ఠాధిపతుల కుండెనేని నేత్ర ప్రమాదము కలుగును.

**120.** తద్భావపాద్వాహ్యథకారకాద్వాపిత్రాదికానాంఫలమేవమాహుః ।
కర్ణస్యవిచ్ఛేదనమాహురార్యాః సౌరేచభౌమేధనపేవిలగ్నే ॥

పిత్రాది భావాధిపతి వలనను, కారకగ్రహ వశమునను పిత్రాదులకును ఈ ఫలము చెప్పవలెను.

ఇక కర్ణ విషయము– శని కుజులు ద్వితీయాధిపతియు లగ్నమందున్న కర్ణచ్ఛేదము జరుగును (చెవి కోయుదురు).

**121.** రోగోద్భవావిత్తపతౌవిలగ్ననాథస్థితేమందసుతాదియుక్తే ।
పిత్రాదికానాంఫలమేవమూహ్యం తద్భావనాథగ్రహకారకాద్యైః ॥

ద్వితీయాధిపతి లగ్నాధిపతితో కూడి గుళికాది యుక్తుడైనను కర్ణచ్ఛేదము కలుగును. పిత్రాది స్థానాధిప, కారకగ్రహ వశమున పిత్రాదులకును ఫల మిట్లు ఊహించవలెను.

122. భుక్తీశ్వరే శుక్ర నిశాకరాభ్యాం కేంద్రే యుతేరాజతమత్రపాత్రం ।
నచంద్రశుక్రామరరాజపూజ్యే కేంద్రస్థితేభుక్తిపతౌహిరణ్యం ॥

ద్వితీయాధిపతి శుక్ర చంద్రులతో కూడి కేంద్రవర్తియైన జాతకునకు వెండి పాత్ర భోజనము కలుగును. ద్వితీయాధిపతి చంద్ర శుక్ర గ్రహంతో కూడి కేంద్ర వర్తియైన హిరణ్య పాత్రతో భుజించును.

123. తదీశ్వరేకోణచతుష్టయేవా వైశేషికాంశేయదితాదృశంచతత్ ।
మృద్వంశకేవాపరమోచ్చకాంశేస్థితేతదీశేయదితాదృశంహితత్ ॥

ద్వితీయాధిపతి కేంద్ర కోణములందు వైశేషికాంశను పొందియున్నా, పర మోచ్చభాగ మందుండి, మృద్వంశగతుడైనా హిరణ్య పాత్రలో భోజనము కలుగును.

124. స్వస్వాంశకానాంపరమోచ్చకాంశేశశాంకజీవాచ్ఛ విదోయదంశే ।
వీర్యాన్వితోభుక్తిపతిస్తదంశేభుక్తౌసుపాత్రంసుదృఢంహిరణ్యం ॥

చంద్ర గురు శుక్ర బుధులు పరమోచ్చ రాశి భాగమందు, స్వనవాంశము లలో నెక్కడ ఉందురో ఆ నవాంశమున ద్వితీయాధిపతి బలవంతుడై యున్న జాతకుని భోజన పాత్ర దృఢమైనది, విలువైన హిరణ్య పాత్ర యగును.

125. మృద్వంశకేభుక్తిపతౌ విశేషా త్పారావతాంశే బలపూర్ణయుక్తే ।
కేంద్రేస్థితేమిత్రశుభేక్షితేవాస్యాత్కాంస్యపాత్రంబహుభుక్తికాలే ॥

ద్వితీయాధిపతి (=భుక్తీశ్వరుడు) పారావతాంశ యందుండి, మృద్వంశ గతుడై, బలవంతుడై, కేంద్రవర్తియై, మిత్రులైన శుభ గ్రహములచే చూడబడిన జాతకునికి భోజన పాత్ర కంచుదై యుండును. (కంచు కంచములలో యున్నంత వరకు తినువారు)

126. విచిత్రపాత్రంప్రవదంతితజ్ఞాభుక్తీశ్వరః కేంద్రగతోబలాఢ్యః ।
శుక్రామరేడ్యేందు సుతాబలాఢ్యాః తైరేవయుక్తోధవిశేషికాంశే ।
భుక్తీశమందౌతనుపేనయుక్తౌషష్ఠస్థితౌచేత్ప్రవదంతిలోహం ॥

ద్వితీయాధిపతి బలవంతుడై, కేంద్రవర్తియై, బలవంతులైన గురు శుక్ర బుధు లతో కూడి, వైశేషికాంశ యందున్న విచిత్ర పాత్ర (పలు లోహములు కలిసిన పాత్ర) లో భుజించును.

ద్వితీయాధిపతి, శని, లగ్నాధిపతితో కలిసి షష్ఠ స్థానమున ఉన్న- జాతకు నికి భోజన పాత్ర లోహ (ఇనుము) మయ మగును (ఇప్పు డందరు స్టెయిన్‌లెస్ స్టీలు వాడుచున్నందున అందరికిని సాధారముగా ఈ యోగము పట్టియుండునేమో).

127. ధాతుద్వయయుతంపాత్రంభుక్తీశస్థాంశరాశిపే ।
పాపగ్రహేణసందృష్టేకారకేబలవర్జితే॥

సువర్ణ, రజత, తామ్ర, కాంస్యాదులకు ధాతువులనియు పేరు. ద్వితీయాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి పాపగ్రహ దృష్టుడైన, భుక్తిపుడు బలహీనుడైన రెండు ధాతువులు కలిసిన పాత్రయగును.

128. పాత్రంతదీశ్వరయుతౌయదివావినాశస్థానర్గౌసుదృఢమత్రతులోహపాత్రం ।
కాంస్యంవదంతికిలభుక్తిపతౌబలాఢ్యే వైశేషికాంశసహితేసతిసౌమ్యదృష్టే ॥

లగ్నాధిపతి ద్వితీయాధిపతితో కలిసి అష్టమమందున్న దృఢమైన యినుప పాత్రయనియు, ద్వితీయాధిపతి బలవంతుడై వైశేషికాంశమందు ఉండి శుభగ్రహ దృష్టుడైన కంచుపాత్రయనియు చెప్పవలెను.

129. భుక్తీశ్వరస్థితనవాంశపతిర్యదంశేతద్రాపశిశ్శుభయుతోపి తథైవమాహుః ।
పాపగ్రహేణసహితేసతిభుక్తిరాశౌ తద్రాశినాథయుతభావపతిర్యదంశే॥

ద్వితీయాధిపతియున్న నవాంశ రాశ్యధిపతియున్న నవాంశ రాశ్యాధిపతి శుభగ్రహ యుక్తుడైన కంచుపాత్ర యగును. ద్వితీయమున పాపగ్రహముండి, ద్వితీయాధిపతి ఏ నవాంశయందుండునో—

130. తద్రాశిపోబలవియుక్శుభైరదృష్టోభుక్తౌతుసీసమదృఢంకథయంతి తజ్ఞాః ।
బహ్వాశనోభుక్తిపతౌనపాపేదావాగ్నిదగ్ధాయుధకాలభాగే ।
నీచాంశకేపాపనిరీక్షితేవాశుభైర్నదోషస్వహితేక్షణాఖ్యాం ॥

ఆనవాంశ రాశ్యధిపతి బలహీనుడై శుభగ్రహ దృష్టిలేక యున్న దృఢమైన సీసపుపాత్రయందు భుజించును. ద్వితీయాధిపతి పాపగ్రహ యుక్తుడై దావాగ్ని దగ్ధ ఆయుధ, కాలభాగలందుండి, నీచాంశగతుడై పాపగ్రహదృష్టుడైన ఎక్కువగా భుజించును. (తిండిపోతనవచ్చును). శుభగ్రహ దృష్టియున్న ఆదోషముండదు.

131. భుక్తిస్థానేశుభయుతేతదీశేశుభసంయుతే ।
శుభగ్రహేణసందృష్టేసుఖభుక్సనరోభవేత్ ॥

ద్వితీయాధిపతి శుభగ్రహదృష్టి కల్గియుండి, ద్వితీయము శుభగ్రహ యుక్తమైన జాతకుడు సుఖభోజనము కలవాడగును.

**132.** భుక్తిసౌఖ్యయుతశ్శ్రీమాన్ భుక్తిశేబలసంయుతే ।
విశేషికాంశకేవాపిశుక్రేజీవనిరీక్షితే ॥

ద్వితీయాధిపతి బలవంతుడై శుక్ర గురుదృష్టికలిగి, వైశేషికాంశయందున్న జాతకుడు భోజన సౌఖ్యముకలవాడగును.

**133.** భుక్తౌస్వోచ్చేత్రికోణేవాతదీశేవాబలాన్వితే ।
కారకేతు విశేషాంశేశుభదృష్టేశుభాశనీ ॥

ద్వితీయాధిపతి ద్వితీయమునగాని, ఉచ్చ, కోణమందుగాని బలవంతుడై యున్న, భుక్తికారకుడు వైశేషికాంశలోఉండి శుభగ్రహములచే చూడబడిన-జాతకుడు శుభమైన ఆహారము భుజించును.

**134.** కాలోచితాశనీభుక్తినాథేదేహేశవీక్షితే ॥
పాపగ్రహేణసందృష్టేనీచారిశయుతేపివా ॥

భుక్తినాధుడు లగ్నాధిపతిచే చూడబడి, నీచగ్రహముచేతను, షష్ఠాధిపతితోను కూడి, పాపగ్రహ దృష్టుడైన సకాలమునకు ఉచితాహార భోక్తయగును.

**135.** అన్నప్రదోద్వితీయేశేగురుసౌమ్యయుతేక్షితే ।
వైశేషికాంశకయుతేమృద్వంశాదియుతేపివా ॥

ద్వితీయాధిపతి గురుబుధులతో కూడినా, చూడబడినా, వైశేషికాంశ యుతుడై, మృద్వంశాది యుక్తుడైనా జాతకుడు అన్నదాతయగును.

**136.** గురుశుక్రయుతేభుక్తినాథేశుభనిరీక్షితే ।
వైశేషికాంశగతేకేంద్రేతూపచయేపివా ॥

భుక్తనాధుడు గురు శుక్రులతోకూడి, శుభగ్రహముచే చూపబడి, వైశేషికాంశ గతుడై కేంద్రమందు, ఉపచయమంధు (1, 3, 6, 11) ఉన్నను అన్నదాత యగును.

**137.** మధ్యేస్వోచ్చేభుక్తిపతౌమిత్రసౌమ్యనిరీక్షితే ।
బలయుక్తేశుభయుతేత్వన్నదాతాభవేన్నరః ॥

భుక్త్యధిపతి మధ్యమైన ఉచ్చయందుండి, మిత్రులైన శుభగ్రహ దృష్టుడై బలవంతుడై, శుభగ్రహయుక్తుడైన అన్నదాతయగును.

**138.** నాథేవైశేషికాంశేతుసుఖభుక్తిప్రదోభవేత్ ।
అల్పాశీరుచికామీస్యాద్భుక్తినాథేశుభగ్రహే ॥

ద్వితీయాధిపతి వైశేషికాంశయందున్న సుఖకరమైన అన్నము పెట్టు

వాడగును. భుక్తినాథుడు శుభగ్రహమైన స్వల్పముగా తినువాడును, తిండిలో రుచులు కోరువాడును అగును.

139. స్వోచ్చే తు శుభసందృష్టే మృద్వంశాదిసమన్వితే ।
తదీశే బలసంయుక్తే శీఘ్రభుక్స నరో భవేత్ ॥

ద్వితీయాధిపతి ఉచ్చస్థుడై, శుభగ్రహదృష్టుడై, మృద్వంశాది యుక్తుడైన బలవంతుడైన శీఘ్రభోజి యగును.

140. పరాన్నభుక్తజీవీ స్యాన్నీచశత్రంశసంయుతే ।
నీచఖేచరసందృష్టే సదూషణపరో భవేత్ ॥

భుక్త్యధిపతి నీచ, శత్రు స్థానములందున్న, నీచ గ్రహములచే చూడబడినా దూషణ చేయువాడు, పరాన్నభోజియు అగును.

141. భుక్తిస్థానాధిపే మందే తదీశే మందసంయుతే ।
నీచేర్కసూనునా దృష్టే శ్రాద్ధభుక్సతతం నరః ॥

భుక్తి స్థానాధిపతి మందగ్రహమై మరొక మందగ్రహముతో కూడి, నీచయందుండి, శనిచే చూడబడిన-నిత్యము శ్రాద్ధాన్న భోక్తయగును. మందగతిగల గ్రహములు మందగ్రహములు.

142. కుభోజీ భుక్తినాథే తు శన్యారగుళికాన్వితే ।
నీచశత్రుయమాంశాదౌ శుభదృష్టివివర్జితే ॥

భుక్తనాథుడు శనికుజగుళికులతో కూడి, నీచ, శత్రు, శని నవాంశల యందుండి, శుభదృష్టిలేకున్న కుత్సితాన్న భోక్తయగును.

143. ద్వితీయే శుభరాశౌ వా శుభఖేచరసంయుతే ।
తదీశే శుభరాశౌ వా భుక్తౌ వా తాదృశే గృహే ॥

ద్వితీయమునగాని, నవమమందుగాని, శుభగ్రహముండి, ద్వితీయాధిపతి నవమముననుండి, ద్వితీయమున మరొక శుభగ్రహమున్న శీఘ్రముగాను, సుఖముగాను, శుభాన్నమును భుజించువాడగును.

144. తాదృశే హ్యశుభైర్యుక్తే చిరభోక్తా తు దూషకః ।
తన్నాథే పాపరాశిస్థే చిరభుక్తిపరో భవేత్ ॥

ద్వితీయ నవమములందు పాపగ్రహములున్న అలస్యముగా భుజించువాడును, దూషకుడును అగును. ద్వితీయాధిపతి పాపరాశియందున్నను అలస్యముగా తిను వాడగును.

145. విలగ్నసప్తాష్టమవిత్తరాశౌ దినేశయుక్తే క్షితిసూనుదృష్టే ।
భౌమేన వా వానరనాథదృష్టే స్ఫోటాగ్నిభీతిః ప్రభవేన్నరాణాం ॥

లగ్న, సప్తమ, అష్టమ, ద్వితీయములందు రవియుండి, కుజునిచే చూడబడినా, ఆ 1, 7, 8, 2 రాశులందు కుజుడుండి, రవిచే చూడబడినా, జాతకునకు స్ఫోటక, అగ్నిబాధలు కల్గును. దుష్టులవలన బాధయని పాఠాంతరము.

**146.** లగ్నాంత్యశత్రుభవనేయదిభూమిపుత్రేమందాన్వితేకమలబంధునిరీక్షితేవా ।
మూఢారినీచభవనేయదివాధరాజేత్యాజ్యాస్పదాదినహితస్పృభవేత్తదానీం॥

లగ్న ద్వాదశ షష్ఠములందు శనితోకలిసి కుజుడుండి, రవిచేచూడబడినా, 1, 12, 6 అందు కుజుడుండి, అవి కుజునికి మూఢ, శత్రు, నీచ స్థానములైన-అతడు విడువదగిన కృత్యములు, విడువదగిన రోగము (కుష్ఠ, క్షయ) కలవాడగును.

**147.** మందాత్మజేనసహితేయదిభూమిపుత్రేవిత్తేథవానిధనరాశిముపాగతేవా ।
తేనైవవీక్షితయుతేధనభావనాథేత్యాజ్యస్పృగాదినియతించవదంతితజ్ఞాః ॥

కుజుడు మాందితో కూడియుండి, ద్వితీయమునగాని, అష్టమమునగాని యున్న, ద్వితీయాధిపతి అట్టి కుజునిచే చూడబడినా, జాతకుడు స్పృశింపకూడని రోగములు, నీచకృత్యములు కలవాడగును.

**148.** పాపేక్షితేరవిసుతేధనరాశిసంస్థే ।
పాపాన్వితేశునకభీతిముపైతిజాతః ।
తద్భావనాథసహితేదిననాథపుత్రే ।
దృష్టేథవాశునకభీతిముపైతిజాతః ॥

శని ద్వితీయమున ఉండి, పాప దృష్టికలిగి, పాపులచే కూడిన శునకభీతి కలవాడగును. శని ద్వితీయాధిపతితో కూడినా, చూచినా శునక భయము కల్గును.

**149.** రాహౌద్వితీయేగుళికేనదృష్టేయుతేథవాసర్పభయంవదంతి ।
కదన్నభుగ్భూమిసుతేనయుక్తేపిత్రాదికానాంఫలమేవమాహుః ॥

ద్వితీయమున రాహువుండి, గుళికునితో కూడినా, చూడబడినా, జాతకునకు సర్ప భయముండును. ద్వితీయమునఉన్న రాహువుతో కుజుడు కూడినా జాతకుడు కుత్సితాన్నభోక్తయగును. పిత్రాది భావములబట్టి వారికిని ఈ ఫలములు చెప్పదగినవి.

**150.** లగ్నేశ్వరేశోభనఖేచరేంద్రేనిధ్యాదిలాభంధనభావయుక్తే ।
పాపేద్వితీయేయదినత్వహీనేపాపేక్షితేవాక్పలనంతదాహుః ॥

లగ్నాధిపతి శుభగ్రహమై ధన భావమునఉన్న విద్యాదిలాభము కల్గును. ద్వితీయమునఉన్న శుభగ్రహము బలహీనమై, పాప గ్రహదృష్టి కల్గియున్న జాతకుడు వాక్చలనము (మాటతూలుట) కలవాడగును.

**151.** వాక్స్థానపోసౌయదినత్వహీనఃక్రూరాంశగఃపాపఖగోయదిస్యాత్ ।
వాక్స్థానపేసౌమ్యదృశావిహీనేపాపేక్షితేవాక్చలనంతదాహుః ॥

ద్వితీయాధిపతి బలహీనుడై, పాపుడై, క్రూరాంశను పొందియున్న ద్వితీయాధిపతి శుభగ్రహదృష్టి పొందినా వాక్చలనము (వాగ్భీతి) కలుగును.

**152.** పాపేధనేపాపనిరీక్షితేవాక్రూరాంశకేపాపయుతేవిశేషాత్ ।
తత్స్థానపేపాపనిరీక్షితేపివిషప్రయోగాత్తలువంచనాది ॥

ద్వితీయమున పాపగ్రహముండి, పాపదృష్టి యుండినా, ద్వితీయాధిపతి పాపునిచే చూడబడినా-విషప్రయోగమున వాక్కుపోవును.

**153.** విత్తాదిస్థానపవశాదేవంతేషాంఫలంవదేత్ ।
నాథాకారకభావానాంబలాబలవశాత్తథా ॥

ద్వితీయ స్థానాధిపతి వశమున ఈ రీతిగా, కుటుంబ, నేత్ర, ముఖ, ధన, ఆహార, వాక్కులఫలము చెప్పవలెను. తదధిపతి, కారకుడు, భావములయొక్క బలాబలములనుబట్టి ఫలము చెప్పవలెను.

**154.** సర్వేషాముపకారార్థంరహస్యార్థఃప్రకాశితః ।
ధనభావఫలాధ్యాయోప్యర్థితోప్పయసూనునా ॥

అందరికి ఉపకారమునకై ధన భావ ఫలాధ్యాయమను రహస్య విషయము అప్పయసూనుడైన వేంకటేశునిచే చెప్పబడినది.

ఇది సర్వార్థ చింతామణియను హోరాశాస్త్రమున, ధనభావము
తృతీయాధ్యాయము

# చతుర్థాధ్యాయము

1. నాశస్థితౌ సోదరనాథభౌమౌ పాపేక్షితౌ సోదరనాశమాహుః ।
పాపర్క్షగౌ పాపసమాగమౌ చేద్భ్రాతౄన్ సముత్పాద్య వినాశమాహుః ॥

తృతీయాధిపతి కుజుడు అష్టమ మందుండి, పాపగ్రహములచే చూడబడిన సోదరనాశనమగును. అట్లుగాకపోయినను, ఆ తృతీయాధిప కుజులు పాపరాశి గతులై పాపగ్రహములచే చూడబడిన సోదరులు పుట్టి నశింతురు.

2. నీచాస్తగౌ కారకభావనాథౌ నీచాంశగౌ పాపసమాగతౌ వా ।
క్రూరాదిషష్ట్యంశయుతౌ తదానీం భ్రాతౄన్ సముత్పాద్య వినాశ
మాహుః ॥

తృతీయాధిపతి కారకుడైన కుజుడును నీచయందున్న, అస్తంగతులైనా, నీచనవాంశగతులైనా, పాపగ్రహయుక్తులైనా, క్రూరాది షష్ట్యంశగతులైనా సోదరులు పుట్టి చనిపోవుదురు.

3. పాపగ్రహే సోదరభావయుక్తే స్వోచ్చేథవా పాపనిరీక్షితే వా ।
తదీశ్వరే పాపఖగాంతరస్థే సహోదరాణాం కథయంతి నాశం ॥

పాపగ్రహము సోదరభావమున ఉండి, అది దాని ఉచ్చయైనా, పాపునిచే చూడబడినా, తృతీయాధిపతి పాపగ్రహ మధ్యవర్తి (అటురాశిలోను, ఇటురాశిలోను పాపులుండుట) యైనా సోదరనాశము కల్గును.

4. పాపాంతరే పాపనిరీక్షితే వా పాపాన్వితే నీచగృహాన్వితే వా ।
తృతీయభావేశుభఖేచరేంద్రైరవీక్షితే సోదరనాశమాహుః ॥

తృతీయ భావాధిపతి పాపగ్రహ మధ్యనుండి, పాపగ్రహములచే చూడబడినా, పాపులతో కూడియున్నా, నీచస్థుడైనా, శుభగ్రహములచే తృతీయము చూడబడకున్న సోదరనాశముకల్గును.

5. భ్రాతృస్థానాధిపస్థాంశరాశీశే నాశరాశిగే ।
నీచారాతిగతే మూఢే త్వాహుస్సోదరనాశనం ॥

తృతీయాధిపతియున్న నవాంశ రాశ్యాధిపతి అష్టమ మందుండి, నీచ, శత్రు క్షేత్రవర్తిగాని, అస్తంగతుడుగానియైన సోదరనాశము కల్గును.

6. శనిమాందీసమాయుక్తే పాపఖేచరవీక్షితే ।
తదీశే నాశరాశిస్థే సోదరాణాం వినాశనం ॥

తృతీయమున శని మాందీ గ్రహములుండి, పాపగ్రహవీక్షితమై సోదరాధిపతి అష్టమస్థుడైన సోదరనాశమగును.

7. పాపాంతరేతదీశేతుకారకేతుతథావిధే ।
తాదృశేభావనాథేవాసోదరాణాంవినాశనం ॥

తృతీయ భావాధిపతి కారకుడైన కుజుడును పాపగ్రహ మధ్యవర్తులైన, తృతీయ భావాధిపతి పాపగ్రహ మధ్యవర్తియైన సోదరనాశము కల్గును. (అర్థము పునరుక్తమైనది).

8. పాపాఖిలక్షితేభావేభావేశేభావసంస్థితే ।
క్రూరషష్ట్యంశకేవాపిసోదరాణాంవినాశనం ॥

తృతీయ భావము పాపదృష్టమై, తృతీయాధిపతి తృతీయమందు క్రూర షష్ట్యంశలోనున్నా-సోదరనాశనము అగును.

9. భ్రాతృస్థానాధిపస్థాంశరాశిశోయన్నవాంశకే ।
తదీశేనాశరాశిస్థేసోదరాణాంవినాశనం ॥

భ్రాతృస్థానాధిపతిఉన్న నవాంశ రాశ్యధిపతిఉన్న నవాంశాధిపతి అష్టమ మందున్న సోదరనాశమగును.

10. సోత్థేశయుక్తత్రింశాంశనాథేయత్రనవాంశగే ।
తన్నాథేనీచమూఢారిభావేసోదరనాశనం ॥

తృతీయాధిపతియున్న త్రింశాంశాధిపతియున్న నవాంశాధిపతి నీచ, శత్రు క్షేత్ర, అస్తంగతుడుకాగా సోదరనాశము అగును.

11. భ్రాతృస్థానాధిపేదుస్థేకారకేవాతథావిధే ।
పాపేక్షితేపాపయుతేస్వోచ్చేవాసోదరక్షయః ॥

తృతీయాధిపతి 6, 8, 12 లందుండి, పాపగ్రహయుక్తుడై, పాపగ్రహ దృష్టుడైన, తన యుచ్చయందున్నను సోదరనాశమగును. కారకుడైన కుజుడట్లున్నను సోదరనాశము కల్గును.

12. అతిక్రూరసమాయుక్తేభావేవాకారకేపివా ।
తద్భావనాయకేవాపిబాల్యేసోదరనాశనం ॥

తృతీయ భావముకాని కారకుడుకాని తృతీయాధిపతికాని, అతి క్రూర గ్రహ యుక్తుడైన బాల్యముననే సోదరనాశ మగును.

13. యత్కించిత్క్రూరసంయోగేతన్నాశశ్చిరకాలతః ।
బలహీనవశాదేవంసోదరక్షయచింతనం ॥

సోదరభావ, కారక, భావాధిపతులగు కొద్ది క్రూరగ్రహ సంయోగమున్న

సోదరనాశము చిరకాలమున కగును. వారి బలహీనతనుబట్టి సోదరనాశమును చెప్పవలెను.

14. భ్రాతృస్థానేశుభయుతే శోభనగ్రహవీక్షితే ।
భావనాథేబలాఢ్యేతు భ్రాతృలాభముదీరయేత్ ॥

భ్రాతృస్థానము శుభయుక్తమై, శుభగ్రహముచే చూడబడుచుండగా, సోదరభావాధిపతి బలవంతుడైన సోదరలాభము (సోదరులుండుట, వారికి సుఖము, ధనము ఉండుట వగైరా) కల్గును.

15. భ్రాతృపేకారకేవాపి శుభయోగనిరీక్షితే ।
భావేవాబలసంపూర్ణే భ్రాతౄణాంవర్ధనంభవేత్ ॥

భ్రాతృభావ, భావాధిప, కారకులు శుభగ్రహయోగముగాని, దృష్టికాని కల్గియున్నను, భావము పూర్ణ బలసంపన్నమైన సోదరవృద్ధి కల్గును.

16. కేంద్రత్రికోణగేవాపి స్వోచ్చమిత్రస్వవర్గగే ।
నాథేవాకారకేవాపి భ్రాతృలాభముదీరయేత్ ॥

భ్రాతృభావాధిపతి, కారకులు స్వక్షేత్ర, ఉచ్చ, మిత్రక్షేత్ర, స్వవర్గములందున్నా, కేంద్రకోణ గతులైనా భ్రాతృలాభము కల్గును.

17. స్వోచ్చగృహాంశకేవాపి సౌమ్యానామంశగేయది ।
నాథేవాకారకేవాపిభవేత్సోదరవర్ధనం ॥

సోదరభావాధిప, కారకులు శుభరాశి, నవాంశలలోగాని, స్వ, ఉచ్చనవాంశలలోగాని ఉన్న సోదరవృద్ధి యగును.

18. సోత్థేశ్వరేగోపురభాగయుక్తే సింహాసనేకారకఖేచరేంద్రే ।
సౌమ్యగ్రహేతద్భువనాధిపేవా భ్రాత్రాదిలాభంకథయంతితజ్ఞాః ॥

సోదరాధిపుడు గోపురాంశగతుడై, కారకుడు సింహాసనాంశయందుండి, శుభగ్రహములైన భ్రాత్రాదిలాభము కలుగును.

19. పారావతాంశేయదికేంద్రరాశౌ భావేశ్వరేశోభనఖేటయుక్తే ।
సౌమ్యాంశకే సౌమ్యగృహేతదీశే సోత్థాదిబాహుళ్యముదాహరంతి ॥

తృతీయాధిపతి కేంద్రమందు పారావతాంశయందుండి, శుభగ్రహయుక్తుడై, శుభరాశి, నవాంశలందున్న యెడల సోదర బాహుళ్యము (ఎక్కువమంది సోదరులు) కలుగును.

20. భ్రాతృనాథేన్వతుంగాదివర్గే మూలత్రికోణగే ।
బలాఢ్యే భ్రాతృభావేవా సోదరోత్పత్తిమాదిశేత్ ॥

తృతీయాధిపతి స్వ, మూలత్రికోణ, ఉచ్చక్షేత్రమున, స్వవర్గములందున్నా, భ్రాతృభావము బలవత్తరమైనా సోదరవృద్ధి కలుగును.

21. వైశేషికాంశకేభావనాథేవాశుభవీక్షితే ।
మృద్వంశాదియుతేవాపిభ్రాతృవర్ధనమేవహి ॥

తృతీయాధిపతి వైశేషికాంశయందుండి, శుభగ్రహదృష్టి కల్గియున్నా, మృద్వంశాది షష్ట్యంశగతుడైనా-భ్రాతృవృద్ధి కలుగును.

22. ఐరావతాంశగేభావనాథేగుర్విందుభార్గవైః ।
దృష్టేయుతేబలాఢ్యేవాసోదరోత్పత్తిమాదిశేత్ ॥

తృతీయాధిపతి ఐరావతాంశయందుండి, గురు శుక్రులతో కూడినా, చూడబడినా, బలవంతుడైనా సోదరోత్పత్తి కలుగును.

23. లగ్ననాథస్యసోత్థేశోమిత్రంచేన్మైత్రతోభవేత్ ।
భ్రాతాశత్రుర్భవేచ్ఛత్రుశ్చేదేవంవినియుజ్యతే ॥

లగ్నాధిపతికి తృతీయాధిపతి మిత్రుడైన సోదరులతో మైత్రియు, శత్రువైన శత్రుత్వము నుండును.

24. అయుగ్మభాంశేయదికారకేశౌగుర్వర్కభూసూనునిరీక్షితౌచేత్ ।
ఓజేగ్రహేస్యాద్యదివిక్రమాఖ్యేపుంభ్రాతరస్తస్యవదంతితజ్జ్ఞాః ॥

తృతీయాధిపతి, కారకుడును ఓజ రాసులందు, ఓజరాశి నవాంశలందుండగా జాతకునకు పురుషసోదరు లుందురు.

25. యుగ్మాంశకేయుగ్మగృహేతదీశేభావేతథాకారకఖేచరేంద్రే ।
సహోదరీలాభమిహాహురార్యాఃనపుంసకాంశేకిలతత్తథైవ ॥

తృతీయాధిపతి, తృతీయము, కారకుడును, సరిరాశులందు, సరిరాశి నవాంశలందున్న-సోదరీలాభము (అక్కలు-చెల్లెళ్లు) ఉండును. శనిబుధులు నవాంశలైన నపుంసక సోదరు లుందురు.

26. భ్రాతృరాశ్యంశకవశాద్భ్రాతృసంఖ్యాంవినిర్దిశేత్ ।
నాథకారకసంయుక్తరాశ్యంశాద్వాతథావదేత్ ॥

తృతీయరాశి నవాంశవలనగాని, తృతీయాధిపతి, కారకుడుఉన్న నవాంశ వలనగాని భ్రాతృసంఖ్యను చెప్పవలెను.

27. భ్రాతృరాశిసమాయుక్తఖేచరస్థాంశపాద్వదేత్ ।
సోత్థేశయుక్తరాశ్యంశకారకాన్వితభాగతః ॥

తృతీయమందున్న గ్రహమున్న నవాంశాధిపతి వలనగాని, తృతీయాధిపతి, కారకులున్న నవాంశవలనగాని సోదరసంఖ్య చెప్పవలెను.

28. తయోస్సంయుక్తఖేటస్థరాశ్యంశాద్వాతథావదేత్ ।
ఏతయోరస్తమానాద్వాపాపయోగాద్వినాశనం ॥

తృతీయాధిపతి, కారకులతోకూడినగ్రహమున్న నవాంశలవలనగాని సోదర సంఖ్య చెప్పవలెను. భావాధిప కారకుల అస్తంగతత్వమువలనను, వారికి పాపగ్రహ సంబంధము వలనను సోదరనష్టము చెప్పవలెను. ఆ గ్రహముల బలాబలములను బట్టి సోదర సంఖ్యను బాగుగా ఆలోచించి చెప్పవలెను.

29. సింహాసనాంశకంప్రాప్తేత్వర్కేబలినివిక్రమః ।
కారకాద్విక్రమేశాద్వావిక్రమోస్తితినిర్దిశేత్ ॥

రవి బలవంతుడై - సింహాసనాంశను పొందియున్న -జాతకుడు పౌరుషము గలవాడగును. తృతీయాధిప, కారకులు బలవంతులైన, జాతకునకు వారి బలానుసారము విక్రమముండును.

30. శౌర్యాధిపేతుంగయుతేబలాఢ్యేకేంద్రేత్రికోణేపతిసౌమ్యదృష్టే ।
మూలత్రికోణేస్వగృహేష్టగేహేవైశేషికాంశేపురుషస్సధీరః ॥

తృతీయాధిపతి ఉచ్చస్థుడై, బలవంతుడై, కేంద్రకోణములందున్న, శుభగ్రహ సంబంధమున్న, స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, మూల త్రికోణములందున్న, వైశేషికాంశ యందున్న జాతకుడు ధైర్యవంతుడగును.

31. ధీరోభవేద్విక్రమరాశినాథేసౌమ్యగ్రహాంశేశుభఖేటయుక్తే ।
తద్దైవతత్కారకఖేచరేంద్రేసౌమ్యగ్రహాంశభవనేతుశౌర్యే ॥

తృతీయాధిపతి, కారకుడును, శుభగ్రహ యుక్తులై శుభగ్రహముల నవాంశ లందున్న, తృతీయము శుభరాశియైన ధైర్యముకలవా డగును.

32. ధైర్యాన్వితోవిక్రమరాశినాథసంయుక్తరాశ్యంశపతిర్యదంశే ।
తదంశనాథేస్వగృహాదివర్గేయుద్ధేవిదగ్ధఃకలహప్రవీణః ॥

తృతీయాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి స్వక్షేత్రాది శుభవర్గమందున్న ధైర్యశాలియు, యుద్ధమున నేర్పరి, సమర్థుడును అగును.

33. విక్రమాధిపతౌస్వోచ్చరాశిస్థేపాపసంయుతే ।
చరఖేచరరాశ్యంశేయుద్ధాత్పూర్వందృఢోభవేత్ ॥

తృతీయాధిపతి ఉచ్చయందుండి, పాపగ్రహముతోకూడి, చంద్రగ్రహరాశి నవాంశలయందున్న -యుద్ధమునకు పూర్వము దృఢ చిత్తుడగును.

34. స్థిరశేస్థిరరాశ్యంశేయుద్ధేపశ్చాద్దృఢోభవేత్ ।
క్రూరషష్ట్యంశకేవాపితదీశేనీచరాశిగే ॥

విక్రమాధిపతి నీచయందుండి, క్రూరషష్ట్యంశగతుడై, స్థిర రాశియందు, స్థిర రాశి నవాంశయందు ఉన్న యుద్ధము తర్వాతను దృఢచిత్తుడగును.

35. పాపయుక్తేథవాదృష్టేయుద్ధేమందోభవేన్నరః ।
యుద్ధేపరాజితస్స్యాచ్చేవిక్రమేశేవినాశభే ॥

తృతీయాధిపతి పాపగ్రహయుక్తుడైనా, పాపగ్రహ దృష్టుడైనా, యుద్ధమున మందుడగును. తృతీయాధిపుడు అష్టమమున ఉచ్చస్థుడైన యుద్ధమున ఓడిపోవును.

36. కారకేబలహీనేవాక్రూరషష్ట్యంశసంయుతే ।
తథావిధేతదీశేతుయుద్ధేమందోభవేన్నరః ॥

విక్రమ కారకుడు బలహీనుడై క్రూరషష్ట్యంశను పొందియుండి, విక్రమాధిపతియు అట్లేయున్న యుద్ధమున మందుడగును.

37. సింహాసనాంశేసతివిక్రమేశేపారావతేగోపురభాగయుక్తే ।
మృద్వంశకేవాశుభదృష్టియుక్తేమహోత్సవోయుద్ధవిశారదస్స్యాత్ ॥

తృతీయాధిపతి సింహాసన; పారావత, గోపురాంశలందుండి, మృద్వంశయందుండి, శుభగ్రహదృష్టి కలిగియున్న జాతకుడు మహోత్సాహముకలిగి యుద్ధవిశారదుడగును.

38. యుద్ధాభిలాషీనమరప్రవీణోవీర్యేశ్వరేసౌమ్యయుతేస్వతుంగే ।
వైశేషికాంశేబలపూర్ణయుక్తేమృద్వంశకేవావిపరీతమన్యత్ ॥

తృతీయాధిపతి శుభగ్రహయుక్తుడై, ఉచ్చస్థుడై, వైశేషికాంశయందు, మృద్వంశగతుడైయున్న, పూర్ణ బలుడైన యుద్ధకాంక్షకలవాడు, యుద్ధనిపుణుడునగును. ఇందుకు విపరీతముగానున్న విపరీతఫలము కలుగునని యూహింపవలెను.

39. శౌర్యాధిపేభానుయుతేత్రతభీరుశ్చంద్రాన్వితేమానసధైర్యజాతః ।
బాహ్యేజడోభౌమయుతేప్రకోపీసౌమ్యాన్వితేసాత్వికబుద్ధియుక్తః ॥

తృతీయాధిపతి రవితోకూడిన పిరికివాడును, చంద్రునితో కలిసిన మనోధైర్యము కలవాడును, కుజునితో కలిసిన పైకి జడుడును, లోపల కోపము కలవాడును, బుధునితో కలిసిన సాత్వికబుద్ధి కలవాడునగును.

40. జీవాన్వితేధీరతయాసమేతస్స్యాత్సర్వశాస్త్రార్థవిశారదశ్చ ।
కామాన్వితస్స్యాస్సుజితాన్వితేస్యాత్తన్మూలకోపాత్కలహప్రవీణః ॥

గురునితోకలిసిన-ధైర్యశాలి, సర్వశాస్త్ర ప్రవీణుడును, శుక్రునితో కలిసియున్న కామయుక్తుడు, తన్మూలకముగా కలహప్రియుడును అగును.

41. జితోభవేద్వానరనాథపుత్రయుతేఫణినామధిపేనయుక్తే ।
బహిర్భయోహృద్గతజాడ్యయుక్తేకేత్వన్వితోమాందియుతేతథైవ ॥

శనితోకూడిన బుధుడును, రాహుకేతు, మాంది యుక్తుడైన-పైకి ధైర్యము, లోపల మనోజాడ్యము కలవాడు నగును.

42. లగ్నేగురౌవిక్రమనాథయుక్తేచతుష్పదేభ్యఃప్రవదంతిభీతిం ।
గవాంభయంవాజలరాశిమగ్నే జలప్రమాదోభవతిధ్రువంతు ॥

విక్రమాధిపతి గురునితోకలిసి లగ్నమందున్న చతుష్పాత్తులైన పశువుల వలన భయమును, ఆ గురుడున్నలగ్నము జలరాశియైన గోవులవలన భయముకాని, జలభయముకాని కలుగును.

43. వీర్యాధిపేనాపిసమేతరాశినాథాన్వితేరాహుయుతేవిలగ్నే ।
సర్పాద్భయంవిక్రమరాశినాథేబుధేనయుక్తేగళరోగమత్ర ॥

తృతీయాధిపతియున్న రాశ్యధిపతి రాహువుతోకూడి లగ్నమందున్న సర్ప భయము కలుగును. బుధునితో కూడియున్న కంఠమున వ్యాధి కలుగును.

44. నీచేతృతీయేరిగృహేపిమూఢేపాపేక్షితేవాగళరోగమాహుః ।
విషప్రయోగాద్విషభక్షణాద్వాతేషామభావేత్రవినిశ్చితార్థః ॥

తృతీయమున నీచగతుడైన గ్రహమున్నా, షష్ఠమందు అస్తంగత గ్రహము వుండి పాపగ్రహముచే చూడబడినా కంఠవ్యాధి కలుగును. ఈ ఫలము కలుగనిచో, విషభక్షణవలనగాని, విషప్రయోగమువలన భయము తప్పక కలుగును.

45. శుక్రేబలాఢ్యేయదివాశశాంకేసౌమ్యేక్షితేశోభనఖేటయుక్తే ।
స్వోచ్చస్థితేస్వోచ్చకమిత్రవర్గేసుపాత్రభోక్తాసుఖభుక్తిభాక్స్యాత్ ॥

శుక్రుడుగాని, చంద్రుడుగాని బలవంతులై, శుభగ్రహయుక్తుడై శుభగ్రహ దృష్టి కలిగియున్న, స్వ, ఉచ్చ, మిత్రక్షేత్ర, వర్గగతుడై తృతీయ మందున్న జాతకుడు మంచి పాత్రయందు భుజించువాడు, సుఖభోజియు అగును.

46. పాపేతృతీయేగళరోగమత్రవదంతిమాంద్యాదియుతేవిశేషాత్ ।
భౌమాన్వితేప్రేతపురీశభాగేతృతీయరాశౌసతికర్ణరోగః ॥

తృతీయమున పాపగ్రహమున్నా, మాంద్యాది గ్రహములున్నా కంఠరోగము కలుగును. తృతీయమున కుజుడుండి, ప్రేతపురీశ భాగస్థుడైన కర్ణరోగము కలుగును.

47. రాహుణాఫణినాక్రాంతభేశేనాపియుతేసతి ।
సబుధేవిక్రమపతౌగళరోగంవదంతిహి ॥

తృతీయాధిపతి రాహుకేతువులున్న రాశ్యధిపతితోకూడి, బుధయుక్తుడైన కంఠరోగము కలుగును.

48. సోత్థేశనౌమాందియుతేతథైవవాతాద్భయంసౌమ్యదృశావిహీనే ।
తృతీయనాథస్థితరాశినాథసంయుక్తరాశేరధిపేచరంధ్రే ॥

తృతీయమున శనిగాని, మాందిగాని ఉండి, శుభగ్రహదృష్టి లేకున్న వాత వ్యాధివలన భయము కలుగును. తృతీయాధిపతిఉన్న రాశ్యధిపతిఉన్న రాశ్యధిపతి లగ్నమున కష్టమమునఉండి—

49. పాపాన్వితేపాపనిరీక్షితేవావదంతికర్ణోద్భవరోగమత్ర ।
క్రూరాదిషష్ఠ్యంశయుతేతదీశేకర్ణస్యరోగంకథయంతితజ్ఞాః ॥

పాపగ్రహముతో కూడినా, పాపగ్రహదృష్టియున్నా, తృతీయాధిపతి క్రూరాది షష్ఠ్యంశగతుడైనా కర్ణరోగము కలుగును.

50. సౌమ్యయుక్తేతృతీయేవాసౌమ్యఖేచరవీక్షితే ।
తదీశేశుభసంయుక్తేకర్ణయోర్భూషణంవదేత్ ॥

తృతీయరాశి శుభగ్రహ దృష్టమై, తృతీయాధిపతి శుభగ్రహ యుక్తుడైన కర్ణ భూషణములుండును.

51. భానోస్తుసంబంధయుతేతృతీయేతద్రక్తిమంనీలమయంహిమాందే ।
శుక్రేతృతీయేసతిమౌక్తికంస్యాజ్జీవేసువర్ణాభరణంవదంతి ॥

తృతీయము రవిక్షేత్రమైనా, తృతీయమున రవిఉన్నా కర్ణాభరణము ఎరుపు దనియు, శనిక్షేత్రమైనా, శనియున్నా నీలమనియు, శుక్రుడున్న ముత్యమనియు, గురుడున్న సువర్ణమయమనియు,

52. చంద్రేబహుత్వాభరణంహిసౌమ్యేశ్యామంభవేత్తత్తిసూనురౌశా ।
విచిత్రమార్గాభరణంతథైవపాపేక్షితేతల్లయమాహురార్యాః ॥

చంద్రుడున్న బహుమతిగా పొందబడిన ఆభరణమనియు, బుధుడున్న శ్యామ వర్ణమనియు, కుజుడున్న విచిత్రాభరణ మనియ, తృతీయమునకు, పాపగ్రహ దృష్టి యున్న కర్ణభూషణ నాశనమని చెప్పుదురు.

53. శుభగ్రహాణాంభవనేతుతస్మిన్ శుభాంశకేవాశ్రవణంతథానాం ।
పుణ్యాదికానాంయదిపాపరాశౌవక్తుంచతత్కర్మకఠోరమాహుః ॥

తృతీయ భావము శుభగ్రహరాశియైనా, శుభ నవాంశమైనా, జాతకుడు పుణ్య కథలు వినును. పాపక్షేత్రమైనా, పాప నవాంశమైనా కఠోరమైన మాటలను, శబ్దములను, పాపకరములను వినును.

ఇది సర్వార్థ చింతామణి తాత్పర్యమున
భ్రాతృభావము - చతుర్థాధ్యాయము.

# పంచమాధ్యాయము

1. బంధుభవనేతుబంధూన్ గృహమాతృజలాత్మవృద్ధిభోజ్యాదీన్
వాహనహృదయస్కంధాంసనశయ్యాసుఖజలానిచబ్రూయాత్ ।

చతుర్థ స్థానమునలన-బంధువులను, గృహ, మాతృ, జల, ఆత్మవృద్ధి, భోజ్యాదులను, వాహన, హృదయ, స్కంధ, ఆసన, శయ్య, సుఖ జలములను తెలియవలెను.

2. లగ్నేశ్వరేలగ్నగతేసుఖేస్తనాధేనయుక్తేయదిగేహలాభః ।
అయత్నతస్స్యాచ్ఛుభదృష్టియోగేస్వోచ్చేస్వ మిత్రస్వగృహే
బలాఢ్యే ॥

లగ్నేశ్వరుడు సప్తమాధిపతితో కలిసి లగ్నమునగాని, సప్తమమునగాని ఉన్న గృహలాభము కలుగును. స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రములందు లగ్నాధిపతి బలవంతుడైయున్న, శుభదృష్టియున్న అప్రయత్నముగా గృహలాభము కలుగును.

3. గేహాధిపేకేంద్రగతేబలాఢ్యేసౌమ్యేక్షితేమందిరలాభమాహుః ।
వైశేషికాంశేపరమోచ్చభాగేగేహేశ్వరేమందిరలాభమాహుః ॥

చతుర్థాధిపతి బలవంతుడై కేంద్రములందుండి, శుభగ్రహ దృష్టుడైన గృహ లాభము కలుగును. గృహాధిపతి పరమోచ్చ నవాంశయందు వైశేషికాంశ గతుడైన గృహలాభము కలుగును.

4. గృహస్థానాధిపస్థాంశనాథనంయుక్తరాశిపః ।
తదంశాధిపతౌకేంద్రేగృహలాభముదీరయేత్ ॥

గృహాధిపతియున్న నవాంశాధిపతి యున్న రాశ్యధిపతి ఉండు నవాంశ రాశ్యధిపతి కేంద్రమునఉన్న గృహలాభము కలుగును.

5. భాగ్యేశేకేంద్రభావస్థేగృహేశేస్వోచ్చమిత్రభే ।
గృహరాశిగతేఖేటేస్వోచ్చేబహువిచిత్రకం ॥

నవమాధిపతి కేంద్రమందుండి, గృహాధిపతి స్వ, ఉచ్చ, మిత్రక్షేత్ర గతుడైన, ఉచ్చస్థుడైన గ్రహము చతుర్థ మందున్న బహు విచిత్రమైన గృహము లభించును.

6. తృతీయేసౌమ్యనంయుక్తేగేహాధీశేబలాన్వితే ।
తదీశేబలసంపూర్ణేహర్మ్యప్రాకారమండితం ॥

తృతీయము శుభగ్రహయుక్తమై, చతుర్థాధిపతి బలవంతుడై, తృతీయాధిపతియు పూర్ణబలుడైన ప్రాకారమండితమైన మేడ ఉండును.

7. సింహాసనాంశకేవాపి గేహేశేగోపురాంశకే ।
మృద్వంశాదియుతేవాపితద్గృహంసౌధమండితం ॥

గృహాధిపతి సింహాసనాంశ, గోపురాంశ, మృద్వంశలలో ఉన్న, మేడ ఉండును.

8. పారావతాంశగే గేహనాథేగుర్విందువీక్షితే ।
గోపురాద్యంశకేవాపిదైవికంగృహమాదిశేత్ ॥

గృహాధిపతి పారావతాంశ, గోపురాంశలలో ఉండి, గురుశుక్రులచే చూడబడిన జాతకునకు దైవిక గృహము కలుగును.

9. విచిత్రసౌధప్రాకారమండితంగేహమాదిశేత్ ।
కర్మేశసహితేగేహనాథేకేంద్రేర్కజేపిచ ॥

చతుర్థాధిపతి దశమాధిపతితోకూడి, శనికేంద్రమందున్న విచిత్రమైన సౌధప్రాకారములుకల భవనముండును.

10. గేహాధిపోనాశగతోయదిస్యాత్పాపేక్షిత స్తద్గృహనాశమాత్రం ।
గేహేశసంయుక్తనవాంశనాథోనాశస్థితస్యాద్యదిగేహనాశం ॥

గృహాధిపతి అష్టమమందుండి పాపగ్రహముచే చూడబడిన జాతకుని గృహము నాశనమగును. గృహాధిపతిఉన్న నవాంశ రాశ్యధిపతి అష్టమమున ఉన్నను గృహ నాశనమగును.

11. బంధుస్థానాధిపేసౌమ్యగ్రహనిరీక్షితే ॥
తత్కారకేబలాఢ్యేవాబంధుపూజ్యోభవేన్నరః ॥

బంధు స్థానాధిపతి (చతుర్థాధిపతి) శుభగ్రహమై శుభగ్రహములచే చూడబడినా, కారకుడు బలవంతుడైనా బంధు పూజ్యుడు అగును.

12. బంధూపకర్తాతన్నాథేకేంద్రకోణాయసంస్థితే ।
వైశేషికాంశసంయుక్తేపాపదృగ్యోగవర్జితే ॥

చతుర్థాధిపతి కేంద్ర,కోణ, ఏకాదశములందుండి, వైశేషికాంశయందుండి, పాప సంబంధములేకున్న జాతకుడు బంధువుల కుపకారము చేయును.

13. బంధుస్థానగతేజీవేతన్నాథేగురుసంయుతే ।
గురుదృష్టియుతేవాపిబంధుశ్రేష్ఠోభవేన్నరః ॥

గురుడు చతుర్థమునఉన్నా, చతుర్థాధిపతి గురునితో కూడియున్నా, చూడబడినా, జాతకుడు బంధుశ్రేష్ఠుడగును.

14. బంధూనాముపకారీస్యాద్వంగురౌర్విందుసోమజాః ।
తేషాంగ్రహైర్యుతేదృష్టేమృద్వంశాదిసమన్వితే ॥

చతుర్థమున గురుచంద్రబుధులుండినా, వారిచే చూడబడినా, మృద్వంశాది యుక్తమైన జాతకుడు బంధువుల కుపకారము చేయును.

15. బంధుభిస్త్యక్తపురుషఃతదీశేపాపసంయుతే ।
క్రూరషష్ట్యంశగేవాపినీచారాతిగృహేపివా ॥

బంధు స్థానాధిపతి పాపగ్రహయుక్తుడైనా, నీచ, శత్రుక్షేత్రమందున్నా, జాతకుడు బంధువులచే విడువబడును.

16. బహుపాపసమాయుక్తేబంధునాథేతథైవచ ।
తత్కారకేతథైవాత్రబంధూనాంకుత్సితోభవేత్ ॥

చతుర్థాధిపతి అనేక పాపగ్రహయుక్తుడైనా, బంధుకారకుడు పాపగ్రహ యుక్తుడైనా బంధువులకు కుత్సితుడు, విడువబడినవాడు నగును.

17. నాథకారకసంయుక్తనవాంశేశశ్చసంయుతః ।
నీచారాతిగతేమూఢేబంధూనాంహేయకర్మకృత్ ॥

చతుర్థాధిప, కారకులున్న నవాంశ రాశ్యధిపతి నీచ, శత్రురాశి, అస్తంగతుడైన బంధువుల కసహ్యమైన పనులు చేయువాడగును.

18. బంధూపభోగేకేంద్రస్థేతదీశేశుభవీక్షితే ।
గోపురాంశగతేవాపిమృద్వంశాదిసమన్వితే ॥

చతుర్థాధిపతి కేంద్రమునందుండి, శుభగ్రహదృష్టి కలిగియున్నా, గోపురాంశయందున్నా, మృద్వంశాది గతుడైనా బంధువులలో భోగవంతుడగును.

19. ధనేలాభేత్రికోణస్థేతస్మాధేశుభవీక్షితే ।
సౌమ్యగ్రహాణామంశేవాబంధూనాముపకారకృత్ ॥

చతుర్ధాధిపతి 2, 11, 5, 9 లందుండి, శుభగ్రహదృష్టి కలవాడైనా, శుభ నవాంశయందున్నా బంధువుల కుపకారము చేయువాడగును.

20. బంధుద్వేషీభవేన్నిత్యంపాపాక్రాంతేగృహేసతి ।
నీచాస్తగతేటసంయుక్తపాపదృగ్యోగసంయుతే ॥

చతుర్థము పాపాక్రాంతమై, నీచ, అస్తంగత గ్రహయుక్తమై, పాపగ్రహదృష్టి కలదైన జాతకుడు బంధుద్వేషి యగును.

21. కస్మింశ్చిత్తేచకేంద్రేవాబంధౌస్వోచ్చస్వమిత్రభే ।
గురుణాదృష్టిసంపాతోబంధుపూజ్యోభవేన్నరః ॥

ఏ గ్రహమైనా స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రమైన చతుర్థమున ఉండి, గురునిచే చూడబడిన జాతకుడు బంధుపూజ్యుడగును.

22. గృహస్థానేచరేలగ్నే తదీశేచరరాశిగే ।
తథాతత్కారకేవాపిబహుస్థానేగ్రహంతదేత్ ॥

చతుర్థము చరరాశియై, చతుర్థాధిపతిగాని, కారకుడుగాని చరరాశియందున్న జాతకుడు చాలచోట్ల ఇళ్లు కట్టును.

23. స్థిరేగృహేస్థిరగృహంనాథకారకయోరపి ।
షష్ట్యంశశుభభాగేవాతదీశేస్థైర్యతాంవదేత్ ॥

చతుర్థము స్థిరరాశియై, గృహాధిపతి, కారకులు స్థిరరాశిగతులైనా, గృహాధిపతి శుభ షష్ట్యంశలో ఉన్నా జాతకుడు స్థిరమైన గృహము కల్గియుండును.

24. అర్థవ్యయగృహేశైస్తైర్యావంతఃపాపినోగ్రహాః ।
తావద్గృహవినాశస్స్యాచ్ఛుభదృష్టానదోషభాక్ ॥

2, 12, 4 అధిపతులతో ఎన్ని పాపగ్రహములు కూడియుండునో, అన్ని గృహములు నశించును. శుభగ్రహములచే చూడబడిన ఆ దోషముండదు.

25. అర్థవ్యయగృహేశాస్తుకేంద్రకోణాదిసంయుతాః ।
తావద్దేహాలయంసర్వంశోభనంతత్రనిర్దిశేత్ ॥

2,12,4 అధిపతులు కేంద్ర, కోణ, (1,4,7,10,5,9) స్వక్షేత్ర, ఉచ్చాదులందుండిన జాతకుని గృహ విషయమంతా శుభకరముగా నుండును.

26. గృహేశేకర్మరాశిస్థేకర్మేశేగృహమాస్థితే ।
బలయుక్తేధరాసూనౌబహుక్షేత్రంవినిర్దిశేత్ ॥

గృహాధిపతి దశమమున, దశమాధిపతి చతుర్థమున ఉండి, కుజుడు బలవంతుడైన జాతకుడు ఎక్కువభూమి కలవాడగును.

27. బలాఢ్యైకర్మరాశీశేబంధుస్థానాధిపేతథా ।
తయోర్మిత్రంయదాతస్యబహుక్షేత్రంవినిర్దిశేత్ ॥

దశమ చతుర్థాధిపతులు బలవంతులై, వారిద్దరు మిత్రులైన జాతకునకు భూమి యెక్కువగా ఉండును.

28. క్షేత్రస్థానేశుభయుతేతదీశేశుభసంయుతే ।
తత్కారకేతథాప్రాప్తేబహుక్షేత్రధనైర్యుతః ॥

చతుర్థము శుభగ్రహయుక్తమై, క్షేత్రాధిప క్షేత్రకారకులు శుభగ్రహ యుక్తులైన భూమి, ధనము ఎక్కువగా ఉండును.

29. క్షేత్రాధిపేతులాభస్థేగోపురాంశాదిసంయుతే ।
మృద్వంశాదిగతేవాపిబహుక్షేత్రసమన్వితః ॥

చతుర్థాధిపతి లాభమునఉండి, గోపురాంశాదియుతుడైనా, మృద్వంశాదిగతుడయినా భూమి ఎక్కువగా ఉండును.

30. భ్రాతృకారకసంయుక్తేభ్రాతృనాథేనవీక్షితే ।
క్షేత్రేతదీశ్వరేవాపిభ్రాతృక్షేత్రంవినిర్దిశేత్ ॥

చతుర్థముకాని, చతుర్థాధిపతిగాని భ్రాతృ కారకునిచేగాని, భ్రాతృ స్థానాధిపతిచేగాని కూడినా, చూడబడినా, జాతకుడు భ్రాతృక్షేత్రము కలిగియుండును.

31. క్షేత్రేశసంయుక్తనవాంశనాథేకర్మస్థితేకేంద్రసమన్వితేవా ।
భౌమాన్వితేభౌమదృశాసమేతేభ్రాతుర్ధనంక్షేత్రముదాహరంతి ॥

చతుర్థాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి దశమమున ఉండినా, కేంద్రమందుండి కుజునితోకూడినా, చూడబడినా, సోదరుని ధనము, క్షేత్రము కలవాడగును.

32. లగ్నేశ్వరేక్షేత్రగతేబలాఢ్యేలగ్నేబలిష్ఠేసతిగేహనాథే ।
శుభగ్రహైర్దృష్టిసమన్వితేవాక్షేత్రంస్వశక్తియేనబలేనయాతి ॥

లగ్నాధిపతి బలిష్ఠుడై చతుర్థమందుండి, చతుర్థాధిపతి బలవంతుడై లగ్నమున ఉండి శుభయుతి, దృష్టి కలిగియున్న జాతకుడు స్వశక్తిచే భూమి నార్జించును.

33. కళత్రకారకేక్షేత్రేతదీశేవాకళత్రభే ।
తదీశయోస్తథామైత్రేకళత్రాత్క్షేత్రమాదిశేత్ ॥

కళత్రకారకుడైన శుక్రుడు చతుర్థమందుండి, చతుర్థాధిపతి సప్తమ మందున్న, వారిద్దరికి మైత్రియున్న, భార్యద్వారా భూమి పొందును.

34. షష్ఠేశ్వరేక్షేత్రగతేబలాఢ్యేశత్రోన్నకాశాత్పధరాముపైతి ।
పారావతాంశేస్వగృహేబలాఢ్యేక్షేత్రేశ్వరేణాసినమాగతేవా ॥

షష్ఠాధిపతి బలవంతుడై చతుర్థమున ఉండిన-శత్రు, జ్ఞాతుల ద్వారా భూమి లభించును. షష్ఠాధిపతి బలవంతుడై స్వక్షేత్రమునఉండి పారావతాంశయందున్న, క్షేత్రాధిపతితోకూడినా-శత్రు-జ్ఞాతులద్వారా భూమి పొందును.

35. ఆరోహభాగేశుభదృష్టియుక్తే క్షేత్రస్యబాహుళ్యముదాహరంతి ।
ధనేశలాభేశసమన్వితేవాక్షేత్రేతదీశేప్యథకారకేవా ।
వైశేషికాంశేప్యథదృష్టియోగేప్యనేకభూసంగ్రహమాహురార్యాః ॥

చతుర్థాధిపతి చతుర్థమున ఆరోహభాగయందు, శుభగ్రహదృష్టి కలిగియున్న

ఎంతో భూమియుండును. చతుర్థముకాని, చతుర్థాధిపతికాని, కారకుడుకాని ధన లాభాధిపతులతోకూడినా, చూడబడినా ఎక్కువ భూమిని సంపాదించును.

ఆరోహ భాగయనగా-ప్రతిరాశిలోను 1-15 భాగ. 16-30 అవరోహభాగ. పరమనీచనుండి పరమోచ్చకు వెళ్లుట ఆరోహణము, అవి ఆరోహ భాగలు. ఉచ్చ నుండి నీచకు అవరోహణము.

36. క్షేత్రేశ్వరేనీచగతేథమూఢేపాపాంతరేపాపనిరీక్షితేవా ।
పాపాంతరక్షేత్రగతేరిగేహేక్షేత్రాదినాశంకథయంతితత్‌జ్ఞాః ॥

చతుర్థాధిపతి నీచస్థుడైనా, అస్తంగతుడైనా, పాపగ్రహ మధ్యవర్తియైనా, పాప గ్రహ దృష్టుడైనా, పాపగ్రహ మధ్యస్థరాశి సంచున్నా, శత్రుక్షేత్రవర్తియైనా- భూమి యుండదు.

37. పాపాంతరస్థేయదిభూమిరాశౌపాపాన్వితేపాపనిరీక్షితేవా ।
పాపగ్రహక్షేత్రగతేథవాస్యాత్ క్రూరాంశకేభూమివినాశమేతి ॥

చతుర్థము పాపమధ్యగతమైనా, పాపగ్రహ యుక్తమైనా, పాపదృష్టి కలదైనా, పాపక్షేత్రమై క్రూరాంశయుక్తమైన జాతకునకు భూమి యుండదు.

38. క్రూరాదిషష్ట్యంశయుతేతదీశేక్షేత్రేసపాపేయదినీచభేవా ।
దుస్థేరిగేహేత్వతిభీషణాంశేక్షేత్రాదినాశంకథయంతితత్‌జ్ఞాః ॥

చతుర్థాధిపతి చతుర్థమునఉండి, పాపగ్రహయుతుడై, క్రూరాది షష్ట్యంశగతుడై, నీచగతుడై,-6, 8, 12 అందున్న, శత్రుక్షేత్ర మందుండి, అతి భయంకర షష్ట్యంశ గతుడైన క్షేత్రనాశము కలుగును.

39. క్షేత్రేశ్వరేపాపయుతేధనస్థేనీచారిభేక్షేత్రవినాశమేతి ।
స్వోచ్చస్థితేతద్భవనేశ్వరేతుపాపాన్వితేవిక్రయమేతిభూమేః ॥

చతుర్థాధిపతి పాపయుక్తుడై, నీచ, శత్రుక్షేత్రవర్తియై, ధనమునఉన్న క్షేత్ర నాశము కలుగును. క్షేత్రాధిపతి ఉచ్చస్థుడై పాపగ్రహ యుక్తుడైన భూమి నమ్మి వేయును.

40. ఆజ్ఞాక్షయాత్ క్షేత్రవినాశమాహుఃఆజ్ఞేశ్వరేక్షేత్రగతేసపాపే ।
క్రూరాంశకేమృత్యుయమాదిభాగేకర్మేశ్వరేణాపియుతేతథైవ ॥

ఆజ్ఞాధిపతి = దశమాధిపతి పాపగ్రహయుక్తుడై, పాపగ్రహ నవాంశ యం దుండి, మృత్యుయమాది షష్ట్యంశగతుడై, చతుర్థమందున్న జాతకునకు భూమిపై అదుపుతప్పి, భూమిపోవును. చతుర్థాధిపతి దశమాధిపతితో కూడినను అంతే. తన భూమిని నిబంధనములతో ఇతరుల స్వాధీనముచేయుట ఆజ్ఞాక్షయము.

41. రాజ్యేశతత్కారకభూమినాథే క్రూరాంశకేవాత్యవరోహభాగే ।
నాశస్థితేమృత్యుయమాదిభాగేరాజాజ్ఞయానాశముపైతిభూమిః ॥

రాజ్యాధిపతి, కారక, చతుర్థాధిపతులు క్రూర నవాంశగతులై, భావమున అవరోహభాగ (ఉత్తరార్ధ) మున ఉండి, అష్టమమున మృత్యుయమాది షష్ట్యంశ యందున్న జాతకుని భూమి రాజాజ్ఞచే నశించును.

42. ధనేశసంయుక్తనవాంశనాథయుక్తాంశపేనాథయుతేనపాపే ।
జీవేనదృష్టేయదివాతదీశేమృద్వంశకేవాసుఖభాగ్యయుక్తః ॥

ధనాధిపతియున్న నవాంశాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి పాపగ్రహ యుక్తుడైన చతుర్థాధిపతి కూడియున్న రాజనిగ్రహమున భూనాశనమగును. చతుర్థాధి పతి గురు దృష్టుడై మృద్వంశ యందున్న జాతకుడు సుఖభాగ్యయుక్తుడగును.

43. రమ్యేగురౌశోభనఖేచరేవాసౌమ్యాంతరేతద్భవనేచసౌమ్యే ।
జీవోబలాఢ్యోయదిగేహనాథాత్సుఖీభవేత్సర్వజనేషుముఖ్యః ॥

చతుర్థమున గురుడుకాని, మరొక శుభగ్రహముకాని ఉండి, చతుర్థము శుభ గ్రహ మధ్యగతమైన, శుభగ్రహ క్షేత్రముగానియైన, గురుడు చతుర్థాధిపతికన్న బలిష్టుడైన జాతకుడు సుఖవంతుడై, సర్వజనులలో ముఖ్యుడగును.

44. గోపురాద్యంశకేవాపిసుఖేచేద్దేవపూజితః ।
ధనాయబుద్ధిదారేషుతస్మిన్ ఖేటేసుఖీభవేత్ ॥

చతుర్థమున గురుడుండి గోపురాద్యంశగతుడై, 2,11,5,7 లందు చతుర్థాధి పతియున్న జాతకుడు సుఖవంతుడగును.

45. సౌమ్యేతరాన్వితేసౌఖ్యేబలహీనేగురావపి ।
సపాపేదుర్బలేనాథేదుఃఖీస్యాద్ధనసంయుతః ॥

చతుర్థము పాపగ్రహయుక్తమై, గురుడు బలహీనుడై, చతుర్థాధిపతి పాపగ్రహ యుక్తుడై దుర్బలుడయిన ధనమున్నా దుఃఖవంతుడగును.

46. పుత్రార్థబంధుయుక్తశ్చేద్దుఃఖీస్యాన్నీచఖేచరః ।
సుఖేతదీశేపాపేనయుక్తేక్రూరాంశసంయుతే ॥

నీచగ్రహము 5,2,3 లందుండి, చతుర్థాధిపతి చతుర్థమున ఉండి, పాప గ్రహయుక్తుడై, క్రూరాంశయుక్తుడయిన దుఃఖముగలవాడగును.

47. రవ్యారయుక్తేసుఖరాశినాథేక్రూరాంశకేసౌమ్యదృశావిహీనే ।
ఆరోహభాగేతరభాగయుక్తేదేహార్తిభాగ్జాతనరస్తునిత్యం ॥

సుఖాధిపతి రవికుజయుక్తుడై, క్రూరనవాంశ యందుండి, శుభదృష్టిలేక, అవ రోహ భాగమందుండిన, ఎప్పుడును దేహబాధ కలవాడగును.

48. నీచారిశాత్రవభూమిపుత్రే సుఖస్థితే పాపదృశాప మేతే ।
క్రూరాంశకే తద్భవనాధినాథే దేహీ స్థితియుక్తే చరతి ప్రజాతః ॥
రవికుజులు చతుర్థస్థితులై, పాపదృష్టి కలిగి, నీచ, శత్రునవాంశగతులై, చతుర్థాధిపతి క్రూరనవాంశయందున్న దుఃఖము కలవాడగును.

49. పాపాన్వితే పాపనిరీక్షితే వా పాపాంతరే వా సుఖభే తదీశే ।
క్రూరాదిషష్ట్యంశసమన్వితే వా పాపీనరస్స్యాచ్ఛుభదృష్టియుక్తే ॥
చతుర్థము, తదధిపతియు పాపగ్రహయుతి, దృష్టి కలవై, పాపగ్రహ మధ్యనగాని, క్రూరాది షష్ట్యంశయందుగాని ఉన్న, శుభదృష్టియున్నను జాతకుడు పాపియగును.

50. అనేకపాపే సుఖరాశియుక్తే తదీశ్వరే చారివిమూఢయాతే ।
పాపాన్వితే వా యమసూనుయుక్తే జాతస్తు పాపత్వబహుత్వమేతి ॥
చతుర్థమున అనేక పాపగ్రహములుండి, చతుర్థాధిపతి శత్రుస్థాన, అస్తంగతుడుకాగా, పాపగ్రహముతోగాని, గుళికామాంది గ్రహములతోగాని కూడియున్న జాతకుడు బహు పాపియగును.

51. శుక్రేందువిద్దేవసుపూజితానాంక్షేత్రే సుఖీపూర్ణబలాన్వితానాం ।
శుభాన్వితే శోభనదృష్టిపాతే జాతోనరో యం బహుసౌఖ్యభాక్స్యాత్ ॥
చతుర్థము బలవంతులయిన శుక్ర, చంద్ర, బుధ, గురులస్థానమై, శుభగ్రహయుక్తమై శుభదృష్టి కలిగియున్న జాతకుడు సుఖవంతుడగును.

52. బుధదృష్టే సితే సౌఖ్యే సౌమ్యమధ్యగతేపి వా ।
గోపురాద్యంశకే వాపి పుణ్యభాక్స్యనరో భవేత్ ॥
చతుర్థమున శుక్రుడుండి బుధునిచే చూపబడినా, శుభగ్రహమధ్యగతుడై గోపురాంశయందున్న జాతకుడు పుణ్యాత్ముడగును.

53. నీచాన్వితే క్రూరయుతే సుఖస్థే నపత్నభే వా జలరాశినంజ్ఞే ।
తదీశ్వరే హీనబలే తదా నీం పతత్యసౌ కూపతటాంబురాశౌ ॥
నీచగ్రహము క్రూరగ్రహయుక్తుడై చతుర్థమునగాని, జలరాశియైన షష్ఠమునగాని ఉండగా, చతుర్థాధిపతి బలహీనుడైన–జాతకుడు–బావి, తటాకములలో పడును.

54. లగ్నేశ్వరే హీనబలే సుఖస్థే నీచేర్క్షయుక్తే యది వా సపాపే ।
జలగ్రహేణాపియుతే సుఖే శే బలేన హీనే జలరాశిమగ్నః ॥
లగ్నాధిపతి బలహీనుడై చతుర్థమందున్నా, పాపగ్రహముతో కూడి నీచరాశిలో

రవితోకూడియున్నా, చతుర్థాధిపతి బలహీనుడై జలగ్రహముతో కూడియున్న జాతకుడు జలరాశి (సముద్రమున)లో మునుగును.

**55.** సరిత్స్థానాధిపేలగ్ననాథేనసహితేసుఖే ।
కర్మాధిపేనసంద్రుష్టేనదీకూపతటాదిషు ॥

నదీస్థానా(7)ధిపతి లగ్నాధిపతితోకూడి చతుర్థమందుండి, చూడబడిన-జాతకుడు నదిలోనో, బావిలోనో, చెరువులోనో పడును.

**56.** పతనంకూపనద్యాదౌసుఖేశస్థాంశరాశిపే ।
సరిత్స్వామీశసంద్రుష్టేయదివాసుఖపేనహి ॥

చతుర్థాధిపతియున్న నవాంశరాశ్యధిపతి సప్తమ చతుర్థాధిపతుల యుతి, దృష్టికలిగియున్న-జాతకుడు బావిలోనో, నదిలోనో పడును.

**57.** శిలాప్రహారతస్తుస్యాద్రవిభౌమాన్వితేసుఖే ।
దృష్టేయుతేకర్మపేనసరిత్స్వానాధిపేశనౌ ॥

సప్తమాధిపుడు శనియై, చతుర్థము రవికుజులతో కూడియుండి, దశమాధిపతితోకూడినా, చూడబడినా-జాతకునకు రాతి దెబ్బలు కలుగును.

**58.** సుఖేశేరాహుమందాభ్యాంసహితేకుజవీక్షితే ।
శుభదృష్టివిహీనేచశిలాభిఃపీడితోనరః ॥

చతుర్థాధిపతి రాహుశనులతో కూడియుండి, కుజునిచే చూడబడి, శుభ గ్రహములచేచూడబడకున్న రాతి దెబ్బలచే పీడితుడగును.

**59.** కేంద్రస్థితేరాత్రికరేశ్భృగౌవాపాపాన్వితేపాపనిరీక్షితేవా ।
పాపేక్షితేపాపయుతేశశాంకేదివాకరేవాయదికేంద్రరాశౌ ॥

కేంద్రమున రవిచంద్రశుక్రులలో నొకరయినానుండి పాపగ్రహయుక్తుడైనా, దృష్టుడయినా, చంద్రుడు పాపదృష్టుడయిన జాతకుడు మాతృగామి యగును.

**60.** క్రూరేసుఖేవాయదిపాపదృష్టేజాతౌనరస్స్యాదిహమాతృగామీ ।
పాపేక్షితేవాసుఖభావనాథేపాపాన్వితేసౌమ్యదృశావిహీనే ॥

చతుర్థమున పాపగ్రహముండి, పాపగ్రహదృష్టమైన మాతృగామి యగును. సుఖాధిపతి పాపగ్రహయుక్తుడై, పాపదృష్టికలిగి, శుభదృష్టిలేకున్న మాతృగామి యగును.

**61.** దారేశ్వరాల్లగ్నపతౌవిహీనేజాతోనరోమాతృసమానగామీ ।
సహోదరీసంగమమాహురన్యదారేశ్వరేశుక్రయుతేసుఖస్థే ॥

సప్తమాధిపతికన్న లగ్నాధిపతి బలహీనుడయిన జాతకుడు మాతృసమాన స్త్రీగామి యగును. సప్తమాధిపతి శుక్రునితోకూడి చతుర్థ మందున్న -

62. పాపేక్షితేపాపసమాగతేవా క్రూరాదిషష్ట్యంశసమన్వితేవా ।
సుఖేశనౌపాపనిరీక్షితేవాపాపాన్వితేతాదృశపాపయుక్తః ॥

పాపగ్రహయుక్తుడై, పాపగ్రహముచే చూడబడినా, క్రూరాది షష్ట్యంశ యుక్తుడైన సహోదరీ సంగమముచేయును. చతుర్థమున శనియుండి, పాపగ్రహ యుక్తుడై, పాపదృష్టుడైన సహోదరిని పొందును.

63. పాపగ్రహాణాంభవనేసుఖేతుక్రూరాదిషష్ట్యంశయుతేతథైవ ।
షష్ఠేశభూనందనసంయుతేజ్జేసుఖస్థితేపాపనిరీక్షితేవా ॥

చతుర్థము పాపక్షేత్రమై, క్రూరాది షష్ట్యంశయుతమైన, సహోదరిని కలియును. చంద్రుడు షష్ఠాధిప కుజులతోకూడి, పాపగ్రహదృష్టుడై చతుర్థ మందున్న మాతృగామి యగును.

64. చంద్రాంశసంయుక్తనవాంశనాథేతథావిధేమాతరిదోషమాహుః ।
సుఖేశ్వరేరాహుయుతేనపాపేశనైశ్చరేణాపిదివాకరేణ ॥

చంద్రుడున్న నవాంశ రాశ్యధిపతి షష్ఠాధిప కుజులతోకూడి చతుర్థమందుండి పాపగ్రహదృష్టుడైన మాతృగామి యగును. సుఖాధిపతి రాహుయుక్తుడై పాపగ్రహ యుక్తుడయిన శనిచేగాని, రవిచేగాని చూడబడిన-తల్లికన్న ఇతరులైన స్త్రీలను పొందును.

65. మాతాన్యసక్తాసుఖరాశినాథసంయుక్తభాంశాధిపతౌతథైవ ।
పాపాన్వితేపాపనిరీక్షితేవామాంద్యాదిసంయుక్తనిరీక్షితేవా ॥

సుఖాధిపతియున్న నవాంశరాశ్యధిపతి పాపగ్రహయుక్తుడై, పాపదృష్టికలిగి యున్నా, మాంద్యాదులతోగూడియున్నా తల్లికన్న ఇతర స్త్రీలను పొందును.

66. సుఖేశ్వరేలగ్నగతేబలాఢ్యేగుర్విందుసౌమ్యాస్ఫుజితైస్తుదృష్టే ।
వైశేషికాంశేశుభదృష్టియోగేపతివ్రతాతస్యభవేత్సవిత్రీ ॥

చతుర్థాధిపతి బలవంతుడై లగ్నగతుడయి, గురు, చంద్ర, బుధ, శుక్రులచే చూడబడి, వైశేషికాంశయందు శుభదృష్టి కలిగియున్న జాతకునితల్లి పతివ్రత యగును.

67. తథావిధేశీతకరేసరాహౌకేతౌనవిత్రీయదినీచసక్తా ।
మందేనయుక్తాయదిశూద్రసక్తావైశ్యేనయుక్తాశశిసూనుయుక్తే ॥

చంద్రుడు లగ్నగతుడై రాహుయుక్తుడయినా, కేతుయుక్తుడయినా, జాతకుని తల్లి నీచపురుషసక్త యగును. శనియుక్తుడయిన శూద్రాసక్త యగును. బుధ యుక్తుడయిన వైశ్యాసక్త యగును.

68. రవ్యన్వితేక్షత్రియజాతిసక్తాదేవేజ్యయుక్తేద్విజపుంగవేన ।
భృగోస్సుతేనాపితథావిధేనవక్తుంఫలంతాదృశమత్రశక్యం ॥

చంద్రుడు రవియుక్తుడై లగ్నమందున్న క్షత్రియాసక్తయు, గురుయుక్తుడైన బ్రాహ్మణాసక్తయు, శుక్రయుక్తుడైన తప్పక బ్రాహ్మణాసక్త యగును.

69. షష్ఠేశ్వరేణసహితేసుఖరాశినాథేభాగ్యస్థితేజనకమన్యత్రవిటంకరోతి ।
భాగ్యాధిపేనసహితేయదిమాతృనాథేసౌఖ్యస్థితేజనకమన్యత్రవిటం
కరోతి ॥

చతుర్థాధిపతి షష్ఠాధిపతితోకూడి భాగ్యస్థానమునఉన్న జాతకుని తండ్రి విటు డగును. భాగ్యాధిపతితో కలిసి చతుర్థాధిపతి చతుర్థమందున్న తండ్రి విటు డగును.

70. లగ్నేశభాగ్యేశసుఖేశయుక్తేషష్ఠాధిపేస్యాత్పరజాతఏవ ।
తదంశనాథేనయుతేతదీశేపాపేక్షితస్స్యాత్పరజాతఏవ ॥

షష్ఠాధిపతి లగ్న, భాగ్య, సుఖాధిపతులతో కూడిన, జాతకుడు పరజాతుడు. షష్ఠాధిపతియున్న నవాంశరాశ్యధిపతితో చతుర్థాధిపతి కూడియుండి పాపదృష్టుడైన జాతకుడు పరజాతుడు.

71. పాపాంతరేమాతృగృహేతదీశేతత్కారకేవాఽశుభదృష్టియుక్తే ॥
లగ్నేశ్వరాద్ధీనబలేశుభేశేజాతస్తదానీంపరజాతఏవ॥

మాతృస్థానము పాపమధ్యగతమై మాతృస్థానాధిప, కారకులు పాపదృష్టులైన, నవమాధిపతి లగ్నాధిపునికన్న హీనబలుడయిన జాతకుడు పరజాతుడు.

72. నవీక్షితంచేద్గురుణావిలగ్నంనిశాకరోవాగురుణానదృష్టః ।
దివాకరేణాపియుతశ్శశాంకస్సపాపకేందౌరవిణాతథైవ ॥

లగ్నముకాని, చంద్రుడుకాని గురువుచే చూడబడనిచో పరజాతుడు. రవి చంద్రులు కలిసియుండి గురునిచే చూడబడనియెడల పరజాతుడు. చంద్రుడు రవితోను, కుజునితోగాని, శనితోగాని కూడియున్న పరజాతుడు.

73. పాపేశుభేమాతృగృహేసపాపేలగ్నేశ్వరేహీనబలేసపాపే ।
పరాంశకాదౌసుఖభేతదానీంజాతోనరస్స్యాత్పరజాతఏవ ॥

నవమమున పాపగ్రహముండి, మాతృస్థానమునను పాపగ్రహముండి, లగ్నాధి పతి పాపయుక్తుడై బలహీనుడయిన, చతుర్థము పరనవాంశాది వర్గమైన జాతకుడు పరజాతుడు.

74. మాతృస్థానేశుభయుతేకారకేశుభసంయుతే ।
తద్భావపేబలాఢ్యేవామాతురాయుష్యమాదిశేత్ ॥

మాతృస్థానము, కారకుడును శుభగ్రహముతో కూడియుండి, మాతృస్థానాధి పతి బలవంతుడయిన తల్లికి దీర్ఘాయువు కలుగును.

75. చంద్రేబలిష్ఠేయదివాభృగౌవాసౌమ్యేక్షితేశోభనభాగయుక్తే ।
చతుష్టయేమాతృగృహాచ్ఛుభాఢ్యేమాతుశ్చదీర్ఘాయురుదాహరంతి ॥

చంద్రుడుగాని శుక్రుడుగాని బలవంతుడై శుభగ్రహదృష్టుడై, శుభనవాంశగతుడై కేంద్రమందుండి, శుభాఢ్యముకాగా తల్లికి దీర్ఘాయువు కలుగును. శుభాఢ్యమనగా శుభగ్రహయుతి, దృష్టి, వర్గాదులను కలిగియుండుట.

76. భావేశసంయుక్తనవాంశనాథయుక్తాంశపేకేంద్రగతేబలాఢ్యే ।
తస్మిన్ శశాంకాద్యదికేంద్రరాశౌమాతుశ్చదీర్ఘాయురుదాహరంతి ॥

మాతృ స్థానాధిపతియున్న నవాంశరాశ్యధిపతి ఉన్న నవాంశరాశ్యధిపతి కేంద్రమందుండి బలవంతుడై చంద్రునకును కేంద్రమందున్న జాతకుని తల్లి దీర్ఘాయుష్మతి యగును.

77. పాపాంతరేపాపయుతేశశాంకేపాపేక్షితేమాతృవినాశమాహుః ।
పాపేక్షితశ్చేదచిరేణనాశంపాపగ్రహాణాంభవనేశనిస్థు ॥

చంద్రుడు పాపగ్రహ మధ్యగతుడైపాపయుక్తుడై పాపదృష్టుడైయున్న మాతృవినాశనము కలుగును. శని పాపగ్రహరాశియందుండి, పాపగ్రహముచే చూడబడిన తల్లి త్వరగా చనిపోవును.

78. పాపాన్వితేమాతృవినాశమేతిశుభేక్షితస్యాచ్చిరకాలమృత్యుః ।
ఉదాహరంత్యత్రమహానుభావాదైవజ్ఞవర్యాఇతినిశ్చయేన ॥

శని పాపగ్రహయుక్తుడైన జాతకుడు మాతృవినాశము పొందును. శని శుభగ్రహయుక్తుడయిన, శుభగ్రహేక్షితుడయినా తల్లికి చిరకాలమునకు మృత్యువు కలుగును.

79. మాతృస్థానాధిపస్థాంశరాశిశోయన్నవాంశకే ।
తదంశాధిపతిర్దుస్థోమాతృనాశనమేవహి ॥

మాతృస్థానాధిపతియున్న నవాంశ రాశ్యధిపతియున్న నవాంశ రాశ్యధిపతి లగ్నమునకు 6,8,12 లందున్న మాతృ నాశనము కలుగును.

80. చంద్రేవిమూఢేవిగ్రహేతినీచేనీచాంశకేమాతృవినాశమేతి ।
పాపాంతరేపాపదృశానమేతేశోకంతథైవప్రవదంతిసంతః ॥

చంద్రుడు అస్తంగతుడై పాపరాశియందుగాని, పరమ నీచమందుగాని, నీచాంశయందుగాని ఉన్న మాతృవినాశము కలుగును. చంద్రుడు పాపగ్రహ మధ్యవర్తియై పాపగ్రహదృష్టియున్న జాతకునకు మాతృనాశము కలుగును.

81. తత్స్థానపాద్వాశతయంత్యశేషంనిశాకరాత్పాపయుతేస్థితేవా ।
భృగోస్తథైవంజననీవినాశంవదంతితత్కాలవిదఃపురాణాః ॥

చతుర్థాధిపతినిబట్టియు, చంద్రునిబట్టియు, శుక్రునివలనను పాపగ్రహయుక్త, పాపక్షేత్రస్థితి కలుగగా మాతృవినాశము కలుగునని మహర్షులు చెప్పిరి.

82. తదంశనాథకిరణాన్మాతృనాశంవినిర్దిశేత్ ।
నాథకారకరాశీనాంమధ్యేయోబలవాన్భవేత్ ॥

మాతృస్థానాధిపతియుండు నవాంశ రాశ్యధిపతి కిరణమువలన మాతృనాశన కాలమును నిర్ణయించవలెను. మాతృభావ, అధిపతి, కారకులలో బలవత్తరమేదో—

83. యావానంశస్తదంశాత్స్యాన్మేషాదౌతత్రమృత్యుదః ।
వక్రేతద్విగుణంప్రోక్తంత్రిగుణంత్వతివక్రగే ॥

అదియున్న నవాంశసంఖ్యకు తుల్యమైన సంవత్సరమున, ఆ సంఖ్యగల మేషాదిరాశియందు మాతృమారకుడగును. ఆ నవాంశాధిపతి వక్రించియున్న తల్లి ఆయుర్దాయకాలమును రెట్టించవలెను. అతి వక్రగతుడయిన మూడురెట్లు చేయవలెను.

84. త్రిగుణంస్వర్క్షగేస్వాంశేవర్గోత్తమగతేథవా ।
చతుర్గుణంశుభైర్దృష్టేకాలమేవంవినిర్దిశేత్ ॥

ఆ నవాంశరాశ్యధిపతి స్వక్షేత్రమందున్నా, స్వాంశమందున్నా, వర్గోత్తమాంశయందున్నా, త్రిగుణీకృతము చేయవలెను. వక్రగతుడై శుభగ్రహదృష్టియున్న చతుర్గుణము చేయవలెను. ఇట్లు ఆయుర్దాయము నూహింపవలెను.

85. హృదయేపాపసంయుక్తేపాపదృష్టేతదీశ్వరే ।
పాపాంతరేవాహృదయేహృత్కాపట్యంవినిర్దిశేత్ ॥

హృదయ (చతుర్థ) స్థానము పాపయుక్తమై పాపగ్రహమధ్యగతమైన, హృదయాధిపతి పాపగ్రహములచే చూడబడిన కపట స్వభావుడగును.

86. శన్యారరాహుసంయుక్తేహృదయేశుభవర్జితే ।
పాపేకర్మేశ్వరేసౌఖ్యేకపటీపాపవీక్షితే ॥

చతుర్థమున శుభగ్రహములు లేక, శనికుజరాహువులున్న, దశమాధిపతియు పాపుడై చతుర్థమునఉండి, పాపవీక్షితుడయిన హృదయము కపటమగును.

87. తత్రైవతద్భావనాథేమందమాంద్యగుసంయుతే ।
పాపైర్నిరీక్షితయుతేహృత్కాపట్యంవినిర్దిశేత్ ॥

చతుర్థాధిపతి శని, మాంది, రాహువులతో కూడియుండి, పాపగ్రహములచే చూడబడినను, కూడినను, మనఃకాపట్య ముండును.

88. సపాపేరంధ్రపేసౌఖ్యేకపటీపాపవీక్షితే ।
శుభదృష్టివిహీనేచసౌఖ్యేపాపసమన్వితే ॥

అష్టమాధిపతి పాపగ్రహయుక్తుడై, పాపదృష్టుడై చతుర్థమున ఉన్నా, చతుర్థము పాపయుక్తమై శుభదృష్టి లేకున్నా కపటియగును.

89. భానునాక్షీణచంద్రేణసహితేహృదయేతతః ।
కపటీక్షణమాత్రంతునిష్కాపట్యంతదూర్ధ్వతః ॥

చతుర్థము క్షీణచంద్రరవులతో కూడియుండిన, క్షణము కపటము, క్షణము నిష్కాపటత్వమును కలిగియుండును.

90. హృదయేశుభసంయుక్తేస్వోచ్చమిత్రగ్రహాన్వితే ।
శుభగ్రహాణాంక్షేత్రేవానిష్కాపట్యంవినిర్దిశేత్ ॥

స్వక్షేత్రము, మిత్రరాశియైన చతుర్థమున శుభగ్రహమున్నా - అది శుభగ్రహ క్షేత్రమైనా నిష్కాపట్యము కలుగును.

91. విశుద్ధహృదయోజాతోహృదయేశేబలాన్వితే ।
గోపురాద్యంశకేవాపిమిత్రస్వాంశగతేపివా ।

చతుర్థాధిపతి బలవంతుడై గోపురాద్యంశయందున్నా, స్వాంశ, మిత్రాంశలందున్నా పరిశుద్ధ హృదయుడగును.

92. లగ్నేశ్వరేహృద్గతేవాశుభయుక్తేక్షితేపివా ।
పారావతాదిభాగస్థేనిష్కాపట్యంవినిర్దిశేత్ ॥

లగ్నాధిపతి హృదయ స్థానమునఉండి, శుభగ్రహయుక్త, దృష్టుడయిన, పారావతాంశ యందున్న జాతకుడు కపటములేని వాడగును.

93. లగ్నేగురౌదానవపూజితేనయుక్తేతదాతస్యవిశుద్ధచిత్తం ।
సుఖేశుభేతద్భవనాధినాథేశుభాన్వితేతస్యవిశుద్ధచిత్తం ॥

లగ్నమున గురుడుండి, శుక్రునితో కూడియుండినా, చతుర్థమున శుభగ్రహముండి, చతుర్థాధిపతి శుభయుక్తుడయినా పరిశుద్ధమైన మనస్సు కలవాడగును.

94. రాహౌసుఖేపాపదృశాసమేతేబహిర్విశుద్ధస్త్వితిత్రభాతి ।
అంతర్గతంతత్కపటంవదంతిపాపగ్రహైశ్చేచ్ఛుభరాశిసంస్థైః ॥

రాహువు పాపగ్రహదృష్టికలిగి చతుర్థమందున్న జాతకుడు పైకి నిర్మల హృదయమున్నట్లు కనిపించినా, లోపల కపటము కల్గియుండును. శుభ రాశులందున్న పాపగ్రహములతో చతుర్థము కూడినను పైకి పరిశుద్ధుడు, లోపల కపటము నుండును.

95. యదాలగ్నసుఖేశౌవామిత్రభూతౌపరస్పరం ।
శుభేక్షితౌశుభైర్యుక్తౌమాతృస్నేహంవినిర్దిశేత్ ॥

లగ్న చతుర్థాధిపతులు పరస్పరము మిత్రులైన, శుభగ్రహయుక్తులైనా, శుభ దృష్టులైనా మాతృస్నేహముండును.

96. లగ్నేశ్వరేణసందృష్టేమాతృనాథేచతుష్టయే ।
శుభగ్రహాన్వితేదృష్టేమాతృస్నేహంవినిర్దిశేత్ ॥
చతుర్థనాధుడు కేంద్రమందుండి, శుభగ్రహదృష్టుడై, శుభయుక్తుడైయున్న లగ్నాధిపతిచే చూడబడిన మాతృస్నేహము కలిగియుండును.

97. బుధశ్చేన్మాతృనాథస్స్యాల్లగ్నభావాధిపోయది ।
పాపేక్షితేపాపయుతేతచ్ఛత్రుత్వంవినిర్దిశేత్ ॥
లగ్న మాతృస్థానాధిపతియైన (మిథునలగ్నమునకే సంభవించును) బుధుడు పాపగ్రహయుక్తుడై పాపగ్రహదృష్టి కలిగియున్న మాతృశత్రుత్వము కలుగును.

98. వాహనేశేబలయుతేవాహనేబలసంయుతే ।
శుభగ్రహేణసందృష్టేవాహనాదిఫలంవదేత్ ॥
చతుర్థాధిపతి బలవంతుడై చతుర్థమును బలముకలిగినదై, శుభగ్రహముచే చూడబడిన వాహనప్రాప్తి కలుగును.

99. సుగంధవస్త్రాభరణాదియానంశుక్రాద్వదేద్వాసుఖరాశితోవా ।
సేందౌచతుర్థాధిపతౌవిలగ్నేలగ్నేశ్వరేణాపియుతేశ్వలాభః ॥
శుక్రునివలనగాని, చతుర్థ భావమువలనగాని సుగంధ, వస్త్ర, ఆభరణ, పుష్పాదికమును వాహనమును చెప్పవలెను. చతుర్థాధిపతి చంద్రయుక్తుడై, లగ్నాధిపతితో కూడి, లగ్నమందున్న అశ్వవాహనప్రాప్తి కలుగును.

100. శుక్రేణయుక్తేయదివాహనేశేదేహాన్వితేవానరవాహనాది ।
దేవేంద్రపూజ్యేనయుతేవిలగ్నేవదంతిసంతశ్చతురంతయానం ॥
వాహనాధిపతి (చతుర్థాధిపతి) శుక్రునితోకూడి లగ్నమందున్న నరవాహనము కలుగును. చతుర్థాధిపతి గురునితోకలిసి లగ్నమందున్న పల్లకి ఉండును. (చతురంతయానము=పల్లకి)

101. చంద్రామరేజ్యామరశత్రుపూజ్యైర్యుక్తేతనౌవాయదివాహనేశే ।
ప్రోక్తంత్రయంవాహనమాహురార్యాఃనీచారిమూఢాదివిహీనఖేటైః ॥
లగ్నముకాని, వాహనాధిపతికాని నీచ, మౌఢ్యాదులులేని గ్రహములైన చంద్ర, గురు, శుక్రులతో కూడిన వాహన త్రయము కలుగును.

102. భాగ్యస్థితేవాహనరాశినాథేవశుక్రకణేవేసుఖరాశియుక్తే ।
భాగ్యాధికోణచతుష్టయేవాహ్యానేకదేశాభరణార్థయానం ॥

చతుర్థాధిపతి భాగ్యమునఉండి, శుక్రునితోకలిసి గురుడు చతుర్థమందుండగా, భాగ్యాధిపతి కేంద్రకోణములందున్న అనేక దేశీయములైన ఆభరణములు, పదార్థములు, వాహనములు కలుగును.

103. భాగ్యాధిపేనసహితేనతివాహనేశేజీవేక్షితేతనుగతేఖలపూర్తియుత్తే।
స్వర్క్షేస్వతుంగసహితేయదివాత్రికోణేభూనాథమాననదనాద్ధన వాహనాది ॥

చతుర్థాధిపతి భాగ్యాధిపతితోకలిసి పూర్ణబలముకలిగి, గురుదృష్టుడై, లగ్నమందున్నా, స్వక్షేత్ర, ఉచ్చ, త్రికోణములందున్నా, రాజసన్మానము, రాజాశ్రయమువలన జాతకునకు ధన వాహనాది భాగ్యము కలుగును.

104. భాగేశలగ్నేశచతుర్థనాథామూఢాదిహీనాశ్చహికర్మసంస్థాః।
కర్మేశ్వరేణాపియుతేవిలగ్నేసింహాసనప్రాప్తిముదాహరంతి ॥

భాగ్య, లగ్న, చతుర్థాధిపతులు మౌఢ్యాదులు లేక, దశమమందుండి, దశమాధిపతి జన్మలగ్నమునఉన్న-జాతకునకు రాజ్యాధికారముకల సింహాసనము ప్రాప్తించును.

105. భాగ్యేశ్వరేణాపియుతేసుఖేశేయత్రస్థితేపశ్యతివాసుఖర్క్షం।
వైశేషికాంశేయదివాబలాఢ్యేసర్వార్థభాగ్యాన్వితవాహనస్స్యాత్ ॥

చతుర్థాధిపతి భాగ్యాధిపతితోకలిసి చతుర్థమందున్నా, చతుర్థమును చూచుచున్నా, వైశేషికాంశగతుడై బలవంతుడైన జాతకునకు సర్వ పదార్థయుక్తమైన వాహనముండును.

106. దుఃస్థేతిమూఢేనతివాహనేశేభాగ్యేశ్వరేణాపినమీక్షితేవా।
దుర్వాహనంచంచలవాహనంవాసౌఖ్యాధిపేశోభనఖేతరేంద్రే॥

చతుర్థాధిపతి శుభగ్రహమై, 6,8,12 లందుండినా, అస్తంగతమైనా, భాగ్యాధిపతిచే చూడబడినా, జాతకునకు దుర్వాహనముకాని, చంచల వాహనముకాని ఉండును.

107. సేనాబహుత్వంసముపైతిజాతోహ్యనేకదేశాభరణార్థయానం।
భాగ్నేశ్వరాల్లాభగతేవిలగ్ననాథేసుఖేశేయదిభాగ్యరాశౌ ॥

లగ్నాధిపతి భాగ్యాధిపతికి లాభమందుండి, చతుర్థాధిపతి నవమమందున్న, జాతకుడు పెద్దసేన, అనేక దేశాభరణ పదార్థములు వాహనములు కలవాడగును.

108. సుఖాయభాగ్యేతనునాయకేవాఅసంఖ్యయానాదియుతఃప్రసిద్ధః।
సుఖేశ్వరేకేంద్రగతేతదీశేలాభాన్వితేవాబహువాహనాఢ్యః ॥

లగ్నాధిపతి 4,11,9 లందున్న అసంఖ్యాక వాహనములుండును. సుఖాధిపతి కేంద్రమందున్న, కేంద్రాధిపతి లాభమందున్న బహు వాహనములు కలవాడగును.

109. కర్మేశ్వరేలగ్నగతేతదీశేకర్మస్థితేవాబహువాహనాఢ్యః ।
సుఖేశ్వరేకర్మయుతేశుభస్థైశ్శస్త్రాశ్వకోశాధిపతిర్భవేద్ధి॥

దశమాధిపతి లగ్నగతుడై, లగ్నాధిపతి కర్మగతుడైన బహు వాహనము లుండును. సుఖాధిపతి దశమమందున్న, రెంటికన్న ఎక్కువ గ్రహములు నవమ మందున్న జాతకుడు శస్త్ర, అశ్వ, కోశాధిపతియగును.

110. క్షేత్రేశ్వరేలాభగతేబలాఢ్యేబంధుస్థితేవాక్షితిసూనుయుక్తే ।
భూసూనురాశౌయదివాసుఖేశేరాజ్యార్థసౌఖ్యాభరణార్థయానం ॥

క్షేత్రాధిపతి బలవంతుడై లాభమందున్నా, కుజునితోకలిసి చతుర్థమం దున్నా, లేదా కుజరాశులందు చతుర్థాధిపతి ఉన్నా, రాజ్య, ధన, సౌఖ్య, ఆభరణ, పదార్థ వాహనములు కలుగును.

111. సౌఖ్యేవిలగ్నేబలసంప్రయుక్తేధర్మాన్వితేశోభనఖేచరేంద్రే ।
స్వోచ్చస్థితేవిత్తపతౌచకేంద్రేసింహాసనప్రాప్తిముదాహరంతి ॥

చతుర్థాధిపతి చతుర్థమునగాని లగ్నమునగాని బలవంతుడై యుండగా, భాగ్య మున శుభగ్రహము ఉచ్చస్థుడై యుండగా, ద్వితీయాధిపతి కేంద్రమందున్న జాత కుడు సింహాసనము నెక్కును.

112. కేంద్రేశుభాఃపాపఖగాస్త్రిషష్ఠలాభస్థితాస్సత్వరమాహురార్యాః ।
లగ్నేశేవ్యయరాశిస్థేస్వదేశాదన్యదేశగః ॥

కేంద్రమున శుభగ్రహములు, 3,6,11 లందు పాపగ్రహములు ఉండెనేని జాతకునకు మంచి పదవి లభించును. లగ్నాధిపతి వ్యయమునఉన్న జాతకుడు స్వదేశమువిడిచి, పరదేశమున ఉండును.

113. అష్టమస్థేగృహేశేతున్వయంనంపాదయేద్గృహం ।
గృహేశేధనభావస్థేకర్మేశేధననంయుతే।
వాహనేశేస్వోచ్చరాశౌవాహనాధిపతిర్భవేత్ ॥

చతుర్థాధిపతి అష్టమమందున్న జాతకుడు స్వార్జితమైన గృహమున ఉండును. చతుర్థాధిపతి ఉచ్చస్థుడై కర్మాధిపతితోకూడి ధనస్థానమునఉన్న జాతకుడు వాహనాధి పతియగును.

114. వాహనస్థేలాభనాథేకర్మనాథేనవీక్షితే ।
లగ్ననాథేనవాదృష్టేవాహనాధిపతిర్భవేత్ ॥

లాభాధిపతి చతుర్థమునఉండి దశమాధిపతిచేగాని, లగ్నాధిపతిచేగాని చూడబడినను వాహనములు కలవాడగును.

115. లగ్నవాహనభాగ్యేశాఅన్యోన్యం కేంద్రమాశ్రితాః।
లగ్నాధిపేబలాఢ్యేవావాహనాధిపతిర్భవేత్ ॥

లగ్న, చతుర్థ, నవమాధిపతులు అన్యోన్యము కేంద్రములందుండి లగ్నాధిపతి బలవంతుడయిన వాహనాధిపతి యగును.

116. గోపురాద్యంశకేవాపివాహనేశేబలాన్వితే ।
లాభకర్మశుభాధీశైర్దృష్టేవాహనసంయుతః ॥

చతుర్థాధిపతి బలవంతుడై, గోపురాద్యంశయందుండి, 9,10,11 అధిపతులచే చూడబడినను వాహనాధిపతి యగును.

117. పరమోచ్చాంశకాదిస్థేభాగ్యేశేకేంద్రమాశ్రితే ।
గ్రహద్వయేతుంగయుతేబహువాహనదేశభాక్ ॥

భాగ్యాధిపతి పరమోచ్చాంశయందుండి కేంద్రగతుడై, మరి, రెండు గ్రహము లుచ్చయందున్న బహువాహన, దేశములు కలవాడగును.

118. ధనాధిపేనసంయుక్తేవ్యయేశేస్వోచ్చరాశిగే ।
భాగ్యాధిపేనసందృష్టేవాహనాధిపతిర్భవేత్ ॥

వ్యయాధిపతి ధనాధిపతితోకూడి ఉచ్చస్థుడై భాగ్యాధిపతితో చూడబడిన-వాహనాధిపతి యగును.

119. కర్మాధిపేచతుర్థస్థేలాభనాథేనసంయుతే ।
భాగ్యనాథేనవాయుక్తేబహువాహనదేశభాక్ ॥

దశమాధిపతి చతుర్థమందుండి, లాభాధిపునితోకూడినా బహువాహనదేశములు కలవాడగును.

120. ఉచ్చగ్రహేకర్మగతేలగ్ననాథేనవీక్షితే ।
భాగ్యాధిపేనవాదృష్టేవాహనాధిపతిర్భవేత్ ॥

కర్మస్థాన (10)మున ఉచ్చగ్రహముండి, లగ్నాధిపతిచేగాని, భాగ్యాధిపతిచేగాని చూడబడిన జాతకుడు వాహనాధిపతి అగును.

121. సింహాసనాంశకయుతౌకర్మవాహనరాశిపౌ ।
లగ్నేశ్వరేణసందృష్టౌబహువాహనదేశభాక్ ॥

10,4 అధిపతులు సింహాసనాంశగతులై, లగ్నాధిపతిచే చూడబడిన బహువాహన దేశములు కలవాడగును.

**122.** వావాహనార్థతృతీయేషుభాగ్యకర్మగృహాధిపాః ।
స్థితాబలార్థయానాదినంయుతో నిధనే శుభే ॥

4,9,10ల అధిపతులు 2,3,4 భావములందుండి, అష్టమమున శుభగ్రహమున్న బల, ధన, వాహనములు కలవాడగును.

**123.** స్వోచ్చేసుఖేశేతన్నాథే కేంద్రకోణసమన్వితే ।
వాహనేతుంగనంయుక్తేవ్యయేశుద్ధేత్రియానయుక్ ॥

చతుర్థాధిపతి ఉచ్చస్థుడై అతడున్న రాశ్యధిపతి కేంద్రకోణములందుండి, చతుర్థమున ఉచ్చస్థ గ్రహమున్న మూడు వాహనములుండును.

**124.** పరమోచ్చాంశగే శుక్రే కర్మేశే గృహనంయుతే ।
నంఖవేత్తాద్వ్యశేయోగేవాద్యఘోషాదిభిర్యుతః ॥

శుక్రుడు పరమోచ్చాంశయందుండి, దశమాధిపతి చతుర్థమునఉన్న జాతకుడు వాద్యఘోషములు కలవాడగును.

**125.** శంఖవాదిత్రవాద్యైశ్చనంయుతో భాగ్యపేసుఖే ।
కేంద్రేశే కోణగేవాపికర్మేశేవాహనాన్వితే ॥

నవమాధిపతి చతుర్థమందుండి, కేంద్రాధిపతి కోణమందైనా, దశమాధిపతి చతుర్థమందైనాఉన్న జాతకుడు శంఖాది చతుర్విధ వాద్యయుక్తుడగును.

**126.** శశివానంయుతేకర్మనాథే కేంద్రేశుభాన్వితే ।
లగ్నేశేవృత్తిభంయాతేపణవాదిరవైర్యుతః ॥

దశమాధిపతి చంద్రునితోకూడి కేంద్రమందు శుభగ్రహయుక్తుడుకాగా, లగ్నాధిపతి దశమమునఉన్న పణవాది వాద్యములుండుడు.

**127.** కర్మభాగ్యవిలగ్నేషుస్వోచ్చేపాపగ్రహాస్థితాః ।
దృష్టాయద్వాలగ్నపేనయానాంతేదుఃఖమాప్నుయాత్ ॥

1,9,10 లందు ఉచ్చస్థులైన పాపగ్రహములుండి, లగ్నాధిపతిచే చూడబడిన జాతకుడు వాహనాంతమున దుఃఖము పొందును.

**128.** కామషట్సోదరసుఖభాగ్యలగ్నవ్యయేశ్వరాః ।
సుతాధిపేనసహితాస్త్వసంఖ్యంఘోషదేశభాక్ ॥

7,6,3,4,9,1,12 అధిపతులు పంచమాధిపతితో కూడిన లెక్కలేని ఘోష, దేశములుండును. ఘోషమనగా వాద్య శబ్దము.

**129.** సుఖేశుభయుతేనాథే కేంద్రకోణోచ్చనంయుతే ।
భాగ్యేశేపరమోచ్చాంశేసుఖతూర్యాదిలాభభాక్ ॥

చతుర్థమున శుభగ్రహముండి, చతుర్థాధిపతి కేంద్ర, కోణ, ఉచ్చస్థానస్థితుడై, భాగ్యాధిపతి పరమోచ్చాంశయందున్న జాతకుడు సుఖ, వాద్యాదిలాభము కలవాడగును.

130. మానేశేసుఖరాశిస్థేలాభేశేసుఖసంయుతే ।
లగ్నేశుభేనసందృష్టేబహుతూర్యాదిలాభభాక్ ॥

దశమాధిపతి చతుర్థమందుండి, లాభాధిపతితో కూడియున్న లగ్నము శుభ గ్రహదృష్టమైన బహు వాద్యాదిలాభము కలవాడగును.

131. మృదంగభేరీశంఖాద్యైఃకాహళాదిరవైర్యుతః ।
రాజయోగసముద్భూతోకర్మేపాతభాన్వితే ॥

రాజయోగమందు పుట్టినవాడుగాని, దశమాధిపతి చతుర్థమందుండగా పుట్టిన వాడుగాని మృదంగభేరీశంఖ, కాహళాది ధ్వనులు కలవాడగును.

132. బలాబలాచ్ఛుభసదృష్టియోగాత్ప్రోక్తంతృతీయస్యఫలంతురాశేః ।
చతుర్థరాశేశ్చఫలంతథైవశ్రీవేంకటేశేననిరీక్ష్యసర్వమ్ ॥

తృతీయరాశియొక్క, చతుర్థరాశియొక్క ఫలము బలాబలములవలన, శుభ గ్రహదృష్టి, యోగములవలన, వేంకటేశ దైవజ్ఞునిచే సర్వము పరిశీలించి చెప్ప బడినది.

ఇది సర్వార్థ చింతామణి కాంధ్రతాత్పర్యమున
చతుర్థభావము — పంచమాధ్యాయము.

---

# షష్ఠాధ్యాయము

1. సుతభవనాత్పుత్రవృద్ధింమంత్రంపితృబుద్ధిమాత్మవిద్యాంచ ।
హృదయోదరప్రవేశంవివేకశక్తించనిర్దిశేన్మతిమాన్ ॥

పంచమ భావమువలన - పుత్రవృద్ధి, మంత్రము, పితృబుద్ధి, తనవిద్య, హృదయోదర ప్రవేశము, వివేకశక్తి-వీనిని బుద్ధిమంతుడయిన జ్యోతిషికుడు చెప్ప వలెను.

2. నాథైః కళత్రాత్మజధర్మభానాం పుత్రస్య చింతాం కథయేత్సుధీర్వై ।
బుద్ధింతథా సోమసుతాబ్జకాభ్యాం పితు ర్గద్యైవాత్మజభాగ్యనాథైః ॥

7,5,9 అధిపతులచేతను, గురునిచేతను (కారకుడు) పుత్రవిచారణ చేయదగినది. బుధచంద్రులబట్టి బుద్ధిని చెప్పవలెను. పంచమ, నవమస్థానములచేతను, రవిచేతను తండ్రికి అట్లే చెప్పవలెను.

3. పుత్రే తు భానౌ జనకస్య నాశః పుత్రే శశాంకే మరణం చ మాతుః ।
శుభై ర్యుతే శోభనదృష్టియోగాత్పుత్రం దదాత్యేవ తథా తదీశే ॥

పుత్రస్థాన (5) మున రవియున్న తండ్రికి నాశము కల్గును. పంచమమున చంద్రుడున్న తల్లికి మరణము. పంచమముగాని, పంచమాధిపతిగాని శుభయుక్తమైన, శుభదృష్టియున్న పుత్ర సంతానము కలుగును.

4. పుత్రస్థానే తదీశే వా గురౌ వా శుభవీక్షితే ।
శుభేన సహితే వాపి పుత్రావాప్తిం వినిర్దిశేత్ ॥

పుత్రస్థానముకాని, తదధిపతికాని గురుడై, శుభగ్రహదృష్టియున్నా, శుభయుక్తుడైనా పుత్రప్రాప్తి కలుగును.

5. లగ్నేశే పుత్రభావస్థే పుత్రేశే బలసంయుతే ।
పరిపూర్ణబలే జీవే పుత్రావాప్తిర్న సంశయః ॥

లగ్నాధిపతి పంచమమందుండి, పంచమాధిపతి బలవంతుడయిన, గురుడు బలవంతుడయినా పుత్రప్రాప్తి కలుగును.

6. పుత్రస్థానాధిపే జీవే పరిపూర్ణబలాన్వితే ।
లగ్నాధిపేన వా దృష్టే పుత్రప్రాప్తిర్న సంశయః ॥

పంచమాధిపతి గురుడై, పూర్ణబలుడయినా, లగ్నాధిపతిచే చూడబడినా పుత్రప్రాప్తి కలుగును.

7. లగ్నపుత్రాధిపౌ యుక్తావన్యోన్యం సమవీక్షితౌ ।
స్వోచ్చమిత్రాదిగౌ స్వస్థౌ పుత్రయోగా ఇతి స్మృతాః ॥

లగ్న పంచమాధిపతులు ఏకరాశియందున్నా, అన్యోన్యము దృష్టియున్నా, స్వ, ఉచ్చ, మిత్ర క్షేత్రగతులయినా, పుత్రుడు కలుగును.

8. లగ్నపుత్రాధిపౌ కేంద్రే శుభగ్రహసమన్వితే ।
కుటుంబేశే బలాఢ్యే తు పుత్రావాప్తిం వినిర్దిశేత్ ॥

లగ్న పంచమాధిపతులు శుభగ్రహయుక్తులై కేంద్రమందుండి, ద్వితీయాధిపతి బలవంతుడయిన పుత్రప్రాప్తి కలుగును.

9. దారేశసంయుతగృహాన్నవాంశభవనాధిపే ।
భాగ్యవిత్తవిలగ్నేశదృష్టేత్ర ప్రాప్తిమాదిశేత్ ॥

సప్తమాధిపతియున్న భావ నవాంశ రాశ్యధిపతి నవమ, ద్వితీయ, లగ్నాధిపతులచే చూడబడిన - పుత్రప్రాప్తి కలుగును.

10. పుత్రస్థానాధిపస్థాంశరాశీశేశుభసంయుతే ।
శుభేనసంయుతేత్రపుత్రప్రాప్తిర్నసంశయః ॥

పంచమాధిపతియున్న నవాంశరాశ్యధిపతి శుభగ్రహయుక్తుడైనా, శుభయుక్తుడై పంచమమందున్నా పుత్రప్రాప్తి కలుగును.

11. లగ్నేశేదారభావస్థేభాగ్యేశేదారసంయుతే ।
ద్వితీయేశేవిలగ్నస్థేపుత్రప్రాప్తింవినిర్దిశేత్ ॥

లగ్నాధిపతి సప్తమమున, భాగ్యాధిపతి సప్తమమున, ద్వితీయాధిపతి లగ్నమునందున్న - పుత్రప్రాప్తి కలుగును.

12. పాపదృష్టేసుతద్వావేతదీశేపాపసంయుతే ।
కారకేపుత్రసంయుక్తేపుత్రనాశంవదేత్తదా ॥

పంచమము పాపగ్రహదృష్టమై, పంచమాధిపతి పాపగ్రహయుక్తుడైన పుత్ర కారకుడు (గురుడు) పంచమమందున్న పుత్రనాశము కలుగును.

13. విత్తాధిపకళత్రేశసంయుక్తనవభాగపా ।
పాపాంశగౌపాపయుతౌపుత్రనాశంవదేత్తదా ॥

ద్వితీయ సప్తమాధిపతులున్న నవాంశాధిపతు లిద్దరును పాపయుక్తులై, పాప నవాంశగతులైన పుత్రనాశము కలుగును.

14. క్రూరాంశేపుత్రభావేశేనీచమూఢసమన్వితే ।
పాపైర్దృష్టేఒథవాదుస్థేపుత్రనాశంవదంతిహి ॥

పంచమాధిపతి నీచ, అస్తంగత స్థానగతుడై, క్రూరనవాంశను పొందియుండి పాపగ్రహములచే చూడబడినా, లేక, 6, 8, 12 లందున్నా- మిత్రనాశనము కలుగును.

15. వ్యయేశసంయుతాంశేశత్ర్యంశనాథసమన్వితే ।
దృష్టేపుత్రేశ్వరేతేనపుత్రార్తింకథయంతిహి ॥

వ్యయాధిపతియున్న నవాంశరాశ్యధిపతియున్న ద్రేక్కాణాధిపతిచే పంచమాధిపతి చూడబడిన జాతకునకు పుత్రదుఃఖము కలుగును.

16. పుత్రస్థానాధిపేదుస్థేక్రూరషష్ట్యంశసంయుతే ।
క్రూరగ్రహేణవాదృష్టేపుత్రార్తింకథయంతిహి ॥

పంచమాధిపతి 6,8,12 లందుండి, క్రూర షష్ట్యంశగతుడయినా, క్రూర గ్రహయుక్తుడయినా పుత్రదుఃఖము కలుగును.

17. మృద్వంశాదినమాయుక్తేపుత్రస్థానేశ్వరేదృఢే ।
గోపురాద్యంశకేవాపిపుత్రవృద్ధిర్నసంశయః ॥

పంచమాధిపతి బలవంతుడై మృద్వంశాది షష్ట్యంశయుతుడై, గోపురాంశ యందున్నా, పుత్రవృద్ధి కలుగును.

18. పుత్రాధిపస్థాంశపతౌవిలగ్నేలగ్నేశ్వరస్థాంశపతౌసుతస్థే ।
గురుస్థితాంశాధిపతౌచకేంద్రేపుత్రాప్తిమాహుర్యవనోమహాంతః ॥

పుత్రస్థానాధిపతియున్న నవాంశరాశ్యధిపతి లగ్నమున, లగ్నాధిపతియున్న నవాంశరాశ్యధిపతి పంచమమున, గురుడున్న నవాంశరాశ్యధిపతి కేంద్రములందు ఉన్న జాతకునకు పుత్రప్రాప్తి కలుగును.

19. పారావతాంశాదియుతేసుతేశేభాగ్యేశ్వరేతాదృశభాగయుక్తే ।
లగ్నేశ్వరేశోభనదృష్టియుక్తేపుత్రాదిలాభంకథయంతితజ్ఞాః ॥

పంచమ నవమాధిపతులు పారావతాది అంశలందున్న, లగ్నాధిపతి శుభ గ్రహముచే చూడబడిన జాతకునకు పుత్రలాభము కలుగును.

20. వంశక్షయావిరహితేయదితథ్యమేతచ్చాస్త్రార్థపారగమునా మునయోవదంతి ।
పుత్రాదియోగమఖిలంతదభావయోగంప్రోక్తంవిలోక్యమనసాచవదేత్సువిద్వాన్ ॥

వంశక్షయాది యోగములు లేనప్పుడు ఈ చెప్పిన పుత్రప్రాప్తియోగములు సత్యమగునని మహర్షులు చెప్పిరి. విద్వాంసుడు పుత్రప్రాప్తి- తదభావయోగములను చక్కగా యోచించి ఫలము చెప్పవలెను.

21. వంశస్యవిచ్ఛేదకరఃప్రజాతఃచంద్రాస్ఫుజిత్పాపఖగాఃక్రమేణ ।
ఖదారసౌఖ్యేషుయుతాస్తథైవంలగ్నేశ్వరేచంద్రసుతేనయుక్తే ॥

చంద్రుడు దశమమున, శుక్రుడు సప్తమమున, పాపగ్రహములు చతుర్థ మందుండగా, లగ్నాధిపతి బుధునితో కూడియుండెనేని జాతకుడు వంశ విచ్ఛేద కరుడగును.

22. పాపగ్రహైరిఃఫసుతాష్టమస్థైవంశస్యవిచ్ఛేదకరోర్థహీనః ॥

పాపగ్రహములు 12,5,8 లందున్న జాతకుడు దరిద్రుడును వంశక్షయ కరుడు నగును.

23. నిశాకరేలగ్నగతేనజీవేతత్సప్తమేలగ్నపతౌశనౌవా।
పాపగ్రహైబంధుగతాశ్చసర్వేవంశస్యవిచ్ఛేదకరఃసుతేష్టై॥
చంద్రుడు గురుయుక్తుడై లగ్నమందుండగా, సప్తమమున లగ్నాధిపతిగాని, శనిగానియున్నా, పాపగ్రహములు చతుర్థమందుండి, పంచమమందు చంద్రుడున్నచో జాతకుడు వంశ విచ్ఛేదకరుడగును.

24. దారస్థితేసోమసుతేసశుక్రేపాపేసుఖేదేవగురౌసుతస్థే।
రంధ్రేశశాంకాత్సహితేతుపాపైర్వంశస్యవిచ్ఛేదకరోత్రజాతః॥
బుధశుక్రులు సప్తమమందు, పాపగ్రహము చతుర్థమున, గురుడు పంచమమునఉండి, చంద్రుని కష్టమమున పాపగ్రహములున్న వంశక్షయమగును.

25. పాపేవిలగ్నేసుఖేశశాంకేలగ్నేశ్వరేపంచమరాశియుక్తే।
బలైర్విహీనేనతిపుత్రనాథేవంశస్యవిచ్ఛేదకరోత్రజాతః॥
లగ్నమున పాపగ్రహముండి, చతుర్థమున చంద్రుడు, పంచమమున లగ్నాధిపతిఉండి, పంచమాధిపతి బలవంతుడయిన వంశచ్ఛేదమగును.

26. క్షీణేశశాంకేతనుభావయుక్తేమూఢాన్వితేరంధ్రగృహేసురేడ్యే।
త్రికోణగైఃపాపఖగైశ్చసర్వైఃప్రాగేవపుత్రస్యసు(ము)ఖాద్వినాశః॥
లగ్నమున క్షీణ చంద్రుడుండి, గురుడస్తంగతుడై అష్టమస్థుడుకాగా, పంచమనవమములందు పాపగ్రహములుండిన, జాతకుడు పుత్రుని ముఖముచూడడు. సంతానము కల్గకుండగనేపోవును.

27. చంద్రాత్మజేపంచమభావయుక్తేలగ్నేసుఖేవాయదిపాపయుక్తే।
శుభేతరైఃపంచమభాగ్యయుక్తైఃనదృశ్యతేపుత్రముఖంహితేన॥
బుధుడు పంచమమునఉండి, లగ్నమునగాని, చతుర్థమునగాని, పాపగ్రహముండి, పంచమనవమములందు తక్కిన పాపగ్రహములుండగా పుట్టిన జాతకుడు పుత్రముఖము చూడడు.

28. జాతోయదిస్యాత్తితినూనులగ్నేరంధ్రేశనౌపంచమభేరవౌచ।
పుత్రస్యలాభంమునయోవదంతికాలాంతరేశోభనదృష్టియోగాత్॥
కుజక్షేత్రములగ్నమై, అష్టమమున శనియుండి, పంచమమున రవియుండి, శుభదృష్టియున్న కాలాంతరమున పుత్రలాభము కలుగునందురు.

29. పుత్రస్థానగతేరాహౌపుత్రేశనహితేనతి।
శుభైరవీక్షితేవింద్యాత్సర్పదష్టాత్సుతక్షయః॥
రాహువు పంచమమునఉండి పుత్రస్థానాధిపతోకూడి, శుభదృష్టి లేకున్న సర్పదష్టలయి సంతానము క్షయమగును.

30. పుత్రస్థానేబుధక్షేత్రేమందక్షేత్రేథవాపునః ।
మందమాందియుతేదృష్టేదత్తపుత్రాదయస్స్మృతాః ॥

పంచమము బుధక్షేత్రముగాని శనిక్షేత్రముగాని అయి, శనిమాందిగ్రహములతోకూడినా, చూడబడినా- జాతకునకు దత్తపుత్రుడగును.

31. బుధిస్థానాధిపేసౌమ్యేశుభదృష్టిసమన్వితే ।
శుభగ్రహాణాంక్షేత్రేవాబుద్ధిమాన్నీతిమాంభవేత్ ॥

పంచమాధిపతి శుభగ్రహమై, శుభగ్రహదృష్టియున్నా, శుభగ్రహక్షేత్ర మందున్నా జాతకుడు బుద్ధిమంతుడు, నీతిమంతుడునగును.

32. పరమోచ్చాంశకేబుద్ధినాథేసౌమ్యనిరీక్షితే ।
శుభగ్రహాణాంమధ్యస్థేతీవ్రబుద్ధింసమాదిశేత్ ॥

పంచమాధిపతి పరమోచ్చ నవాంశమందుండి, శుభగ్రహదృష్టియుండి, శుభగ్రహ మధ్యవర్తియైన జాతకుని తీవ్రబుద్ధి అనవలెను.

33. బుద్ధిస్థానాధిపస్థాంశరాశీశేశుభవీక్షితే ।
బుధిస్థానాధిపేసౌమ్యేతీవ్రబుద్ధింవినిర్దిశేత్ ॥

పంచమాధిపతియున్న నవాంశ రాశ్యధిపతి శుభగ్రహదృష్టుడై పంచమాధిపతి శుభగ్రహమైన తీవ్రబుద్ధి యగును.

34. కారకస్థితరాశ్యంశనాథేకేంద్రత్రికోణగే ।
బుద్ధీశ్వరేణసందృష్టేధారణాదిపటుర్భవేత్ ॥

బుద్ధికారకుడయిన గురుడున్న నవాంశ రాశ్యధిపతి కేంద్రకోణములందుండి, పంచమాధిపతిచే చూడబడిన ధారణాసమర్థమైన బుద్ధికలవాడగును.

35. పరేంగితజ్ఞోమేధావీకారకస్థితభాగపే ।
కేంద్రత్రికోణసంయుక్తేకారకగ్రహవీక్షితే ॥

గురుడున్న నవాంశాధిపతి కేంద్రకోణములందుండి, గురునిచే చూడబడిన జాతకుడు పరుల మనోభావములతెలియు మేధావియగును.

36. నాథకారకసంయుక్తత్ర్యంశభాగపతౌశుభే ।
చతుష్టయేత్రికోణేవాచేంగితజ్ఞశ్శుభేక్షితే ॥

పంచమాధిప, కారకులలో నొకడున్న ద్రేక్కాణాధిపతి శుభగ్రహమై అది, కేంద్రకోణములందున్న శుభగ్రహదృష్టమైన పరేంగితజ్ఞుడగును.

37. పంచమేపాపసంయుక్తేతదీశేపాపసంయుతే ।
క్రూరషష్ట్యంశగేవాపిబుద్ధినాశోభవేత్తథా ॥

పంచమము పాపయుక్తమై, పంచమాధిపతియు పాపగ్రహయుక్తుడై క్రూర షష్ట్యంశగతుడయిన బుద్ధినాశము కలుగును.

38. నీచమూఢారిగేహస్థేపాపఖేచరవీక్షితే ।
క్రూరషష్ట్యంశసంయుక్తేబుద్ధినాశోభవేత్తథా ॥

పంచమాధిపతి నీచ శత్రుక్షేత్రగతుడు, అస్తంగతుడునై, క్రూర షష్ట్యంశ యుక్తుడైన బుద్ధినాశము కలుగును.

39. పంచమేమందసంయుక్తేలగ్నేశేమందవీక్షితే ।
తదీశేపాపసంయుక్తేబుద్ధిజాడ్యంసమాదిశేత్ ॥

పంచమము శనియుక్తమై, లగ్నాధిపతి శనిచేచూడబడి, పంచమాధిపతి పాపగ్రహయుక్తుడైన బుద్ధిమాంద్యముండును.

40. మందమాంద్యగుసంయుక్తేపంచమేశుభవర్జితే ।
తదీశేపాపసందృష్టేవిస్మృతిఃప్రాయశోభవేత్ ॥

పంచమ స్థానము శుభగ్రహదృష్టిలేనిదై, శనిమాందీరాహువులతోకూడి, పంచమాధిపతి పాపగ్రహదృష్టుడైన మరుపు కలవాడగును.

41. బుద్ధేర్విస్మృతిపూర్వాస్యాత్కారకేపాపసంయుతే ।
తదీశేపాపసంయుక్తేక్రూరషష్ట్యంశకేపివా ॥

బుద్ధికారకుడు పాపగ్రహయుక్తుడై, పంచమాధిపతియు పాపగ్రహయుతుడై క్రూర షష్ట్యంశగతుడయిన మరుపుగలవాడగును.

42. సౌమ్యేచబుద్ధిభావస్థేగురుశుక్రనిరీక్షితే ।
తాదృశేబుద్ధినాథేవాసర్వేషాంబుద్ధిదోభవేత్ ॥

బుధుడు పంచమమందుండి, శుక్రగురులచే చూడబడినా, పంచమాధిపతి పంచమమందుండి గురుశుక్రులచే చూడబడినా జాతకుడు బోధనలచే సర్వజనులకు బుద్ధిప్రదుడగును.

43. ఊహాపోహసమర్థస్యాత్తదీశేగోపురాంశగే ।
కారకస్థితరాశీశేలగ్ననాథేనవీక్షితే ॥

పంచమాధిపతి గోపురాంశగతుడై, గురుడున్న రాశ్యధిపతి లగ్నాధిపతిచే చూడబడిన జాతకుడు ఊహాపోహలు తెలియు సమర్థుడగును.

44. రాజమంత్రీభవేజ్జాతోవాక్పతౌబలసంయుతే ।
బుద్ధీశ్వరేణసందృష్టేగోపురాద్యంశకేపివా ॥

గురుడు బలవంతుడై పంచమాధిపతిచే చూడబడి, గోపురాంశయందున్న జాతకుడు రాజమంత్రి యగును.

45. ఆగామిసూచకోమంత్రీకారకఃకేంద్రకోణగః ।
భృగుసౌమ్యసమాయుక్తేదృష్టేతాభ్యాంశుభాన్వితే ॥

గురుడు కేంద్రకోణములందుండి, శుక్రబుధులచే చూడబడినను, కూడినను, శుభయుక్తుడయిన రాబోవుదానిని సూచింపగల మంత్రి యగును.

46. త్రికాలజ్ఞోభవేజ్జీవేస్వాంశేమృద్వంశసంయుతే ।
గోపురాద్యంశకేవాపిశుభాంశేశుభవీక్షితే ॥

గురుడు స్వాంశయందు, మృద్వంశయందుండినా, శుభనవాంశయందుండి శుభగ్రహదృష్టుడైనా గోపురాంశయందున్నా త్రికాలజ్ఞుడగును.

47. పుంగ్రహేపుంగృహంప్రాప్తేపుంభాగేపుత్రనాయకే ।
ప్రాక్పుత్రజననంవింద్యాద్విద్వద్భిర్నాత్రసంశయః ॥

పుత్రస్థానాధిపతి పురుషగ్రహమై, పురుషరాశియందుండి, పురుషనవాంశ యందున్న జాతకునకు జ్యేష్ఠుడు పుత్రుడగును.

48. స్త్రీరాశౌస్త్రీగృహంప్రాప్తేస్త్రీభాగేపుత్రనాయకే ।
బాలికాంప్రథమంవింద్యాత్షండాంశేషండమాదిశేత్ ॥

పంచమాధిపతి స్త్రీరాశియందు, స్త్రీగ్రహముతోకూడియుండి, స్త్రీగ్రహనవాంశ యందున్న జాతకునకు ప్రథమ ప్రసూతి స్త్రీయగును. నపుంసక గ్రహనవాంశ యందున్న నపుంసకుడు జన్మించును. స్త్రీగ్రహ నవాంశయనగా యుగ్మరాశి అని యర్థము.

49. కారకస్యతురాశౌవాపంచమేబిందుసంఖ్యయా ।
నీచమూఢారిఖేటానాంబిందూన్త్యక్త్వాసుతాన్వదేత్ ॥

పంచమస్థానమునందున్న బిందు సంఖ్యతోగాని, కారకుడున్నరాశిలోని బిందు సంఖ్యచేగాని నీచమూఢశత్రుగతగ్రహముల బిందువులను విడిచిపెట్టి మిగిలిన బిందు సంఖ్యచే పుత్రులను చెప్పవలెను. అష్టకవర్గులోని శుభసూచక బిందువులు.

50. పుత్రభావేశకిరణాత్పుత్రభావాంశకాద్వదేత్ ।
రశ్మిజాలైర్గురోర్వాపిబలోత్కర్షాదితస్తథా ॥

పంచమాధిపతియొక్క కిరణములచేగాని, పంచమ నవాంశవలనగాని, గురుని కిరణములవలనగాని బలాధిక్యమునుబట్టి పుత్రసంఖ్య చెప్పవలెను.

51. లగ్నపుత్రేశ్వరాభ్యాంతుమిత్రత్వేనైవమిత్రతా ।
శత్రుత్వేశాత్రవంప్రోక్తంసమత్వేసమతాభవేత్ ॥

లగ్న పంచమాధిపతుల మిత్రత్వముచే మైత్రియు, శత్రుత్వముచే విరోధ మును, సమత్వముచే సమత్వమును చెప్పవలెను.

52. విలగ్నపుత్రనాథౌతుపరస్పరనిరీక్షితౌ ।
పరస్పరగృహాంశస్థౌపితురుక్తంహికారయేత్ ॥

లగ్న పంచమాధిపతులు పరస్పరదృష్టి కలిగియున్నా, అన్యోన్య నవాంశ లందున్నా జాతకుని పుత్రుడు తండ్రికి చెప్పినమాట వినును.

53. లగ్నంపశ్యతివాపుత్రనాథేపుత్రాన్వితేపివా ।
లగ్నేశ్వరేసుతస్థేవాపితృవాక్యవశానుగః ॥

పంచమాధిపతి లగ్నమును చూచుచున్నా, పంచమమందున్నా, లగ్నాధిపతి పంచమమందున్నా, జాతకునిపుత్రుడు పితృవశవర్తియగును.

54. పుత్రస్థానేశ్వరేదుస్థేలగ్నేశేనాపివీక్షితే ।
సందృష్టేకుజరాహుభ్యాంనిత్యంపితృవిదూషకః ॥

పంచమాధిపతి 6,8,12 లందుండి లగ్నాధిపతిచేత, కుజరాహువులచేత చూడబడిన జాతకుని పుత్రుడు సర్వదా దూషించును.

55. పంచమేగురుశుక్రాభ్యాంనవిధాభ్యాంనహితేథవా ।
ఏతేషాంభవనేవాపిసోయంభోజయితాభవేత్ ॥

పంచమము బుధగురుశుక్రయుతమైనా, బుధగురుశుక్రక్షేత్రమైనా జాతకుడు పుత్రునితోకూడియుండువాడును, పుత్రునిచే పరులకు భోజనము పెట్టించువాడు అగును.

56. తృతీయేశేతృతీయస్థేపంచమేశేసుఖంగతే ।
సుఖేశేస్వోచ్చగేకేంద్రేభుక్తిశేషస్యన్నదానదః ॥

ద్వితీయాధిపతి (తృతీయాధిపతి అని పాఠాంతరము) తృతీయమందుండి, పంచమాధిపతి చతుర్థమందుండ, చతుర్థాధిపతిగాని, ద్వితీయాధిపతిగాని ఉచ్చస్థుడై కేంద్రమందున్న అన్నదాతయగును.

57. హృదయేపాపసంయుక్తేతదీశేపాపవీక్షితే ।
పాపగ్రహాణాంమధ్యస్థేహృద్గతంరోగమాదిశేత్ ॥

పంచమము పాపగ్రహయుక్తమై, పంచమాధిపతి పాపగ్రహదృష్టుడైన, పాపగ్రహ మధ్యవర్తియైన హృదయమున రోగముండును.

ఇది సర్వార్థ చింతామణి కాంధ్రతాత్పర్యమున పంచమభావంబను
షష్ఠాధ్యాయము.

---

# సప్తమాధ్యాయము

1. అరిభవనాదరిచోరక్షతవిఘ్నక్లేశనాభ్యుదరదేశాన్ ।
మధురాదిషడుపదంశాన్ గ్రహరాశ్యాదితాన్వదేత్ప్రాజ్ఞః ॥

షష్ఠస్థానమువలన - శత్రువులు, దొంగలు, గాయములు, విఘ్నములు, దుఃఖము, నాభి, ఉదరము, మధురాదిషడ్రసములు, సుఖరోగములు, వ్యాధులు, ఊరుగాయ మున్నగు వ్యంజనములు, వీనినిఆయా గ్రహ సంబంధ, దృష్టులబట్టి ఫలముల చెప్పవలెను.

2 షష్ఠేశ్వరే క్రూరయుతే విలగ్నే రంధ్రస్థితే వా వ్రణదశ్శరీరే ।
కర్మస్థితే తాదృశఖేచరేంద్రే వ్రణప్రదోంగేశుభదృష్టియోగే ॥

షష్ఠాధిపతి క్రూరగ్రహయుక్తుడై లగ్నమందున్నా, అష్టమమందున్నా, శరీరమున వ్రణములు కలుగును. దశమమున క్రూరగ్రహముండి, పాపగ్రహదృష్టి సంబంధమున్న వ్రణములు కలుగును.

3. పిత్రాదిభావాదపియోజనీయం భావేశతత్కారకదృష్టియోగాత్ ।
బలాబలేనాపివికల్ప్యసర్వం తేషాం ఫలం తత్కథయంతిసంతః ॥

పిత్రాదిభావపతి, తత్కారకులదృష్టి, యోగములవలన, బలాబలములచే వికల్పించి, పిత్రాది భావములవలన పిత్రాదులకును ఫలము చెప్పనగును.

4. శిరోమేషాన్ముఖం కంఠం శ్రోత్రం నాసాం చ గుహ్యకం ।
పాణిపార్శ్వదృశాపాదౌ ప్రపదే కుక్షిమాదిశేత్ ॥

మేషము-శిరస్సు, వృషభము-ముఖము, మిధునము-కంఠము, కర్కాటకము-చెవి, సింహము-నాభి, కన్య-గుహ్యము, తుల-చెయ్యి; వృశ్చికము-పార్శ్వము; ధనుస్సు-కన్నులు; మకరము-పాదములు; కుంభము-మోగాళ్ళు, మీనము-కడుపు-గా అవయవ విభాగము చేయవలెను.

5. లగ్నేశభూపుత్రశశాంకపుత్రానహస్థితాస్స్వాఖ్యగృహేవ్యయేవా ।
అపానరోగం త్వథవాపవిత్రం శ్వేతంతుకుష్ఠం మునయోవదంతి ॥

లగ్నాధిపతి, కుజ, బుధులు చతుర్థమందయినా, ద్వాదశమందయినాఉన్న, జాతకునకు--అపానరోగము, పాండు, కుష్ఠవ్యాధులలో నొకటి కలుగును.

6. శశాంకతత్పుత్రవిలగ్ననాథాన్పరాహుణార్కేణయుతాస్తదంశే ।
శ్యామంతుకుష్ఠంతు జనం యుతేచనైల్యంభవేన్మందనమన్వితేషు ॥

చంద్ర, బుధ, లగ్నాధిపతులు-రవిరాహువులతోకూడగా, నల్లని మేహవ్యాధి

కలుగును. రవి నవాంశలో వారు ముగ్గురు ఉన్నను ఆ వ్యాధి కలుగును. వారు ముగ్గురు కుజునితో కలిసియున్న కుష్ఠువ్యాధి కలుగును. శనితోకూడిన, నీలవ్యాధి కలుగును.

7. రక్తంతదాహూర్యనమన్వితేచగ్రహోక్తదేశేనియమంతదాహుః ।
లగ్నే శషష్ఠాధిపతీదినేశయుక్తౌజ్వరంచంద్రనమన్వితౌచేత్ ।
జలేనగండంక్షితిసూనుయుక్తేయుద్ధేనవాస్ఫోటకరాశిభిర్వా ॥

చంద్ర బుధ లగ్నాధిపతులు రవితోకూడియున్న రక్తవ్యాధి కలుగును. ఆయాగ్రహమునకు చెప్పిన అవయవమందు వ్యాధికలుగును. లగ్న షష్ఠాధిపతులు రవితోకూడిరేని జ్వరము, చంద్రునితోకూడిన జలగండము, కుజునితోకూడిన యుద్ధమునగాని, స్ఫోటకమునగాని గండముండును.

8. పిత్తేనరోగేణబుధేనయుక్తౌనిర్వ్యాధికోజీవనమన్వితౌచేత్ ।
శుక్రేణభార్యావిపదంవదంతిమందేననీచానిలరోగమాహుః ॥

లగ్నాధిప షష్ఠాధిపులు బుధునితోకూడిన పైత్యరోగ గండము కలుగును. గురునితోకూడిన రోగములేనివాడగును. శుక్రునితోకూడిన భార్యకాపద కలుగును. శనితోకూడిన నీచమైన వాతరోగము కలుగును.

9. సరాహుకేతూశిరసిప్రపీడాచోరాగ్నిభిర్వాతభయాత్ప్రమాదః ।
షష్ఠేశ్వరశ్చంద్రసుతేనయుక్తస్స్యాహుర్విలగ్నేభయమత్రశిశ్నే ॥

రాహుకేతువులతోకూడిన శిరోవ్యాధి, చోరాగ్ని భయము, వాతరోగ గండము, షష్ఠాధిపతి బుధునితోకూడిన శిశ్నరోగము కలుగును.

10. ఛినత్త్వసౌసౌమ్యదృశావిహీనేనసూర్యపుత్రోయదిలింగమాహుః ॥
షష్ఠాధిపతి శనితోకూడి లగ్నమందున్న లింగచ్ఛేదనము జరుగును.

11. షష్ఠేశ్వరోభూమిసుతేనయుక్తఃవ్రణాద్భయంస్ఫోటకభీతిమాహుః ।
కామేశ్వరశ్శుక్రయుతోరిపుస్థఃకళత్రషండత్వముదీరయంతి ॥

షష్ఠాధిపతి కుజునితోకూడిన వ్రణ, స్ఫోటక భయము కలుగును. సప్తమాధిపతి శుక్రునితోకూడి షష్టమందున్న యెడల కళత్రమునకు నపుంసకత్వము (మాచకమ్మ) కలుగును.

12. షష్ఠేశలగ్నాధిపతీసమందౌకేంద్రత్రికోణేయదిబంధనంస్యాత్ ।
సరాహుకేతూయదికేంద్రకోణేవదంతితజ్ఞానిగళంతదానీం ॥

షష్ఠలగ్నాధిపతులు శనితోకూడి కేంద్రత్రికోణములందున్న బంధనము కలుగును. రాహుకేతుయుక్తులై కేంద్రకోణగతులైనను బంధనము కలుగును.

13. పిత్రాదితత్కారకనాథయోగాత్పిత్రాదికానాంఫలమాహురార్యాః।
తత్తద్గ్రహాణాంపరిపాకకాలేత్వంతర్దశాయామథవావదంతి ॥

పిత్రాది భావములకు, పితృస్థానాధిప, పితృకారకుల పూర్వోక్త యోగముల వలన పిత్రాదులకును చెప్పిన ఫలితములు చెప్పవలెను. ఆ యోగము లాయాగ్రహముల దశాంతర్దశాకాలములందు జరుగును.

14. ధర్మేశనౌదేవగురౌతృతీయేకరచ్ఛిదాస్యాన్నిధనేవ్యయేవా।
విధౌశశ్రేనిధనాన్వితేవాకుజేనయుక్తేయదివానజీవే ॥

నవమమునశని, తృతీయమున గురుడున్నా, అష్టమమందు శని వ్యయమున గురుడున్నా జాతకుని చేతులు నరుకబడును. చంద్రుడు సప్తమమునగాని, అష్టమమునగాని ఉండి కుజునితోకూడినా, గురునితోకూడినా హస్తచ్ఛేదనము జరుగును.

15. కర్మస్థితాశ్చేద్యదిరాహుమందసౌమ్యాఃకరచ్ఛేదయుతోత్రజాతః।
శుక్రేనయుక్తేయదివారినాథేరవౌశనౌవాఫణినాథయుక్తే।
క్రూరాదిషష్ట్యంశసమన్వితేవావిచ్ఛేదనంతస్యశిరోవదంతి ॥

దశమమున రాహుశనిబుధులుండిన కరచ్ఛేదనము జరుగును. షష్ఠాధిపతి శుక్రునితోకూడి, రవిగాని, శనిగాని, రాహుయుక్తుడై క్రూరాధిషష్ట్యంశ గతుడయిన శిరచ్ఛేదనము కలుగును.

16. షష్ఠాష్టమవ్యయేచంద్రేలగ్ననాథేనవీక్షితే।
మందమాంద్యగునంయుక్తేతస్యదుర్మరణంవదేత్ ॥

చంద్రుడు 6,8,12 లందుండి లగ్నాధిపతిచే చూడబడి, శనిమాందీ రాహుయుక్తుడయిన జాతకునకు దుర్మరణము కలుగును.

17. రంధ్రేశ్వరస్థితత్ర్యంశేపాశసర్పాదిసంయుతే।
దృగాణేనిగళాద్వాపిఉద్బంధాన్మరణంవదేత్ ॥

అష్టమాధిపతియున్న ద్రేక్కాణము పాశ, సర్పాది సంజ్ఞకలదయిన జాతకుడు బంధనమువలనగాని, ఉరిపోసికొనికాని చచ్చును.

18. మందమాంద్యగునంయుక్తేరంధ్రేశస్థత్రిభాగపే।
తథావిధేఽర్కపుత్రేతుహ్యుద్బంధాన్మరణంవదేత్ ॥

అష్టమాధిపతియున్న ద్రేక్కాణాధిపతి శనిమాందీరాహువులతో గూడియున్ననూ, శనియు అట్లున్నను ఉరిపోసికొని మరణించును.

19. షష్ఠాష్టమేశౌతామేవావిక్రమేశసమన్వితే।
మందమాంద్యగునంయుక్తేక్రూరాంశేయుద్ధతోమృతిః ॥

షష్ఠ, అష్టమాధిపతులు, కుజులలో ఎవరయినా తృతీయాధిపతితోకూడి, శని, పొంది, రాహుయుక్తుడై క్రూరాంశయందున్న యుద్ధమున మృతికలుగును.

**20.** **యుద్ధేనమరణంబ్రూయాచ్ఛనియుక్తత్రిభాగగే।**
**కుజేనవీక్షితయుతేభౌమక్షేత్రేతదంశకే॥**

శనియున్న ద్రేక్కాణాధిపతి కుజక్షేత్రమునగాని, కుజనవాంశయందుగాని ఉండి, కుజదృష్టుడయిన-జాతకుడు యుద్ధమున మరణించును.

**21.** **రవిభౌమౌయదాన్యోన్యంపరస్పరనిరీక్షితౌ।**
**పరస్పరగృహాంశస్థౌద్వంద్వయుద్ధాన్మృతిర్భవేత్॥**

రవికుజులు పరస్పరదృష్టికలిగి, కుజక్షేత్రమునరవి, రవిక్షేత్రమున కుజుడు ఉన్నా, పరస్పర నవాంశస్థులైనా ద్వంద్వయుద్ధమున మృతికలుగును.

**22.** **అష్టమేబహవఃపాపాఃభౌమరాశిగతాంశపాః।**
**క్రూరషష్ఠ్యంశకయుతాస్సంఘాతాన్మరణంవదేత్॥**

అష్టమమున అనేక పాపగ్రహములుండి, అవి కుజనవాంశగతులై, క్రూర షష్ఠ్యంశగతులయిన సంఘమరణము కలుగును.

**23.** **నీచమూఢారిగేహస్థాఃసౌమ్యాస్సర్వేపరాజితాః।**
**పాపాంశకాఃపాపయుతామృతిస్సాంఘాతికీభవేత్।**

శుభగ్రహములన్నియు నీచ, శత్రుక్షేత్రగతులు, అస్తంగతులు, యుద్ధపరాజితులునై, పాపనవాంశస్థులై పాపగ్రహయుక్తులయిన సంఘమరణము సంభవించును.

**24.** **సంఘేస్యాన్మరణంతస్యశనిరాహుదినాధిపాః।**
**రంధ్రేశవీక్షితాస్సర్వేక్రూరాంశామూఢసంయుతాః॥**

రవిశనిరాహువులు ముగ్గురును అష్టమాధిపతి దృష్టికలిగి, క్రూరాంశగతులై, అస్తంగతులయిన సంఘాతమరణము కలుగును.

**25.** **రోగస్థానేగతేసూర్యేతద్భావేపాపసంయుతే।**
**క్రూరదృష్టియుతేభానౌపైత్యకోల్బణమాదిశేత్॥**

షష్ఠమందు రవియుండి, అక్కడనే మరొక పాపగ్రహమును ఉండి, రవి క్రూరగ్రహదృష్టి కలిగియున్నవానికి పైత్యప్రాబల్యముండును.

**26.** **తథాభూతేనిశానాథేక్రూరదృష్టేతదంశకే।**
**వాతార్తితోభవేజ్జాతోరక్తపిత్తార్తితఃకుజే॥**

షష్ఠమున చంద్రుడుండి, క్రూరగ్రహదృష్టికలిగి, క్రూరనవాంశయందున్న,

జాతకుడు వాతవ్యాధిపీడితుడగును. షష్టమున కుజుడుండి, పాపగ్రహదృష్టికలిగి, పాపగ్రహ నవాంశయందున్న రక్తపైత్యవ్యాధికలుగును.

27. శ్లేష్మవాతార్తితస్సౌమ్యేతథాభూతేవిశేషతః ।
నదోషస్తాదృశేజీవేశుక్రేమూలాతిసారరుక్ ॥

షష్టమున బుధుడుండి, పాపగ్రహదృష్టుడై, పాపనవాంశయందుండిన శ్లేష్మవాతవ్యాధి కలుగును. షష్టమున గురుడుండి పాపదృష్టికలిగి, పాపనవాంశయందున్న జాతకునకు ఏ రోగమునుండదు. షష్టమున శుక్రుడుండి పాపగ్రహదృష్టి కలిగి, పాపనవాంశస్థితుడయిన మూల, అతిసార వ్యాధులు కలుగును.

28. తథాభూతేశనౌగుల్మరోగోవాత్రవిశేషతః ।
రాహుకేతునమాయుక్తేబాధాపైశాచికీస్మృతా ॥

షష్టమందు శనియుండి, పాపగ్రహముతోకూడి, పాపనవాంశయందున్న గుల్మరోగము గలుగును. రాహుకేతువులు షష్టమునఉండి పాపగ్రహదృష్టి కలిగి, పాపనవాంశనుపొందిన పిశాచబాధ కలుగును.

29. చంద్రేషష్టేకుజయుతేభ్రాంతిశ్వేతేపాండ్వాదిరోగభాక్ ।
శిఖోచంద్రేరవియుతేవిసర్పాశూలరోగభాక్ ॥

చంద్రకుజులు షష్టమందున్న భ్రాంతి, శ్వేతకుష్టవు (బొల్లి) పాండురోగము కలుగును. చంద్రుడు రవితోకలిసియున్న విసర్పి, శూలరోగములు కలుగును.

30. షష్ఠేబుధేకుజయుతేభృగుచంద్రనిరీక్షితే ।
క్రూరాంశకసమాయుక్తేక్షయరోగంవదంతిహి ॥

షష్టమున బుధుడు కుజయుక్తుడై శుక్రచంద్రులచే చూడబడిన క్రూరాంశయందున్న-క్షయరోగి యగును.

31. శన్యారసహితేషష్ఠేరవిరాహునిరీక్షితే ।
శుభైరదృష్టయుక్తేవాశ్వాసకాసక్షయాదిరుక్ ॥

షష్టమున శనికుజులుండి రవిరాహువుచే చూడబడిన, శుభులయుతిగాని, దృష్టిగానిలేకున్న శ్వాస, కాస, క్షయరోగములు కలుగును.

32. బలహీనేరిపాధేవాలగ్నస్థేవాధరాసుతే ।
అజీర్తిర్ముఖరోగోవాగుల్మవిడ్వ్యాధిభాగ్భవేత్ ॥

బలహీనుడయిన షష్టాధిపతిగాని, కుజుడుగాని, లగ్నమందున్న - అజీర్ణము గాని, ముఖరోగముగాని, గుల్మరోగముగాని, మలవ్యాధికాని కలుగును.

33. షష్ఠేశ్వరస్థితాంశేశేరవ్యారౌస్యాత్తథావదేత్ ।
ఫలంపూర్వోక్తమత్యుగ్రక్రమాత్తన్యలివిర్భికేత్ ॥

షష్టాధిపతియున్న నవాంశాధిపతి రవియైనా, కుజుడైనా పూర్వోక్త ఫలము నెరుగునది.

34. జలరాశిగతేచంద్రేషష్ఠేతద్భవనాధిపే ।
జలర్షస్థేవిదాదృష్టేమూత్రకృచ్ఛ్రాదిరోగభాక్ ॥

చంద్రుడు జలరాశిగతుడై షష్టమందున్న, షష్టాధిపతియు జలరాశిగతుడై బుధదృష్టుడైన మూత్రకృచ్ఛ్రము కలుగును.

35. షష్ఠేచంద్రేశనౌరంధ్రేవ్యయేపాపేవిలగ్నపే ।
పాపాంశకసమాయుక్తేపీనసంరోగమాదిశేత్ ॥

షష్టమున చంద్రుడు, అష్టమమునశని, ద్వాదశమందు పాపులుండి, లగ్నాధిపతి పాపాంశలోఉన్న పీనసరోగము కలుగును.

36. శత్రుస్థానాధిపేదుస్థేనీచమూఢారిసంయుతే ।
లగ్నేశేబలసంయుక్తేశత్రునాశంవదేత్తదా ॥

షష్టాధిపతి 6, 8, 12 లందుండి, నీచ, మూఢ (అస్తంగత) శత్రుభావ యుక్తుడయిన, లగ్నాధిపతి బలవంతుడయిన శత్రునాశము కలుగును.

37. శుభగ్రహేణసందృష్టేశత్రుస్థానాధిపేసతి ।
శుభాన్వితేశుభక్షేత్రేతేనమైత్రీంవినిర్దిశేత్ ॥

శత్రుస్థానాధిపతి శుభగ్రహదృష్టుడై, శుభక్షేత్రమునఉండి, శుభయుక్తుడయిన శత్రువుతో మైత్రికలుగును.

38. లగ్నేశేషష్ఠభావస్థేషష్ఠేశేననిరీక్షితే ।
తౌవావిలగ్నభావస్థౌజ్ఞాతిపీడాంవినిర్దిశేత్ ॥

లగ్నాధిపతి షష్టమందుండి షష్టాధిపతిచే చూడబడినా, లగ్నాధిప, షష్టాధిపతులు లగ్నమందున్నా జ్ఞాతులవలన బాధకలుగును.

39. గురుశుక్రవిలగ్నేశాఃషష్ఠభావేశ్వరాన్వితాః ।
శన్యారఫణిసందృష్టాఃజ్ఞాతిపీడాంవినిర్దిశేత్ ॥

గురుశుక్రలగ్నాధిపతులు ముగ్గురును షష్టాధిపతితోకూడి, శనికుజ రాహువులతో చూడబడిన జ్ఞాతిపీడ కలుగును.

40. లగ్నాధిపేబలయుతేషష్ఠేచంద్రేథవాశుభే ।
కేంద్రత్రికోణగేజీవేజ్ఞాతిభిస్సహజీవనం ॥

లగ్నాధిపతి బలవంతుడై షష్టమున చంద్రుడుగాని, మరొక శుభగ్రహము గాని ఉండి, గురుడు కేంద్రకోణగతుడైన జాతకుడు జ్ఞాతులతో సహజీవనము చేయును.

41. జ్ఞాతయోబహవస్సంతిషష్ఠేశేదేవపూజితే ।
శుభాన్వితేశుభై ర్దృష్టేమృద్వంశాదిసమన్వితే ॥
షష్ఠాధిపతి గురుడై, శుభయుక్తుడై, శుభదృష్టుడయిన, మృద్వంశాదియుతుడైన జాతకునకు జ్ఞాతి బాహుళ్యముండును.

42. జ్ఞాతిక్షయంవిజానీయాత్ షష్ఠేశేపాపసంయుతే ।
క్రూరాంశనీచమూఢాదౌశుభదృగ్యోగవర్జితే ॥
షష్ఠాధిపతి పాపయుక్తుడై, క్రూరనవాంశ, నీచ, మూఢత్వాదులను కలిగి యున్న, శుభదృష్టి, యుతిలేకున్న-జ్ఞాతిక్షయము కలుగును.

43. పారావతాదిభాగస్థేలగ్నేశేశుభవీక్షితే ।
శత్రుపేబలహీనేవాతస్మాదుత్కృష్టతాంవదేత్ ॥
లగ్నాధిపతి పారావతాద్యంశయందుండి, శుభగ్రహదృష్టుడై, షష్ఠాధిపతి బల హీనుడయిన జాతకుడు జ్ఞాతులకన్న శ్రేష్ఠుడగును.

44. భాగ్యేశేషష్ఠరాశిస్థేషష్ఠేశేననిరీక్షితే ।
షష్ఠేశేమందభౌమాభ్యాంయుతేచోరాగ్నిపీడనం ॥
భాగ్యాధిపతి షష్ఠమందుండి, షష్ఠాధిపతిచే చూడబడి, షష్ఠాధిపతి శనికుజ యుక్తుడైన, చోరాగ్నిపీడ కలుగును.

45. తదీశేగోపురాంశాదౌదినేశేననిరీక్షితే ।
లగ్నేశేబలసంపూర్ణేజ్ఞాతినాముపకారకృత్ ॥
షష్ఠాధిపతి గోపురాంశాదికమునఉండి, రవిచేచూడబడి, లగ్నాధిపతి బలవంతు డయిన జాతకుడు జ్ఞాతులకుపకారము చేయును.

46. షష్ఠేసౌమ్యేశుభై ర్దృష్టేతదీశేశుభసంయుతే ।
పాపగ్రహాణాంమధ్యస్థేఉపదంశప్రియోభవేత్ ॥
షష్ఠమున శుభగ్రహముండి, శుభగ్రహదృష్టమై, షష్ఠాధిపతియు శుభగ్రహ యుక్తుడై, శుభగ్రహ మధ్యవర్తియైన ఉపదంశప్రియుడగును. ఉపదంశమనగా నల్చుకొనునట్టి ఊరగాయ వగైరా.

47. ఉపదంశప్రియోనిత్యంషష్ఠేజీవశశాంకజౌ ।
క్షేత్రేతయోర్వాసంప్రాప్తేమృద్వంశాదిసమన్వితే ॥
షష్ఠమందు గురుబుధులున్నా, షష్ఠరాశి గురుబుధక్షేత్రమై, మృద్వంశాది షష్ఠ్యంశగతమైనా ఉపదంశప్రియుడగును.

48. మకశేత్యేషష్ఠభావస్థేశుక్రేవాతన్య నాయకే ।
మధురాదిప్రియోనిత్యంగోపురాద్యంశకాన్వితే ॥

గురుడు షష్ఠమందుండి, లేక గురుడుండి, గోపురాద్యంశయుక్తుడయిన తీపి పదార్థమందిష్టము కలుగును.

**49.** శుక్రేషష్ఠే ససౌమ్యేవాశుభదృష్టేశుభాంశకే।
బలాన్వితేశుభాంశస్థేనిత్యంమధురభాగ్భవేత్॥

షష్ఠమున శుక్రుడుండి, శుభయుక్తునయినా, శుభదృష్టుడైనా, శుభాంశయందున్న బలయుక్తుడై శుభషష్ఠ్యంశగతుడయిన మధురపదార్థప్రియుడగును.

**50.** పాపగ్రహాణాంసంబంధేషష్ఠే మధురవర్జితః।
షష్ఠేశ్వరేశుభైర్దృష్టేభౌమక్షేత్రేతదన్వితే॥

అష్టమము పాపరాశియై, పాపసంబంధమున్న తీపియందిష్టముండదు. షష్ఠాధిపతి శుభదృష్టుడై కుజక్షేత్రమున, కుజయుక్తుడైయున్న నేతినెక్కువగా తినును.

**51.** దివసేశేనవాదృష్టేఆజ్యభాక్చనరోభవేత్।
షష్ఠేశేభానుసంయుక్తేరాహుకేతుసమన్వితే॥

షష్ఠాధిపతి రవిదృష్టుడైనా ఘృతప్రియుడగును. షష్ఠాధిపతి రవిరాహుకేతువులతో కూడియున్నా —

**52.** భౌమక్షేత్రగతేవాపివిప్రలంభాదిచౌర్యభాక్।
రాహుకేతునసూయుక్తేషష్ఠేపాపనిరీక్షితే॥

కుజక్షేత్రమున షష్ఠాధిపతియున్నా, వివాదచౌర్యము చేయువాడగును. షష్ఠము రాహుకేతుయుక్తమై, పాపదృష్టమైన —

**53.** క్రూరాంశకేతదీశేవావిప్రలంభాదిచౌర్యభాక్।
పిత్రాదీనామిదంవాచ్యంతత్తద్భావోపకారకైః॥

షష్ఠాధిపతి క్రూరాంశయందున్నా వివాదచౌర్యము కలుగును. ఈ యోగములు పిత్రాదులకును ఆయా భావములబట్టి చెప్పనగును.

**54.** సుతారిభావజాహ్యర్థావిస్తరేణప్రకీర్తితాః।
విచిత్రార్థసమాయుక్తావేంకటేశేనధీమతా॥

పుత్ర, శత్రు భావములవలన కలుగు ఫలములు విస్తరముగా శ్రీ వేంకటేశునిచే చెప్పబడినవి.

**55.** నాస్తికాయ నవక్తవ్యావక్తవ్యాసుజనాయతు।
సాధుభిస్తుగృహీతవ్యావిద్వద్భిఃకాలకోవిదైః॥

ఇది నాస్తికునకు చెప్పరాదు. సుజనునికి చెప్పవలెను. పండితులయిన జ్యోతిషికులు గ్రహింపదగినది.

ఇది సాంధ్ర తాత్పర్య సర్వార్థ చింతామణియందు శత్రుభావ మను
సప్తమాధ్యాయము.

# అష్టమాధ్యాయము

1. యువతిపదాదుద్వాహంభార్యాపతిసంపద్వృద్ధిగుడక్షీరం ।
అగమనరిద్గవాప్తింమూత్రాశయంచనష్టధనం ॥

సప్తమస్థానమువలన - వివాహము, భార్య, పతి, సంపత్తు, పెరుగు, బెల్లము, పాలు, అగమము, నది, గోవులరాక, మూత్రాశయము, నష్టధనమును చెప్పవలెను.

2. శుక్రేకళత్రేత్వతికాముకస్స్యాద్బుధేన్యదారేషురతోగురౌతు ।
స్వదారనక్తోదిననాథపుత్రేశుదారయుక్తస్సపతౌసుదారః ॥

కళత్ర స్థానమున శుక్రుడున్న అతికాముకుడు, బుధుడున్న పరదారాసక్తుడు, గురుడున్న స్వభార్యాసక్తుడు, శనియున్న కామిన్యాసక్తుడు, సప్తమాధిపతియున్న మంచి భార్యకలవాడగును.

3. కుజేబహుస్త్రీషురతఃకులఘ్నోభానౌకుటుంబేపరదారయుక్తః ।
లగ్నస్థితావిత్తకళత్రశత్రునాథాస్సశుక్రాయదిపాపయుక్తాః ॥

సప్తమమందు కుజుడున్న బహుస్త్రీసక్తుడు, కులఘాతకుడునగును. రవి యున్న పరస్త్రీఆసక్తుడు 2,6,7 అధిపతులు శుక్రునితోకూడి, పాపగ్రహయుక్తులై లగ్నమందున్న—

4. జాతఃపరస్త్రీషురతఃకుమార్గఃశుభేక్షితాశ్చేన్నతథాభవేత్తు ।
లగ్నారిపౌపాపసమన్వితౌచేజ్జాతఃపరస్త్రీషురతఃకుమార్గీ ॥

పరస్త్రీరతుడు, దుర్మార్గుడునగును. శుభదృష్టియున్న అట్లుకాదు. లగ్న, షష్ఠాధిపతులిద్దరును పాపగ్రహయుక్తులైనను పరస్త్రీరతుడు, దుర్మార్గుడునగును.

5. లగ్నేశ్వరేశత్రుకుటుంబనాథేపాపైర్యుతేవాయదివారిరాశౌ ।
శరీరగేవాయదిదారనాథేజాతఃపరస్త్రీషురతఃకుటుంబే ॥

లగ్న, షష్ఠ, ద్వితీయాధిపతులు పాపగ్రహయుక్తులై షష్ఠమందున్నా, లేక-సప్తమాధిపతి లగ్నమందున్నా కుటుంబమున పరదారాసక్తుడగును.

6. రాహుకేతౌయదిదారనాథేపాపేక్షితేవావ్యభిచారయోగః ।
కర్మేశవిత్తేశకళత్రనాథాఃమానస్థితాజారముదాహరంతి ॥

సప్తమాధిపతి రాహుకేతుయుక్తుడై, పాపగ్రహదృష్టుడయిన వ్యభిచారియగును. 2,10,7 అధిపతులు దశమమున ఉండిన జారుడగును.

7. ఏకోగ్రహస్తేషుచతుర్థరాశౌజాతఃపరస్త్రీగమనంప్రయాతి ।
శుక్రేశ్వరేదారపతౌబలాఢ్యేదృష్టేయుతేవారిపునాయకేన ॥

దశమ, ద్వితీయ, సప్తమాధిపతులలో నెవరయినా చతుర్థమందుండిన పరదారాసక్తుడగును. పంచమ, సప్తమాధిపతులు బలవంతులై షష్ఠాధిపతితోకూడినా, చూడబడినా—

8. జాతోనపత్యోయదితత్కళత్రేజారాత్ప్రసూతస్స్వ్యచ్ఛుభఖేటదృష్టే ।
దారేశ్వరేపాపయుతేకుటుంబేభౌమేనదృష్టోయదిజారపుత్రః ॥

అనపత్యుడు (సంతానము లేనివాడు) అగును. పంచమ, సప్తమాధితులలో నెవరయినా షష్ఠాధిపతి సంబంధము కలవారైన, శుభగ్రహదృష్టియున్న - ఆతని కళత్రమునందు జారునివలన పుత్రుడు కలుగును. సప్తమాధిపతి పాపయుక్తుడై ద్వితీయమందుండి కుజునిచే చూడబడిన జారజాతుడు పుత్రుడగును.

9. దృష్టేశుభేదారబహుత్వయోగేత్వపుత్రయోగంమునయోవదంతి ।
క్షీణేశశాంకేయదిపాపయుక్తేదారస్థితేత్వన్యకళత్రగామీ ॥

అశుభమైన బహుదారయోగము అపుత్రయోగము కలగవచ్చునని మును లనిరి. క్షీణచంద్రుడు పాపగ్రహయుక్తుడై సప్తమమందున్న పరదారగమనము చేయును.

10. నీచేభృగౌవాయదివాశశాంకేనీచస్థితేచాంబునిదారహానిః ।
ఉద్బంధనాత్తన్మరణంవదంతిదారేశ్వరేపాశభుజంగముఖ్యే ॥

శుక్రుడుకాని చంద్రుడు కానినీచస్థుడై చతుర్థమునఉన్న భార్యకు హాని కల్గును. సప్తమాధిపతి పాశ, సర్పద్రేక్కాణమందున్న జాతకునిభార్య ఉరిపోసుకొని మరణించును.

11. ద్రేక్కాణభాగేవిషభక్షణాద్వామానాన్వితేదారపతౌసరాహౌ ।
స్వర్క్షేకుటుంబాధిపతౌకళత్రనాథేయదాత్వేకకళత్రభాక్స్యాత్ ॥

సప్తమాధిపతి రాహుయుక్తుడై దశమమందున్న విషభక్షణమువలన మరణించును. ద్వితీయ, సప్తమాధిపతులు స్వక్షేత్రమందున్న జాతకు డేక కళత్రవంతు డగును.

12. తాభ్యాంసమేతైర్గ్రహనాయకైర్వాకళత్రసంఖ్యాంప్రవదంతిసంతః ॥

ద్వితీయ, సప్తమాధిపతులతో ఎన్నిగ్రహములు కూడియుండునో అందరు భార్యలని చెప్పుదురు.

13. కళత్రేశేబహుగుణేతుంగవక్రాదిహేతుభిః ।
బహుభార్యంనరంవింద్యాదుదయర్క్షగతేతథా ।
భార్యాద్వయంభవేత్తత్రలగ్నేశేనాశరాశిగే ।

కళత్రాధిపతి ఉచ్ఛస్థుడగుట, వక్రిగుటవంటి కారణములచే బలవంతుడైనా, లగ్నగతుడయినా, బహుభార్యలుందురు, ఆ యోగమున లగ్నాధిపతి అష్టమమున ఉన్న ద్వికళత్రయోగము.

14. కళత్రేపాపసంయుక్తేకళత్రేశేతునీచగే ।
పాపేకళత్రరాశిస్థేవివాహద్వయమాదిశేత్ ॥

సప్తమము పాపరాశియై, కళత్రాధిపతి నీచగతుడై, సప్తమమున పాపగ్రహమున్న రెండు వివాహములగును.

15. కారకేపాపసంయుక్తేనీచరాశ్యంశగేపివా ।
పాపగ్రహేణసందృష్టేవివాహద్వయమాదిశేత్ ॥

శుక్రుడు పాపగ్రహయుక్తుడై, నీచరాశిలోగాని, నీచనవాంశలోగాని యున్న పాపగ్రహ దృష్టుడైన రెండు వివాహములగును.

16. కళత్రకారకశ్చంద్రోజ్ఞోవాజీవోథవాభృగుః ।
మధ్యేబలిష్ఠోయస్తేషాంతస్మాత్సర్వంనిరూపయేత్ ॥

కళత్రాధిపతి, చంద్ర, బుధ, గురు, శుక్రులలో ఏ గ్రహము బలవత్తరమో దానినిబట్టి సర్వము నిరూపించవలెను.

17. కళత్రేవాకుటుంబేవాపాపదృగ్యోగసంభవే ।
తదీశేబలహీనేతుకళత్రాంతరభాగ్భవేత్ ॥

సప్తమముకాని, ద్వితీయముకాని పాపగ్రహ సంబంధము కలిగియున్న, కళత్రాధిపతిగాని, ద్వితీయాధిపతికాని బలహీనుడయిన రెండవభార్య కలుగును.

18. సప్తమేచాష్టమేవాపివ్యయేభూసూనుసంయుతే ।
అదృష్టేపతినాథేనకళత్రాంతరభాగ్భవేత్ ॥

సప్తమ, అష్టమ, వ్యయములందు కుజుడుండి, సప్తమాధిపతిచే చూడబడకున్న రెండవభార్య కలుగును.

19. నీచమూఢారిభావస్థేలగ్నేశేదారపేథవా ।
క్రూరషష్ట్యంశకేవాపికళత్రాంతరభాగ్భవేత్ ॥

లగ్నాధిపతికాని, సప్తమాధిపతికాని నీచ, మూఢ, శత్రురాశి, నవాంశస్థితుడై క్రూరషష్ట్యంశగతుడయిన రెండవభార్య యుండును.

20. దారేశస్థనవాంశేశేనీచమూఢారిభాంశకే ।
పాపాంతరేపాపదృష్టేకళత్రాంతరభాగ్భవేత్ ॥

కళత్రాధిపతియున్న నవాంశాధిపతి నీచ, మూఢ, శత్రుస్థాన, అంశగతుడై

పాపగ్రహమధ్యనఉండి (పాపకర్తరి) పాపగ్రహముచే చూడబడిన కళత్రాంతర యోగము.

21. ఏవంకుటుంబనాథేనకారకస్థాంశపేనవా।
పాపాంతరేదారగృహేతన్నాథేపికళత్రహా॥

ఇట్లు ద్వితీయాధిపతిచేతను, కళత్రకారకుడున్న నవాంశరాశ్యధిపతిచేతను, కళత్రస్థానము పాపగ్రహమధ్యగతమైనా, కళత్రాధిపతి పాపగ్రహమమధ్యవర్తియైనా కళత్రహాని కలుగును.

22. లగ్నేశ్వరాత్కర్మగతేసోమపుత్రేబలాన్వితే।
దారేవావిక్రమేచంద్రేబహుస్త్రీసంయుతోభవేత్॥

లగ్నాధిపతికి దశమమున బుధుడుండి, బలవంతుడై, చంద్రుడు తృతీయ, సప్తమములందున్న జాతకుడు బహుస్త్రీ సంబంధము కలవాడగును.

23. విత్తేపాపబహుత్వేతుకళత్రేవాతథావిధే।
తదీశేపాపసందృష్టేకళత్రత్రయభాగ్భవేత్॥

ద్వితీయమునగాని, సప్తమునగాని అనేక పాపగ్రహములుండి, ద్వితీయాధిపతిగాని, సప్తమాధిపతిగాని పాపదృష్టుడైన భార్యాత్రయముండును.

24. లగ్నేకుటుంబేదారేవాపాపఖేచరసంయుతే।
దారేశేనీచమూఢాదౌకళత్రత్రయభాగ్భవేత్॥

లగ్న ద్వితీయ సప్తమములో నేదైనా పాపగ్రహయుక్తమై, సప్తమాధిపతి నీచ, మూఢగతుడయిన కళత్రత్రయము కలుగును.

25. వ్యయార్థేశౌతృతీయస్థౌగురుణాచనిరీక్షితౌ।
భాగ్యనాథేనవాదృష్టౌబహుస్త్రీసహితోభవేత్॥

ధన, వ్యయాధిపతులు తృతీయస్థులై గురునిచేగాని, భాగ్యాధిపతిచేగాని చూడబడిన జాతకుడు బహు భార్యావంతు డగును.

26. కేంద్రత్రికోణేదారేశేస్వోచ్చమిత్రస్వవర్గగే।
కర్మాధిపేనవాయుక్తేబహుస్త్రీసహితోభవేత్॥

సప్తమాధిపతి కేంద్రకోణములందు, స్వ, ఉచ్చ, మిత్రరాశివర్గగతుడయినా, దశమాధిపతితోకూడినా బహుస్త్రీయుక్తు డగును.

27. లాభదారేశ్వరౌయుక్తౌపరస్పరనిరీక్షితౌ।
బలాఢ్యౌతౌత్రికోణస్థౌబహుదారసమన్వితః।

లాభకళత్రాధిపతులు కలిసియున్నా, పరస్పర దృష్టియున్నా, బలవంతులై కోణములందున్నా బహుదారయుతు డగును.

28. భాగ్యేశేదారరాశిస్థేదారేశేసుభభంగతే ।
భావేశేలాభనాథేవా కేంద్రేబహుకళత్రభాక్ ॥

భాగ్యాధిపతి సప్తమస్థుడై, సప్తమాధిపతి చతుర్థమందుండి, లగ్నలాభాధిపతులలో నెవరయినా, కేంద్రగతులయిన బహుకళత్రములుండును.

29. దారేశనంయుక్తనవాంశనాథయుక్తాంశనాథేయదిసౌమ్యయుక్తే ।
పారావతాంశాదిగతేబలాఢ్యేజాతశ్శతస్త్రీసహితోనరస్స్యాత్ ॥

సప్తమాధిపతియున్న నవాంశాధిపతి శుభగ్రహయుక్తుడై బలవంతుడైయున్న జాతకుడు వందమంది స్త్రీలను చూచును.

30. కుటుంబనాథస్థితరాశినాథనంయుక్తషష్ట్యంశపతౌబలాఢ్యే ।
మృద్వంశకేగోపురభాగయుక్తేజాతశ్శతస్త్రీద్విగుణంకళత్రం ॥

ద్వితీయాధిపతియున్న రాశ్యధిపతియున్న షష్ట్యంశాధిపతి బలవంతుడై మృద్వంశ, గోపురాంశలందున్న జాతకుడు రెండువందలమంది స్త్రీలతో సంబంధము కలవాడగును. (బహుభార్యాకుడు)

31. దారేశేకర్మరాశిస్థేకర్మేశేదారరాశిగే ।
తథావిధేకుటుంబేశేత్వసంఖ్యకకళత్రవాన్ ॥

సప్తమాధిపతి దశమమున, దశమాధిపతి సప్తమములలో నుండిన జాతకుడు అసంఖ్యాక స్త్రీలకు భర్తయగును.

32. ఏవంపిత్రాదిభావానాంకళత్రాదికమాదిశేత్ ।
దారేశేపాపసంయుక్తేదారేవాపాపసంయుతే ॥

ఈ రీతిగా పిత్రాది భావములకును కళత్రాదికమును చెప్పవలెను. సప్తమాధిపతి పాపయుక్తుడైనా, సప్తమస్థానము పాపగ్రహయుక్తమైనా—

33. దారేశస్థాంశపేవాపికుస్త్రీభాక్పునరోభవేత్ ।
క్రూరషష్ట్యంశకేదారనాథేకుస్త్రీయుతోభవేత్ ॥

సప్తమాధిపతియు, నవాంశాధిపతి పాపగ్రహయుక్తుడైనా నీచస్త్రీ సంబంధము కలుగును.

34. నీచాంశేనీచసంయుక్తేదారనాథేతకారకే ।
కుస్త్రీయుతోభవేజ్జాతశ్శుభదృష్టియుతేనహి ॥

కళత్రాధిపతి, కళత్రకారకుడును నీచగతులై, నీచనవాంశయందున్నా, నీచస్త్రీ సంబంధము కలుగును. శుభగ్రహయుతిగాని, దృష్టిగానియున్న అట్లుకాదు.

35. దారేశేశుభసంయుక్తేసత్కళత్రసమన్వితః ।
స్వోచ్చమిత్రస్వవర్గస్థేగోపురాద్యంశకేపివా ॥

సప్తమాధిపతి శుభగ్రహయుక్తుడైన సత్కళత్రము లభించును. ఆ కళత్రాధిపతి స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రస్థుడైనా, స్వవర్గమందున్నా, గోపురాద్యంశ గతుడయినా సత్కళత్రలాభము కలుగును.

36. మృదుషష్ట్యంశభాగస్థేసత్కళత్రసమన్వితః ।
గురుణావతినంద్రుష్టేదారనాథేబలాన్వితే ॥

కళత్రాధిపతి బలవంతుడై గురునిచేచూడబడి, మృద్వంశగతుడయిన సత్కళత్రము గలుగును.

37. కారకేవాతథాభూతేసత్కళత్రపరాయణః ।
కళత్రేశేభృగౌవాపిగురుసౌమ్యనిరీక్షితే ॥

కళత్రకారకుడు గురుదృష్టుడయినా, బలవంతుడై, మృద్వంశగతుడయినా, సత్కళత్రలాభము. కళత్రాధిపతికాని, శుక్రుడుకాని గురు బుధదృష్టుడయినా కళత్రము ధర్మశీల, పతివ్రతయగును.

38. గురుయుక్తేకళత్రేవాధర్మశీలాపతివ్రతా ।
కళత్రాధిపతౌకేంద్రేశుభగ్రహనిరీక్షితే ।
శుభాంశేశుభరాశౌవాభవేత్పత్నీపతివ్రతా ॥

సప్తమస్థానము గురుయుక్తమైనా, కళత్రాధిపతి కేంద్రగతుడై శుభగ్రహదృష్టుడై, శుభక్షేత్రమందున్నా, శుభనవాంశయందున్నా, భార్య పతివ్రతయగును.

39. కళత్రేశేరవౌవాపిపాపరాశ్యంశసంయుతే ।
పాపాన్వితేపాపదృష్టేపత్నీపానపరాయణా ।
పాపాంశకేవాదారేశేతథాభూతాంవదేద్బుధః ॥

కళత్రాధిపతికాని, రవిగాని పాపరాశి, నవాంశయుతుడయిన, పాపయుక్తుడైనా, పాపదృష్టుడైనా భార్య త్రాగేఅలవాటు కలదగును.

40. భానౌకళత్రాధిపతౌబలాఢ్యేశుభాన్వితేశోభనరాశిభాగే ।
శుభగ్రహేణాపినిరీక్షితేవాలగ్నేశమిత్రేపతిభక్తియుక్తా ॥

సప్తమాధిపతి రవియై బలవంతుడై శుభగ్రహయుక్తుడై శుభగ్రహరాశి, నవాంశలందున్న, శుభగ్రహదృష్టుడై, లగ్నాధిపతికి మిత్రుడయిన-భార్య పతిభక్తికలదగును.

41. దారేశ్వరేవాకుముదాత్మబంధౌపాపాన్వితేపాపనిరీక్షితేవా ।
పాపాంశగేపాపగృహాంతరస్థేకుమార్గదారాకథితాపరాధా ॥

కళత్రాధిపతియైన చంద్రుడు పాపగ్రహయుక్తుడు, దృష్టుడైన, పాపరాశిలో పాపనవాంశలో ఉన్నవాని భార్య చెడుప్రవర్తనకలది, కఠినురాలు, అపరాధము చేయునదియు అగును.

42. సౌమ్యాంశగే సౌమ్యగృహాంతరే వా మిత్రోచ్చగే హేమృదుభాగయుక్తే।
చంద్రే కళత్రాధిపతౌ చ శుక్రే సా పుణ్యశీలానుచరిత్రయుక్తా ॥

కళత్రాధిపతియైన చంద్రుడు, శుక్రుడును శుభరాశి, శుభ నవాంశయందున్న, స్వ, ఉచ్చ, మిత్రరాశిగతుడై, మృద్వంశగతుడయిన జాతకునిభార్య పుణ్యశీల, సచ్చరిత్రయగును.

43. దారాంశపే హీనబలే ధరాజే క్రూరాదిషష్ట్యంశసమన్వితే వా ।
నీచారిమూఢే విహగారిభాగే దుష్టాన్యసక్తామతికర్కశా స్యాత్ ॥

సప్తమాధిపతి కుజుడై బలహీనుడై, క్రూరాది షష్ట్యంశగతుడై నీచ, శత్రు, అస్తంగతుడై, పక్షి, శత్రుద్రేక్కాణగతుడయిన, భార్య దుష్టురాలు, పరపురుషాసక్తయు, కఠినురాలునగును.

44. మిత్రోచ్చవర్గే సతి దారనాథే శుభాన్వితే సౌమ్యదృశా సమేతే ।
పారావతాంశాదిగతే బలాఢ్యే క్రూరాపి పత్యుర్గుణమార్గవృత్తిః ॥

కళత్రాధిపతి కుజుడయిన మిత్ర, స్వక్షేత్ర, ఉచ్చలందుండినా, శుభగ్రహయుక్తుడయినా, పారావతాంశాదిగతుడై బలవంతుడయిన జాతకునిభార్య క్రూరచిత్తయైనా భర్తృ మార్గానువర్తిని యగును.

45. భార్యాధిపే సోమసుతే సపాపే నీచారిమూఢే నతినాశభావే ।
పాపాంతరే పాపదృశా సమేతే నారీ పతిఘ్నీ కులనాశకర్త్రీ ॥

సప్తమాధిపతి బుధుడై పాపగ్రహయుక్తుడై నీచ, శత్రు, అస్తంగతాదిగతుడై అష్టమ స్థానమున పాపగ్రహ మధ్యవర్తియైన, పాపగ్రహదృష్టికలిగిన వానిభార్య భర్తను చంపేది, కులనాశము చేయునదియునగును.

46. సుపుత్రసౌమ్యాదిసుధర్మశీలా వ్రతోపవాసాదివిశుద్ధభావా ।
గురౌ కళత్రాధిపతౌ బలాఢ్యే మిత్రోచ్చవర్గేయది గోపురాంశే ॥

గురుడు సప్తమాధిపతియై బలవంతుడై, స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రవర్తియై గోపురాంశగతుడయిన భార్య ధర్మశీల, మంచిపుత్రులుకలది. వ్రతోపవాసాది పరిశుద్ధ భావముకలదగును.

47. భృగోస్సుతే దారపతౌ సపాపే పాపేక్షితే నీచశత్రుగేహే ।
క్రూరాదిషష్ట్యంశసమన్వితే వా వేశ్యా నమానా కఠినాపి చోరా ।

శుక్రుడు సప్తమాధిపతియై పాపగ్రహయుక్తుడై, పాపదృష్టుడై, నీచ, శత్రు క్షేత్రవర్తియైన, క్రూరాది షష్ట్యంశగతుడయిన జాతకునిభార్య వేశ్యాసమానురాలు, దొంగతనము చేయునది అగును.

48. శుక్రేకళత్రాధిపతౌబలాఢ్యేశుభాన్వితేశోభనఖేచరాంశే ।
మిత్రోచ్చవర్గేస్వగృహేమృదుస్థేవాచాటకీపుత్రవతీగుణాఢ్యా ॥

సప్తమాధిపతి శుక్రుడై బలవంతుడై శుభగ్రహయుక్తుడై, దృష్టుడై శుభనవాంశ గతుడయిన, స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రవర్గ వర్తియైన, మృద్వంశగతుడయిన, వాని భార్య మంచిగా మాట్లాడునది (వాచాల) పుత్రవతి, గుణవంతురాలు నగును. వర్గమన ద్వాదశ వర్గమని అర్థము.

49. జారాచదుష్టాకులదూషకీస్యాన్మందేకళత్రాధిపతౌనపాపే ।
నీచాంశగేనీచగృహేరిగేహేపాపేక్షితేపాపవియచ్చరాంశే ॥

కళత్రాధిపతి శనియై పాపగ్రహయుక్తుడై, దృష్టుడై, నీచరాశి, నవాంశగతుడై శత్రుక్షేత్రమున, పాపనవాంశయందున్న వానిభార్య కులట, కులదూషిత, దుష్టురాలునగును.

50. శుభేక్షితేధర్మయుతానుశీలామందేకళత్రాధిపతౌబలాఢ్యే ।
పరోపకర్త్రీద్విజదేవభక్తాస్త్రీబ్రహ్మనక్తాగురుదృష్టియుక్తే ॥

శని కళత్రాధిపతియైనా బలవంతుడై శుభగ్రహదృష్టి, యుక్తుడయిన, భార్య ధర్మయుక్త, పరోపకారిణి, దేవబ్రాహ్మణ భక్తికలది, తత్త్వజ్ఞానముకలది, సచ్చరిత్ర యగును.

51. నరాహుకేతౌమదరాశిసంస్థేపాపేక్షితేపాపయుతాకుశీలా ।
క్రూరాంశకేభర్తృవిషప్రదాస్యాల్లోకాపవాదాన్వితకష్టశీలా ॥

రాహుకేతువులు సప్తమమందుండి, పాపగ్రహదృష్టికలిగి, పాపయుక్తులై యున్న జాతకునిభార్య కుత్సితమైన శీలముకలదగును. వారు క్రూరాంశగతులైన భర్తకు విషము పెట్టునది, లోకాపవాదకలది చెడునడతకలది భార్యయగును.

52. దారేశ్వరేసన్నిహితేవిలగ్ననాథస్యబాల్యేపరిణీతిమాహుః ।
లగ్నాత్కళత్రాచ్ఛుభఖేచరేంద్రేసమీపరాశౌయదిసాతథైవ ॥

సప్తమాధిపతికి లగ్నాధిపతికి సమీపమందున్న బాల్యమున వివాహమగును. లగ్నమునకుగాని సప్తమమునకుగాని సమీపమున శుభగ్రహమున్న జాతకునకు బాల్యవివాహము జరుగును.

53. లగ్నేకుటుంబేయదిదారభావేశుభాన్వితేశోభనవర్గయుక్తే ।
తదీశ్వరేశోభనదృష్టియుక్తేబాల్యేవివాహాదికమాహురార్యాః ॥

లగ్న, ద్వితీయ, సప్తమములలో నేదియైనా శుభగ్రహయుక్తమై శుభగ్రహ వర్గుకల్గియున్న, తదధిపతి శుభగ్రహదృష్టి, యుక్తుడైనా, బాల్యవివాహమగును.

54. పారావతాంశాదిగతేకళత్రనాథేకుటుంబాధిపతౌబలాఢ్యే ।
మృద్వంశభాగేతనుభావనాథేబాల్యేవివాహంమునయోవదంతి ॥

కళత్రాధిపతి పారావతాంశాదిగతుడై, కుటుంబాధిపతి బలవంతుడయిన, లగ్నాధిపతి మృద్వంశగతుడైన జాతకునకు బాల్యవివాహము అగును.

55. భాగ్యంవివాహాత్పరతోవదంతిశుక్రే సప్తగేచోపచయాన్వితేవా ।
కుటుంబపేతాదృశభావయుక్తేలగ్నేశ్వరేవాశుభదృష్టియుక్తే ॥

శుక్రుడు సప్తమమునగాని, ఉపచయ స్థానములందుగాని ఉండి, కుటుంబాధిపతి భావమున (ద్వితీయ, సప్తమములు) ఉండగా, లగ్నాధిపతి శుభదృష్టుడైన జాతకునకు వివాహానంతరము భాగ్యము కలుగును.

56. తత్కారకేదారపతౌకుటుంబనాథేవిలగ్నాధిపతౌచదుస్థే ।
నీచారిమూఢాంశగతేనపాపేభాగ్యంవివాహాంతముపైతినాశం ॥

కళత్రాధిపతి, కళత్రకారకుడు, ద్వితీయ, లగ్నాధిపతులు-నల్గురును దుష్టస్థానము(6,8,12) లందుండి, నీచ, శత్రు, అస్తంగతులయిన, పాప గ్రహయుక్తులయినవాని భాగ్యము వివాహానంతరము నశించును.

57. క్రూరాదిషష్ట్యంశసమన్వితేవాతత్కారకేతాదృశభేచరేంద్రే ।
శుభాన్వితేశోభనదృష్టియుక్తేనాశాత్పరంభాగ్యముపైతిజాతః ॥

కళత్రాధిప, తత్కారకులు క్రూరాది షష్ట్యంశగతులై, శుభగ్రహయుక్తులు, దృష్టులునైన వివాహానంతరము భాగ్యము నశించినా, తిరిగిలభించును.

58. క్రూరేకళత్రేశయుతేత్రికోణేతత్కారకేపాపసమన్వితేవా ।
కుటుంబరాశౌయదివాత్రజాతఃదూరేవివాహంకథయంతిసంతః ॥

కళత్రాధిపతి క్రూరగ్రహముతోకూడి, త్రికోణమందున్నా, కళత్రకారకుడు కాని, కుటుంబస్థానముకాని పాపగ్రహయుక్తమయినను, దూరమున (దూరదేశము కాని, ఆలస్యముగాగాని) వివాహమగును.

59. మానేనపాపేయదివాకుటుంబేభాగ్యేథవాపాపయుతేకళత్రే ।
క్రూరాంశగేక్రూరనిరీక్షితేవాదూరేవివాహంకథయంతిసంతః ॥

దశమ, ద్వితీయ, నవమములో నేదయినా పాపయుక్తమై, సప్తమము పాపగ్రహయుక్తమై క్రూరాంశగతమైన, పాపగ్రహదృష్టమైనా వివాహము దూరమున (వయసుమీరినతర్వాత) అగును.

60. లగ్నేశ్వరాద్దీనబలేకళత్రనాథేరిభాగాంశయుతేవిమూఢే ।
నీచాంశగేనీచసమన్వితేవానికృష్టజాతౌహికళత్రభావః ॥

లగ్నాధిపతికన్న కళత్రాధిపతి బలహీనుడై శత్రునవాంశగతుడై అస్తంగతుడయినా నీచరాశి, నవాంశలయందున్నా జాతకునకు నికృష్టజాతిస్త్రీ భార్యమగును.

61. లగ్నేశ్వరాత్పూర్ణబలేకళత్రనాథేశుభాంశేశుభదృష్టియుక్తే ।
వైశేషికాంశేపరమోచ్చభాగేఉత్కృష్టజాతౌతుకళత్రలాభః ॥

లగ్నాధిపతికన్న కళత్రాధిపతి బలవంతుడయిన శుభాంశయందు, శుభగ్రహదృష్టుడై, వైశేషికాంశలో పరమోచ్చభాగలోఉన్న జాతకునకు ఉత్కృష్టజాతి భార్య కలుగును.

62. లగ్నేశ్వరేహీనబలేకళత్రనాథాత్సపాపేయదినీచభాగే ।
నాశస్థితౌవాత్వవరోహభాగేకళత్రజాతేఃన్వయమత్రహీనః ॥

లగ్నాధిపతి కళత్రనాథునికన్న హీనబలుడయిన, పాపగ్రహయుక్తుడయిన నీచనవాంశస్థుడయిన, అష్టమమందున్నా అవరోహదశలోనున్న కళత్రముకన్న జాతకుడు తక్కువజాతివాడగును.

63. తస్మాద్బలాఢ్యేహివిలగ్ననాథేత్వారోహభాగేపరమోచ్చకాంశే ।
కేంద్రత్రికోణేయదివానసౌమ్యైశ్రేష్ఠఃకళత్రాత్స్వయమత్రజాతః ॥

సప్తమాధిపతికన్న లగ్నాధిపతి బలయుక్తుడై, ఆరోహభాగమందుండి, పరమోచ్చ నవాంశయందున్న, శుభగ్రహయుక్తుడై కేంద్రకోణములందున్న జాతకుడు భార్య జాతికన్న శ్రేష్ఠమైన జాతివాడగును. గ్రహమున్న రాశిలో పూర్వభాగము (1-15) ఆరోహభాగము, ఉత్తరభాగము (16-30) అవరోహభాగము, అనబడును.

64. కళత్రనాథాద్యదివాకలత్రరాశేఃకుటుంబాధిపతేర్వవేద్వా ।
బలేనసామ్యేనమజాతిమాహుఃస్త్రియంసుశీలాపతిభక్తియుక్తా ॥

కళత్రనాధునితోగాని కళత్రరాశితోగాని కుటుంబాధిపతికి సామ్యమున్న సమానజాతిస్త్రీ భార్యయగును. మంచి స్వభావము, పతిభక్తిగలస్త్రీ భార్యయగును.

65. లగ్నేశ్వరస్యాపికళత్రనాథేశత్రౌనశత్రౌరిపుభావమేతి ।
మిత్రేహిమిత్రంతునమేనమత్వమిత్యాదికంవీక్ష్యవదేత్సువిద్వాన్ ॥

లగ్నకళత్రాధిపతులు శత్రువులయిన భార్యాభర్తలు శత్రువులగుదురు. మిత్రులయిన మిత్రులగుదురు. సములయిన సములగుదురు.

66. కళత్రనాథేరిపునీచసంస్థేమూఢేథవాపాపనిరీక్షితేవా ।
పాపైర్యుతేసౌమ్యదృశావిహీనేకళత్రశోకంప్రవదంతిసంతః ॥

కళత్రాధిపతి శత్రు, నీచరాశిగతుడయిన, అస్తంగతుడయిన పాపగ్రహ దృష్టుడైన, యుక్తుడయిన, శుభగ్రహదృష్టి లేకున్న జాతకునకు కళత్రశోకము కలుగును.

67. కళత్రాధిపతేర్వర్ణంరాశేర్వాకారకస్యవా ।
సర్వోత్తమబలస్త్యైవతేషాంమధ్యేవినిర్దిశేత్ ॥

కళత్రరాశి, కళత్రాధిపతి, కళత్రకారకులలో బలీయమయినవారి వర్ణము శీలము, మున్నగునవి కళత్రమునకు కలుగును.

68. గురుణారూపసంపన్నాతస్మిఞ్శుభనిరీక్షితే ।
పాపేక్షితేపాపయుతేకురూపాదుర్గుణాభవేత్ ॥

కళత్రాధిపతి గురుడయినను, కళత్రస్థానము శుభదృష్టమైనా, భార్య రూపవతి యగును. పాపగ్రహదృష్టమైనా, కూడినా భార్య కురూపి, దుర్గుణవంతురాలు నగును.

69. కళత్రనాథాంశపతేస్తదీయంరాశింకళత్రస్యవిదుర్మహాంతః ।
తస్యోచ్చరాశియదివాకళత్రంరాశింతదంశంశ్రితమేతదీయం ॥

కళత్రాధిపతియున్న నవాంశరాశిగాని, కళత్రాధిపతి కుచ్చరాశిగాని, కళత్ర రాశి నవాంశగాని ఈ మూడిటిని కళత్రరాశిగా చెప్పుదురు.

70. కళత్రరాశిత్రితయేథవాస్యాత్తదీయసంయుక్తభకోణరాశౌ ।
కళత్రరాశింసముదాహరంతిప్రోక్తాన్యరాశౌయదినాస్తిపుత్రః ॥

ఆ కళత్రరాశిత్రయమందుగాని, లేక కళత్రరాశికి పంచమ, నవమములందైనా కళత్రజన్మరాశియగును. ఈ చెప్పిన రాశులు కాక మరొకరాశి కళత్రజన్మరాశి యైన పుత్రులు కలుగరు.

71. గోసింహకన్యాళిషుజన్మరాశౌస్త్రీణాంభవేజ్జన్మనిచాల్పపుత్రః ।
శుభగ్రహైరాక్రమితేషుతేషుసుతాన్వదేత్తత్రబహూన్గుణాఢ్యాన్ ॥

స్త్రీల జన్మరాశి వృషభ, సింహ, కన్యా, వృశ్చికములందైన స్వల్పపుత్ర సంతానము కలుగును. అవి శుభగ్రహయుక్తములయిన అందు జన్మించిన స్త్రీకి చాల పుత్రులు కలుగుదురు.

72. వంధ్యాసంగోమదేభానౌచంద్రేదాసీసమాస్త్రియః ।
కుజేరజస్వలాసంగఃవంధ్యాసంగశ్చకీర్తితః ॥

సప్తమమందు రవియున్న గొడ్రాలితోను, చంద్రుడున్న దాసీ సమానతోను, కుజుడున్న రజస్వలతోగాని, వంధ్యతోగాని సంగమము కలుగును.

73. బుధేవేశ్యార్థహీనాస్యాద్వణిక్ స్త్రీవా,ప్రకీర్తితా ।
గురౌ,బ్రాహ్మణభార్యాస్యాద్గర్భిణీసంగమోభృగౌ ॥

సప్తమమున బుధుడున్న ద్రవ్యములేని వేశ్యకాని, వర్తకముచేయు వనిత గాని, గురుడున్న బ్రాహ్మణ భార్యతోను, శుక్రుడున్న గర్భిణీస్త్రీతోను సంగమము కలుగును.

74. హీనావాపుష్పిణీవాస్యాన్మందకేతుఫణీశ్వరైః ।
రాహౌచగర్భిణీసంగఃకృష్ణాయాంకుబ్జయాశనౌ॥

సప్తమమున శనిరాహుకేతువులున్న హీనజాతిస్త్రీతోగాని, రజస్వలతోగాని సంగమము కలుగును. రాహువున్న గర్భిణితోను, శనియున్న నల్లని, పొట్టిదైన స్త్రీ తోను సంగమము కలుగును.

75. ఏవంసుఖస్థితైరేతైరేభిదృక్సంగమఉహ్యతే ।
సూర్యాద్యైస్సుఖగైర్వాచ్యోభోగగ్రహవినిర్ణయః ॥

సప్తమ భావమునకు చెప్పినట్లే చతుర్థమందున్న గ్రహములవున్న ఫలము చెప్పదగినది. 'భోగగ్రహ' అన్నపదమునకు 'భోగగృహ' అని అర్థము చెప్పిరి. అది సమంజసమే. చతుర్థమందున్న రవ్యాదిగ్రహములచే భోగగృహము చెప్పదగి నది. ఎట్లనగా—

76. వనంగృహంచకుడ్యంస్యాత్ విహారోదేవతాలయః ।
జలంహారిర్గజస్థానమితి స్థానం నిరూప్యతాం ॥

రవికి వనము, చంద్రునకు గృహము, కుజునకు గోడ, బుధునకు విహార స్థానము, గురునకు దేవతాగృహము, శుక్రునకు జలస్థానము, శనికి కోతులు ఉండు చోటు, రాహువునకు ఏనుగులుండుచోటు, ఇట్లు సంగమ సుఖస్థానమును నిరూపించ వలెను.

77. పాపైర్యుక్తైశ్చతుష్కేంద్రేచతుష్పాన్మైథునంవదేత్ ।
పాపదృష్టేషుసర్వేషుకేంద్రేష్వేవంవినిర్దిశేత్ ॥

లగ్నాదికేంద్రములు నాల్గింట పాపగ్రహములున్న, పాపగ్రహములచే చూడబడినా జాతకుడు చతుష్పాద జంతువువలె సంగమించును.

78. కేంద్రత్రితేపాపయుతేపశువన్మైథునంవదేత్ ॥
మందేసూర్యేసుఖేభౌమేపశువన్మైథునంవదేత్ ॥

మూడు కేంద్రములు పాపగ్రహయుక్తములైనా, చతుర్థమున శనిగాని, రవి గాని, కుజుడుగానియున్నా జాతకుడు పశువువలె మైథున మాచరించును.

79. రాహౌకళత్రేభౌమేవాసుఖేతాదృశమైథునం ।
మదేశేసుఖనంద్రృష్టేభృగుణానహితేథవా ॥

సప్తమ చతుర్థములందు రాహువుగాని, కుజుడుగానియున్న పశుతుల్యముగా మైధున మాచరించును. సప్తమాధిపతి చతుర్థమునుచూచినా, శుక్రునితో కూడియున్నా—

80. భృగుక్షేత్రగతేవాపిభగచుంబనమాదిశేత్ ।
లగ్నేశేనీచరాశ్యంశేస్థితేతాదృశచుంబనం ॥

శుక్రక్షేత్రమునఉన్నా, లగ్నాధిపతి నీచరాశి, నీచ నవాంశలోఉన్నా జాతకుడు భగచుంబనము చేయును.

81. కృశస్తనీకుజేమందేరాహ్వౌదౌలంబనస్తనీ ।
కఠినోర్ధ్వకుచాభానౌశేషాస్త్రీచోత్తమస్తనీ ॥

సప్తమమున కుజుడున్న జాతకునిభార్య చిక్కిన-చిన్న స్తనములు కలదగును. శనిగాని రాహువుగానిఉన్న వ్రేలాడు కుచములుకలది, రవియున్న కఠినమైన పైకున్న స్తనములుకలది, తక్కిన గ్రహములున్న అందమైన చనులుకలదగును.

82. పాపేనైకేనసహితేవైలక్షణ్యస్తనీభవేత్ ।
దారేశేపాపఖేటేవాశుభేవాతాదృశస్తనీ ॥

సప్తమమున ఒక పాపగ్రహమున్న విలక్షణముగాఉన్న (హెచ్చుతగ్గులుకల) స్తనములు కలది, సప్తమాధిపతి శుభుడయినా, పాపుడయినా, సప్తమమున పాపగ్రహమున్న విలక్షణస్తనియగును.

83. శుభద్వయేనసహితేదారేశేపితథావిధే ।
సమస్తనీభవేత్పత్నీపాపయోగేన్యథావదేత్ ॥

సప్తమమున ఇద్దరు శుభగ్రహములున్న, సప్తమాధిపతి శుభగ్రహయుక్తుడైనా సమస్తని యగును. పాపగ్రహ సంబంధమున్న విలక్షణస్తనియే యగును.

84. అతిస్థూలస్తనీపత్నీసశుభేదారనాయకే ।
జలగ్రహేజలర్క్షస్థేగురుణాపినిరీక్షితే ॥

సప్తమాధిపతి శుభగ్రహయుక్తుడై, జలగ్రహమై, జలరాశిగతుడై, గురునిచే చూడబడిన-వానిభార్య అతిస్థూలస్తనియగును.

85. రవౌవాభూమిపుత్రేవామందమాంద్యగుసంయుతే ।
దారాధిపేపాపభాగేభగదైర్ఘ్యంవినిర్దిశేత్ ॥

రవికుజులలో నెవడయినా శనిమాంది రాహుయుతుడయిన, సప్తమాధిపతి పాపగ్రహమైన జాతకునిభార్య భగము దీర్ఘముగా నుండును.

86. తదీశాగురుశుక్రౌవాశుభాంశసహితౌయది ।
సమంభగంభవే త్తస్యాఃపాపయుక్తౌతుదీర్ఘకం ॥
సప్తమాధిపతి గురుశుక్రులలో నొకడై శుభగ్రహ నవాంశయుక్తుడైన, వాని భార్య భగము సమముగా నుండును. పాపగ్రహయుక్తమైన దీర్ఘముగా నుండును.

87. శనిచంద్రవిదాంమధ్యేయత్రైకస్మిన్ మదేశ్వరే ।
హ్రస్వంభగంసమందీర్ఘంస్త్రియామేవంవినిర్దిశేత్ ॥
సప్తమాధిపతి శనిచంద్రబుధులలో నొకడైన జాతకునిభార్య జాతకమున సప్తమాధిపతి శనియైన భగము హ్రస్వము, చంద్రుడైన సమము, బుధుడైన దీర్ఘము గాను ఉండును.

88. కళత్రేశేజలర్క్షస్థేకారకేవాతథావిధే ।
జలర్క్షేదారభావేనాపూర్ణచంద్రనిరీక్షితే ॥
కళత్రాధిపతి జలరాశియందుండి, కళత్రకారకుడును జలరాశిగతుడై, కళత్రభావమును జలరాశియై పూర్ణచంద్రునిచే చూడబడిన జాతకునిభార్య భగము ఎప్పుడును ఆర్ద్రముగా నుండును.

89. చంద్రేజలర్క్షేదారస్థేజలర్క్షభృగువీక్షితే ।
జలర్క్షవిదాదృష్టేసదాగుహ్యార్ద్రతాభవేత్ ॥
చంద్రుడు సప్తమమున జలరాశిలోఉండి, జలరాశిగతుడయిన శుక్రుని చేతను, బుధునిచేతను చూడబడిన సదా ఆర్ద్రమై యుండును.

90. పూర్ణేశశాంకేదారస్థేజలరాశ్యంశకేపివా ।
జలర్క్షేగురుణాదృష్టేసదాగుహ్యార్ద్రతాభవేత్ ॥
పూర్ణచంద్రుడు సప్తమమునఉండి, జలరాశి నవాంశలోఉండి, జలరాశిగతు డయిన గురునిచే చూడబడిన జాతకునిభార్య భగము ఆర్ద్రమై యుండును.

91. పరమోచ్చాంశగేశుక్రేజలరాశిగతేపివా ।
భానునాసంయుతేవాపిమైథునత్వార్ద్రతాభవేత్ ॥
శుక్రుడు జలరాశిగతుడై పరమోచ్చనవాంశయందుండి, రవితోకూడియున్న వానిభార్య గుహ్యము మైథునకాలమందు ఆర్ద్రమై యుండును.

92. దారేశేశుష్కరాశిస్థేదారేవాశుష్కసంజ్ఞికే ।
శుష్కగ్రహేణసంయుక్తేత్వనార్ద్రంగుహ్యమాదిశేత్ ॥
సప్తమాధిపతి నిర్జలరాశియందుండి సప్తమస్థానము శుష్కమై, శుష్కగ్రహ ముతోకూడిన జాతకునిభార్య భగము శుష్కమై (ఎండి-తడిలేక) యుండును.

93. పాపేక్షితేపాపమధ్యేదారేశేపితథావిధే ।
పాపదృగ్యోగసంజాతేహ్యనార్ద్రింగుహ్యమాదిశేత్ ॥
సప్తమరాశి, సప్తమాధిపతి పాపగ్రహదృష్టములై, పాపగ్రహమధ్యవర్తులై పాపగ్రహయుక్తము, దృష్టమునయిన వానిభార్య భగము ఆర్ద్రితలేక యుండును.

94. దారస్థేపాపఖేటేతుజలసంబంధసంయుతే ।
జలగ్రహేణసందృష్టేతాదృశంగుహ్యమాదిశేత్ ॥
జలరాశియైన సప్తమమందు పాపగ్రహముండి, జలగ్రహముచే చూడబడిన వానిభార్య భగము ఆర్ద్రితలేక యుండును.

95. గురుదృష్టేనప్తమేశేశోభనాంశసమన్వితే ।
సౌమ్యాంశేసౌమ్యసందృష్టేసూపదధ్యాజ్యభాగ్భవేత్ ॥
సప్తమాధిపతి గురుదృష్టుడై శుభషష్ట్యంశాదియుతుడై, శుభనవాంశ యందున్న, శుభగ్రహదృష్టుడైన పప్పు, నెయ్యి, పెరుగు భుజించువాడగును.

96. సప్తమస్థేబుధేదృష్టేగురుణాబలసంయుతే ।
భుక్తిశేనాపిసందృష్టేసూపదధ్యాజ్యభాగ్భవేత్ ॥
బుధుడు సప్తమమునఁడుండి, బలవంతుడై గురునిచేచూడబడి, ద్వితీయాధిపతి దృష్టియుఉన్న దధిసూపఘృతభోక్త యగును.

97. రవౌవాభూమిపుత్రేవానప్తమేశేశుభేక్షితే ।
బుద్ధిస్థానగతేవాపితదాచిద్దధిసూపభాక్ ॥
రవికుజులు సప్తమాధిపతులై శుభగ్రహదృష్టులైనా, లేక పంచమమందున్నా జాతకుడు ఎప్పుడైనా పప్పునేతులు తినువాడగును.

98. పాపేవాపాపమధ్యస్థేతదీశేపాపవీక్షితే ।
క్రూరషష్ట్యంశగేవాపినక్షీరఘృతసూపభాక్ ॥
సప్తమాధిపతి పాపగ్రహమై, పాపమధ్యవర్తియై, పాపగ్రహదృష్టమైన, క్రూరషష్ట్యంశగతుడయిన పాలు, పప్పు, నేతులను తినడు. వాటిపై ఇష్టముండదు.

99. చంద్రేగురౌవాదారేశేజలరాశ్యంశసంభవే ।
జలగ్రహేణసందృష్టేక్షీరపానాదిభాగ్భవేత్ ॥
చంద్రుడుగాని గురుడుకాని సప్తమాధిపతియై జలరాశి నవాంశయందుండి, జలగ్రహముచే చూడబడిన క్షీరపానము మున్నగు స్వాదుపదార్థ ప్రియుడగును.

100. సప్తమేశస్థితాంశేశేశుభదృష్టిసమన్వితే ।
శుభగ్రహాంశగేవాపిగుడక్షీరాదిపానభాక్ ॥

సప్తమాధిపతియున్న నవాంశరాశ్యధిపతి శుభగ్రహదృష్టి, యుక్తుడై శుభ నవాంశయందున్న గుడక్షీరాది మధురప్రియుడగును.

101. బహవస్సప్తమేపాపాషష్టేనారంధ్రభేపివా ।
క్రూరషష్ట్యంశసంయుక్తాస్సర్వదాకృశభాగ్భవేత్ ॥

షష్ఠ, సప్తమ, అష్టమములందు అనేక పాపగ్రహములుండి, క్రూరషష్ట్యంశ యుక్తులైన జాతకుడు శుష్కపదార్థ ప్రియుడగును.

102. శ్రీమత్కాశ్యపవంశేనవేంకటేశేనధీమతా ।
ఫలంకళత్రభావస్యవీక్ష్యసర్వంనిరూపితం ॥

కాశ్యపవంశజాతుడైన శ్రీ వేంకటేశ పండితునిచే కళత్రభావ ఫలము సర్వమును పరిశీలించి, నిరూపింపబడినది.

ఇది సర్వార్థ చింతామణియందు కళత్రభావమను
అష్టమాధ్యాయము

# న వ మా ధ్యా య ము

1. మరణాజ్జీవితమరణంగుహ్యస్థానంచమరణహేతుంచ ।
అన్నసుఖమరణదేశంపరిభవమపిచింతయేత్ప్రాజ్ఞః ॥

అష్టమస్థానమువలన ఆయుర్దాయము, మరణము, గుహ్యస్థానము, మరణ హేతువు, అన్నసుఖము, మరణప్రదేశము, అవమానము, వీటి విషయము విచారణ చేయవలెను.

2. రంధ్రేశ్వరేపాపయుతేంత్యరాశావల్పాయురస్యేతివదంతిషష్ఠే ।
తత్రాపిలగ్నేశ్వరయోగజాతేత్వల్పాయురస్యేతివదంతిసంతః ॥

అష్టమాధిపతి పాపగ్రహయుక్తుడై వ్యయమందున్న అల్పాయుష్కుడగును. అష్టమాధిపతి షష్ఠమందు లగ్నాధిపతితో కూడియున్నను అల్పాయుష్కుడగును.

3. స్వక్షేత్రగేవాయదిరంధ్రనాథేదీర్ఘాయురస్తీతివదంతిసంతః ।
మందేనవాచింత్యమశేషమాయుఃస్వక్షేత్రమిత్రోచ్చగృహస్థితేన ॥

అష్టమాధిపతి స్వక్షేత్రమందున్నను, ఉచ్ఛ, మిత్రక్షేత్రగతుడయిన శని వలనను దీర్ఘాయుర్యోగము చెప్పదగినది.

4. రంధ్రేశ్వరేణాపియుతేవిలగ్ననాథేరిపౌవావ్యయరాశియుక్తే ।
షష్ఠాంత్యపేవాయదిలగ్నయుక్తేదీర్ఘాయురస్యేతిశుభేక్షితశ్చేత్ ॥

లగ్నాధిపతి అష్టమాధిపతితోకూడి షష్ఠమునగాని, వ్యయమునగాని ఉండి, షష్ఠాధిపతిగాని, వ్యయాధిపతిగాని లగ్నమందుండి శుభగ్రహదృష్టుడైన దీర్ఘాయుష్కుడగును.

5. కర్మేశ్వరేణాపివిచింత్యమాయుఃదీర్ఘంసుహృత్స్వోచ్ఛయుతేనతేన ।
కేంద్రస్థితౌకర్మవిలగ్ననాథౌతథైవదీర్ఘాయురుదాహరంతి ॥

మిత్ర, స్వ, ఉచ్ఛరాశిగతుడయిన దశమాధిపతి వలనను దీర్ఘాయువు కలుగును. దశమ, లగ్నాధిపతులు కేంద్రములందున్నను దీర్ఘాయువు కలుగును.

6. పోక్తైర్గుణైర్వ్యోమచరైస్త్రిభిర్వానభాను జైః కేంద్రగతైస్తథైవ ।
స్వక్షేత్రకోణాదిగతైర్విశేషాద్వదంతిదీర్ఘాయురుదారచిత్తాః ॥

స్వోచ్ఛ మిత్రరాశిగతులయిన లగ్న, అష్టమ, దశమాధిపతులు రవితోకలిసి కేంద్రగతులయిన దీర్ఘాయువు కలుగును. ఆ ముగ్గురును స్వక్షేత్రగతులైన దీర్ఘాయువు కలుగును.

7. చతుర్గ్రశేశుభైర్యుక్తేలగ్నేశేశుభసంయుతే ।
గురుణాదృష్టిసంయుక్తేపూర్ణమాయుర్వినిర్దిశేత్ ॥

కేంద్రములు శుభగ్రహయుక్తములై, లగ్నాధిపతి శుభగ్రహముతోకూడి, గురునితో చూడబడిన పూర్ణాయువు కలుగును.

8. రంధ్రాధిపేవిలగ్నస్థేగురుశుక్రనిరీక్షితే ।
లగ్నేశేకేంద్రగేఖావాపూర్ణమాయుర్వినిర్దిశేత్ ॥

అష్టమాధిపతి లగ్నమందుండి గురుశుక్రులచే చూడబడిన, లగ్నాధిపతి కేంద్రమునఉన్న జాతకుడు పూర్ణాయువు కలుగును.

9. షష్ఠాష్టమవ్యయేపాపేలగ్నేశేదుర్బలేసతి ।
అల్పాయురనపత్యోవాశుభదృగ్యోగవర్జితే ॥

6,8,12 లందు పాపుడుండి, లగ్నాధిపతి బలహీనుడయిన శుభగ్రహయుతి, దృష్టిలేనివాడయిన అల్పాయుష్కుడుగాని, అనపత్యుడుగాని అగును.

10. క్రూరషష్ఠ్యంశకేరంధ్రేరంధ్రేశేఖానుకేపివా ।
పాపాన్వితేపాపదృష్టేత్వల్పమాయుర్వినిర్దిశేత్ ॥

అష్టమము క్రూరషష్ట్యంశకలిగి, అష్టమాధిపతిగాని, శనిగాని, పాపగ్రహ యుక్తుడైనా, పాపదృష్టుడైనా అల్పాయుష్కుడగును.

11. అయుర్యోగాస్త్రిధాప్రోక్తాస్త్వల్పమధ్యచిరాయుషః ।
ద్వాత్రింశత్పూర్వమల్పాయుర్మధ్యమాయుస్తతోభవేత్ ॥

అల్పాయువని, మధ్యాయువని, పూర్ణాయువని మూడు విధములు. 32 సం.ల వరకు అల్పాయువు.

12. సప్తత్యాః ప్రాక్తనంపూర్ణమాయురత్రవినిర్దిశేత్ ।
అల్పాయుర్దిననాథస్యశత్రౌలగ్నాధిపేసతి ॥

32 పైన డెబ్బదికిలోపు మధ్యమాయువు. డెబ్బదినుండి నూరువరకు పూర్ణాయువు. రవికి లగ్నాధిపతి శత్రువైన అల్పాయువు.

13. సమేతుమధ్యమాయుస్స్యాన్మిత్రేదీర్ఘాయురాదిశేత్ ।
బలహీనేవిలగ్నేశేజీవేకేంద్రత్రికోణగే ॥

లగ్నాధిపతి రవికి సముడయిన మధ్యాయువు, మిత్రుడయిన పూర్ణాయువు. లగ్నాధిపతి బలహీనుడై గురుడు కేంద్ర, కోణగతుడైన—

14. షష్ఠాష్టమేవ్యయేపాపేమధ్యమాయురుదాహృతం ।
శుభాఃకేంద్రత్రికోణస్థాశ్శనౌబలసమన్వితే ॥

6,8,12 లందు పాపగ్రహమున్న మధ్యాయువు. శుభగ్రహములు కేంద్ర కోణగతులై శని బలవంతుడయిన—

15. షష్ఠేవాప్యష్టమేపాపేమధ్యమాయురుదాహృతం ।
లగ్నత్రికోణకేంద్రేవామధ్యమాయుశ్చమిశ్రితే ॥

షష్ఠమునగాని, అష్టమమునగాని పాపగ్రహమున్న మధ్యాయువు. పాప గ్రహము లగ్నత్రికోణ కేంద్రములందున్న మధ్యాయువు కలుగును.

16. అల్పాయుర్యోగజాతానాంవిపత్ప్రాకోమృతిప్రదః ।
మధ్యమేప్రత్యరిదశామృతిందద్యాద్విశేషతః ॥

అల్పాయుర్యోగజాతులకు విపద్దశమరణము నిచ్చును. మధ్యాయువునందు పుట్టినవారికి శత్రుదశ మరణము కలిగించును.

17. వధభేశదశాకష్టాపూర్ణాయుర్యోగసంజ్ఞితే ।
యోగాయురపినిశ్చిత్యజాతస్యైవంవదేద్బుధః ॥

పూర్ణాయుర్యోగమున్న పుట్టినవారికి అష్టమాధిపతి దశ మృతి నిచ్చును. చెప్పబోవు యోగాయుర్దాయము నిర్ణయించి, జాతకునకు చెప్పవలెను.

18. ఆయుర్విలగ్నాధిపతౌసపాపేబలేనయుక్తేవ్రణరాశియుక్తే ।
యుద్ధేమృతింతస్యవదంతితజ్ఞాశ్శస్త్రేణవాతన్మరణంవిశేషాత్ ॥
అష్టమ, లగ్నాధిపతులు పాపగ్రహయుక్తులై, బలవంతులై షష్ఠమందున్న జాతకుడు యుద్ధమునగాని, శస్త్రముచేగాని మృతినందును.

19. రన్ధ్రాంగనాథౌయదివారిపుస్థౌరాహ్వాన్వితేకేతుయుతేచమందే ।
తద్భుక్తికాలేత్వథవావిపాకేశస్త్రేణచోరైర్మరణంప్రయాతి ॥
షష్టాష్టమాధిపతులు షష్ఠమందుండి, రాహుయుక్తులుకాగా, శనికేతుయుక్తుడైన ఆగ్రహదశాకాలమునగాని, అంతర్దశాకాలమునగాని, చోరులచే, శస్త్రముచే మృతి నందును.

20. రంధ్రాంగపౌవాహననాథయుక్తౌతస్మాన్మృతింతస్యవదంతితజ్ఞాః ।
మృతిస్త్వజీర్ణాద్గురుసంయుతౌతౌదేహేశజీవౌరిపుగౌత్వజీర్ణాత్ ॥
అష్టమ షష్టాధిపతులు వాహనాధిపతితోకూడిన వాహనమువలన మృతి కలుగును. వారు గురుయుక్తులయిన అజీర్ణవ్యాధివలన మృతిగలుగును.

21. లగ్నేశ్వరేవాహననాథయుక్తేవాగీశ్వరేణాపియుతేత్వజీర్ణాత్ ।
రంధ్రేశ్వరేవాహనవిత్తనాథేనాశాన్వితేతన్మరణంత్వజీర్ణాత్ ॥
లగ్నాధిపతి చతుర్థాధిపతితోను గురునితోను కూడియున్నా, అష్టమ, చతుర్థ, ద్వితీయాధిపతులు అష్టమమందున్నా అజీర్ణరోగమువలన మృతికలుగును.

22. రంధ్రేశయోగాన్మరణందశాయామంతర్దశాయాంమరణంవదంతి ।
పిత్రాదిభావాధిపయోగదృష్ట్యాపిత్రాదికానాంమరణంతథైవ ॥
అష్టమాధిప సంబంధమువలన ఆగ్రహ దశాకాలమునగాని, అంతర్దశా కాలమునగాని, మరణము చెప్పవలెను. పిత్రాది భావాధిపతుల సంబంధ, దృష్టులచే పిత్రాదులకును మరణము చెప్పవలెను.

23. భుక్త్యంగపౌభానుసుతేనయుక్తౌదుస్థానగౌవావిషభక్షణేన ।
రాహుధ్వజాభ్యాంసహితౌతుదుస్థౌఉద్బంధనాత్తస్యమృతింవదంతి ॥
ద్వితీయ షష్టాధిపతులు శనితోకూడి 6,8,12 లందున్న విషభక్షణమువల్లనూ, రాహుకేతువులతోకూడి 6,8,12 లందున్న ఉరివల్లను మరణము కలుగును.

24. షష్ఠేశ్వరేభానుసుతేసరాహుకేతౌమృగాద్భీతిముదాహరంతి ।
జీవేనయుక్తేగజభీతిమన్యజాతస్యచంద్రేణయుతేశ్వభీతిః ॥
షష్టాధిపతియైన శని రాహుకేతు యుక్తుడయిన మృగమువలనను, గురునితో కూడిన ఏనుగులవలనను, చంద్రునితోకూడిన గుర్రమువలనను మరణభయ మున్నది.

25. సూర్యాన్వితేశాద్భశసూర్యపుత్రేమృగాత్పశృంగాచ్ఛునకాత్కుజే ॥
అష్టమాధిపతియైన శనిరవితోకూడిన కొమ్ములున్న మృగమువలనను; కుజునితో కూడిన కుక్కవలనను ప్రాణభీతి కలుగును.

26. షష్ఠేస్థితేభానుసుతేపిచైవంవినాస్వతుంగస్వగృహస్థఖేటైః ।
సుఖేశభాగ్యేశవిలగ్ననాథాస్త్రికోణగాః కేంద్రగతాశ్శనర్వే ॥
స్వక్షేత్ర, ఉచ్ఛస్థగ్రహములుతప్ప, శనిషష్ఠస్థుడైనా శునకభీతియే. చతుర్థ, నవమ, లగ్నాధిపతులు కేంద్రములందున్నా.—

27. భుక్తిర్యదాతత్పరిపాకకాలేపిత్రానహైవానుమృతిశ్చమాతుః ।
రంధ్రేశశాంకేఫణినాథయుక్తేహీనేబలేపాపయుతేనమందే ॥
ఆయాగ్రహ దశాభుక్తికాలమున తండ్రితోపాటు తల్లికిని మరణముకలుగును. లగ్నమున కష్టమమందున్న చంద్రుడు రాహుయుక్తుడైన, బలహీనుడై, పాపయుక్తుడైనా పిశాచపీడవలన మృతికలుగును.

28. తత్రస్థితేహీనబలేశశాంకేపిశాచపీడాచజలేవిపచ్చ ॥
అష్టమము శనితోకూడి చంద్రుడు బలహీనుడైయున్న నీటిలోపడి మృతినందును.

29. భౌమాహిమందాన్యతమేనయుక్తేక్షీణేశశాంకేనిధనేస్థితేవా ।
దుస్థేత్వపస్మారభయాన్మృతిస్స్యాత్పిశాచబాధాత్వథవామృతిస్స్యాత్ ॥
క్షీణచంద్రుడు కుజరాహుశనులలో నెవరితోనైనా కలిసి 6,8,12 లందున్న అపస్మారమువలనగాని, పిశాచబాధవలనగాని మృతికలుగును.

30. రంధ్రేసరాహౌయదివానకేతౌచాతుర్థికాత్పితనమాహురన్యే ।
రంధ్రేశ్వరేణాపియుతేతథైవక్రూరాదిషష్ట్యంశయుతేపినత్యం ॥
అష్టమము రాహుకేతుయుక్తమైన చాతుర్థికజ్వరపీడచే మృతికలుగును. అష్టమాధిపతి రాహుకేతుయుక్తుడైనా, క్రూరాదిషష్ట్యంశగతుడయినా చాతుర్థిక జ్వరపీడచే మృతికలుగును.

31. నీచస్థితేవానరనాయకేవాషష్ఠాష్టమస్థేయదిపాపదృష్టే ।
రాజ్ఞాంప్రకోపాన్మరణంపితుశ్చతత్పీడయావిత్తవినాశమేతి ॥
సూర్యుడు షష్ఠాష్టమములందు నీచస్థుడైయున్న, పాపగ్రహదృష్టుడైన, రాజకోపమువలన తండ్రికి మరణము, జాతకునకు ధననాశము కలుగును.

32. లగ్నాత్పుతేకర్మణిభూమిపుత్రేపాపేక్షితేమాతులమృత్యుమాహుః ।
మందేనయుక్తేయదిపుత్రమృత్యుంచంద్రేహితన్మాతృమృతింనపాపే॥

కుజుడు పంచమదశమములందు పాపగ్రహదృష్టుడైయున్న మేనమామ చని పోవును. అట్టి కుజునితో శనికూడిన పుత్రునకును, చంద్రుడు పాపయుక్తుడై కూడిన తల్లికిని మరణము కలుగును.

33. పితుర్మృతింనరనాయకేతుననంశయఃపాపదృశానమేతే ।
పాపద్వయేనాపియుతౌవిలగ్ననిశాకరౌమృత్యుముపైతిబాలః ॥

రవి పాపగ్రహదృష్టుడై పంచమ దశమములందున్న తండ్రికి మృతి కల్గును. లగ్న చంద్రులు రెండు పాపగ్రహ యుక్తములయిన బాలుడు మృతుడగును.

34. గ్రస్తేశశాంకేపరివేషయుక్తేపాపేక్షితేవామరణంచసద్యః ।
త్వాష్ట్రేజ్యతోయేషువిలగ్నచంద్రేజాతస్యవిప్రాసుతమాతులాంశ్చ ।
పాదక్రమేణాపినిహంతితాంస్తుశుభైస్తుదృష్టేనహితేనదోషః ॥

చంద్రుడు రాహుకేతుగ్రస్తుడయి, పరివేషయుక్తుడై పాపగ్రహదృష్టుడైయున్న శిశువునకు సద్యోమరణము కలుగును. లగ్నమున చంద్రుడు-చిత్ర, పుష్యమి, పూర్వాషాఢా నక్షత్రస్థితుడైయున్న పాదక్రమమున 1. తల్లిని, 2. శిశువును, 3. మేన మామలను చంపును. ఆ చంద్రునికి శుభగ్రహయుతి, దృష్టియున్న, ఆ దోషములేదు.

35. లాభేశుభేవాయదిమందభౌమౌఫణీంద్రయుక్తౌపితురత్యయాయ ।
పాపేక్షితేభూమిసుతేనచంద్రేజాతస్తుమృత్యుంసముపైతిరంధ్రే ॥

శనికుజులు లాభమునగాని దశమమునగానియుండి, రాహుయుక్తులైన తండ్రికి మరణముకలుగును. అష్టమమున కుజచంద్రులుండి పాపగ్రహదృష్టులైన త్వరగా మృతినందును.

36. సోత్థేధరాసూనుయుతేనపాపేపాపేక్షితేసోదరనాశమాహుః ।
అస్తేశశాంకేయదిమాతృమృత్యుఃపాపాన్వితేపాపదృశానమేతే ॥

తృతీయమున కుజుడు పాపగ్రహయుక్తుడై యుండి, పాపదృష్టుడైన సోదర నాశముకలుగును. చంద్రుడు సప్తమమందుండి పాపగ్రహయుక్తుడు, దృష్టుడైన తల్లికి మరణము కలుగును.

37. భానౌపితుర్మృత్యుముదాహరంతిమందారశుక్రైస్సహితేసుతస్య ।
తృతీయషష్ఠస్థితఖేచరేంద్రైఃపాపగ్రహైరంత్యగతస్తుసౌమ్యైః ॥

సప్తమమున రవియుండి పాపగ్రహయుక్తుడు, దృష్టుడునయిన తండ్రికి మర ణము కలుగును. సప్తమమున శనికుజశుక్రులున్న సుతునికి మరణము కలుగును. తృతీయ షష్ఠములందు పాపగ్రహములున్నను, వ్యయమున శుభగ్రహములున్నను శిశువునకు మరణము కలుగును.

38. శిశోర్మృతిస్యాత్కుముదాత్మబంధౌ చతుర్థరంధ్రస్థితపాపఖేటైః ।
లగ్నేర్కచంద్రౌ వ్యయగాస్తుపాపాశ్శిశోర్మృతిశ్శోభనదృష్టహీనే ॥

చతుర్ధ, అష్టమములందున్న పాపగ్రహములతో చంద్రుడు కూడినా, పాప దృష్టుడైనా శిశువు మృతిచెందును. లగ్నమందు రవిచంద్రులుండి, వ్యయమున పాపగ్రహములుండి, శుభదృష్టి లేకున్న శిశువు మృతిచెందును.

39. అస్తేరవౌ చంద్రయుతేవిలగ్నే పాపావ్యయేతత్సుతమృత్యుమాహుః ।
దినేశచంద్రౌ వ్యయగౌ తదాదానీంమందోశుభవేత్సౌమ్యదృశావిహీనౌ ॥

సప్తమమున రవియుండి, లగ్నమున చంద్రుడుండి, వ్యయమున పాపులున్న జాతకుని పుత్రులు మృతినందుదురు. రవిచంద్రులు వ్యయమునఉండి శుభదృష్టి లేకున్న జాతకుడు మందుడగును.

40. యుక్తేతయోరన్యతరేణరిప్పేకాణోభవేత్సౌమ్యదృశావిహీనే ।
దుస్థేతృతీయాధిపతౌనచంద్రే స్తన్యంపరస్త్రీషుపిబేత్సబాలః ॥

రవిగాని చంద్రుడుగాని వ్యయమందుండి శుభదృష్టిలేనియెడల కాయకంటి వాడగును. తృతీయాధిపతి 6,8,12 లందున్న జాతకుడు పరస్త్రీల స్తన్యము త్రాగును.

41. లగ్నాధిపేపూర్ణబలేసుఖేశభాగ్యేశ్వరౌనాశగతౌతుహీనౌ ।
జాతస్యజన్మావసరేతదానీంపితుశ్చమాతుర్నిధనంవదంతి ॥

లగ్నాధిపతి పూర్ణబలవంతుడై, చతుర్ధ నవమాధిపతులు బలహీనులై అష్టమ మందున్న జాతకుని తల్లిదండ్రులు అతడు పుట్టినపుడే చనిపోవుదురు.

42. తాతేశతత్కారకఖేచరేంద్రౌదుస్థౌతయోఃపుత్రముఖంనదృష్టం ।
కేంద్రత్రికోణేయదితౌగ్రహేంద్రౌవదేత్తయోఃపుత్రముఖంనదృష్టం ॥

నవమాధిపతి, రవియు 6,8,12 లందున్న జాతకుని తల్లిదండ్రులు పుత్రము చూడరు. నవమాధిప, రవులు కేంద్రకోణములందున్న పుత్రముఖము చూడరు.

43. పితుర్నిశాయాంమరణంవదంతిభాగ్యేశసూర్యార్కసుతాఃషష్ఠస్థాః ।
షష్ఠేశ్వరేణాపియుతాస్తథైవంచంద్రేణహీనాస్తుదివామృతిస్స్యాత్ ॥

నవమాధిపతి రవిశనులు షష్టరాశియందున్న షష్టాధిపతితోకూడినా తండ్రి మరణము రాత్రియందగును. ఆ మూడు గ్రహములు చంద్రునితోను, షష్టాధిపతితోను షష్ట స్థానమందు చేరకున్న తండ్రి మరణము పగలగును.

44. మాతుర్నిశాయాంమరణంసుఖేశశుక్రేందవఃషష్ఠగతాబలాఢ్యాః ।
సౌరీశ్వరాత్తన్మరణంతథైవచంద్రేణహీనాస్తుదివామృతిస్స్యాత్ ॥

చతుర్థాధిపతి, శుక్రచంద్రులు బలవంతులై షష్ఠస్థులైన తల్లిమరణము రాత్రి యగును. శని చతుర్థ షష్ఠాధిపతులతో కూడనా రాత్రియే మరణమగును. చతుర్థాధిప శుక్రులు చంద్రునితోకూడక, షష్ఠాధిపతితోకూడక, షష్ఠమందుండకున్న మాతృమరణము పగటివేళ అగును.

45. సుఖస్థితైఃఖేచరనాయకైర్వామాతుర్మృతిస్యాదయనేతుతస్మిన్ ।
నోచేత్తదీశాన్వితరాశికాలేమాతుర్మృతిస్యాదయనేతుతస్మిన్ ।

చతుర్థమందున్న గ్రహములారాశికి చేరిన అయనమందు మాతృమరణమగును, చతుర్థమున గ్రహములు లేకున్న చతుర్థాధిపతి రాశికివచ్చిన కాలమున, చతుర్థాధిపతియుండు రాశికి సంబంధించిన అయనమున మాతృమరణమగును.

46. ద్విత్ర్యాదియోగాదయనంహిత్రత్రవ్యత్యానతో త్రప్రవదంతిసంతః ।
నాశేచరేవాపితృభావనాథేదూరస్థితస్తజ్జనకోపివాచ్యః ॥

చతుర్థమందు రెండు మూడు గ్రహములున్న అయనవ్యత్యాసమగును. అనగా ఆ రాశి ఉత్తరాయణరాశియైన దక్షిణాయనమున, దక్షిణాయనరాశియైన ఉత్తరాయణమున అగును. భాగ్యాధిపతి అష్టమమునగాని, చరరాశియందుగాని ఉన్న జాతకుని తండ్రి దూరమందుండి మృతిచెందును.

47. స్థిరోభయస్థేపితృభావనాథేసమీపతస్తజ్జనకస్థితస్స్యాత్ ।
కేంద్రేచరేర్కేయదివాశశాంకేసుతోవహేత్తత్పితరౌనతత్ర ॥

నవమాధిపతి స్థిరరాశియందుగాని, ద్విస్వభావ రాశియందుగాని ఉన్న జాతకుడు తండ్రి మరణకాలమున దగ్గర ఉండును. కేంద్రమునగాని, చరరాశులందుగాని రవిచంద్రులున్న జాతకుడు తల్లిదండ్రుల మరణకాలమున దగ్గర ఉండడు.

48. ద్విదేహరాశౌయదితౌచకేంద్రేతయోర్మృతిస్స్యాద్దహనంత్వకాలం ।
బలేనయుక్తేపితృభావనాథేశశాంకదేహేశచతుర్థనాథాః ।
బలేనహీనాయదితజ్జనన్యాఃమహద్విపత్తింసముదాహరంతి ॥

ఆ రవిచంద్రులు కేంద్రగతులై ద్విస్వభావరాశియందున్న తల్లిదండ్రుల దేహముల నకాలమున దహనము చేయుదు. అనగా దగ్గర ఉండనందున ఆలస్యమగును. నవమాధిపతి బలవంతుడై, చంద్రుడు, లగ్నచతుర్థాధిపతులును బలహీనులయిన జాతకునితల్లి మరణకాలమున గొప్ప ఆపత్తు కలుగును.

49. రంధ్రేతుపాపబాహుళ్యేగుహ్యరోగంవినిర్దిశేత్ ।
శుభగ్రహాణసందృష్టేనిర్దోషత్వంవినిర్దిశేత్ ।
రంధ్రేశుభేక్షితేతేనసంయుతేతుసుఖంవదేత్ ॥

అష్టమస్థానము పాపబాహుళ్యమున్న జాతకునకు గుహ్యరోగముండును. అష్ట మము శుభగ్రహదృష్టమైన దోషముండదు. అష్టమము శుభగ్రహయుక్తమైనా, దృష్టమైనా సుఖము కలుగును.

50. స్థూలాన్నంపాపసంబంధేమృద్వన్నంశుభఖేచరే ।
రంధ్రేశ్వరేపాపయుతేపాపదృష్టేతదంశకే ॥

అష్టమము పాపగ్రహయుక్తమయిన ముతక అన్నమును, శుభగ్రహయుక్త మైన సన్న అన్నమును భుజించును. అష్టమాధిపతి పాపగ్రహయుక్తుడైనా, దృష్ట డయినా, పాపనవాంశయందున్నా జాతకునికి అవమానము కలుగును.

51. పాపక్షేత్రేభవారంధ్రేజాతఃపరిభవాన్వితః ।
శుభగ్రహాణాంసంబంధేరంధ్రేపరిభవోనహి ॥

అష్టమము పాపక్షేత్రమైనా అవమానము కలుగును. శుభగ్రహ సంబంధ మున్న అవమానముండదు.

52. చరేరంధ్రేమృతిర్దూరేతదీశేచరరాశిగే ।
శనౌవాచరరాశిస్థేచరాంశస్థేతథాభవేత్ ॥

అష్టమము చరరాశియైనా, అష్టమాధిపతి, శని చరరాశియందున్నా, చర నవాంశయందున్నా, జాతకునకు దూరదేశమున మృతికలుగును.

53. స్థిరేరంధ్రేతదీశేపిస్థిరరాశౌతదంశకే ।
శనౌవాస్థిరరాశ్యంశేస్వగృహేమరణంవదేత్ ॥

అష్టమము స్థిరరాశియైనా, అష్టమాధిపతి, శనియుస్థిరరాశి, స్థిర నవాంశలం దున్నా జాతకునకు స్వగృహమున మరణము కలుగును.

54. రంధ్రేద్విదేహరాశ్యాదౌమార్గేమరణమాదిశేత్ ।
అష్టమేశేయదాకేంద్రేలగ్నేశేబలవర్జితే ॥

అష్టమము ద్విస్వభావమైన మార్గమున మరణము కలుగును. అష్టమాధిపతి కేంద్రగతుడై, లగ్నాధిపతి బలహీనుడైన—

55. త్రింశద్వర్షాణ్యథోజీవీద్వాంత్రింశత్పరమావధి ।
పితుర్జన్మనియేజాతాఃజనకంనాశయంతితే ॥

జాతకుడు 30—32 సం.ల మధ్య మృతి పొందును. తండ్రి నక్షత్రమున పుత్రులు పుట్టిన, తండ్రికి గండము.

56. మాతృజన్మనియేజాతామాతృణాంఘాతుకాఃస్త్రియః ।
త్వాష్ట్రేచపుష్యేచతథాచతోయేకన్యాతుశీరోదయచాపలగ్నే ॥

తల్లి నక్షత్రమున ఆడపిల్లలు పుట్టిన తల్లికి గండము. జన్మ నక్షత్రము చిత్త అయిన, కన్యాలగ్నమునను, పుష్యమి అయిన కర్కాటక లగ్నమునను, పూర్వాషాఢ అయిన, ధనుర్లగ్నమునను జన్మించిన జాతకుడు లగ్నచంద్రులను—

57. శుభగ్రహైః పశ్యతిచేన్నవాస్యాత్పిత్రాంశ్చమాతౄన్సుతమాతులౌచ ।
పిత్రోర్మృతిర్హస్తమఖాత్రిపాదపిత్రాంశ్చపూర్వస్థలపుష్యయోశ్చ ॥

శుభగ్రహదృష్టియున్నా, లేకున్నా, తల్లిదండ్రులను, పుత్రులను, మేనమామలను చంపును. (అనగా వారికి గండము) హస్త, మఖలలో తృతీయ పాదమున జన్మమైన తల్లిదండ్రులకును, పూర్వాషాఢా పుష్యమీ నక్షత్ర ప్రథమ పాదమైన తండ్రులకు పినతండ్రి, పెదతండ్రులకును, గండము.

58. త్వాష్ట్రేంద్రహస్తౌతునవిత్రినాశంచంద్రోదయేమాతృవధాయమధ్యే।
చతుర్ఘటీమూలమఖాశ్వినాదౌగండాంతమంత్యేచఫణీంద్రపౌష్ణే ॥

చిత్త, విశాఖ, హస్తానక్షత్రములైన తల్లికిని, మృగశిర మధ్యలోఅయిన తల్లికిని, మూల, మఖ, అశ్వినీ నక్షత్రముల ఆదిని 4 గడియలును, ఆశ్రేషా రేవతీ నక్షత్రముల చివర 4 గడియలును గండాంతము. (జ్యేష్ట చివరను గండాంతమే. ఎందుకు చెప్పలేదో-జ్యేష్టాంత్యం మూలపూర్వకం అని సూత్రము)

59. గండాంతస్యప్రమాణంతుఘటికాయాశ్చతుష్టయం ।
ఆద్యనాడ్యాంతుజాతస్యమాతుర్మరణమాప్నుయాత్ ॥

గండాంత ప్రమాణము 4 గడియలు. అందు మొదటి గడియయైన తల్లికి మరణము.

60. ద్వితీయాయాంపితుశ్చైవతృతీయాయామథస్వయం ।
చతుర్థ్యాంజాయమానస్తుహంతిభ్రాతౄన్నసంశయః ॥

రెండవ గడియయైన తండ్రికి, మూడవ గడియయైన తనకు-శిశువునకును; నాల్గవ గడియయైన అన్నలకును గండము కలుగును.

61. పంచమ్యాంపంచదశ్యాంచదశమ్యామంత్యమేఘటీ ।
ద్వేద్వేచతిథిగండాంతమితిగండత్రయంవిదుః ॥

పంచమి, పూర్ణిమ, అమావాశ్య, దశమి- వీటి చివర 1 గడియకాలము గండాంతము. ఇవి మొత్తము 3 జంటలు, శుక్లకృష్ణ పంచమి, దశమిలు; అమావాస్యా పౌర్ణములు.

62. మేషస్యకంఠీరవధన్వినోశ్చగండాంతమాద్యేనవభాగసంజ్ఞే ।
ఝుళీరమీనాళిగృహేషుసంధింవదంతిగండాంతమితిప్రసిద్ధం ॥

మేష, సింహ, ధనుస్సుల మొదటి నవాంశలు, కర్కాటక, వృశ్చిక, మీన ముల చివరి నవాంశలు రాశి గండాంతములు. ఇట్లు తిథి, నక్షత్ర, లగ్న గండాం తములు మూడు.

63. తిథ్యర్ధగండేపితృమాతృనాశోలగ్నవ్యసంధౌతనయస్యనాశః ।
సర్వేషునోజీవతిమాంతివంశంజీవేచ్ఛదాస్యాద్బహుసేవనాశ్చ ॥

తిథి నక్షత్ర గండాంతమున పుట్టిన పితృమాతృనాశము. సంధి యందైన శిశువునకు గండము. ఆ శివుశు వెంటనే చనిపోవును. బ్రతికెనా-దాస్యము వలన, బహుసేవనము వలనను జీవించును.

64. నరచక్రంవిలిఖ్యాస్యభానుభాన్యూర్ధ్నివిన్యసేత్ ।
త్రీణ్యాస్యేచ3త్రి3ముఖంచద్వయం2కంఠేభుజేద్వయం2 ॥

మనుష్యాకారము చక్రము వ్రాసి, దాని శిరముమొదలు హస్తానక్షత్రమాదిగా 27 నక్షత్రములను వేయవలెను. శిరసున-హస్త, చిత్త, స్వాతి 3 నక్షత్రములను, ముఖమున- విశాఖానూరాధాజ్యేష్ఠలు 3న్ను, కంఠమున మూలపూర్వాషాఢలు 2న్ను, భుజమున ఉత్తరాషాఢా శ్రవణములు 2న్ను;

65. ఏకై1కం1హస్తయుగశేహృదయేముఖపంచకం5 ।
ఏకై1కం1పాదయుగశేతతోనిశ్చనుయాత్ఫలం ॥

రెండు చేతులందు ధనిష్ట, శతభిషం 2న్ను, హృదయమున పూర్వాభాద్రా, ఉత్తరాభాద్రా రేవత్యశ్వినీ భరణులు 5న్ను, నాభియందు కృత్తికయు, గుహ్యమున రోహిణియు, మోకాళ్ళయందు మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేషా మఖలు 6న్ను, పాదములందు పుబ్బ, ఉత్తర 2న్ను వ్రాయవలెను.

66. అల్పాయుఃపాదనక్షత్రేజానూరూభౌపుమాన్భవేత్ ।
సదాయుద్ధేచనిరతోగుహ్యేస్యాత్పరదారికః ॥

జనన నక్షత్రము పాదములందున్న అల్పాయువు, మోకాళ్ళయందున్న యుద్ధప్రియుడు, గుహ్యమున పరస్త్రీసక్తుడు.—

67. జాయతేల్పధనోనాభౌహృదయేతుమహాధనః ।
కరయోశ్చభవేజ్జారోభుజయోర్దుఃఖభాగ్భవేత్ ॥

నాభిని-అల్ప ధనవంతుడు, హృదయమున మహాధనవంతుడు, చేతులందు జారుడు, భుజములందు దుఃఖియు—

68. స్కంధయోర్భోగనిరతోముఖేధర్మరతోధనీ ।
రాజ్యంశిరసిజాతస్యఫలమేతన్నిరూపయేత్ ॥

స్కంధముల భోగాసక్తుడు (కంఠమనుకొనవలెను), ముఖమున ధర్మాసక్తుడు, ధనియు; శిరస్సున రాజ్యము కలవాడు అని ఫలము నిరూపించవలెను.

**69. శతవర్షాణిజీవేత్తుశిరోధిష్ణ్యోద్భవశ్శిశుః ।**
**అశీతిర్వాన్యతోజాతః స్కంధయోన్స ప్తతి స్తథా ॥**

శిరస్థ నక్షత్రజాతకుడు నూరేళ్ళు జీవించును. ముఖనక్షత్ర జాతకుడు 80 సం.లు జీవించును. కంఠనక్షత్ర జాతకుడు 70 ఏళ్లు జీవించును.

**70. బాహోర్వాశ్చషష్ఠివర్షాణిత్రింశద్వర్షాణిహ స్తయోః ।**
**హృదయేనవతిర్వర్షంనాభౌపంచాశదుచ్యతే ॥**

భుజనక్షత్రజాతుకు 60 సం.లున్ను, హ స్తములందలి నక్షత్రజాతుడు 30 సం.లున్ను, హృదయనక్షత్ర జాతుడు 90 ఏళ్లున్ను, మోకాళ్ళ నక్షత్రజాతుడు 50 ఏళ్లున్ను జీవించును.

**71. గుహ్యేచపంచచత్వారింశద్వర్షాణిజానుని ।**
**పాదయోర్దశవర్షాణిదశమాసా స్తథాపిచ ॥**

గుహ్యనక్షత్రజాతుడు 45 ఏళ్ళున్ను, మోకాళ్ళ నక్షత్రజాతుడు 20 ఏళ్ళున్ను, పాద నక్షత్రజాతుడు 10 ఏళ్ళు కాని పదినెలలుకాని జీవించును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున అష్టమభావమను
నవమాధ్యాయము



# దశమాధ్యాయము

**1. శుభభవనాత్పితృభాగ్యంగురుపౌత్రాదిందయాతపఃప్రాప్తిం ।**
**అగ్రస్థానంసత్వంసహభోక్త్రాన్‌దానయోగమపివింద్యాత్ ॥**

లగ్నాత్తు నవమస్థానమువలన-పితృభాగ్యము, గురు, పౌత్రాదికము, దయ, తపస్సు, అగ్రస్థానము, స్వభావము, సహభోక్తలు, దానయోగము-తెలియవలెను.

**2. చింతనీయాగురుస్వామిపితృభార్యాదిమాతులాః ।**
**నవమస్వామిసౌమ్యాద్యైశుభాఏతాన్యథాఽశుభాః ॥**

గురు, రాజ, పితృ భార్యాదులు, మేనమామలు-వీరి విషయము విచారణ చేయవలెను. నవమస్థానము, తదధిపతియు శుభవర్గమై బలయుక్తమైన ఆ భావములు శుభములుగాను, పాపవర్గములై బలహీనములయిన అశుభములు అగును.

3. చంద్రేనపాపేయదిధర్మరాశౌ క్షీణేతినీచేత్వథవాతదంశే ।
శుక్రేతినీచేగురుదారగామీధర్మాధిపేనీచగతేతదంశే ॥

చంద్రుడు పాపగ్రహయుక్తుడై క్షీణుడై పరమ నీచమైన నవమమునఉండి, నీచాంశగతుడయిన, శుక్రుడు పరమ నీచయందుండి, నవమాధిపతి నీచగతుడై నీచాంశగతుడై జాతకుడు గురుతల్పగుడగును.

4. ధర్మాధిపేతాదృశఖేచరేణదృష్టేనపాపేపరదారగామీ ।
ధర్మాధిపస్థాంశపతౌతథైవయుక్తేథవాతాదృశదారగామీ ॥

నవమాధిపతి పాపయుక్తుడై నీచగతగ్రహముచే చూడబడిన పరదారాసక్తుడగును, నవమాధిపతియున్న నవాంశరాశ్యధిపతి పాపయుక్తుడయిన నీచగత గ్రహముచే చూడబడిన పరదారగామియగును.

5. వయోధికస్త్రీగమనంవదంతిచంద్రేనపాపేయదిధర్మరాశౌ ।
క్షీణేతినీచేత్వథవాతదంశేశుక్రేతథైవంగురుదారగామీ ॥

క్షీణచంద్రుడు నవమమున పరమనీచమునఉండి, నీచాంశగతుడై పాపయుక్తుడైన తనకన్న ఎక్కువ వయస్సున్న స్త్రీనిపొందును. శుక్రుడు పాపగ్రహ యుక్తుడై నవమమున పరమనీచయందున్నను, నీచాంశగతుడయినా, గురుతల్పగుడగును.

6. ధర్మాధిపేనీచగృహేతదంశేశుక్రేణయుక్తేగురుదారగామీ ।
ధర్మేశ్వరేసౌమ్యయుతేతదంశేతత్కారకేవాత్వథవాతదంశే ।
క్రూరాదిషష్ట్యంశవివర్జితేస్యాజ్జాతస్తుధర్మేదృఢబుద్ధియుక్తః ॥

నవమాధిపతి నీచయందు నీచాంశగతుడై శుక్రయుక్తుడైన గురుదారగామియగును. నవమాధిపతి శుభయుక్తుడై, శుభనవాంశయందున్నా, లేదా ధర్మకారకుడు శుభనవాంశయందుండి క్రూరాదిషష్ట్యంశగతుడు కానున్న ధర్మమున దృఢబుద్ధియగును.

7. గురౌవాభృగుపుత్రేవాస్వోచ్చమిత్రాంశగేశుభే ।
ధర్మాధిపేననంయుక్తేధర్మాధ్యక్షోభవేన్నరః ॥

గురుశుక్రులలో నొకరు నవమమందుండి, స్వ, ఉచ్చ, మిత్ర నవాంశగతుడై నవమాధిపతితో కూడియున్న ధర్మాధ్యక్షుడగును.

8. గురుశుక్రబుధాంశస్థేధర్మనాథేశుభేక్షితే ।
శుభగ్రహాణాంమధ్యస్థేధర్మకృత్సనరోభవేత్ ॥

నవమాధిపతి గురు, శుక్ర, బుధ నవాంశయందుండి, శుభగ్రహదృష్టుడై, శుభ గ్రహ మధ్యస్థుడయిన ధర్మకర్తయగును.

9. సౌమ్యాన్వితేధర్మగృహేతస్మిన్ పాపాంశసంయుతే ।
క్రూరషష్ట్యంశకేవాపిదంభధర్మపరాయణః ॥

నవమము శుభగ్రహయుక్తమై, పాపనవాంశయుక్తమైనా, లేదా క్రూరషష్ట్యంశ యుక్తమైనా డాంబికముగా ధర్మాసక్తిచూపు వాడగును.

10. ధర్మేపాపేపాపభాక్స్యాత్తదీశేపాపసంయుతే ।
క్రూరషష్ట్యంశగేవాపిపాపమధ్యగతేపివా ॥

నవమమున పాపగ్రహమున్నా, నవమాధిపతి పాపగ్రహయుక్తుడైనా, క్రూర షష్ట్యంశగతుడయినా, పాపగ్రహమధ్యగతుడయినా జాతకుడు పాపకర్ముడగును.

11. నాథకారకభావానామంశేశుభసమన్వితే ।
శుభాంశేశుభసందృష్టేసుచింతాధర్మసంగ్రహః ॥

నవమభావ, నవమాధిప, ధర్మకారకుల నవాంశ శుభగ్రహరాశియై శుభ షష్ట్యంశమై, శుభగ్రహదృష్టి కలిగియున్న జాతకుడు ధర్మస్వభావము, ధర్మకార్యము చేయువాడు అగును.

12. రాహుమందయుతేధర్మేక్రూరాంశేగుళికేక్షితే ।
తదీశేక్రూరరాశ్యంశేహ్యతిక్రూరాదికృద్భవేత్ ॥

నవమము శనిరాహుయుక్తమై క్రూరాంశమందుండి, గుళికదృష్టమై, నవమాధి పతి క్రూరనవాంశయందున్న జాతకుడు క్రూరకర్మలు చేయును.

13. పితృస్థానేశ్వరేసౌమ్యేకారకేశుభసంయుతే ।
భావేవాశుభసంయుక్తేపితృసౌఖ్యంవినిర్దిశేత్ ॥

నవమాధిపతి శుభగ్రహమై పితృకారకుడు శుభగ్రహయుక్తమైనా పితృసౌఖ్యము కలుగును.

14. పారావతాదౌతన్నాథేకారకేచతథావిధే ॥
స్వోచ్చమిత్రాంశకేవాపిపితృసౌఖ్యంవినిర్దిశేత్ ॥

నవమాధిపతి పారావతాద్యంశగతుడై, పితృకారకుడును పారావతాద్యంశ గతు డయినను, లేక స్వ, ఉచ్చ, మిత్రాంశయందున్న జాతకునకు పితృసౌఖ్యము కలుగును.

15. లగ్నేశాత్పితృభావేశేసంపూర్ణబలసంయుతే ।
కారకేచశుభైర్దృష్టేజాతఃపితృవశానుగః ॥

లగ్నాధిపతికన్న నవమాధిపతి బలవంతుడై, పితృకారకుడు శుభగ్రహదృష్టు డయిన జాతకుడు తండ్రి చెప్పినట్లు వినును.

16. పితృజన్మాష్టమేజాతఃతదీశేలగ్నగేపివా ।
తేనైవపితృకార్యాణికర్మశేషంసమాపయేత్ ॥

తండ్రి జన్మలగ్నమున కష్టమము జన్మలగ్నమైనా, పితృజన్మ లగ్నాష్టమాధి పతి లగ్నగతుడయినా-ఆ జాతకుడే తండ్రికి కర్మచేయును.

17. పితృకర్మగృహేజాతఃపితృతుల్యగుణాన్వితః ।
పితృజన్మతృతీయస్థేజాతఃపితృధనాశ్రితః ॥

తండ్రి జన్మలగ్నమునకు దశమరాశియందు పుట్టినవాడు తండ్రితో సమ మైన గుణములు కలవాడగును. పితృజన్మలగ్నమునందును, దానికి తృతీయరాశి యందును పుట్టినవాడు పితృధనాశ్రితుడగును.

18. పితుష్షష్టాష్టమేజాతఃపితృద్వేష్యోభవేన్నరః ।
పితృధర్మాయవిత్తేషుజాతఃపితృవశానుగః ॥

తండ్రి జన్మలగ్నమునకు షష్టాష్టమ రాశులందు పుట్టినవాడు పితృద్వేష్యు డగును.

19. పితృష్టమేషునక్షత్రత్రితయేయస్తుజాయతే ।
సకరోతిపితుర్దీక్షాంపుత్రపౌత్రసమన్వితః ॥

తండ్రి జన్మనక్షత్రమునకు అష్టమ నవమ దశమ నక్షత్రముల పుట్టినవాడు పుత్రపౌత్రయుతుడై తండ్రిదీక్షను పూర్తిచేయును. తండ్రి యిష్టప్రకారము చేయును.

20. పితుర్జన్మాంత్యభేశత్రితయేయస్తుజాయతే ।
సకరోతిపితుర్దుఃఖందూరదేశగతోభవేత్ ॥

తండ్రి జన్మనక్షత్రమునకు అంత్యనక్షత్రమందు ఏకాదశ, ద్వాదశ, త్రయో దశ (11,12,13) నక్షత్రముల పుట్టినవాడు దూరదేశగతుడై తండ్రికి దుఃఖముకల్గ జేయును.

21. భావాధిపేవిలగ్నస్థేదుశ్చిక్యేవాపిధర్మభే ।
బలవత్యుచ్చగేయేషాంతేశ్రేష్ఠామానవాస్మృతాః ॥

నవమాధిపతి లగ్నమున, తృతీయమున, నవమమునఉన్న జాతకులు శ్రేష్ఠు లగుదురు. భాగ్యాధిపతి బలవంతుడై ఉచ్చస్థుడైనను శ్రేష్ఠుడగును.

22. త్రికోణకేంద్రేయదిభావనాథేసౌమ్యేక్షితేసౌమ్యయుతేబలాఢ్యే ।
పారావతాంశాదిగతేశుభాంశేజాతోధనాఢ్యోబహుభాగ్యయుక్తః ॥

నవమాధిపతి కేంద్రకోణగతుడై, శుభగ్రహయుక్తుడై, శుభదృష్టుడై పారావ తాంశాదిగతుడై, శుభాంశమందున్న జాతకుడు బహు ధనవంతుడు, బహు భాగ్య వంతుడునగును.

23. లగ్నాధిపేలాభగతేతదీశేభాగ్యస్థితేతద్భవనాధిపేర్థే ।
కర్మాధిపేనాపియుతేచదృష్టేజాతోమహాభాగ్యయుతోనరస్స్యాత్ ॥
లగ్నాధిపతి లాభగతుడై, భాగ్యాధిపతి భాగ్యస్థుడై, భాగ్యాధిపతి ద్వితీయ మందుండి, దశమాధిపతితోకూడినా, చూచినా మహాభాగ్యవంతుడగును.

24. తృతీయరాశేరధిపేనయుక్తేభాగ్యాధిపేసౌమ్యదృశానమేతే ।
శుభాంశకేశోభనఖేచరాంశేభ్రాతుర్ధనాద్భాగ్యముపైతిజాతః ॥
భాగ్యాధిపతి తృతీయాధిపతితోకూడి, శుభగ్రహదృష్టుడు, యుక్తుడునై, శుభ నవాంశయందు, శుభ షష్ఠ్యంశయందున్న జాతకుడు సోదరభాగ్యము పొందును.

25. పుత్రేశ్వరేవాయదిభాగ్యరాశౌభాగ్యాధిపేనాత్రయుతేపిదృష్టే ।
తత్కారకేవాయదిపుత్రభావేజాతాత్సుతాద్భాగ్యముపైతివిత్తం ॥
పుత్రాధిపతి నవమమందుండి, నవమాధిపతితోకూడినా, చూడబడినా, లేక పుత్రకారకుడు పంచమమునఉండి భాగ్యాధిపతి యోగము, దృష్టికలిగిన జాతకుడు పుత్రునివలన భాగ్యమును పొందును.

26. జ్ఞాతిస్థానాధిపేభాగ్యేభాగ్యేశేజ్ఞాతిసంగతే ।
జ్ఞాతికారకసంయుక్తేజ్ఞాతిభాగ్యముపైతిసః ॥
షష్ఠాధిపతి నవమమందు, నవమాధిపతి షష్ఠమందుఉన్న, జ్ఞాతికారకునితో కూడిన జ్ఞాతుల ధనమును పొందును.

27. కళత్రకారకాదేవంతద్భావేశాద్వదేత్తథా ।
భాగ్యాధిపస్యశత్రుశ్చేచ్ఛత్రురాశిపతిస్తథా ॥
సప్తమాధిపతి నవమమందు, నవమాధిపతి సప్తమమునఉండి, కళత్రకారకునితో కూడియున్న భార్య సంపద కలియును. షష్ఠాధిపతి నవమాధిపతికి శత్రులై—

28. తదీశేభాగ్యసంబంధేశత్రుభాగ్యముపైతిసః ।
భాగ్యాధిపేవినాశస్థేశత్రునీచనిరీక్షితే ॥
శత్రుస్థానాధిపతి భాగ్యమందున్న శత్రుభాగ్యము పొందును. నవమాధిపతి అష్టమస్థుడై శత్రునీచగ్రహములచే చూడబడిన—

29. క్రూరాంశేనీచరాశ్యాదౌభాగ్యహీనోభవేన్నరః ।
షష్ఠాష్టమాంత్యనాథేనభాగ్యనాథేరిపుక్షయః ॥
క్రూరాంశయందుండి నీచ, శత్రుక్షేత్రములలోఉన్న జాతకుడు భాగ్యహీను డగును. భాగ్యాధిపతి 6,8,12 అధిపతులతో కూడినయున్న భాగ్యమున శించును.

30. గురుశుక్రేక్షితేయుక్తేభాగ్యేశతన్నాయకేపివా ।
లగ్నేశార్థపతౌధీశేభాగ్యప్రాప్తిఃపునర్భవేత్ ॥

భాగ్యస్థానముకాని, భాగ్యాధిపతికాని గురు శుక్రులతోకూడినా, చూడబడినా, లగ్నద్వితీయాధిపతులు తృతీయమందున్నా మరల భాగ్యప్రాప్తిగలుగును.

31. లాభేశేభాగ్యరాశిస్థేభాగ్యేశేలగ్నమాశ్రితే ।
లాభేభాగ్యేశసంయుక్తేపునర్భాగ్యంశవేత్తలు ॥

లాభాధిపతి భాగ్యమున, భాగ్యాధిపతి లగ్నమునఉండి, లాభమున భాగ్యాధిపతిఉన్న మరల భాగ్యము కలుగును.

32. కోణేశరాశిభాగస్థేభాగ్యేశేబలసంయుతే ।
గురుశుక్రయుతేదృష్టేజపధ్యానసమాధిమాన్ ॥

భాగ్యాధిపతి బలసంయుతుడై, పంచమ సప్తమాధిపతుల నవాంశలందుండి, గురు శుక్రులచే చూడబడినా, కూడియున్నా జపధ్యానయుక్తుడగును.

33. దేవలోకాంశకస్థేవాకర్మేశేభాగ్యపేథవా ।
పారావతాంశగేసౌమ్యేదృష్టేబ్రహ్మణినిష్ఠితః ॥

దశమాధిపతిగాని, నవమాధిపతిగాని దేవలోకాంశమందున్నా, దేవలోకాంశగతుడయినా, బుధదృష్టుడయినా జాతకుడు బ్రహ్మనిష్ఠకలవాడగును.

34. దానస్థానాధిపేస్వోచ్చేశుభగ్రహనిరీక్షితే ।
తత్స్థానేశుభసంయుక్తేదానకృత్సనరోభవేత్ ॥

నవమాధిపతి ఉచ్చస్థుడై శుభగ్రహదృష్టుడయిన, నవమమందు శుభగ్రహములున్న జాతకుడు దాతయగును.

35. పారావతాదిభాగస్థేదానేశేగురువీక్షితే ।
లగ్నేశేగురుసందృష్టేమహాదానకరోభవేత్ ॥

నవమాధిపతి పారావతాంశాదిగతుడై గురుదృష్టుడై, లగ్నాధిపతియు గురుదృష్టుడైన జాతకుడు మహాదాతయగును.

36. దానాధిపేనసందృష్టేలగ్నేతన్నాయకేపివా ।
తస్మిన్ కేంద్రత్రికోణస్థేమహాదానకరోభవేత్ ॥

నవమాధిపతి లగ్నమునుకాని, లగ్నాధిపతినిగాని చూచుచు, భాగ్యాధిపతి కేంద్రత్రికోణములందున్న జాతకుడు మహాదాతయగును.

37. సింహాసనాంశకేదాననాథేలగ్నేశవీక్షితే ।
కర్మేశేనాపిసందృష్టేమహాదానకరోభవేత్ ॥

నవమాధిపతి సింహాసనాంశయందుండి, లగ్నదశమాధిపతులచే చూడబడిన మహాదాతయగును.

38. భాగ్యయోగేధనం ప్రాప్తేరాజయోగేథవాభవేత్ ।
రాజయోగోథవా ప్రాప్తోయథోక్తంతత్తథాభవేత్ ॥

భాగ్యయోగమునధనము ప్రాప్తముకాగా, లేక-రాజయోగము కల్గుచుండగా, చెప్పిన దానయోగములు చెప్పినట్లు జరుగును.

39. ఇతరేషాంతునంజాతోదానయోగఃకథంభవేత్ ।
భాగ్యయోగేతుయోజాతోదానస్యతుసహాయకృత్ ॥

భాగ్యయోగ, ధనయోగ, రాజయోగములులేనివారికి దానయోగమెట్లు ఫలించును? ధనహీనునకున్న దానయోగము నిష్ప్రయోజనము. భాగ్యయోగమున పుట్టినవాడు దానమునకు సహాయకారియగును.

40. జాతఃపురోహితోవాపి బ్రహ్మవంశసముద్భవః ।
దానాధ్యక్షోన్యజాతౌస్యాద్వర్ణభేదేవికల్పనా ॥

దానయోగమున పుట్టినవాడు పురోహితుడయినను దానాధ్యక్షుడగును. వర్ణభేదమున వికల్పనలుండును.

41. చతుర్థేదానభావేశేకర్మేశేకేంద్రమాశ్రితే ।
వ్యయేశేగురుసంయుక్తేమహాదానకరోభవేత్ ॥

నవమాధిపతి చతుర్థమందుండి, దశమాధిపతి కేంద్రమందున్న, వ్యయాధిపతి గురుయుక్తుడైన జాతకుడు మహాదాతయగును.

42. భాగ్యేశేనాపిసంద్రుష్టేస్వోచ్చస్థేసోమనందనే ।
లాభేశేకేంద్రభావస్థేమహాదానకరోభవేత్ ॥

బుధుడు ఉచ్చస్థుడై భాగ్యాధిపతి కేంద్రమందున్న మహాదాతయగును.

43. లాభేశేలాభరాశిస్థేకర్మేశేబలసంయుతే ।
దానాధిపేనసంద్రుష్టేదానగ్రహణమేష్యతి ॥

లాభాధిపతి లాభమందుండి, దశమాధిపతి బలవంతుడై నవమాధిపతిచే చూడకినా దాన గ్రహణము (దానము చేయుటను) పొందును.

44. సుతేశేభాగ్యరాశిస్థేకర్మభాగ్యపసంయుతే ।
లగ్నాధిపేనసంద్రుష్టేభాగ్యప్రాప్తిర్నసంశయః ॥

పంచమాధిపతి భాగ్యస్థుడై, దశమ భాగ్యాధిపతులతోకూడి, లగ్నాధిపతిచే చూడబడిన జాతకునకు భాగ్యప్రాప్తి నిస్సంశయముగా కలుగును.

45. గురుస్థానేశసంయుక్తనవాంశాధిపతౌయదా ।
గురుశుక్రేక్షితేవాపిగురుభక్తియుతోభవేత్ ॥

నవమాంశాధిపతియున్న నవాంశాధిపతి గురుశుక్రదృష్టుడైన గురుభక్తి కలుగును.

46. గురుస్థానేశుభయుతేగురుసంబంధమాశ్రితే ।
తదీశేమృదుభాగస్థేగురుభక్తియుతోనరః ॥

నవమమున శుభగ్రహముండి గురు సంబంధమున్న, నవమాధిపతి మృద్వంశ యందున్న జాతకునకు గురుభక్తి యుండును.

47. రంధ్రభాగ్యఫలంప్రోక్తంశ్రీమత్కాశ్యపనాధునా ।
సమ్యగ్దైవవిదాంప్రీత్యైవేంకటేశేనధీమతా ॥

కాశ్యపగోత్రజుడగు శ్రీ వేంకటేశ దైవజ్ఞునిచే అష్టమ, నవమ భావఫలములు దైవజ్ఞులప్రీతికై చెప్పబడినవి.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున భాగ్యభావమను
దశమాధ్యాయము.

# ఏకాదశాధ్యాయము

1. దశమాత్ప్రవృత్తిమాజ్ఞాంకీర్తింపుష్టింప్రవాసపూజ్యాదీన్ ।
మానంజీవనకర్మ జ్ఞానంవినిర్దిశేద్దాసాన్ ॥

దశమమువలన-ప్రవృత్తి, ఆజ్ఞ, కీర్తి, పుష్టి, ప్రవాసము, పూజ్యాదికము, మానము, జీవనకర్మ, జ్ఞానము, స్థానము, సేవకులను చెప్పవలెను.

2. కర్మాధిపేహీనబలేసపాపేకర్మాదివైకల్యముశంతితజ్ఞాః ।
కర్మేశవాగీశశశాంకపుత్రావీర్యాన్వితాయజ్ఞకరాభవంతి ॥

కర్మాధిపతి హీనబలుడై పాపగ్రహయుక్తుడైన కర్మవైకల్యము (కర్మచెడును) కలుగును. దశమాధిపతి, గురు, బుధులు బలవంతులయిన యజ్ఞములుచేయును.

3. శుభగ్రహైర్దృష్టినమన్వితైర్వైర్యాన్వితైర్యజ్ఞవిశేషమాహుః ।
దుస్థాశ్వశాంకాత్మజజీవశుక్రాఃపాపేక్షితాఃకర్మవినాశదాస్తు ॥

కర్మాధిప బుధగురులు శుభగ్రహదృష్టులైయున్న యజ్ఞవిశేషములు చేయును గురుబుధశుక్రులు 6,8,12 లందున్న, పాపగ్రహదృష్టులయిన కర్మభ్రష్టుడగును.

4. నాశస్థితా స్తత్ర తదంశనాథాస్తైర్యుక్తరాశేరధిపాచ్చనాశం ।
రాహౌచ కేతౌ యదివాదినేశే భాగీరథీస్నానఫలాదిభాక్స్యాత్ ॥

గురుబుధశుక్రులు అష్టమమందున్నా, లేక, వారున్న నవాంశాధిపతులున్న రాశ్యధిపతులు అష్టమమందున్నా కర్మభ్రష్టత కలుగును. దశమమున రాహుకేతువులు, రవిగానియున్న గంగాస్నానము దక్కును.

5. మానేచమీనేయదివానసౌమ్యే భౌమాన్వితేవాభవితా చముక్తిః ।
జలర్క్షగౌపూర్ణశశాంకజీవౌ మానస్థితౌ గాంగజలాభిపూతః ॥

దశమము మీనముగాని, బుధయుక్తముగాని, కుజయుక్తముగానియైన జాతకునకు ముక్తికలుగును. పూర్ణచంద్రగురులు జలరాశియైన దశమ భావమందుండిన గంగాస్నాన పవిత్రుడగును.

6. మానేశ్వరే శుక్రయుతేచ కేంద్రే దేస్వోచ్చసంస్థితే తాదృశతోయపూతః ।
వ్యయేబుధే వాయదివా తదీశే స్వోచ్చాన్వితే తాదృశతోయపూతః ॥

దశమాధిపతి శుక్రునితోకూడి కేంద్రమున ఉచ్చస్థుడైయున్నా, బుధుడుగాని, దశమాధిపతికాని వ్యయమున ఉచ్చస్థులైనా గంగాజలతుల్యస్నాన పవిత్రుడగును.

7. బుధేనజీవేయదివానసౌమ్యే ప్రాకారకృద్గోపురమంటపాదీన్ ।
మానస్థితే తద్గృహనాథయుక్తే కరోతిజీర్ణోద్ధరణాదికంతు ॥

బుధుడు గురుయుక్తుడైగాని, శుక్రయుక్తుడైగాని దశమమునఉన్న ప్రాకార గోపుర మండపాదుల నిర్మించును. బుధుడు దశమాధిపతితోకూడి దశమమునఉన్న జీర్ణదేవాలయోద్ధరణ చేయును.

8. కరోతికూపాదితటాకమత్ర తకర్మేశ్వరేగోపురభాగయుక్తే ।
మృద్వంశకేవాశుభదృష్టియుక్తే భాగ్యేశ్వరేణాపినిరీక్షితేవా ॥

కర్మాధిపతి కర్మస్థానమున గోపురాంశయుక్తుడైనా, మృద్వంశయందుండి శుభగ్రహదృష్టుడైనా, భాగ్యాధిపతి దృష్టుడైనా, బావులు, చెరువులు త్రవ్వించును.

9. జన్మాధిపే కర్మగతే తదీశే భాగ్యస్థితే పాపవివర్జితేస్మిన్ ।
సౌమ్యేక్షితే శోభనభాగయుక్తే యజ్ఞన్యకర్తాసభవేత్తదానీం ॥

లగ్నాధిపుడు దశమమునఉండి, కర్మాధిపతి భాగ్యమునఉండి, పాపయుక్తుడు గాక, శుభగ్రహదృష్టుడై, శుభనవాంశగతుడైన యజ్వయగును.

10. ధర్మాధిపే స్వోచ్చగతేనపాపే నీచాంశగేనాశగతే తుతస్మిన్ ।
విష్ణ్వాఖ్యవేదేవముఖన్యకత్వక్రూరాదిషష్ట్యంశగతేపిచైవం ॥

పైనచెప్పిన యాగకర్తృత్వయోగమున్నా, నవమాధిపతి అష్టమస్థుడై ఉచ్ఛగతుడై, పాపయుక్తుడై నీచనవాంశగతుడై, క్రూరషష్ట్యంశగతుడైన యజ్ఞకర్మకు విఘ్నము కలుగును.

11. తుంగస్థితేసోమసుతేతదీశేస్వోచ్చాన్వితేసోమసుతేనదృష్టే ।
బుధాన్వితేవాసబుధేస్తరాశౌయజ్ఞస్యకర్తానభవేత్తదానీం ॥

బుధుడు ఉచ్చస్థుడై, కర్మాధిపుడును ఉచ్చస్థుడై, బుధదృష్టుడైనా, బుధయుక్తుడయినా, బుధుడు సప్తమమందున్నా యజ్ఞకర్త యగును.

12. ఆజ్ఞాస్థానాధిపేసౌమ్యేశుభయుక్తేక్షితేపివా ।
శోభనాంశగతేవాపిజాతస్స్యాజ్ఞాధరోభవేత్ ॥

దశమాధిపతి శుభగ్రహమై, శుభయుక్తుడయినా, శుభదృష్టుడయినా, శుభనవాంశగతుడయినా ఆజ్ఞాధరుడు (ఆజ్ఞలనిచ్చు అధికారి-న్యాయాధికారి కాని) అగును.

13. ఆజ్ఞాస్థానగతేసూర్యేభూమిపుత్రేథవాస్థితే ।
కేంద్రాన్వితేతదీశేపిక్రూరమాజ్ఞాంకరోతిసః ॥

కుజుడు దశమమందున్నా, రవియున్నా, దశమాధిపతి కేంద్రమందున్న జాతకుడు క్రూరమైన ఆజ్ఞలచేయును.

14. ఆజ్ఞాధిపోమందయుతేరంధ్రనాథేనసంయుతే ।
క్రూరాంశేకేంద్రరాశౌవాక్రూరామాజ్ఞాంకరోతిసః ॥

దశమాధిపతి శనితోకూడి, అష్టమాధిపయుక్తుడై, క్రూరాంశమందున్నా, కేంద్రమందున్నా, జాతకుడు క్రూరముగా ఆజ్ఞాపించువాడగును.

15. రాహౌమాందియుతేమానేరంధ్రేరాహౌధ్వజేపివా ।
నీచస్థేధర్మభావేశేక్రూరామాజ్ఞాంకరోతిసః ॥

రాహువుమాందీయుతుడై దశమమందున్నా, మాంది దశమమందుండి రాహుకేతువులష్టమమందున్నా, భాగ్యాధిపతి నీచగతుడయిన క్రూరాజ్ఞల నిచ్చును.

16. మానాధిపేకేంద్రగతేశుభయుక్తేక్షితేపివా ।
క్రూరషష్ట్యంశసంయుక్తేక్రూరామాజ్ఞాంకరోతిసః ॥

దశమాధిపతి కేంద్రగతుడై, శుభగ్రహయుక్తుడుగాని, దృష్టుడుగానయైన, క్రూరషష్ట్యంశయుక్తుడైనా, క్రూరాజ్ఞల నిచ్చును.

17. శశాంకేకేంద్రసంయుక్తేగురుశుక్రనిరీక్షితే ।
పారావతాదిభాగస్థేసత్కీర్తిసహితోభవేత్ ॥

చంద్రుడు కేంద్రవర్తియై గురుశుక్రులచే చూడబడి, పారావతాంశయందున్న సత్కీర్తిగలవాడగును.

18. తదీశేశుభసంయుక్తేశుభమధ్యగతేపివా ।
శుభగ్రహాణామంశేవాసత్కీర్తిసహితోభవేత్ ॥

దశమాధిపతి శుభగ్రహయుక్తుడైనా, శుభగ్రహమధ్యగతుడైనా, శుభశవాంశ యందున్నా సత్కీర్తిమంతుడగును.

19. కీర్తిస్థానాధిపేసౌమ్యేస్వోచ్చమిత్రస్వవర్గగే ।
సౌమ్యషష్ఠ్యంశగేవాపిసత్కీర్తిసహితోభవేత్ ॥

దశమాధిపతి శుభగ్రహమై స్వ, ఉచ్చ, మిత్రక్షేత్ర, వర్గములందున్న, శుభ షష్ఠ్యంశయుతుడయినా సత్కీర్తికలవాడగును.

20. తదీశేదేవలోకస్థేసింహాసనగతేపివా ।
బలపూర్ణేవిలగ్నేశేసత్కీర్తిసహితోభవేత్ ॥

దశమాధిపతి దేవలోకాంశగతుడయినా, సింహాసనాంశయందున్నా, లగ్నాధి పతి పూర్ణబలవంతుడయిన జాతకుడు కీర్తిమంతుడగును.

21. పాపగ్రహాణాంసంబంధేమానసాధేబలక్షయే ।
క్రూరషష్ఠ్యంశసంయుక్తేహ్యపకీర్తియుతోభవేత్ ॥

దశమాధిపతి పాపగ్రహయుక్తుడై, బలహీనుడై, క్రూరషష్ఠ్యంశయుతుడైన అపకీర్తి కలుగును.

22. అపకీర్తియుతోజాతఃకర్మస్థేసరవౌశనౌ ।
పాపాంశగేపాపదృష్టేపాపమధ్యగతేతథా ॥

రవిశనులు దశమమునఉండి, పాపగ్రహనవాంశగతులై, పాపగ్రహదృష్టులైనా, పాపమధ్యగతులైనా అపకీర్తి కలుగును.

23. శుభగ్రహాణాంసంబంధేమానేతన్నాయకేపివా ।
స్వోచ్చేవాస్వగృహేవాపిజాతోమానీదృఢవ్రతః ॥

దశమముకాని, దశమాధిపతికాని శుభగ్రహ సంబంధముండి-లేదా దశమాధి పతి ఉచ్చస్థుడైనా, స్వక్షేత్రగతుడైనా, జాతకుడు అభిమానముకలవాడు, దృఢ వ్రతుడు అగును.

24. ఇంగితజ్ఞోభిమానీస్యాన్మానేజీవేథవాశుభే ।
తదీశేశుభసంబంధేశుభమధ్యగతేపివా ॥

దశమమున గురుడుకాని, శుభగ్రహముకానిఉండి, దశమాధిపతికి శుభసం బంధమున్న, శుభమధ్యగతుడైనా పరేంగితజ్ఞుడు, అభిమానవంతుడునగును.

25. పాపేమానేపాపదృష్టేతదీశేనీచరాశిగే ।
పాపరాశ్యంశగేవాపిమానహీనోభవేన్నరః ॥
దశమము పాపక్షేత్రమై, పాపగ్రహదృష్టమై, దశమాధిపతి నీచగతుడయిన, పాపనవాంశయందున్నా జాతకుడు మానహీనుడగును.

26. మానాధిపేచరాశిస్థేసంచారసహితోభవేత్ ।
స్థిరాంశేస్థైర్యముద్దిష్టంఉభయంచద్విదేహగే ॥
దశమాధిపతి చరాంశయందున్న దేశసంచారముచేయువాడును, స్థిరాంశ యందున్న స్వగృహముననే యుండువాడును, ద్విస్వభావమైన మిశ్రమైనవాడు నగును.

27. షష్ఠేశేకర్మరాశిస్థేకర్మేశేమందసంయుతే ।
షష్ఠాధిపస్యసంబంధేబహుదాసాన్వినిర్దిశేత్ ॥
షష్ఠాధిపతి దశమమునఉండి, దశమాధిపతి శనియుక్తుడై షష్ఠాధిపతి సంబంధ మున్న సేవకులుందురు.

28. కర్మాధిపస్థాంశపతౌశనిసంబంధసంయుతే ।
కేంద్రత్రికోణగేవాపిదాసీదాసాన్వినిర్దిశేత్ ॥
దశమాధిపతియున్న నవాంశాధిపతికి శనిసంబంధముకల్గి, లేదా కేంద్రకోణ గతుడయినా, జాతకునకు దాసీవర్గముండును.

29. శుభగ్రహైణసంబంధేకర్మరాశౌతదీశ్వరే ।
భానుపుత్రేణవాయుక్తేప్రశ్నేపూర్తిర్వినిర్దిశేత్ ॥
దశమముకాని, దశమాధిపతికాని శుభగ్రగహసంబంధము కలిగియున్న-లేదా శనియుక్తమైనా ప్రశ్నపూర్తియగును. సంశయములులేనివాడగును.

30. కర్మనాథేనవాభుక్తింప్రశ్నేపూర్తింవినిర్దిశేత్ ।
తత్రపాపసమాయోగేజానుదౌర్బల్యమాదిశేత్ ॥
దశమాధిపతిచే భోజనమును (జీవికను) ప్రశ్నపూర్తిని చెప్పవలెను. దశమ మున పాపగ్రహమున్న మోకాళ్ళ నొప్పులు కలుగును.

31. గ్రహైశ్చతుర్భిస్సహితేతదీశేత్రికోణగైః కేంద్రగతైస్తుముక్తః ।
చతుర్గ్రహైఃకర్మయుతైఃప్రవ్రజ్యాంప్రాప్నోతిజాతఃకథితో
మునీంద్రైః ॥
దశమాధిపతి కోణస్థులైన నాలుగు గ్రహములతోకూడియున్న, కేంద్రగతు లైన చతుర్గ్రహయుక్తుడయినా జీవన్ముక్తుడగును. దశమమున నాల్గుగ్రహములున్న సన్యాసయోగము కలుగును.

32. నవీక్షితశ్చేదితరైః గ్రహేందై ర్లగ్నాధిపం పశ్యతిభానుపుత్రః ।
లగ్నాధిపోవాయదిభానుపుత్రంసన్యాసయోగంమునయోవదంతి ॥
శని యే గ్రహముచేతను చూడబడక లగ్నాధిపతిని చూచుచున్నా-లేదా లగ్నాధిపతి ఇతరగ్రహములచే చూడబడక శనిని చూచుచున్నా, సన్యాసయోగము కలదు.

33. శనేర్ద్రేగాణేక్షముదాత్మబంధౌమందేక్షితేతాదృశయోగమాహుః ।
మందాంశకేభూమిసుతాంశకేవామందేక్షితేచంద్రయుతేతథైవం ॥
శనిద్రేక్కాణమున చంద్రుడుండి, శనిచేచూడబడినను శనినవాంశలోగాని, కుజనవాంశలోగాని చంద్రుడుండి శనిదృష్టుడయినా సన్యాసయోగము కలుగుము.

34. సన్యాసయోగాధిపతౌసరాహౌక్రూరాంశకేవాగుళికేనయుక్తే ।
సన్యాసయోగోనహిబుద్ధిమద్భిఃఊహ్యంహితత్రోప్తక్రి
మిథీహతత్త్వైః ॥
సన్యాసయోగాధిపతి రాహుయుక్తుడై క్రూరాంశయందున్నా -లేక-గుళికునితో కూడియున్నా సన్యాసయోగములేదు.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున దశమభావంబను
ఏకాదశాధ్యాయము

# ద్వా ద శా ధ్యా య ము

1. ఏకాదశాల్లాభగతింజ్యేష్ఠసోదరమేవచ ।
కర్ణంతద్భూషణంచైవప్రవదేద్బుద్ధిమాన్నరః ॥
ఏకాదశస్థానమువలన లాభమార్గమును, జ్యేష్ఠసోదరులను, కర్ణము, కర్ణభూషణము, వీనినాలోచించి చెప్పవలెను.

2. లాభేశేస్వోచ్చరాశిస్థేకేంద్రకోణగతేపిచ ।
శుభశుద్ధ్యగతేలాభేధనలాభముదీరయేత్ ॥
లాభాధిపతి ఉచ్చస్థుడైనా, కేంద్రకోణగతుడైనా, లాభస్థానము శుభగ్రహమధ్యమందున్నా, ధనలాభము కలుగును.

3. శుభేనకర్మనాథేనదృష్టయుక్తేతదీశ్వరే ।
స్వోచ్చమిత్రస్వవర్గస్థేధనలాభముదీరయేత్ ॥

దశమాధిపతి శుభగ్రహమై, వానిచే లాభాధిపతి చూడబడినా, కూడియున్నా, ఉచ్చ, మిత్ర, స్వక్షేత్రవర్తియైనా ధనలాభము కలుగును.

4. లాభనాథసమాయుక్తనవాంశాధిపతౌశుభే ।
శుభగ్రహాణాంమధ్యస్థేధనలాభముదీరయేత్ ॥

లాభాధిపతియున్న నవాంశాధిపతి శుభగ్రహమై, శుభగ్రహమధ్యస్థుడయిన ధనలాభము కలుగును.

5. విత్తాధిపేనసందృష్టేవాహనాధీశ్వరేణచ ।
భాగ్యేశేనతథాయుక్తేధనలాభముదీరయేత్ ।

లాభాధిపతి, ద్వితీయ చతుర్థాధిపతులచే చూడబడి, భాగ్యాధిపతితో కూడి యున్న ధనలాభము కలుగును.

6. లాభాధిపసమాయుక్తత్ర్యంశభాగపతౌశుభే ।
కర్మాధిపేనసందృష్టేధనలాభ ముదీరయేత్ ॥

లాభాధిపతియున్న ద్రేక్కాణాధిపతి శుభగ్రహమై, దశమాధిపతిచే చూడబడిన ధనలాభము కలుగును.

7. లాభేశ్వరోక్తదిగ్భాగాద్ధనలాభముదీరయేత్ ।
బలాబలవశేనైవంధనేశాన్నిర్దిశేద్బుధః ॥

లాభాధిపతికి చెప్పబడిన దిక్కునుండి ధనలాభము కలుగును. ధనాధిపతి బలాబలములనుబట్టియు ధనలాభము చెప్పనగును.

8. లాభేపాపేతద్గృహేవాప్యర్థహానింవినిర్దిశేత్ ।
లాభేశపాపసంబంధేప్రోక్తాతద్ధానిరత్రతు ॥

లాభస్థానమున పాపగ్రహమున్నా, లేక-లాభము పాపరాశియైనా ధనహాని కలుగును. లాభాధిపతికి పాపసంబంధమున్నను ధనహాని కలుగును.

9. కర్ణస్థానేశ్వరేసౌమ్యేశుభదృష్టిసమన్వితే ।
కర్ణాధిపేబలవతికర్ణాభరణమిష్యతే ॥

కర్ణాధిపతి=లాభాధిపతి శుభగ్రహమై, శుభదృష్టి కలిగియున్న, బలవంతుడయిన- కర్ణాభరణముండును.

10. పాపగ్రహాణాంసంబంధేపాపగ్రహయుతేతథా ।
పాపగ్రహక్షేత్రేవాపితన్నాశోత్రభవిష్యతి ॥

కర్మాధిపతికి పాపగ్రహ సంబంధముండి, పాపయుక్తుడై, పాపదృష్టుడైన కర్ణా భరణములుండవు.

11. లాభేశాత్సోదరేశాద్వాకర్ణసౌఖ్యంవినిర్దిశేత్ ।
తదీశేశుభసంబంధేకర్ణసౌఖ్యంవినిర్దిశేత్ ॥

తృతీయ లాభాధిపతులవలన కర్ణసౌఖ్యము నిశ్చయించవలెను. తృతీయ లాభాధిపతులు శుభగ్రహయుక్తులయిన కర్ణసౌఖ్యము కలుగును.

12. జ్యేష్ఠభావాచ్ఛుభశ్చైవాశుభంపాపవశాదపి ।
శుభగ్రహాణాంసంబంధేతద్దీర్ఘాయుర్వినిర్దిశేత్ ।

లాభమునకు శుభ సంబంధమువలన జ్యేష్ఠసోదరులకు శుభమును, పాపగ్రహ ములవలన అశుభమును చెప్పవలెను. లాభమునకు శుభసంబంధమున్న జ్యేష్ఠ సోదరులకు దీర్ఘాయువు కలుగును.

13. పాపాన్వితేపాపదృష్టేతద్ధానింప్రవదంతిహి ॥

లాభము పాపదృష్టమైనా, పాపయుక్తమైనా జ్యేష్ఠ సోదరహాని కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్ర తాత్పర్యమున లాభభావమను
ద్వాదశాధ్యాయము

# త్రయోదశాధ్యాయము

1. వ్యయభవనాద్వ్యయమఖిలంపతనంనరకేంగవైకల్యం ।
వామాక్షిచరణయుగళంశయ్యాస్థానంచనిర్దిశేత్ప్రాజ్ఞః ॥

ద్వాదశభావమువలన-సకలమైన వ్యయము, నరకము, అంగవైకల్యము, ఎడమకన్ను, పాదద్వయము, శయనస్థానము – వీనిని విచారణచేయవలెను.

2. వ్యయేపాపసమాయుక్తేతదీశేపాపఖేచరే ।
పాపగ్రహేణసందృష్టేపాపమూలాద్ధనవ్యయః ॥

వ్యయాధిపతి పాపగ్రహమై, వ్యయమున పాపుడుండి, పాపునిచే చూడబడిన జాతకునకు చెడుఖర్చు ఎక్కువగా అగును.

3. వ్యయాధిపసమాయుక్తనవభాగపతౌశుభే ।
శుభాంశేశుభమధ్యస్థేధర్మమూలాద్ధనవ్యయః ॥

వ్యయాధిపతియున్న నవాంశాధిపతి శుభగ్రహమై, శుభాంశయందుండి, శుభగ్రహమధ్యనున్న ధర్మకార్యములకై ధనము వెచ్చించును. చెప్పుకోదగిన మంచి ఖర్చగును.

4. మందమాంద్యగునంయుక్తేవ్యయేవాతద్గృహాధిపే ।
క్రూరాంశకసమాయుక్తేపాపమూలాద్ధనవ్యయః ॥

వ్యయస్థానముగాని వ్యయాధిపతిగాని శని, మాంది, రాహువులతోకూడి, క్రూరాంశమందున్న పాపమూలకధన వ్యయముఅగును. (లెక్కచెప్పలేని, చెప్పరాదని చెడుఖర్చు అగును.)

5. గురుశుక్రౌవ్యయేవాపిబుధచంద్రనిరీక్షితౌ ।
పారావతాదిభాగస్థౌధర్మమూలాద్ధనవ్యయః ॥

గురుశుక్రులు వ్యయమునఉండి బుధచంద్రులచే చూడబడి, పారావతాద్యంశగతులయిన ధర్మమూలక వ్యయమగును.

6. వ్యయాధీపేత్రికోణస్థేకేంద్రేపాపనిరీక్షితే ।
క్రూరషష్ఠ్యంశకేవాపిపాపమూలాద్ధనవ్యయః ॥

వ్యయాధిపతి కేంద్రకోణములందుండి పాపగ్రహదృష్టుడైన, క్రూరషష్ఠ్యంశగతుడయిన చెడుఖర్చుచేయును.

7. పాపేనకర్మనాథేనవ్యయేశేదృష్టిసంయుతే ।
శత్రునీచారిభాగస్థేపాపమూలాద్ధనవ్యయః ॥

పాపుడైన దశమాధిపతిచే వ్యయాధిపతి చూడబడి, శత్రునీచ భాగస్థుడైన పాపమూలక ధనవ్యయమగును.

8. శుభేనకర్మనాథేనదృష్టేయుక్తేవ్యయేశ్వరే ।
స్వోచ్చమిత్రస్వవర్గస్థేధర్మమూలాద్ధనవ్యయః ॥

వ్యయాధిపతి శుభుడయిన కర్మాధిపతిచే చూడబడి, స్వ, ఉచ్చ, మిత్రరాశి వర్గములందున్న ధర్మమూలకవ్యయమగును.

9. వ్యయేశేబలహీనేవాశత్రునాథయుతేక్షితే ।
గుళికాహిసమాయుక్తేశత్రుమూలాద్ధనవ్యయః ॥

వ్యయాధిపతి బలహీనుడై షష్ఠాధిపతితో కూడినను, చూడబడినను, గుళికరాహువులతో కూడినను శత్రుమూలకముగా ధనవ్యయమగును.

10. వ్యయేశేదారనాథేనబలహీనేనతేనతు ।
దృష్టేయుతేవాక్రూరాంశేస్త్రీహేతోర్ధననాశనం ॥
వ్యయాధిపతి బలహీనుడయిన సప్తమాధిపతితోకూడినా, చూడబడినా, క్రూరాంశగతుడయినా, స్త్రీమూలకముగా ధననాశము అగును.

11. తాదృశేవ్యయనాథేస్మిన్దృష్టేయుక్తేథవాథవేత్ ।
తథావిధేనభౌమేనభ్రాతృమూలాద్ధనవ్యయః ॥
వ్యయాధిపతి బలహీనుడయిన కుజునితో కలిసినా, చూడబడినా క్రూరాంశ మందున్న, సోదరమూలక ధనవ్యయమగును.

12. ఏవంమాతృపయోగేనయుతేదృష్టేవ్యయాధిపే ।
క్రూరాన్వితేక్రూరభాగేమాతృమూలాద్ధనవ్యయః ॥
అట్లే వ్యయాధిపతి బలహీనుడయిన చతుర్థాధిపతియుక్తుడయినా, దృష్టుడైనా, పాపయుక్తుడై క్రూరాంశయుక్తుడైనా మాతృమూలకధన వ్యయమగును.

13. పుత్రభావేశ్వరేణాపిబలహీనేనసంయుతే ।
దృష్టేవ్యయేశేక్రూరాంశేపుత్రమూలాద్ధనవ్యయః ॥
వ్యయాధిపతి బలహీనుడయిన పంచమాధిపతితోకూడినా, చూడబడినా, క్రూరాంశయందున్నా పుత్రమూలకముగా ధనవ్యయము అగును.

14. పితృస్థానేశ్వరేణాపికారకేణాపినంయుతే ।
వ్యయేశేదృష్టిసంబంధేపితృమూలాద్ధనవ్యయః ॥
వ్యయాధిపతి నవమాధిపతితోగాని, పితృకారకునితోగాని చూడబడినా, కూడినా, పితృమూలకముగా ధనవ్యయమగును.

15. బలేనహీనేరిప్పేశేక్రూరరాశ్యంశకేపివా ।
నీచాంశకేనీచరాశౌదేహవైకల్యమాదిశేత్ ॥
వ్యయాధిపతి బలహీనుడై క్రూరరాశ్యంశగతుడయినా, నీచరాశస్థుడైనా దేహ వైకల్యము కలుగును.

16. బహుపాపసమాయోగేవ్యయేతద్భావనాయకే ।
మందమాంద్యగుసంయుక్తేదేహవైకల్యమాదిశేత్ ॥
వ్యయభావము పాపవర్గయుతమై, వ్యయాధిపతి శనిమాంది రాహుగ్రహములతో కూడినా దేహవైకల్యము కలుగును.

17. వ్యయేశేపాపరాశ్యంశేక్రూరాంశేక్రూరసంయుతే ।
పాపగ్రహేణసందృష్టేనరకేనభవిష్యతి ।

వ్యయాధిపతి పాపరాశియందుండి, పాపనవాంశయందుండి, క్రూరషష్ట్యంశగతుడై క్రూరవర్గయుతుడైన, పాపగ్రహదృష్టుడైన నరకమునపడును.

18. నరకేపతనంబ్రూయాద్రాహుమాందియుతేవ్యయే ।
షష్ఠాధిపేనసందృష్టేరంధ్రనాథేనవాయుతే ॥

వ్యయభావము మాందీరాహుయుక్తమై షష్ఠాధిపతిచే చూడబడినను, అష్టమాధిపతితో చూడబడినా, కూడినా నరకమందు పడును.

19. వ్యయేశయుతషష్ట్యంశేక్రూరభాగాదిసంజ్ఞితే ।
క్రూరగ్రహేణసందృష్టేనరకేపతనంవదేత్ ॥

వ్యయాధిపతి క్రూరాంశయందుండి, క్రూరగ్రహదృష్టుడైన నరకపతనము కలుగును.

20. చంద్రార్కయోర్యోబలవాన్ తద్యుక్తత్ర్యంశనాయకః ।
గురుర్వాచంద్రశుక్రౌవాసూర్యభౌమజ్ఞసూర్యజాః ॥

రవిచంద్రులలో బలవత్తరగ్రహమున్న ద్రేక్కాణాధిపతి గురువైన—

21. దైవికంపితృలోకస్తువింద్యాన్నరకమేవచ ।
తేషాంసౌమ్యేక్షణవశాత్తల్లోకేశ్రేష్ఠఉచ్యతే ॥

దేవలోకము కలుగును. చంద్రశుక్రులయిన పితృలోకము, రవి, శని, బుధ, కుజులయిన నరకమును కలుగును. ఆ ద్రేక్కాణాధిపతికి శుభదృష్టియున్న అతడాలోక శ్రేష్ఠుడగును.

22. ఉచ్చస్థేశ్రేష్ఠలోకస్స్యాన్నీచత్వేనీచమాప్నుయాత్ ।
మధ్యమేతుసమప్రాప్తిమేవమాహుర్మహర్షయః ॥

పూర్వోక్తగుర్వాది గ్రహములు ఉచ్చస్థులైన శ్రేష్ఠలోకమని, నీచగతులైన నీచలోకమని, మధ్యమైన సమమని మహర్షులు చెప్పుదురు.

23. శుభేన్వోచ్చవ్యయేవాపిసౌమ్యఖేచరవీక్షితే ।
దేవలోకాదిభాగస్థేస్వర్గప్రాప్తిర్భవిష్యతి ॥

ఏ శుభగ్రహమైనా ఉచ్చయందుగాని, వ్యయమందుగానిఉండి, శుభదృష్టమైన, దేవలోకాద్యంశయందున్న జాతకునకు స్వర్గప్రాప్తి కలుగును.

24. దేవాంశేకర్మరాశీశేవ్యయరాశిగతేపివా ।
శుభగ్రహేణసందృష్టేస్వర్గప్రాప్తిర్భవిష్యతి ॥

దశమాధిపతి దేవాంశగతుడయినా, వ్యయమందున్నా, శుభగ్రహముచే చూడబడిన స్వర్గప్రాప్తికలుగును.

25. నేత్రేశేశుభసంయుక్తేశోభనాంశసమన్వితే ।
శుభఖేచరసంబంధేతన్నేత్రస్యశుభంవదేత్ ॥

వ్యయాధిపతి శుభగ్రహయుక్తుడై, శుభనవాంశగతుడై, శుభవర్గమందున్న, ఆ నేత్రమునకు శుభము కలుగును. (వ్యయ మెడమకన్ను-ద్వితీయము కుడికన్ను)

26. అన్యథాచేద్వదేన్నాశంపాదయోరపితత్తథా ।
తత్త్రపంచాదికంసర్వంధనభావేప్రదర్శితం ॥

వ్యయాధిపతి పాపయుక్తుడై, పాపనవాంశలో, పాపవర్గగతుడయిన ఎడమ కంటికి హాని కలుగును. అట్లే వ్యయాధిపతికి పాపసంబంధమున్న పాదములకు హాని, శుభసంబంధమున్న క్షేమము ఈప్రకారమంతయు ధనభావమున చెప్పబడినది. అవి సర్వత్ర యోజన చేయవలెను.

27. గురుశుక్రబుధాస్తత్రనిర్దిశేద్వాహనంబుధః ।
వాహనోక్తాదికంసర్వంతదిహాత్రవిచింతయేత్ ॥

వ్యయమందు గురుశుక్రబుధులున్న జాతకునకు వాహనము కలుగును. చతుర్థ భావమున వాహన విషయమై చెప్పినదంతయు ఇక్కడ యోజించవలెను.

28. శుభగ్రహాణాంసంబంధేవ్యయేతద్భావనాయకే ।
డోలామానంచ్రవదేచ్ఛయనాదిసుఖంవదేత్ ॥

వ్యయమునకుగాని, వ్యయాధిపతికిగాని శుభసంబంధమున్న తూగుటుయ్యేల ఉండునని, శయనసౌఖ్యముండునని చెప్పవలెను.

29. వ్యయేశేస్వోచ్చరాశిస్థేశుభవర్గసమన్వితే ।
శుభగ్రహేణసందృష్టేపర్యంకశయనంవదేత్ ॥

వ్యయాధిపతి ఉచ్చయందుండి శుభవర్గగతుడై శుభగ్రహదృష్టుడైన పర్యంక శయనము (పరుపుమంచము) లభించును.

30. విచిత్రమంచశయనంవ్యయేశేపరమోచ్చగే ।
భాగ్యనాథేనవాదృష్టేమణిరత్నవిభూషితం ॥

వ్యయాధిపతి పరమోచ్చ భాగగతుడై, భాగ్యాధిపతిచే చూడబడిన మణి రత్నములుపొదిగిన విచిత్రమంచశయనము కలుగును.

31. పాపగ్రహాణాంసంబంధేవ్యయేతద్భావనాయకే ।
క్రూరాంశేక్రూరసందృష్టేశయనాదిసుఖంనహి ॥

వ్యయమునకుగాని, వ్యయాధిపతికిగాని పాపగ్రహసంబంధమున్న, క్రూరాంశస్థు క్రూరదృష్టమైన శయ్యాసుఖముండదు.

32. నీచేవ్యయేవాలగ్నేశేశత్రునాథేనవీక్షితే ।
మందమాంద్యగునంయుక్తేశయనాదిసుఖంనహి ॥

లగ్నాధిపతి నీచయందుగాని, వ్యయమందుగాని ఉండి, షష్ఠాధిపతిచే చూడబడిన, శని, మాంది, రాహువులతో కూడియున్న శయనసుఖముండదు.

33. పంచమేభృగునంయుక్తేచంద్రేణనహితేతథా ।
తాభ్యాందృష్టేథవాపుత్రేస్త్రీదైవోపాస్తిమాదిశేత్ ॥

పంచమమున శుక్రుడుండి, చంద్రయుక్తుడై-లేదా-పంచమము చంద్రశుక్రదృష్టమైనా స్త్రీదైవోపాసన కలుగును.

34. పంచమేపాపనంబంధేసూర్యగోవిందసేవనం ।
చంద్రేతథావిధేజాతేయక్షిణీదేవతాంభజేత్ ॥

పంచమమునకు పాపసంబంధమున్న సూర్యోపాసనగాని, విష్ణూపాసనగాని యుండును. (వేంకటేశ్వర, సత్యనారాయణేత్యాదులు) పంచమమునకు చంద్రసంబంధమున్న యక్షిణీదేవత నుపాసించును.

35. స్కందోవాభైరవోవాపిస్కందనంబంధవీక్షితే ।
ఉపాస్యాశారదాసౌమ్యేవిష్ణుస్స్యాత్స్యాత్వికోగురౌ ॥

పంచమమునకు కుజసంబంధమున్న సుబ్రహ్మణ్యునిగాని, భైరవునిగాని, బుధసంబంధమున్న సరస్వత్యుపాసన, గురు సంబంధమున్న విష్ణుతత్త్వము నుపాసించును.

36. చాముండీపంచమేశుక్రనంబంధేత్రవినిర్దిశేత్ ।
శనౌప్రేతాధిపఃప్రోక్తఃశ్మశాననిలయోథవేత్ ॥

పంచమమునకు శుక్రసంబంధమున్న చాముండ్యుపాసన, శనిసంబంధమున్న శ్మశాన నిలయుడయిన ప్రేతాధిపతిని (భేతాళ) ఉపాసించును.

37. రాహుకేతుయుతేత్రపరపీడనదేవతా ।
ఉక్తేష్వేతేషుఖేటేషుస్వోచ్చమిత్రాంశకేషుచ ॥

పంచమము రాహుకేతుయుక్తమైన పరులకు బాధకలిగించు దేవతోపాసన కలుగును. పైనచెప్పిన ఉపాసనలలో కారకగ్రహములు ఉచ్చ, స్వ, మిత్రక్షేత్రము లందున్న—

38. తద్దేవతజనంస్వార్థంపరార్థంత్వన్యథాభవేత్ ।
సౌమ్యేక్షితేషునర్వేషుమృద్వంశాదిగతేషుచ ॥

ఆ దేవతోపాసన తనకోసమునియు, ఇతరాంశములందును పరుల నిమిత్తమనియు తెలియవలెను. పైన చెప్పిన గ్రహములు శుభదృష్టములై, మృద్వంశగతములైయున్న—

39. తద్దేవసౌమ్యతావాచ్యా క్రూరేషు క్రూరతాభవేత్ ।
ద్విత్ర్యాదిగ్రహయోగేనతద్దేవబహునంవదేత్ ॥

ఆ ఉపాస్యదేవత సౌమ్యమైనదనియు, పాపగ్రహదృష్టములైన, క్రూర షష్ట్యంశగతములైన క్రూరదేవతలనియు, తెలియునది. రెండుమూడు గ్రహములున్న ఆయా దేవతోపాస్తి కలుగును.

40. లగ్నాధిపస్యమంత్రేశేమిత్రేతన్మిత్రతాభవేత్ ।
శత్రుత్వేశత్రుభూతాస్యాత్సమత్వేసమతాభవేత్ ॥

లగ్నాధిపతికి పంచమాధిపతి మిత్రగ్రహమైన ఉపాస్యదేవత మిత్రమనియు, శత్రులయిన దేవత శత్రువనియు, సముడయిన సమదేవతనియు తెలియవలెను.

41. లగ్నాద్ద్వాదశభావానాంఫలంప్రోక్తంమయాధునా ।
సంగృహ్యసారమఖిలమేవంశాస్త్రాంతరస్థితం ॥

లగ్నమునుండి ద్వాదశభావములయొక్క ఫలము శాస్త్రాంతరమున ఉన్న దానిని, సారము సంగ్రహించి ఇట్లు సర్వము నాచే చెప్పబడినది.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున వ్యయభావమను
త్రయోదశాధ్యాయము



# చతుర్దశాధ్యాయము

1. షడ్భిర్గ్రహైరుచ్చసమన్వితైస్స్యాద్రాజాధిరాజో బహుదేశభర్తా ।
ఉచ్చస్థితైఃపంచభిరత్రజాతశ్చక్ర్యన్వితేదేవగురౌవిలగ్నే ॥

ఆరుగ్రహములుచ్చస్థులైన బహుదేశ ప్రభువైన రాజాధిరాజగును. అయిదు గ్రహములుచ్చస్థులైనను రాజాధిరాజగును. గురుడు కర్కాటకమునఉండి, అదే లగ్నము కావలెను.

2. కుంభేవిలగ్నేభృగునందనేవాస్వోచ్చస్థితైర్భూమిపతిశ్చతుర్భిః ।
ఉచ్చస్థితైఃనీచవిహీనభాగైః క్రూరాదిషష్ట్యంశవిహీనభాగైః ॥

కుంభములగ్నమై, అందుశుక్రుడుండి, ఉచ్చస్థులైన, నీచాంశగతులుకాని, క్రూరాది షష్ట్యంశగతులుకాని నాలుగుగ్రహములున్న రాజగును.

3. లగ్నే వృషే తత్ర శశాంకయుక్తే షడ్భిర్గ్రహైరుచ్చగతైర్నృపస్స్యాత్ ।
తస్మిన్ గృహేనోప్యుచ్చయుతే తునర్వైన్వక్షేత్రగైర్భూపతితుల్య జాతః ॥

వృషభములగ్నమై,చంద్రుడుండి, ఆరుగ్రహములుచ్చస్థులైన రాజగును.చంద్రుడున్న వృషభములగ్నమై అన్ని గ్రహములు స్వక్షేత్రములందున్న జాతకుడు రాజతుల్యుఁడగును.

4. అస్మిన్ గ్రహైనోప్యుచ్చయుతైస్తుపశేషైర్నీచాంశహీనైర్నృపతుల్యజాతః ।
మూలత్రికోణేన్వగృహేపిచైవంశాస్త్రాంతరేప్రోక్తమిదంమునీంద్రైః॥

వృషభములగ్నమై గ్రహములన్నియు నీచనవాంశయుక్తులుగాక, ఉచ్చస్థులైన రాజతుల్యుఁడగును. గ్రహములన్నియు మూలత్రికోణములందున్నా, స్వక్షేత్రగతులయినా రాజతుల్యుఁడగును.

5. జనయతినృపమేకోప్యుచ్చగో మిత్రదృష్టః ప్రచురధనసమేతంమిత్రయోగాచ్చసిద్ధం
విధనవిసుఖమూఢవ్యాధితంబంధతప్తంవధదురితసమేతంశత్రునీచర్థగేషు ॥

ఒక్కగ్రహమైనా ఉచ్చస్థుడై మిత్రగ్రహదృష్టమైన జాతకుడు ప్రసిద్ధుడై, ధనవంతుడయిన రాజగును. ఉచ్చగ్రహము మిత్రగ్రహయుక్తమైన తప్పక ప్రభువగును. ఒక్కగ్రహము శత్రుక్షేత్రస్థుడైనా, నీచయందున్నా ధనహీనుడగును. రెండుగ్రహములట్లున్న సుఖహీనుడును, మూడుగ్రహములట్లున్న మూఢచిత్తుడును, నాల్గుగ్రహములున్న రోగపీడితుడును, అయిదుగ్రహములున్న బంధనముచే తపించువాడును, ఆరుగ్రహములున్న ప్రాణివధ చేయువాడును, ఏడుగ్రహములున్న పాపసమేతుడునునగును.

6. శుభంవర్గోత్తమేజన్మవేశిస్థానేచసద్గ్రహే ।
అశూన్యేషుచకేంద్రేషుకారకాఖ్యగ్రహేషుచ ॥

వర్గోత్తమాంశలో పుట్టినవాని జాతకము శుభమైనది, వర్గోత్తమాంశయనగా లగ్నరాశినవాంశ. వేశిస్థానమున శుభగ్రహమున్నను శుభమే. రవియుండు రాశికి రెండవది వేశి స్థానమనబడును. లగ్నాది నాలుగుకేంద్రములును గ్రహసహితమైనను శుభమైనదే. కారకగ్రహమున్న జాతకమును శుభమైనదే.

కారకగ్రహమనగా-స్వక్షేత్ర, ఉచ్చ, మూలత్రికోణమందున్న గ్రహము లగ్నాది నాలుగుకేంద్రములలో ఒకకేంద్రమున ఉండగా, మరొక గ్రహముకూడ ఇట్లే ఉచ్చ, స్వక్షేత్రముల త్రికోణములందు మరొక కేంద్రమునఉన్న- ఆ రెండు గ్రహములును పరస్పరము కారకగ్రహములగును. వానిలో దశమ కేంద్రమందున్న గ్రహము విశేషకారక సంజ్ఞకలది.

మరొక కారక లక్షణమేమనగా-స్వక్షేత్ర, మూలత్రికోణ, ఉచ్చలలోనున్న గ్రహము కారకసంజ్ఞకు కారణమగును. కేంద్రమందున్న గ్రహము కారణము కాదు. కావున కేంద్రేతరములందున్నా, స్వక్షేత్రాదులందున్న గ్రహమునకు, స్వక్షేత్రముకాని దశమమునఉన్న గ్రహముకాని, దశమస్థగ్రహమునకు నైసర్గిక మిత్రగ్రహంబుగాని, తాత్కాలిక మిత్రగ్రహముకాని, కారకగ్రహమగును. కాన స్వక్షేత్ర, ఉచ్చ, మూలత్రికోణగతగ్రహమునకు స్వక్షేత్రాదుల బొందనిగ్రహము కారకము. అంతేకాని, స్వక్షేత్రాదుల పొందనిగ్రహమునకు స్వక్షేత్రాదుల పొందిన గ్రహము కారకముకాదు.

7. లగ్నే చంద్రే గురౌ సౌఖ్యే కర్మస్థే భృగునందనే ।
స్వోచ్చస్వర్క్షస్థితే మందే నృపతుల్యో భవేన్నరః ॥

లగ్నమున చంద్రుడు, చతుర్థమున గురుడు, దశమమున శుక్రుడు ఉండి, శని ఉచ్చ స్వక్షేత్రములందున్న జాతకుడు రాజతుల్యుడగును.

8. దృశ్యతే యుజ్యతే వాపి చంద్రజేన బృహస్పతిః ।
శిరసా శాసనం తస్య ధారయంతి నృపాలకాః ॥

గురుడు బుధునితోకూడినా, చూడబడినా-ఆ జాతకుని ఆజ్ఞ రాజులకు శిరోధార్యమగును.

9. నీచస్థితో జన్మని యో గ్రహస్స్యాత్ తద్రాశినాథోపి తదుచ్చనాథః ।
సచంద్రలగ్నాద్యది కేంద్రవర్తీ రాజా భవేద్ధార్మికచక్రవర్తీ ॥

లగ్నమున నీచస్థుడై గ్రహముండి, లగ్నాధిపతి, లగ్నాధిపతి కుచ్చస్థానాధిపతియు ఆ నీచస్థుడైన గ్రహమును,- ఈ ముగ్గురిలో నెవడయినా చంద్రలగ్నమునకు కేంద్రవర్తియైన జాతకుడు ధార్మికుడైన రాజగును. ('జన్మ' అనగా జన్మలగ్నమని ప్రధానమైన అర్థము. జన్మకాలమని కొందరు చెప్పెడి పక్షము.)

10. (అత్ర జన్మని జన్మలగ్న ఇతి ముఖ్యః జన్మకాల ఇతి కేచిత్పక్షః ॥)
నిశాకరే కేంద్రగతే విలగ్నం త్యక్త్వా త్రికోణేన తిజీవదృష్టే ।
శుక్రేణ యుక్తే బలపూర్తియుక్తే జాతో నరో భూపతితుల్యభాగ్యః ॥

చంద్రుడు లగ్నేతరమైన కేంద్రములందుండినా (4,7,10) పంచమ నవమములందున్నా, శుక్రునితోకూడి, గురునిచే చూడబడి, పూర్ణబలవంతుడైన రాజసమాన భాగ్యవంతుడగును.

11. నీచస్థితా జన్మనియే గ్రహాస్స్యుఃఉచ్చాంశగారాజసమానభాగ్యం ।
ఉచ్చస్థితాశ్చేదపినీచభాగాః గ్రహానకుర్వంతితథైవభాగ్యం ॥

గ్రహములు నీచరాశిగతములయినా ఉచ్చనవాంశలందున్న రాజతుల్య భాగ్యము కల్గజేయును. ఉచ్చస్థులైనా నీచనవాంశము పొందియున్నయెడల భాగ్యమును కలుగజేయలేవు.

12. గ్రహాబలాస్యుర్వదిపూర్వషట్కేస్వోచ్చస్థితాఃపూర్వవయాస్నృప స్స్యాత్ ।
తద్వ్యత్యయంపశ్చిమభాగయు క్తేమిశ్రస్థితాశ్చేదుభయత్రభాగ్యం ।

లగ్నాది ఆరురాశులలో గ్రహములు ఉచ్చస్థులైన జాతకుడు పూర్వవయస్సున రాజగును. సప్తమాది ఆరురాశులలో ఉచ్చస్థులైన ఉత్తరార్థమున రాజగును. గ్రహములు మిశ్రముగానున్న పూర్వ పశ్చిమవయస్సులు రెంటిలోను రాజగును.

13. త్రిధావిభాజ్యంతువయఃప్రమాణంఖండత్రయంతత్రవదంతిసంతః ।
వ్యయాదికేప్రాథమికేచఖండేశుభగ్రహాశ్శోభనమత్రదద్యుః ॥

ఆయుఃప్రమాణమును మూడు భాగములు - మూడు ఖండములు చేయవలెను. వ్యయము మొదలు ప్రథమ, ద్వితీయ, తృతీయములు ప్రథమ ఖండము. ప్రథమ ఖండమునఉన్న శుభగ్రహములు శుభఫలమునిత్తురు.

14. ఖండేద్వితీయేబహవశ్చసౌమ్యాఃతథైవసౌమ్యాస్తుతృతీయఖండే ।
ఖండేతుయస్మిన్ బహవశ్చపాపాఃనీచాంశగామూఢసమన్వితాశ్చ ॥

ద్వితీయ ఖండమందు (4,5,6,7) చతుర్థాది సప్తమాంతము శుభగ్రహములున్న ద్వితీయ ఖండమైన ఆయుః ప్రమాణమున ఫలప్రదులగుదురు. తృతీయ ఖండమున అష్టమాది లాభాంతము శుభగ్రహములున్న ఆయువులో తృతీయభాగమున శుభఫలప్రదులగుదురు. ఇట్లు ఏ ఖండమందు పాపగ్రహములు, నీచ, శత్రుక్షేత్రగత గ్రహములుందురో—

15. దుఃఖంతవేత్తత్రవిశేషతోన్యరాజ్యాత్పదాద్భ్రంశముదాహరంతి ।
శుభంతవేచ్ఛోభనఖేచరేంద్రైః ఖండంవిలగ్నాత్ప్రవదంతికేచిత్ ॥

ఆవయఃఖండమున దుఃఖము, రాజ్య, ఉద్యోగాదులనుండి స్థానభ్రంశము కలుగును. శుభగ్రహములున్న శుభఫలము కలుగును. కొందరు లగ్నమునుండి నాలుగేసిరాశులొక ఖండమందురు.

16. లగ్నే గురౌ బుధే కేంద్రే భాగ్యనాథేన వీక్షితే ।
లాభేశేనాపి సందృష్టే నృపతుల్యో భవేన్నరః ॥

లగ్నమున గురుడు, కేంద్రమున బుధుడుఉండి, వారు లాభ, భాగ్యాధిపతులచే చూడబడిన రాజతుల్యుడగును.

17. సప్తమే జీవసంయుక్తే త్రికోణేశసమన్వితే ।
లగ్నాధిపేన సందృష్టే నృపతుల్యో భవేన్నరః ॥

సప్తమమున గురుడుండి, కోణాధిపుడుండి, లగ్నాధిప దృష్టమైన రాజతుల్యుడగును.

18. కేంద్రే శనౌ త్రికోణే వా స్వోచ్చమూలత్రికోణగే ।
రాజ్యాధిపేన సందృష్టే నరో నృపసమో భవేత్ ॥

కేంద్రమున శని, త్రికోణముసగాని, ఉచ్చ, స్వ, మూల త్రికోణాది గతుడయి, దశమాధిపతిచే చూడబడిన రాజసముడగును.

19. కర్మేశే భాగ్యభావస్థే స్వోచ్చమిత్రాంశసంయుతే ।
పారావతాంశగే వాపి రాజరాజో భవేన్నరః ॥

దశమాధిపతి భాగ్యమందుండి స్వ, ఉచ్చ, మిత్రక్షేత్రమందుండినా, పారావతాంశ యందున్నా జాతకుడు రాజశ్రేష్టడగును.

20. పంచమే జీవసంయుక్తే చంద్రకేంద్రే బృహస్పతౌ ।
స్థిరలగ్నే తదీశే తు రాజ్యస్థే నృపతిర్భవేత్ ॥

పంచమమున గురుడుండి, అదిచంద్రునకు కేంద్రముకాగా, స్థిరరాశిలగ్నమై, లగ్నాధిపతి దశమమందున్న జాతకుడు రాజగును.

21. గురౌ వ్యయే శనౌ లాభే రవౌ వా విక్రమాధిపే ।
గురోర్వ్యయే విలగ్నేశే రాజరాజో భవేన్నరః ॥

వ్యయమందు గురుడు, శనిగాని, రవిగాని, తృతీయాధిపతిగాని లాభమందుండి, గురునకు వ్యయమున లగ్నాధిపతియున్న జాతకుడు రాజరాజగును.

22. పూర్వషట్కే గ్రహాస్సర్వే యస్య తిష్ఠంతి జన్మని ।
భాగ్యనాథేన సందృష్టే చంద్రే తు నృపతిర్భవేత్ ॥

పూర్వషట్కమున గ్రహములన్నియుండి భాగ్యపతిచే చూడబడిన ప్రభువగును.

23. చంద్రాధిష్ఠితరాశ్యంశనాథే కేంద్రత్రికోణగే ।
బుధాత్కేంద్రగతే వాపి రాజతుల్యో భవేన్నరః ॥

చంద్రుడున్న నవాంశరాశ్యధిపతి కేంద్రకోణవర్తియై బుధుడున్న రాశికి కేంద్రగతుడయిన జాతకుడు రాజతుల్యుడగును.

24. నిశాకరస్స్వభౌమస్తు విత్తేవావిక్రమేపివా ।
పంచమేరాహుసంయుక్తేరాజతుల్యోభవేన్నరః ॥

కుజయుక్తుడైన చంద్రుడు ద్వితీయములందుండి, పంచమమున రాహువున్న జాతకుడు రాజసముడగును.

25. భాగ్యాధిపనమాయుక్తనవాంశాధిపతౌసుఖే ।
పుత్రస్థానగతేవాపినృపశ్రేష్ఠోభవేన్నరః ॥

నవమాధిపతియున్న నవాంశాధిపతి చతుర్థమునగాని, పంచమమునగాని యున్న జాతకుడు రాజశ్రేష్ఠుడగును.

26. అరభ్యకర్మభావేశంగ్రహాస్తిష్ఠంతిచేత్క్రమాత్ ।
లగ్నాదిపూర్వషట్కేస్మిన్ రాజరాజోభవేన్నరః ॥

దశమాధిపతియున్న రాశి మొదలుకొని ఆరు రాశులలోపల-పూర్వ షట్కముల గ్రహములన్నియున్న జాతకుడు రాజాధిరాజగును.

27. లగ్నేచరేతదీశేపిచరరాశ్యంశకాన్వితే ।
భాగ్యేశేచరరాశిస్థేపిత్రాదేరన్యదేశభాక్ ॥

జన్మలగ్నము చరమై, లగ్నాధిపతి చరరాశియందు, చరనవాంశ యందుండి, భాగ్యాధిపతియు చరరాశిగతుడయిన జాతకుడు తండ్రియున్న దేశముకన్న పరదేశమందుండును.

28. రాజయోగాదిసంజాత స్తథావాచ్యోన్యథానహి ।
ఉత్తమాంశగతేచంద్రేగురౌనీచాంశవర్జితే ॥
శుభషష్ట్యంశకేసూర్యేనృపతుల్యోభవేన్నరః ॥

రాజయోగమున పుట్టినవారికి పూర్వోక్త ప్రకారము చెప్పవలెను. లేనియెడల చెప్పరాదు. చంద్రుడు ఉత్తమాంశయందుండి, గురుడు నీచాంశయందుండక, రవి శుభ షష్ట్యంశయందున్న జాతకుడు రాజతుల్యుడగును.

29. త్రయోవాద్వౌభగౌవాపిచత్వారోనీచసంయుతాః ।
శుభషష్ట్యంశసంయుక్తాస్స్వోచ్చాంశేవానరాధిపే ॥

రెండుగాని, మూడుగాని, నాల్గుగాని గ్రహములు నీచయందుండి, శుభ షష్ట్యంశ యుక్తులయిన, రవి ఉచ్చాంశయందున్న జాతకుడు రాజతుల్యుడగును.

30. నీచస్థితాంశనాథస్తుఖేటః కేంద్రత్రికోణగః ।
చరలగ్నేతదీశేపిచరాంశాదౌనృపోభవేత్ ॥

నీచస్థుడైన గ్రహమున్న నవాంశాధిపతి కేంద్రకోణగతుడై, లగ్నము చర రాశియై లగ్నాధిపతియు చరరాశియందున్న జాతకుడు రాజగును.

31. మానేరాహౌభవేన్మందేభాగ్యనాథేనవీక్షితే ।
లగ్నేశేనీచఖేటేనయుతేనృపసమోభవేత్ ॥

దశమమందు రాహుశనులుండి, భాగ్యాధిపతిచే చూడబడి, లగ్నాధిపతి నీచ గ్రహముతో కూడియున్న జాతకుడు రాజతుల్యుడగును.

32. అంశతోభావతోవాపిస్వోచ్చమూలత్రికోణతః ।
రాజయోగాస్తునిర్దిష్టాస్తేషాంయోగేబహుత్వతా ॥

అంశవలన, భావమువలన, స్వక్షేత్ర, ఉచ్చ, మూల త్రికోణముల వలన, రాజయోగములు అనేకము చెప్పబడినవి. ఒకే జాతకమందు చాల యోగములున్న మిక్కిలి రాజయోగ ఫలము కలుగును.

33. జీవేనరాహౌయదివానకేతౌచండాలతాపాపనిరీక్షితాచేత్ ।
నీచాన్వితేనీచసమన్వితేవాజీవేద్విజశ్చేదపితాదృశస్స్యాత్ ॥

ఇక రాజయోగ భంగములు చెప్పుచున్నాడు— గురుడు రాహుకేతుయుక్తుడై పాపగ్రహముచే చూడబడిన చండాలత్వము పొందును,

34. ధ్వజాహిమందైస్సహితేంద్రపూజ్యేశుక్రేక్షితేవాశశిసూనుదృష్టే ।
శూద్రోపిచేద్విప్రసమత్వమేతివిద్యాంచసర్వామధిగమ్యజాతః ॥

గురుడు రాహుకేతుశనులలో నెవనితోనైనా కూడియుండి, శుక్రునిచేగాని, బుధునిచేగాని చూడబడిన జాతకుడు శూద్రుడైనా సకల విద్యలు కలిగి బ్రాహ్మణ సముడగును.

35. మేషేశశాంకేరవిసూనుదృష్టేభిక్షాశనీభూమిసుతేనయుక్తే ।
నీచేవిలగ్నేతునిశాకరశ్చేల్లుబ్ధోదినేశాత్మజదృష్టియోగాత్ ॥

మేషమున చంద్రుడుండి, కుజయుక్తుడై, శని దృష్టుడైన, భిక్షాటనముచే జీవించును. లగ్నమున చంద్రుడుండి నీచస్థుడై శనిదృష్టుడైన, లోభియగును.

36. శుభగ్రహాణామవలోకహీనేనరస్తుభిక్షాశనశీలదేహః ।
క్రూరాదిషష్ట్యంశసమన్వితేవాపాపాంశగేపాపసమన్వితేవా ॥

లగ్నమున నీచస్థ చంద్రుడుండి శుభదృష్టిలేక, క్రూరాది షష్ట్యంశయుతుడైనా, పాపాంశగతుడైనా, పాపయుక్తుడైనా భిక్షాటనచే జీవించువాడగును.

37. పాపమధ్యగతేచంద్రేదనష్టమేమందసంయుతే ।
శ్వాసక్షయప్లీహకాసపిత్తాదిస్సభవేన్నరః ॥

చంద్రుడు పాపగ్రహమధ్యగతుడై, శనియుక్తుడై సప్తమమందుండిన, శ్వాస, క్షయ, ప్లీహ, కాస, పిత్తాదిరోగి యగును.

38. సుఖేనమందేదశమేచచంద్రేవైకల్యమంగేక్షితిజేకళత్రే।
పరస్పరక్షేత్రనవాంశయుక్తౌశశాంకసూర్యౌతనుశోషణస్స్యాత్॥

చతుర్థమున శని, దశమమున చంద్రుడు, సప్తమమున కుజుడుఉన్న అంగ వైకల్యము కలుగును. రవిచంద్రులు పరస్పర క్షేత్రగతులైనా, పరస్పర నవాంశ లందున్నా శరీరము శుష్కించును.

39. రంధ్రారివిత్తాంత్యగతాగ్రహేంద్రాదినేశచంద్రారయమాఃక్రమేణ।
కుర్వంతిజాతంనయనేనహీనంతద్ధాతుకోపాద్నృపతోస్వపవ్య॥

రవి, చంద్ర, కుజ, శనులు క్రమముగా అష్టమ, షష్ట, ద్వితీయ, వ్యయము లందున్న జాతకునకు ఆయా గ్రహ సంబంధమైన వాతపైత్యాది ప్రకోపమువలన, రాజదండనవలన నేత్రహీనత కలుగును.

40. లగ్నేగురౌభూమిసుతేకళత్రేసోన్మాదభాక్ స్త్రతనరోహిజాతః।
ఉన్మాదయుగ్వ్రింశయుతోవిలగ్నేశనౌకళత్రేనకుజేత్రికోణే॥

లగ్నమున గురుడు, సప్తమమున కుజుడు, ఉన్న ఉన్మాదము కలవాడగును. లగ్నమునశని, సప్తమ, పంచమ, నవమములందు కుజుడున్నను ఉన్మాదము, భ్రాంతి కలవాడగును

41. దుశ్చిక్యషడ్రిఃఫగతేదినేశేచంద్రేత్రికోణేయదివాధరాజే।
ఉన్మాదబుద్ధిస్స్యజడోథవాస్యాజ్జాతోహిచేదస్థిరబుద్ధియుక్తః॥

రవి తృతీయ, షష్ట, వ్యయగతుడై, చంద్రుడుగాని, కుజుడుగాని, పంచమ నవమము లందున్న జాతకుడు ఉన్మాదచిత్తుడో జడచిత్తుడో అగును. లేదా అస్థిరబుద్ధి అగును.

42. లగ్నేత్రికోణేదిననాథచంద్రౌశౌర్యేగురౌకేంద్రసమన్వితేవా।
సోన్మాదబుద్ధిస్స్యభవేత్తదానీంశనౌచసారేయదిజన్మకాలే॥

లగ్న పంచమ నవమములందు రవిచంద్రులుండి, తృతీయమునగాని, కేంద్రమునగాని గురుడుండి, శని సర్వ బలిష్ఠుడుకాగా ఉన్మాదచిత్తు డగును.

43. కేంద్రస్థితౌసౌమ్యనిశాకరౌవాసౌఖ్యైరహినోభ్రమనంయుతస్స్యాత్।
కేంద్రస్థితామందనిశాకరార్కాజడోథవేదన్యవధూపభోక్తా।
రాశ్యేశ్వరేరిఃఫగతేతదీశేవిత్తస్థితేభ్రాతృగతైశ్చపాపైః॥

బుధచంద్రులు కేంద్రమందున్న సౌఖ్యమున్నను, భ్రాంతి (తలతిరుగుడు)

కలవాడగును. చంద్రదశనిరవులు కేంద్రగతులైన జడచిత్తుడు, పరదారాసక్తుడు అగును. దశమాధిపతి ద్వాదశమందున్న, ద్వాదశాధిపతి ధనమందుండి, తృతీయ మున పాపగ్రహములున్న జాతకుడు పరదారోపభోక్త జడచిత్తుడు నగును.

44. కేమద్రుమేస్మిన్ నభవేత్కుభోజీదుష్కర్మయుక్తోన్యకళత్రగామీ ।
నీచేవిలగ్నాధిపతౌతదంశేషష్ఠాష్టమస్థైర్యదిపాపఖేటైః ॥

లగ్నాధిపతి నీచమందుండి, నీచాంశమందుండి, పాపగ్రహములు షష్ఠాష్ట మములందుండగా కేమద్రుమయోగమున పుట్టినవాడు కుత్సితాన్నము తినువాడు, పాపకర్ముడు, పరవనితాసక్తుడు అగును. కేమద్రుమయోగమనగా – చంద్రునకు ద్వితీయ ద్వాదశము లందును, జన్మలగ్నాది కేంద్రములందును కుజాది పంచ గ్రహములలో నొకటియు లేక, చంద్రుడు కుజాదిగ్రహములతో కూడకున్న కేమద్రుమయోగము.

45. మందేవిలగ్నేకులనాశకస్స్యాదల్పాయురాహుశ్శుభదృష్టిహీనైః ।
సర్వైర్గ్రహైర్నీచనపత్నభాగైఃకర్మన్యగై ర్భిక్షుకఏవజాతః ॥

లగ్నమున శనియున్న కులనాశకుడును, అల్పాయువునగును. శుభగ్రహ దృష్టిలేని, నీచ, శత్రుక్షేత్రాంశలందున్న, దశమము తప్ప తక్కినరాశులందు సర్వ గ్రహములున్న భిక్షాన్నభోక్త యగును.

46. హోరేశ్వరేరిఃఫగతేతుమానేక్రూరాన్వితేభౌమయుతేశశాంకే ।
జాతోభిశస్తఃపరదేశవాసీభిక్షాశనీదుఃఖితదేహభాక్స్యాత్ ॥

లగ్నాధిపతి వ్యయమున ఉండి, దశమమున పాపగ్రహముండి, చంద్రుడు కుజయుక్తుడైన జాతకుడు అభిశస్తుడు, పరదేశవాసి, భిక్షుకుడు దుఃఖ భాజనమైన దేహముకలవాడు నగును. అభిశస్తుడనగా పరస్త్రీ గమనాది దోషములచే నిందితుడు.

47. రంధ్రస్థితాఃపాపఖగాశ్చసర్వేనిశాకరారౌయదికేంద్రయుక్తౌ ।
యోగోగదాఖ్యస్సభవేత్తదానీంజాతోహ్యపస్మారయుతోమనుష్యః ॥

సర్వపాపగ్రహము లష్టమమునందుండి, కుజచంద్రులు కేంద్రమునందుండిన గదమనెడి యోగము. ఈ యోగమున పుట్టినవాడు అపస్మారము కలవాడగును.

48. సౌమ్యాన్వితస్సౌమ్యశశాంకశుక్రాఃకేంద్రస్థితాభోగియుతేవిలగ్నే ।
చండాలయోగస్సభవేత్తదానీంజాతోనిజాచారసుకర్మహీనః ॥

బుధచంద్రశుక్రులు గురునితోకూడి కేంద్రగతులై, లగ్నము రాహుయుక్తము కాగా చండాలయోగమున పుట్టినవాడు తన ఆచారకర్మ హీనుడగును.

49. షష్ఠాష్టమేభానుసుతేనభౌమేజాతోహ్యపస్మారయుతోనరస్స్యాత్ ।
పాపగ్రహాష్టవ్యయరంధ్రగాశ్చేక్షీణేపరిత్యన్వితకేంద్రహీనే ॥

కుజయుక్తుడైన శని షష్టాష్టమము లందుండిన జాతకుడపస్మార రోగియగును. పాపగ్రహములు 6,8,12 లందుండి గురుడు పరిధి గ్రహయుక్తుడై కేంద్రవర్తి కాకున్నప్పుడు పుట్టినవాడు—

50. జాతఃపరిభ్రంశనమన్వితస్స్యాచ్ఛుభైర్నదృష్టాయదిదృష్టిహీనః ।
మానస్థితావాయదివి త్తరాశౌపాపా స్తథాదేవగురౌచహీనే ॥

పరిభ్రష్టుడగును. పాపగ్రహములు శుభగ్రహయుక్తములు, దృష్టములు కాక దశమమునగాని, ద్వితీయమునగానియున్న, గురుడు బలహీనుడైయున్న జాతకుడు బాగా భ్రష్టుడగును.

51. భాగ్యేశ్వరేవాంత్యగతేనపాపేజన్మోదయేశౌరవిగౌతులగ్నే ।
వినష్టపుత్రార్థకళత్రభాక్స్యాచ్ఛుభైర్నయుక్తైర్యదివీక్షితైర్వా ॥

భాగ్యాధిపతి వ్యయమున ఉండి జన్మరాశ్యధిపతి, జన్మలగ్నాధిపతులు రవితో కూడి, జన్మలగ్నస్థులై శుభగ్రహ సంబంధము లేకున్న జాతకుని భార్యాపుత్ర ధనములు నశించును. జన్మ రాశ్యధిపతి అనగా చంద్రుడున్న రాశ్యధిపతి.

52. శుభాశుభైః కేంద్రగతైశ్చలాంకోలగ్నేశ్వరేణాపినిరీక్షితస్స్యాత్ ।
సౌరాంశకేవాయదినంయుతశ్చేత్ జాతఃకులధ్వంసకరోవిదారః ॥

కేంద్రగతులైన శుభపాపగ్రహములు, లగ్నాధిపతియు శనినవాంశమందున్నా చంద్రుని చూచుచున్నా – లేక శనితోకూడినా జాతకుడు కులధ్వంసకరుడు, భార్య లేనివాడు నగును.

53. గృహాత్పరిభ్రష్టవిదారపుత్రోగుణేనహీనోయదివాజడోవా ।
కేంద్రేశనౌలగ్నగతేశశాంకేజీవేవ్యయేభిక్షుకఏవజాతః ॥

కేంద్రమున శని, లగ్నమున చంద్రుడు, వ్యయమున గురుడు ఉన్న జాతకుడు ఇల్లువిడిచిపోయి, గుణహీనుడై, జడచిత్తుడై, భిక్షాటనము చేయును.

54. చంద్రాత్సుతేంత్యేయదిలగ్ననాథేరంధ్రస్థితైస్సౌమ్యఖగేతరైర్వా ।
మానస్థితేరాత్రికరేతదానీంజాతస్తుజీవత్యతిహీనవృత్త్యా ॥

లగ్నాధిపతి చంద్రునకు పంచమ వ్యయములందుండి, అష్టమమందున్న పాపగ్రహములచే చూడబడినా, చంద్రుడు దశమమున ఉండి అష్టమస్థ పాపగ్రహ దృష్టుడైనా జాతకుడు అతిహీనవృత్తిచే జీవించును.

55. నీచారిభాంశేయదిదేవపూజ్యేతదంశకేవానరనాథపుత్రే ।
జాతోహిదుఃఖీసుతదారహీనఃకృచ్ఛ్రాదసౌజీవతిభాగ్యహీనః ॥

గురుడు నీచరాశి నవాంశలందుండి, శనికూడ ఆ నవాంశయందే ఉన్న జాతకుడు దుఃఖి, భార్యాపుత్ర విహీనుడు, భాగ్యహీనుడై అతి కష్టముమీద జీవించును.

56. ఉచ్చస్థితేవానరనాయకేతునీచాంశయుక్తేయదిరాజపుత్రః ।
ప్రాప్నోతినీచత్వమినోదయేస్యాత్పాపేక్షితేవాయదినిశ్చితార్థః ॥
సింహము లగ్నమై, రవి ఉచ్చస్థుడై నీచాంశయందున్న రాజపుత్రుడైనా నీచత్వము పొందును. ఆ రవి పాపదృష్టుడైన తప్పక జరుగును.

57. తులాయాందశమేభాగేస్థితఃకమలబాంధవః ।
సహస్రరాజయోగస్యఫలంనీచత్వమాప్నుయాత్ ॥
తులారాశి దశమ భాగమున రవియున్న వెయ్యి రాజయోగముల చెరచి, నీచత్వము పొందును.

58. భృగుపుత్రోపినీచస్థోరాజయోగవినాశదః ।
ఉల్కాపాతాప్యప్రకాశగ్రహాజాతస్యభంగదాః ॥
శుక్రుడు నీచయందున్నా రాజయోగ వినాశము చేయును. ఉల్కలు, రాహ్వాదిపాతలు, ధూమాద్యప్రకాశ గ్రహములును రాజయోగ భంగకరములే.

59. నీచేభృగౌమందనవాంశకేవావ్యయస్థితేచంద్రరవీకళత్రే ।
నిరీక్షితౌభానుసుతేనచాత్రజాతఃపరప్రేష్యముపైతినిత్యం ॥
శుక్రుడు వ్యయమున నీచ నవాంశయందుగాని, శని నవాంశ యందుగాని ఉండి, రవిచంద్రులు సప్తమమున ఉండి శనిచే చూడబడిన పరులకు దాస్యము చేయును.

60. క్షీణేశశాంకేక్షితిజేకళత్రేలగ్నేశనౌభ్రంశమదాన్వితస్స్యాత్ ।
లగ్నేశనౌకామగతేశశాంకేశుక్రేక్షితేవాయదిబంధభోక్తా ॥
క్షీణ చంద్రుడై, కుజుడు సప్తమమున ఉండి, శని లగ్నమందున్న భ్రాంతి, మదములు కలుగును. లగ్నమున చంద్రుడుండి శుక్ర దృష్టుడైన కారాగారమున భుజించును.

61. చంద్రేవ్యయేవాయదివాదినేశేమందేత్రికోణేమదరంధ్రభేర్కే ।
దంతాక్షిరోగీసభవేత్తదానీంనీచారిశత్రంశగతాస్తథైవ ॥
రవికాని, చంద్రుడుకాని, వ్యయమునఉండి, శని పంచమములందు, రవి సప్తమ, అష్టమములందు, నీచ, శత్రురాశి, శత్రంశలందున్న దంత, నేత్ర రోగ ములు గలుగును.

62. సుతాంబుగౌపాపఖగౌవిశేషాచ్చంద్రేష్టరిప్వారిగతేంధతాస్స్యాత్ ।
శుభగ్రహాణామవలోకహీనేత్వంధోభవత్యేవశుభైర్నదోషః ॥
చతుర్థ పంచమముల పాపగ్రహములుండి, చంద్రుడు 6,8,12 లందుండిన గ్రుడ్డివాడగును. శుభదృష్టిలేకున్న తప్పదు. శుభయుతి, దృష్టియున్న దోషములేదు.

63. మానేశశాంకేనబుధేశశ్రతేశనౌద్వితీయేవికలాంగమేతి ।
జాతేచ్యుతిర్నీచనపత్నభాగసమన్వితాశ్చేదపినిశ్చితార్థః ॥

దశమమున చంద్రుడు, సప్తమమున బుధుడు, ద్వితీయమున శనిఉన్న అవయవ వైకల్యము కలుగును. ఆ గ్రహములు పరాజితులు, నీచ, శత్రురాశి, నవాంశల బొందిన తప్పక కలుగును.

64. నిశాకరేకార్ముకమధ్యభాగమృగాన్యకర్కిఝషభాగయుక్తే ।
మందారయోగేతదవేక్షణాద్వాకుష్ఠీశుభేక్షావ్యదృశావిహీనే ॥

చంద్రుడు ధనుర్మధ్య నవాంశ (పంచమ) యందును, మకర, కర్కాటక, మీన నవాంశలందు నుండి శుభదృష్టిలేక, శనికుజయుక్తుడుగాని, దృష్టుడుగాని యైన కుష్ఠరోగి యగును.

65. కుళీరకుంభాళినవాంశయుక్తేచంద్రేనమందేయదిగుహ్యరోగి ।
చంద్రేసుఖేతద్భవనాంశయుక్తేపాపాన్వితేస్యాద్ద్విజకర్ణరోగి ॥

కర్కాటక, కుంభ, వృశ్చిక నవాంశలందు చంద్రుడుండి, శనియుక్తుడైన గుహ్యరోగియగును. చంద్రుడు చతుర్థమున, తద్రాసి నవాంశయందున్న, పాపగ్రహయుక్తుడైన దంత, కర్ణరోగములు కలుగును.

66. చంద్రేనపాపేఫణినాథయుక్తేరిప్పేశుభేరంధ్రగతేథవాపి ।
ఉన్మాదభాక్త్రతనరోషతాచజాతస్తునిత్యంకలహప్రియస్స్యాత్ ॥

చంద్రుడు పాపగ్రహయుక్తుడై రాహువుతోగూడి, ద్వాదశ నవమ అష్టమములందుండినచో, ఉన్మాదుడును, అందునా రోషముతో గూడినవాడును, కలహప్రియుడును అగును.

67. ఇతిచింతామణౌప్రోక్తోరాజయోగాదినిర్ణయః ।
జాతభంగాదికంచైవవేంకటేశ్వరధీమతాః ॥

ఈ రీతిగా శ్రీ వేంకటేశ దైవజ్ఞునిచే సర్వార్థ చింతామణియందు, రాజయోగములు, తద్భంగములు చెప్పబడినవి.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్ర తాత్పర్యమున
రాజయోగ, తద్భంగాధ్యాయము చతుర్థశము.



## అరిష్టాధ్యాయః పంచదశః

1. కేచిద్యోగంప్రశంసంతిదశాంకేచిద్వదంతిహి ।
తద్వినైవాయుషోజ్ఞానంనశక్యంతన్మనీషిభిః ॥

కొందరు యోగమును, కొందరు దశను చెప్పుదురు. అది ఆయుర్దాయ జ్ఞానము లేకుండా చెప్పశక్యముకాదు.

2. త్రివిధాశ్చాయుషోయోగాఃస్వల్పాయుర్మధ్యమోత్తమాః ।
ద్వాంత్రింశత్పూర్వమల్పాయుర్మధ్యమాయుస్తతోత్తరే ॥

అయుర్యోగములు మూడు విధములు - అల్పాయువు, మధ్యాయువు, ఉత్తమాయువు అని. 32 సం.ల లోపు అల్పాయువు.

3. ఆసప్తతి స్తదూర్ధ్వంతుదీర్ఘాయురితిసంమతం ।
ఉత్తమాయుశ్శతాదూర్ధ్వంఅన్యేశంసంతితద్విదః ॥

32 సం పైన 70 సం. లోపు మధ్యమాయువు; ఆపైన దీర్ఘాయువు, 100 సం.కి పైన ఉత్తమాయువని కొందరు చెప్పుదురు

4. అద్వాదశాబ్దంజంతూనామాయుర్జ్ఞాతుంనశక్యతే ।
జపహోమచికిత్సాద్యైర్బాలరక్షాంచకారయేత్ ॥

12 సం.ల వరకు ఆయుర్దాయము తెలియ శక్యముకాదు. (బాలారిష్టాదుల వలన కావచ్చు.) కాన అంతవరకు జప, హోమ, చికిత్సాదులతో బాలురను రక్షింప వలెను.

5. పిత్రోర్దోషైర్మతాఃకేచిత్కేచిద్బాలగ్రహైరపి ।
అపరేరిష్టయోగైశ్చత్రివిధాబాలమృత్యుదాః ॥

12 సం.ల లోపల తల్లిదండ్రుల దోషము (అశ్రద్ధ వగైరా)చే కొందరు, బాలగ్రహాది బాధలచే కొందరు: బాలారిష్ట రోగములచే మరికొందరు మృతులగుదురు. ఇట్లు బాలురకు మరణకారణము లీ మూడును.

6. జన్మేశస్య బలేనైవబాలానాంపుష్టివర్ధనం ।
వదేద్ద్వాదశరాశీశైస్తత్తద్యోగానుసారతః ॥

జన్మలగ్నాధిపతి బలముచేతనే బాలురకు పుష్టివృద్ధి యగును. ద్వాదశ భావాధిపతులచేతను, ఆయా యోగానుసారముగ ఫలము చెప్పవలెను.

7. అల్పాయురల్పమధ్యాయుఃపూర్ణాయుస్త్రివిధంస్మృతం ।
మధ్యమంచాల్పమధ్యంచపూర్ణాయుస్త్రివిధంస్మృతం ॥

అల్పాయువు, అల్పమధ్యాయువు, పూర్ణాయువు అని 3 రకములు. మధ్యాయువు, అల్ప మధ్యాయువు, పూర్ణాయువు అని 3 విధములు.

8. పూర్ణాయుశ్చాల్పమధ్యేచపూర్ణాయుస్త్రివిధంభవేత్ ।
ఏవంనవవిధఃప్రోక్తఆయుషాంతువినిర్ణయః ॥

పూర్ణాయువు, అల్ప మధ్యాయువు, పూర్ణాయువు అని మువ్విధము. ఇట్లు ఆయుర్నిర్ణయము 9 విధములు.

9. పంచమ్యారదశామృత్యుందద్యాత్ షష్ఠేగురో స్తథా ।
శనేర్మృత్యుశ్చతుర్థీస్యాద్దశారాహోస్తు సప్తమీ ॥
దశలలో అయిదవ కుజదశ, ఆరవ గురుదశ, నాల్గవ శనిదశ, ఏడవ రాహు దశమృతి ప్రదములు.

10. విపత్పాపదశాకష్టాప్రత్యగీశదశాతథా ।
వధభేశదశాకష్టాపాపేస్యాన్నశుభేక్షితా ॥
తృతీయాధిపుని పాపదశ, షష్ఠ, అష్టమాధిప దశలు – ఇవి పాపగ్రహముల దశలై, శుభదృష్టి లేనిచో కష్టము కల్గించు దశలగును.

11. నీచారాతివిమూఢాస్యాత్ విపత్ప్రత్యగ్ఘనైధనాః ।
దశాదద్యుమృతింతన్యపాపయుక్తావిశేషతః ॥
తృతీయ, షష్ఠ, అష్టమాధిపుల దశలు నీచ, శత్రు, మౌఢ్య భావముల పొందిన మృతి ప్రదములు; పాపయుక్తములైన విశేషముగా నగును. అవి విపత్తార, ప్రత్యక్తార, నైధనతారలైనను – వాటిదశలు మృతిదములగును.

12. రాశిసంధిషుయేజాతాస్తేబాలమృతజీవినః ।
పాపదృష్టియుతోవాపినిస్సంశయమృతిఃస్మృతః ॥
రాశిసంధులందు జననమైనవారు మృతజీవులు. పాపదృష్టియున్న తప్పక మృతి నందుదురు.

13. గండాంతేషూద్భవోమర్త్యఃపితృమాతృబలాత్తతః ।
యదిజీవేత్సొశ్వన్నృపాలోగజవాజిసమన్వితః ॥
గండాంతములందు పుట్టిన జాతకులు తల్లిదండ్రుల యోగబలమున బ్రతికిన యెడల, గజాశ్వయుక్తులై రాజయోగము పొందుదురు.

14. తృతీయగౌభానునిశాకరౌవాక్రూరర్క్షగౌక్రూరనిరీక్షితౌవా ।
వ్యాధింనరస్యాపివదంతితజ్ఞాస్త్రివర్షమాత్రంత్వపిదుర్లభంతత్ ॥
రవి చంద్రులు తృతీయమున ఉన్న, లేక పాపరాశిగతులై, పాపదృష్టులైనా-జాతకునకు వ్యాధి కలుగును. మూడేళ్ళవరకు జీవించుటే దుర్లభము.

15. ఆద్యద్రేక్కాణేజామిత్రేయన్యస్యాద్దారుణోగ్రహః ।
క్షీణేచంద్రేవిలగ్నస్థేసద్యోహరతిజీవితం ॥
సద్యోమరణయోగములు – సప్తమ భావప్రథమ ద్రేక్కాణమున పాపగ్రహ ముండి, లగ్నమున క్షీణ చంద్రుడున్న పుట్టగానే చనిపోవును.

16. ఆపోక్లిమేస్థితాస్సర్వేగ్రహాఃబలవివర్జితాః ।
షణ్మాసంవాద్విమాసంవాతస్యాయుస్సముదాహృతం ॥

అన్ని గ్రహములు బలహీనములై ఆపోక్లిమములందున్న వాని ఆయుష్కాలము రెండు నెలలో, ఆరునెలలో అందురు.

17. విలగ్నాధిపతిర్నీచేనిధనోవార్కగోభవేత్ ।
కష్ట్రేణజీవితంవింద్యాన్మృతప్రాయోభవిష్యతి ॥

లగ్నాధిపతి రవియుక్తుడై నీచమందున్నా, అష్టమ మందున్నా, జాతకుడు అతి కష్టముమీద మృతప్రాయుడై జీవించును.

18. ఉచ్చక్షేత్రంమేషరాశించహిత్వారాహౌయుక్తేతేష్వపిప్రాణనాశః ।
లగ్నాత్స్వాంత్యేపాపయుక్తౌయదిస్యాత్సప్తాష్టాంత్యేవావిన
శ్యేత్క్షణేన ॥

రాహువు తనకు ఉచ్చయైన వృషభము, మేషము కాక తక్కిన రాశులలో జన్మలగ్న మందున్న ప్రాణహాని చేయును. లగ్నమునకు ద్వితీయ ద్వాదశము లందుగాని, సప్తమ, అష్టమ, ద్వాదశములందుగాని పాపులున్న పుట్టగానే క్షణములో ప్రాణము తీయుదురు.

19. లగ్నాద్భావేచాష్టమేపాపచారైస్సోమేక్షీణేచాష్టవర్షంతుజీవేత్ ।
కేంద్రేచంద్రాత్పాపయుక్తైరసౌమ్యైస్స్వర్గంజాతఃప్రాప్నుయాద్వ
త్సరేణ ॥

లగ్నమున కష్టమభావమున పాపగ్రహములుండి, క్షీణచంద్రుడైన 8 సం.లు జీవించును. చంద్రునకు కేంద్రమున పాపులుండి శుభదృష్టి లేకున్న సంవత్సరము బ్రతుకును.

20. జన్మాధీశేలగ్నగేక్రూరయుక్తేపశ్యన్నార్కిశ్చాష్టమేజీవవర్జ్యే ।
షష్ఠేవర్షేద్వాదశేచాష్టమేవానంధౌరాశేర్జాతవాన్మృత్యుమేతి ॥

చంద్రుడున్న రాశ్యధిపతి లగ్నమునఉండి, పాపయుక్తుడై, గురు సంబంధములేని, అష్టమస్థుడైన శనిచే చూడబడుచు (?) రాశి సంధి జాతుడు ఆరవయేట గాని, ఎన్మిదవ యేటగాని, పండ్రెండవయేటగాని మృతినందును.

21. షష్ఠాష్టమాంత్యేహిమగౌచయన్యక్షీణేత్యంతేపాపయుక్తేథవాపి ।
సౌమ్యైర్దృష్టేచాష్టమబ్దంచజీవేత్పాపైస్సద్యోమిశ్రితైస్తద్దళంచ ॥

అతి క్షీణ చంద్రుడు 6,8,12 లందుండినా, పాపగ్రహయుక్తుడై వ్యయమందుండి శుభదృష్టుడైనా ఎన్మిదేళ్లు, పాపదృష్టుడైన పుట్టగానే, మిశ్రమముగానున్న దానిలో సగము – నాలుగేళ్లు జీవించును.

22. జీవేవిలగ్నేమిథునేతులాయాంశుక్రేణయుక్తేశశినూనునాచ ।
పాపైర్దృష్టేమృత్యురాశిస్థితైర్వాజీవేద్వర్షంచాష్టమంచైవబాలః ॥

లగ్నమున గురుడుండి, మిధున తులలందు శుక్ర బుధులుండి, అష్టమస్థులైన పాపగ్రహములచే (కుజుడేచూచును) చూడబడిన ఎన్మిదేళ్ళు బ్రతుకును.

23. బృహస్పతిర్భౌమగృహేష్టమస్థస్సూర్యేందుభౌమార్కజదృష్ట మూర్తిః ।
అబ్దైస్త్రిభిర్భార్గవదృష్టిహీనో లోకాంతరం ప్రాపయతి ప్రజాతం ॥

కుజ క్షేత్రమున, అష్టమమున గురుడుండి రవిచంద్ర శనులచే చూడబడుచు, శుక్రునిచే చూడబడకున్న మూడేళ్ళకు లోకాంతర మంపును.

24. వక్రీశనిర్భౌమగృహం ప్రపన్నశ్చ్రదేశషష్ఠేశచతుష్టయస్థః ।
కుజేనసంప్రాప్తబలేనదృష్టో వర్షద్వయంజీవయతి ప్రజాతం ॥

షష్టాష్టమాధిపతులకు చతుర్థమున కేంద్రమున కుజక్షేత్రమున వక్రియైన శని బలవంతుడైన కుజునిచే చూడబడిన రెండేళ్ళు బ్రతికించును.

25. సౌరిస్స్మరస్థోయదివావిలగ్నే జన్మస్థలగ్నే శశివృశ్చికేవా ।
సౌమ్యేషుకేంద్రాయగతస్యనద్యోజాతస్యమృత్యుర్యవనోపదిష్టః ॥

శని సప్తమమునగాని, లగ్నముగాని, జన్మరాశి (చంద్రుడున్నది) కర్కాటక వృశ్చికములందుగాని ఉండి, శుభగ్రహములు కేంద్ర లాభ గతములుకాగా జాతకుడు సద్యోమృతు డగును.

26. నీచస్థేదేవపూజ్యేతుభౌమక్షేత్రగతేథవా ।
సంధిత్రయేపిజాతస్తుమాసాన్మృత్యుం ప్రయచ్ఛతి ॥

గురుడు నీచస్థుడైనా, కుజక్షేత్రగతుడైనా, సంధిత్రయమున పుట్టినవాడు నెల కన్న బ్రతకడు.

27. లగ్నేచంద్రేభానుకరేవాబలిష్ఠేపాపేకేంద్రేనైధనేచత్రికోణే ।
శుక్రస్సూర్యశ్శీతగుశ్చైకసంస్థోనాశంగచ్ఛేద్యోగమధ్యేపిజాతః ॥

లగ్నమున చంద్రుడుగాని, రవిగాని ఉండి, బలవంతుడై, పాపులు కేంద్రమున, అష్టమమున, పంచమ నవమమునఉండి, శుక్రరవిచంద్రు లేకరాశిగతులైన ఏడాది జీవించును.

28. కుంభేవింశతిభాగస్థోమృత్యుందద్యాన్నిశాకరః ।
ఏకవింశతిభాగస్థఃసింహేతద్వద్వృషేపిచ ॥

కుంభమున 20వ భాగయందున్న చంద్రుడు, సింహ, వృషభములలో 21వ భాగయందున్న చంద్రుడును మరణము కల్గజేయును.

29. అష్టమేమేషచంద్రస్తుత్రయోవింశతిభాగకః ।
ద్వావింశతిఃకుళీరేతుతులాయాంవేదభాగగః ॥

చంద్రుడష్టమమున మేషమున 23వ భాగయందున్నా, కర్కాటకమున 22వ భాగయందున్నా, తులయందు నాల్గవ భాగయందున్నా మృతిప్రదుడు.

30. వింశతిర్మకరేచంద్రః కన్యాయాం ప్రథమేంశగః ।
ధనుష్యష్టాదశో భాగో మీనేదశమభాగయుక్ ॥

చంద్రుడు మకరమున 20వ భాగయందును, కన్య ప్రథమ భాగయందును, ధనుస్సులో 18వ భాగయందును, మీనమున పదవభాగయందును ఉన్న శిశు మృతి ప్రదుడు.

31. ద్వావింశతిర్నృయుగ్మే తుచంద్రో ప్యేవంమృతిప్రదః ।
యేయేనిశాకరాంశాస్తు మృత్యుభాగావివక్షితాః ।

మిధునము 22వ భాగయందున్న చంద్రుడు మృతిప్రదుడు. పైన చెప్పిన రాశులందెన్నవ భాగలు దోషములన్న, అన్నవ సంవత్సరమున జాతకుడు మరణించును.

32. లగ్నజన్మపయోర్యస్యశత్రుర్లగ్నే గతో ఽశుభః ।
కరోతిమృత్యుంజాతస్యతయోర్మిత్రంహిశోభనం ॥

లగ్న, జన్మరాశి (చంద్రరాశి) అధిపతులకు శత్రువైన పాపగ్రహము లగ్నస్థుడైన మృతి కల్గజేయును. పాపగ్రహమైనా వారికి మిత్రుడైన శుభము కలుగును.

33. అసౌమ్యేమృత్యుమాం స్తస్యపరిహారో భవేచ్ఛుభః ।
రంధ్రేధరానూనుదినేశసౌరాజాతస్తుమృత్యుంసముపైతిమాసాత్ ।
కేతుస్తుయస్మిన్నుదితేత్రజాతో మానద్వయేనైవయమంప్రయాతి ॥

అట్లే జన్మరాశి, జన్మలగ్నాధిపతులకు శత్రువై లగ్నగతమైనది పాపగ్రహమైన మృత్యువును, శుభగ్రహమైన శుభమును కల్గజేయును. అష్టమమున రవికుజశనులున్న నెలకన్న బ్రతుకదు. లగ్నమున కేతువున్న రెండు నెలలు జీవించును.

34. భూపాలయోగాయవనైః ప్రదిష్టారాజ్ఞాంకులేజాతనరాధరేశాః ।
తేతీవ్రయోగాస్తుతదన్యజాతాన్సద్యోయమంయాంతినరాస్తథైవ ॥

యవనులెన్నో రాజయోగములు చెప్పిరి. రాజవంశజు లా యోగములవలన రాజులగుదురు. తక్కినవారికి పాపగ్రహయుక్తములైన తీవ్రయోగములు సద్యోమృతి ప్రదములు.

35. భానుర్నభస్థోయదిపాపదృష్టో ధరాసుతశ్చేశశివక్రగేహే ।
జాతస్తుమృత్యుంసముపైతిశీఘ్రంశుభైర్నదృష్టో వియుతోపిచైవం ॥

రవిదశమమున కుజరాశియందుగాని, చంద్రరాశి యందుగాని పాపగ్రహ దృష్టుడై యుండి, శుభగ్రహ సంబంధములేకున్న శీఘ్రముగా మృతినందును.

36. లగ్నేద్రుగాణానిగళావిహంగాఃపాశాహినంజ్ఞాజనితాస్తుతేషు।
మృత్యుంప్రయాత్యేవహిసప్తమాబ్దేక్రూరైర్యుతాస్స్వామిశుభైర దృష్టా॥

లగ్నమున నిగళ, పక్షి, పాశ, సర్పద్రేక్కాణములందు పుట్టినవారు ఆ ద్రేక్కాణములు పాపగ్రహయుక్తములై లగ్నాధిపతిచేతను, శుభగ్రహములచేతను చూడబడకున్న ఏడవయేట మృతినందును.

37. రవిచంద్రభౌమగురుభిఃకుజగురుసౌరీందుభిస్తథైకస్థైః।
రవిశశినిభౌమశశాంకైర్మరణంఖలుపంచభిర్వర్షైః॥

ఏకరాశిగతులైన రవిచంద్రకుజగురులచేతను, లేదా కుజగురుశనిచంద్రులచే గాని లేదా, రవిశనికుజచంద్రులచేగాని అయిదేండ్లవరకు జీవించును.

38. రవిణాయుక్తశ్శశిజస్సౌమ్యైర్దృష్టోవినాశయతినూనం।
ఏకాదశభిర్వర్షైర్దేవాంతేపిస్థితంజాతం॥

రవియుక్తుడైన బుధుడు శుభగ్రహములచే చూడబడిన శిశువు దేవతల దగ్గర నున్నను 11సం కన్న జీవింపదు. (రవియుక్తుడెక్కడుండవలెనో తెల్పలేదు.)

39. లగ్నేరవిశనిభౌమాశ్శుక్రగృహేస్యాచ్చశీక్షీణః।
దృష్టోనదేవగురుణానశ్యతిభిర్వర్షైర్వినాశయతి॥

లగ్నమున రవిశనికుజులుండి, క్షీణచంద్రుడు శుక్రక్షేత్రవర్తియై గురు దృష్టుడు కాకున్న 7 సం.లు జీవించును.

40. కేంద్రేరవిముషితతనుఃక్షితిజోమందావలోకితో.థయుతః।
వర్షచతుష్కేణాశుచమారయతికిమ్మత్రగణితేన॥

అస్తంగతుడైన కుజుడు శనిదృష్టుడైనా, శనియుక్తుడైనా, కేంద్రమందున్న నాలుగేళ్ళకు మరణించును. ఇక గణిత మెందుకు?

41. లగ్నాధిపతేశ్చంద్రఃమరణపదస్థోతికృష్ణతాంయాతః।
క్రూరైస్సకలైర్దృష్టోనవభిర్వర్షైఃప్రమారయతి॥

లగ్నాధిపతికి అష్టమమందున్న చంద్రుడు క్షీణుడై సకల పాపగ్రహదృష్టు డైన తొమ్మిదేళ్ళకు మరణించును.

42\. పాపోవిలగ్నాధిపతిశ్శశాంకాదంత్యస్థితః క్రూరనిరీక్షితశ్చేత్ ।
చంద్రాంశసంస్థో యదివాతదీశో జాతశ్శిశుః ప్రేతపురంనవాబ్దైః ॥

లగ్నాధిపతి పాపుడై చంద్రునికి వ్యయమందుండి, పాపగ్రహదృష్టుడైనా, చంద్ర నవాంశయందున్నా తొమ్మిదేళ్ళకు మృతిపొందును.

43\. దృశ్యేభాగేనంయుతేసౌమ్యఖేటాః పాపాస్సర్వేయస్యజన్మన్యదృశ్యాః ।
రాహౌలగ్నే పాపయుక్తేథదృష్టే జాతో మృత్యుంపంచమాబ్దే ప్రయాతి ॥

దృశ్యచక్రార్ధమున (లగ్న భోజ్యము, 12,2,1,10,8,7 భుక్తి) శుభగ్రహము లన్నియునుండి, అదృశ్యార్ధమున (తక్కిన రాశులందు) పాపగ్రహములన్నియు నుండి, రాహువు లగ్నమున ఉండి పాపయుక్తుడైనా, దృష్టుడైనా అయిదేళ్ళు జీవించును.

44\. రాహుస్సప్తమభవనే శశిసూర్యనిరీక్షితో నశుభదృష్టః ।
దశభిర్ద్వాదశభిర్వాహ్యబ్దైర్జాతంనరంవినాశయతి ॥

రాహువు సప్తమమున ఉండి, చంద్రరవిదృష్టుడై శుభదృష్టుడు కాని యెడల, పది లేక పండ్రెండవ సం.లు జీవించును.

45\. ఘటాళిసింహే ఫణినాథయుక్తే తస్మిన్ విలగ్నే సతిపాపదృష్టే ।
జాతో యమంసప్తదశే ప్రయాతి వర్షే సురేజ్యేనయుతేనదృష్టే ॥

కుంభ, వృశ్చిక, సింహములులగ్నమై పాపదృష్టడైన రాహువులగ్నగతుడై, గురుదృష్టుడు, గురుయుక్తుడు కాకయున్న జాతకుడు 17వ యేట మరణించును.

46\. క్షీణేందుః పాపసంద్రుష్టో రాహుదృష్టో విశేషతః ।
జాతో యమపురంయాతి దినైః కతిపయైరపి ॥

క్షీణచంద్రుడు పాపదృష్టుడై విశేషముగా రాహుదృష్టుడైన కొన్ని దినములకు మృతినొందును.

47\. జన్మేశలగ్నాధిపతీవిలగ్నాత్ షష్ఠాష్టమాంత్యేషు దినేశయుక్తౌ ।
జాతోనరో ద్వాదశభిస్తువర్షైః ప్రయాతిసౌమ్యైర్నయుతో నదృష్టః ।

జన్మరాశి, జన్మలగ్నాధిపతులు 6,8,12 లందుండి, రవియుక్తుడై, శుభగ్రహ యుక్తుడు, దృష్టుడు కాకున్న 12 ఏళ్ళు జీవించును. (జన్మరాశి చంద్రుడున్నరాశి)

48\. హోరాధిపతిర్ద్యూనే పాపయుతే మరణమేవవిధధాతి ।
రాహుశ్చతుష్టయస్థో మరణాయనిరీక్షితో భవతిపాపైః ॥

లగ్నాధిపతి సప్తమమున పాపయుక్తుడై యుండినా, రాహువు కేంద్రమందు పాపదృష్టుడైయున్నా మృతి చెందును.

49. వర్షైర్వదంతిదశభిఃషోడశభిఃకేచిదాహురాచార్యాగం ।
రాశించంద్రిగుణీకృత్యవర్షమాసేననిశ్చయః ॥
పై రెండు యోగములకు సమయము పది సం. అనియు కొందరాచార్యులు చెప్పుదురు. రాశిని 3చే గుణించగా వచ్చిన సంవత్సర, మాసములకని నిశ్చయము.

50. తరుణేందుకుజాఃపుత్రస్థానయుక్తానసౌమ్యగాః ।
జాతోయమపురంయాతినవమేబ్దేనసంశయః ॥
రవిచంద్రకుజులు పంచమమున శుభయుక్తులుగాకయున్న 9వ ఏట మృతి నందును.

51. చంద్రలగ్నాధిపన్పూర్యఃస్వపుత్రేణసమన్వితః ।
లగ్నాదష్టమరాశిస్థోద్వాదశాబ్దైశ్శుభేక్షితః ॥
చంద్రుడున్న రాశ్యధిపతి రవియై, శనియుక్తుడై అష్టమమందుండి, శుభదృష్టి యున్న 12 ఏళ్ళు జీవించును.

52 లగ్నేశ్వరోవిలగ్నస్థఃపాపైస్సర్వైఃప్రదృశ్యతే ।
చతుర్థేమాసిమరణంధాత్రీపుత్రోనసంశయః ॥
లగ్నాధిపతియైన కుజుడు లగ్నస్థుడై సకల పాప దృష్టుడైన నాలుగు నెలలు బ్రతుకును.

53. షష్ఠాష్టమేపాపయుతేసౌమ్యదృష్టివివర్జితే ।
ఆపోక్లిమేవిలగ్నేశేజాతశ్చనిధనంవ్రజేత్ ॥
షష్ఠాష్టమములందు పాపగ్రహములుండి శుభదృష్టిలేక, లగ్నాధిపతి ఆపోక్లిమములందున్న జాతకుడు చనిపోవును.

54. పరస్పరక్షేత్రసమాగతౌవారంధ్రేశలగ్నాధిపతీనసౌమ్యైః ।
రిప్ఫారిగౌవాగురుణావియుక్తౌత్వష్టాదశాబ్దేనిధనంప్రయాతి ॥
లగ్నాష్టమాధిపతులు శుభ సంబంధములేక, పరస్పరక్షేత్రవర్తులైనా, లేదా షష్ఠవ్యయస్థులై గురుయుక్తులుకాకున్నా 18వ ఏట మృతినందును.

55. కేంద్రేషుపాపేషునిశాకరేణసౌమ్యగ్రహైర్వీక్షితవర్జితేషు ।
షష్ఠాష్టమేవాయదివాశశాంకేజాతశ్చతుర్వింశతివర్షమాత్రం ॥
కేంద్రమునయున్న పాపగ్రహములు, చంద్ర శుభగ్రహదృష్టి లేనివై, చంద్రుడు 6,8,12 లందుండిన 20 సం. వరకు జీవించును.

56. జీవసహాయేసూర్యేవాలగ్నస్థేకీటరాశిగే ।
అష్టమాధిపతౌకేంద్రేద్వావింశేమరణంభవేత్ ॥

గురు సహిత రవిలగ్నమైన కీట (వృశ్చిక) రాశి గతుడై, అష్టమాధిపతి కేంద్రమందున్న 22 సం. వరకు జీవించును.

57. రాహుణానహితశ్చంద్రోజామిత్రేచాష్టమేపివా ।
దేవేజ్యేలగ్నగేవాపిద్వావింశేమరణంభవేత్ ॥

రాహుసహిత చంద్రుడు సప్తమాష్టమములలో ఉండి, గురుడు లగ్నగతు డయిన 22న మృతి కలుగును.

58. చంద్రోమందనహాయస్తుసూర్యశ్చాష్టమసంస్థితః ।
ఏకోనవింశేవర్షేతుజాతోయమపురంవ్రజేత్ ॥

చంద్రుడు శనియుక్తుడై, రవి అష్టమమున ఉన్న 19 సం.లు జీవించును.

59. మందోదయేశత్రురాశౌ సౌమ్యైరాపోక్లిమస్థితైః ।
షడ్వింశేసప్తవింశేవామరణంభవతిధ్రువం ॥

శత్రురాశియైన లగ్నమున శనియుండి, శుభగ్రహములు ఆపోక్లిమ మందుండగా, 26న గాని, 27వ సం.న గాని మరణము తప్పదు.

60. పాపాంతరద్వయస్థేతుహోరానాథేనసౌమ్యగే ।
పితృజన్మనిజాతస్తుజాతోయమపురంవ్రజేత్ ॥

లగ్నాధిపతి శుభయుక్తుడుగాక, పాప మధ్యవర్తియై, తండ్రి జన్మలగ్నమున పుట్టినవాడు మృతినందును (ఎప్పుడు ?)

61. పాపాజనాష్టమార్థస్థాస్సౌమ్యాః కేంద్రబహిస్థితాః ।
అస్మిన్ యోగేబహూత్పన్నేత్వష్టావింశేమృతోభవేత్ ॥

పాపగ్రహములు లగ్న ద్వితీయ అష్టమములందుండి, శుభగ్రహములు పణ పర, ఆ పోక్లిమములందుండి, అనేక గ్రహములున్న, 28 వరకు జీవించును.

62. జన్మరంధ్రపయోర్మధ్యేశానాథేవ్యయేగురౌ ।
సప్తవింశతివర్షేవాద్వాత్రింశత్పరమావధిః ॥

లగ్న, అష్టమాధిపతులమధ్య చంద్రుడుండి, గురుడు వ్యయమునఉన్న 27 సం నగాని లేదా మహా బ్రతికిన 32 సం.వరకు అంతకన్న జీవించడు. అదే పరమావధి.

63. రంధ్రేశేజీవసందృష్టేపాపేపాపనిరీక్షితే ।
రంధ్రస్థేజన్మపేవాపిహ్యష్టావింశేమృతోభవేత్ ॥

అష్టమాధిపతి పాపగ్రహమై, పాపదృష్టమై, గురుదృష్టిగలిగినా, లేదా-జన్మ రాశ్యాధిపతి అష్టమమందున్నా 28వ యేట మరణించును.

64. అష్టమాధిపతౌ కేంద్రే లగ్నేశే బలవర్జితే ।
త్రింశద్వర్షాణ్యథో జీవేద్ద్వాత్రింశత్పరమావధిః ॥
అష్టమాధిపతి కేంద్రమున ఉండి లగ్నాధిపతి బలహీనుడైన 30, 32 సం. కన్న జీవించడు.

65. యః కశ్చిదష్టమస్థశ్చేద్యః కశ్చిద్బలవర్జితః ।
త్రింశద్వర్షాణ్యసౌ జీవేద్ద్వాత్రింశత్పరమావధిః ॥
లగ్నాష్టమాధిపతులలో ఒకడష్టమమున ఉండి, ఒకడు బలహీనుడయిన 30-32 వరకు జీవించును.

66. లగ్నాదష్టమరాశ్యంశే ఖానుపుత్రసమన్వితే ।
పాపే బలాధికే లగ్నే కేంద్రాద్యాపోక్లిమే శుభగ్రహాః ॥
అష్టమరాశి నవాంశయందు శనియుండి, బలవంతమైన పాపగ్రహము లగ్నమందుండి, పణపర, ఆపోక్లిమములందు శుభగ్రహములున్న 30-32 సం. వరకు జీవించును.

67. అన్యోన్యసంగతాః క్రూరాః లగ్నేశే పాపవీక్షితే ।
ద్వాదశే శీతరశ్మిశ్చ పరమాయు స్తథైవహి ॥
పాపగ్రహము లన్యోన్యయుక్తులై, లగ్నాధిపతి పాపదృష్టుడై, వ్యయమున క్షీణ చంద్రుడున్న 30-32 సం.లు పరమాయువు.

68. జన్మాష్టమేశౌ యది కేంద్రయుక్తౌ రంధ్రే తు యః కశ్చన ఖేచరేంద్రః ।
ద్వాత్రింశకే తన్మరణం శుభైస్తు కేంద్రేషు హీనేష్విహ తైర్గ్రహేంద్రైః ॥
లగ్నాష్టమాధిపతులు కేంద్రయుక్తులై, అష్టమము గ్రహయుక్తమై, కేంద్రములందు శుభగ్రహములు లేకున్న 32 సం న మృతి నందును.

69. కేంద్రే శశాంకే దివసేశయుక్తే రంధ్రాధిపే కేంద్రగతేష్టమేపి ।
పాపాన్వితే లగ్నగతే విహీనే ద్వాత్రింశదబ్దాన్మరణం ప్రయాతి ॥
రవిచంద్రులు కలిసి కేంద్రవర్తులై, అష్టమాధిపతియు కేంద్రస్థుడుకాగా, అష్టమము పాపయుక్తమై, లగ్నము గ్రహవర్జితమైన, 32 వరకు బ్రతుకును.

70. లగ్నరంధ్రపయోర్యోగేన పాపేమృత్యునంయుతే ।
శుభేన్నయుక్తే పాపేచ మృత్యుస్స్యాత్సప్తవింశకే ॥
లగ్నాష్టమాధిపతులు కలిసి, పాపయుక్తులై, అష్టమమున ఉండి శుభ సంబంధము లేకున్న 27 సం.లు బ్రతుకును.

71. లగ్నాద్విలోమాన్నవమేచ చంద్రే రంధ్రేశ్వరే కేంద్రగతే న సౌమ్యైః ।
దృష్టేయుతే వా పరమాయురత్ర త్రింశాత్పరం నాస్తి బలైర్విహీనైః ॥

లగ్నమునకు విలోమముగా నవమమున (పంచమమున) చంద్రుడుండి, అష్టమాధిపతి కేంద్రగతుడై, బలహీనులయిన శుభ గ్రహములతో కూడినా, చూడ బడినా, 30 పరమాయువు.

72. రంధ్రేశ్వరేభాగ్యధనాత్మయుక్తేలగ్నాధిపేరంధ్రయుతేత్వసౌమ్యైః ।
జాతశ్చతుర్వింశతివర్షమాత్రంజీవత్యసౌశోభనదృష్టిహీనే ॥

అష్టమాధిపతి భాగ్యధనాధిపయుక్తుడై లగ్నాధిపతి అష్టమమునందుండి, పాప గ్రహయుక్తుడైనా, దృష్టుడైనా, శుభగ్రహదృష్టి లేకున్న 24 మాత్రమే జీవితము కలుగును.

73. అష్టమాధిపతౌలగ్నేలగ్నేశేబలవర్జితే ।
త్రింశద్వర్షాణ్యసౌజీవేత్వథవాద్వాత్రిగ్ంశతిః ॥

అష్టమాధిపతి లగ్నమున ఉండి, లగ్నాధిపతి బలహీనుడయిన, 30-32సం.లు జీవించును.

74. ఆపోక్లిమగతేచంద్రేలగ్నేశేపితథైవచ ।
పాపేక్షితేబలైర్హీనేజీవత్యాయుస్తథైవచ ॥

చంద్రుడు, లగ్నాధిపతియు ఆపోక్లిమములందుండి, లగ్నాధిపతి పాప దృష్టుడై, బలహీనుడై 30 32 సం.లు జీవించును.

75. గురుశుక్రౌతుకేంద్రస్థౌలగ్నేశేపాపసంయుతే ।
ఆపోక్లిమేతుసంధ్యాయామాయుష్షట్త్రింశదేవహి ॥

గురుశుక్రులు కేంద్రస్థులై, లగ్నాధిపతి పాపగ్రహయుక్తుడై ఆపోక్లిమ మందుండి, సంధ్యాకాలజాతుడు 36 సం.లు జీవించును.

76. లగ్నస్థితేవానరనాయకేతుపాపాంతరేశత్రుగృహేవిహీనే ।
షట్త్రింశదంతంపరమాయురస్యశుభైర్నదృష్టేనతినత్యమేతత్ ॥

రవి లగ్నస్థుడై, పాపమధ్యస్థుడై, శత్రుక్షేత్రగతుడై, బలహీనుడైన, శుభగ్రహ దృష్టి లేకున్న 36 సం.లు జీవించును.

77. భూసూనుచంద్రౌతనుగౌశుభాస్తుకేంద్రాష్టమస్థానభవేయురత్ర ।
జాతోయదామాంద్యుదయేశిశుస్స్యాత్షట్త్రింశకేబ్దేనిధనంప్రయాతి ॥

కుజచంద్రులు లగ్నగతులై, శుభగ్రహములు కేంద్ర అష్టమములందు లేకున్న, మాంది గ్రహము లగ్నమందున్న 36వ యేట మృతినందును.

78. హోరాశాస్త్రోక్తిభ్యానబలాత్సంగృహ్యవిదుషాంముదే ।
అయుర్దా వంకృతంసమ్యగ్వేంకటేశేనధీమతా ॥

వేంకటేశ దైవజ్ఞునిచే హోరాశాస్త్రాభ్యాస బలమువలన సంగ్రహించి, పండితుల సంతోషమునకై ఆయుర్దాయము తెలిపెడి విధము తెలుపబడినది.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్ర తాత్పర్యమున ఆయుర్యోగారిష్టాధ్యాయమను పంచదశాధ్యాయము



## అరిష్ట భంగాధ్యాయః షోడశః

1. లగ్నస్థితేదేవగురౌవిశేషాత్ ఖేటాన్నిహన్యాద్విబలాంస్తథైవ ।
ఏకోయథాచక్రధరప్రణామస్సమస్తపాపంశమనంకరోతి ॥

గురుడు లగ్నమందుండిన జాతకునికి జన్మకాలమున బలహీనులైన గ్రహములవలన సంభవించు నరిష్టములను, విష్ణుమూర్తికి చేసిన ఒక్క నమస్కారము సమస్త పాపములను పోగొట్టునట్లు పోగొట్టును.

2. అత్యంతసత్వేసతిలగ్ననాథేసౌమ్యాన్వితేతాదృశదృష్టిమార్గే ।
కేంద్రస్థితేపాపదృశావిహీనేసభాగ్యయుగ్భవతిదీర్ఘమాయుః ॥

లగ్నాధిపతి బలిష్ఠుడై శుభగ్రహయుక్తుడై, శుభ దృష్టుడై కేంద్రవర్తియై, పాప దృష్టి హీనుడైయున్న జాతకుడు భాగ్యవంతుడై దీర్ఘాయుష్కుడగును.

3. శశాంకోరంధ్రనాథశ్చసౌమ్యద్రేక్కాణసంయుతౌ ।
జాతశ్చికుంయమంయాంతమకస్మాద్రక్షయేత్తదా ॥

చంద్రుడును, అష్టమాధిపతియు శుభద్రేక్కాణయుతులయిన జాతకుడు మృతునైనను అకస్మాత్తుగా రక్షింతురు.

4. చంద్రస్సంపూర్ణగాత్రస్తుసౌమ్యక్షేత్రాంశగోపివా ।
సర్వారిష్టంనిహంత్యాశువిశేషాద్గురువీక్షితః ॥

పూర్ణచంద్రుడైనా, శుభగ్రహరాశి, నవాంశగతుడై గురుదృష్టుడైనా, సర్వారిష్టములను పోగొట్టి రక్షించును.

5. సౌమ్యభార్గవజీవానామేకఃకేంద్రగతోబలీ ।
పాపదృగ్యోగహీనశ్చేత్సద్యోరిష్టస్యభంగకృత్ ॥

బుధగురుశుక్రులలో నొకడయినా కేంద్రగతుడై, బలవంతుడై, పాపగ్రహ సంబంధములేకున్న వెంటనే అరిష్ట భంగము చేయును.

6. చంద్రోపిశత్రురాశిస్థోజీవశుక్రబుధైర్యుతః ।
ద్రేక్కాణేవాశమయతిదుష్టపాపంహరిర్యథా ॥

చంద్రుడు శత్రురాశిగతుడయినా, గురుశుక్రబుధయుక్తుడైన, శుభ ద్రేక్కాణ మందున్నా, పాపమును విష్ణువుపశమింపజేయునట్లు అరిష్టమునుపశమింపజేయును.

7. శుక్లేచపక్షేయదిరాత్రిజన్మచంద్రోపిషష్టాష్టమరాశియుక్తః ।
శుభేక్షితోవాహనికృష్ణపక్షేపాపైరదృష్టోహ్యవతిప్రసూతం ॥

చంద్రుడు లగ్నమునకు షష్టాష్టమ రాశులందున్నా, శుక్లపక్షమున రాత్రి జన్మమైనా, శుభగ్రహదృష్టుడైనా, కృష్ణపక్షమున పగలు జన్మమైనా పాపదృష్టుడు కాకుండెనేని శిశువును రక్షించును.

8. నిశాకరశ్చోభనఖేచరాంశేశుభేక్షితఃపూరితదేహకాంతిః ।
జాతస్యనిశ్శేషమరిష్టజాలంయథావిషంహంతిహివైనతేయః ॥

చంద్రుడు శుభగ్రహరాశి నవాంశయందుండి, శుభదృష్టుడై, పూర్ణుడైన అరిష్ట ఫలమును గరుత్మంతుడు విషమును హరించునట్లు హరించును.

9 ప్రకాశమానోగగనేమరేజ్యఃకేంద్రస్థితోరక్షతిజాతసూనుం ।
సౌమ్యాంశగాజీవశశాంకశుక్రసౌమ్యాశ్చనిఘ్నంతిసమస్తదోషం ॥

గురుడాకాశమున ప్రకాశించుచు, కేంద్ర స్థితుడయినా, గురుచంద్రబుధులు శుభగ్రహ నవాంశలందున్నా, సమస్త దోషములను పోగొట్టును.

10. జన్మాధిపఃకేంద్రగతశ్శుభశ్చేజ్జాతంశిశుంరక్షతిసౌమ్యదృష్టః ।
స్వాంశస్థితైశ్శోభనఖేచరేంద్రైర్దృష్టస్తదన్యైర్వినిహంత్యరిష్టం ॥

జన్మరాశ్యధిపతి శుభగ్రహమై, కేంద్రవర్తియై శుభగ్రహదృష్టుడైనా, స్వక్షేత్ర, అంశలందున్న పాపగ్రహములున్ను శుభగ్రహదృష్టములైన సకలారిష్టములను పోగొట్టుదురు.

11. లగ్నాత్తృతీయారిభవేనరాహాపాపైర్వియుక్తేశుభదృశ్యమానే ।
వినాశయత్యాశుసమస్తదోషంతూంయథావాయుబలస్యవేగః ॥

లగ్నమునకు 3,6,11 లందుండు రాహువు పాపవర్జితుడై, శుభదృష్టుడైన గాలివేగమున దూదినెగురగొట్టినట్లు సమస్త దోషముల నెగురగొట్టును.

12. పూర్ణేందురన్యైశ్చశుభగ్రహేంద్రైర్దృష్టోయుతశ్చాపినపాపదృష్టః ।
సర్వగ్రహేంద్రైఃపరిపూర్ణచంద్రోదృష్టోహరత్యాశుసమస్తరిష్టం ॥

పూర్ణచంద్రుడు శుభగ్రహయుక్తుడు, దృష్టుడునై, పాపదృష్టి లేకున్నను, లేక అన్నిగ్రహములచేతను చూడబడినను సమస్తారిష్టములను పోద్రోలును.

13. సౌమ్యగ్రహైరతిబలైర్విబలైశ్చపాపైర్లగ్నంచసౌమ్యభవనంశుభ
దృష్టియుక్తం।
సర్వాపదోవిరహితోభవతిప్రసూతఃపూజాకరఃఖలుయథాదురితం
గ్రహాణాం।

శుభగ్రములు బలవంతములై, పాపగ్రహములు బలహీనములై, లగ్నము శుభగ్రహ క్షేత్రమై, శుభదృష్టి కలదయిన సకల దోషములు పోవును.

14. అజవృషకర్కటలగ్నేరక్షతిరాహుస్సమస్తపీడాభ్యః।
పృథివీపతిఃప్రసన్నఃకృతాపరాధంయథాభృత్యం॥

మేష, వృషభ, కర్కాటక రాశులందున్న రాహువు ప్రసన్నుదయిన రాజు అపరాధముచేసిన భృత్యుని రక్షించునట్లు సమస్త పీడలనుండి రక్షించును.

15. చంద్రశ్శుభవర్గస్థఃక్షీణోపిశుభేక్షితోహరతిరిష్టం।
జలమివహంత్యతిసారందాడిమపలవల్కలక్వథితం॥

చంద్రుడు శుభవర్గమందున్న యెడల, శుభదృష్టుడైన, క్షీణుడైనను కాచిన దానిమ్మతొక్క రసము అతిసారవ్యాధిని పోగొట్టునట్లు, అరిష్టదోషమును హరించును.

16. చంద్రాధిష్ఠితరాశీశేలగ్నస్థేశుభవీక్షితే।
భృగుణావీక్షితేచంద్రేస్వోచ్చేరిష్టంహరేత్తదా॥

చంద్రుడున్న రాశ్యధిపతి లగ్నస్థుడై శుభగ్రహదృష్టుడై, చంద్రుడుచ్చస్థుడై, శుక్రునిచే చూడబడిన అరిష్టమును పోగొట్టును.

17. స్వోచ్చస్థస్స్వగృహేథవాపిసుహృదాంవర్గేస్వకీయేపివా।
సంపూర్ణశ్శుభవీక్షితశ్శశధరోవర్గేథసౌమ్యేపివా।
శత్రూణామవలోకనేనపతితఃపాపైరయుక్తేక్షితో।
రిష్టంహంతిసుదుస్తరందినమణిఃప్రాలేయరాశింయథా॥

చంద్రుడు ఉచ్చస్థుడైనా, స్వక్షేత్ర మందున్నా, మిత్రవర్గమందున్నా స్వవర్గ మందున్నా శుభవర్గమందున్నా, పూర్ణుడై శుభదృష్టుడైనా, శత్రుదృష్టుడుగాక, పాప యుక్తుడుగాక,పాపదృష్టుడుగాకున్న సూర్యుడు మంచును హరించినట్లు దుస్తరమైన అరిష్టమునుహరించును.

18. అధ్యాయోరిష్టభంగాఖ్యఃప్రోక్తశ్చింతామణౌమయా।
సారంగృహిత్వావెల్నాడువేంకటేశ్వరశర్మణా॥

వెలనాటివాడైన వేంకటేశ్వరశర్మయైన నాచే హోరాశాస్త్రసారము గ్రహించి, సర్వార్థ చింతామణి యందు అరిష్ట భంగాధ్యాయము చెప్పబడినది.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున అరిష్టభంగమను షోడశాధ్యాయము

# సప్తదశోధ్యాయః

1. ద్వాత్రింశోర్ధ్వంచాచార్యాత్ప్రత్యాఖ్యమధ్యమంహ్యాయుః ।
తావత్కాలప్రమితానోగవిశేషానహంవక్ష్యే ॥

32 సం,లకు పైన 70కి మధ్యమైన ఆయువు మధ్యమాయువు. అంత పరిమితికల యోగ విశేషములను చెప్పుదును.

2. చంద్రేకుజర్క్షేతనుగేప్రదృష్టేక్రూరగ్రహైశ్శోభనఖేచరేంద్రైః ।
కేంద్రాద్బహిస్థైర్నిధనంప్రయాతివర్షైస్త్రయస్త్రింశసమానకైస్తు ॥

లగ్నమైన కుజక్షేత్రమున చంద్రుడుండి, కేంద్రములుకాని రాశులందున్న పాప, శుభగ్రహములచే చూడబడిన జాతకుడు 33 సం.లు జీవించును.

3. పాపగ్రహేరంధ్రపతౌచచంద్రేకేంద్రస్థితేవాయదివాత్రికోణే ।
నిరీక్షితేపాపఖగైర్నభస్థైఃజాతస్త్రయస్త్రింశదుపైతివర్షం ॥

అష్టమాధిపతి పాపగ్రహమై, చంద్ర, అష్టమాధిపతులు కేంద్రకోణము లందుండి, దశమస్థులైన పాపగ్రహములచే చూడబడిన 33 సం.లు జీవించును.

4. లగ్నేశనౌరాత్రికరేణయుక్తేఖౌమేఘటస్థేనురసాంఖ్యవర్షైః ।
క్రూరాంతరేలగ్నగతేదినేశేయుగ్మస్థితేదేవగురౌరిపుస్థే ॥

శనిచంద్రయుక్తుడై లగ్నమున ఉండి, కుజుడు కుంభమున ఉన్న 38సం.లు జీవించును. లగ్నగతుడైన రవి పాపమధ్యవర్తియై, గురుడు సరిరాశియందు షష్ఠస్థుడైయున్న—

5 జాతస్తుమృత్యుంనగవహ్నివర్షైఃప్రయాతిశాస్త్రజ్ఞవరైః ప్రదిష్టం ।
నభూమిజేరంధ్రపతౌవిలగ్నేరాశౌస్థిరేవాయదివాధరాజే ॥

జాతకుడు 37 సం.లు జీవించును. అష్టమాధిపతి లగ్నమున ఉండి, కుజుడు కూడ లగ్నమందున్నా, లేదా స్థిరరాశి యందుండినా,

6. రిశ్ఫేష్టమేమృత్యుము పైతిజాతస్త్వబ్దేద్విచత్వారినమానకేవా ।
కేంద్రేగురౌకర్మణిసూర్యపుత్రేలగ్నే చరేవేదయుగైర్నమానైః ॥
8, 12 అందున్నా, 42 సం.లు జీవించును. గురుడు కేంద్రమందుండి, శని దశమమునఉండి, లగ్నము చరమైన 44 సం,లు జీవించును.

7. స్వోచ్చేవిలగ్నే క్షితినందనేచజీవే స్తగేకర్మణిసూర్యపుత్రే ।
జాతోధనాఢ్యోబహుశాస్త్రవేత్తానాగాబ్ధివర్షైర్నిధనంప్రయాతి ॥
జన్మలగ్నమైన స్వోచ్చయందు కుజుడుండి, సప్తమమున గురుడుండి దశమమున శనియున్న జాతకుడు ధనవంతుడు, బహుశాస్త్రవేత్తయై 48 సం.లు జీవించును.

8. జన్మేశ్వరేరంధ్రగతేనపాపేపాపాన్వితేలగ్నపతౌరిపుస్థే ।
బలాన్వితౌతౌశుభదృగ్విముక్తౌపంచాబ్ధివర్షైర్నిధనంప్రయాతి ॥
జన్మరాశ్యధిపతి పాపయుక్తుడై అష్టమమందుండి, లగ్నాధిపతి పాపయుక్తుడై షష్టమందుండి, ఇద్దరును బలీయులై ' శుభదృష్టిలేకున్న 45 సం.లు జీవించును.

9. మేషేశశాంకేతనుగేసుపూర్ణేసౌమ్యేక్షితేభూపతిరత్రజాతః ।
పాపగ్రహైశ్చాంచదృశావిహీనేనాగాబ్ధివర్షైర్నిధనంప్రయాతి ॥
మేషము జన్మలగ్నమై, అక్కడ పూర్ణచంద్రుడుండి, శుభదృష్టియున్న ప్రభువగును. పాపదృష్టి పొందకున్న 48 సం.లు జీవించును.

10. శనైశ్చరోలగ్నగతస్సహాయస్త్వన్యేనచంద్రేవ్యయగేష్టమేస్యాత్ ।
వేదాంతవిజ్ఞానసుశీలవృత్తోజాతస్తుమృత్యుంనయనేషువర్షైః ॥
శని లగ్నగతుడై ఇతర గ్రహయుక్తుడై, చంద్రుడు వ్యయమునగాని, అష్టమమునగాని యున్న జాతకుడు వేదాంత విజ్ఞాని, సుశీల వృత్తుడునై 52 సం.లు జీవించును.

11. చాపేగురౌలగ్నగతేష్టమస్థేభౌమేసరాహౌమునిశాణవర్షైః ।
రంధ్రేశ్వరేకామగతేశశాంకేపాపాన్వితేస్యాన్మృతిష్టబాణే ॥
ధనుస్సు లగ్నమై గురుయుక్తమై, రాహుషష్టమమున, కుజుడును ఉండగా 57 సం.లు జీవించును. అష్టమాధిపతి సప్తమమున ఉండి, చంద్రుడు పాపగ్రహయుకుడైన 58 సం.లు జీవించును.

12. సరంధ్రపేదేవగురౌవిలగ్నేకుంభేనపాపేయదికేంద్రరాశౌ ।
జ్ఞానీసుఖీశాస్త్రవిదాంవరిష్టోజాతస్తుషష్ట్యాంనిధనంప్రయాతి ॥
గురుడు అష్టమాధిపతియుక్తుడై లగ్నమున ఉండి, కుంభము కేంద్రమై, అందు పాపగ్రహమున్న జాతకుడు బ్రహ్మజ్ఞాని, సుఖి, శాస్త్రజ్ఞశ్రేష్టుడునై 60 సం.లు జీవించును.

13. రంధ్రేశపాపేతను పేవ్యయస్థే రంధ్రేశ్వరే లగ్నగతస్తు షష్ఠ్యాం ।
లోకాంతరం యాతి చ జాతమానుః కుశీలవృత్తః కులపాంసనశ్చ ॥
అష్టమాధిపతి లగ్నస్థుడై, అష్టమము పాపయుక్తమై లగ్నాధిపతి వ్యయమున ఉండిన-దుశ్శీలుడు, కులపాంసనుడునై 60వ యేట మృతి నందును.

14. సౌరేవిలగ్నే హిబుకే శశాంకే కుజేకళత్రే గగనే దినేశే ।
కవీజ్యసౌమ్యేష్విహ సంయుతేషు నరేశ్వరో జీవతి వర్షషష్ఠ్యాం ॥
లగ్నమున శని, చతుర్థమున చంద్రుడు, సప్తమమున కుజుడు, దశమమున రవి ఉండి, గురుశుక్రబుధులు కేంద్రగతులైన జాతకుడు ప్రభువై 60 సం.లు జీవించును.

15. లగ్నాధిమానే విబుధారిపూజ్యే బుధేజ్యచంద్రైః పరిదృశ్యమానే ।
జాతం నరం భూమిపతిం ధనాఢ్యం కరోతి షష్ఠ్యాం సుతభే మరేజ్యే ॥
దశమమున శుక్రుడు బుధగురుచంద్రులచే చూడబడి, గురుడు పంచమమున ఉన్న జాతకుడు ధనవంతుడయిన ప్రభువై 60 సం.లు జీవించును.

16. సితేవిలగ్నే బుధభానుపుత్రా కేంద్రే చతుష్టయస్థా పరిశేషఖేచరాః ।
తృతీయలాభర్షగతాస్తు యోగే మహీపతిస్స్యాన్నిధనం చ షష్ఠ్యాం ॥
లగ్నమున శుక్రుడు, కేంద్రమున బుధశనులు, తక్కిన గ్రహములు 3,11 లందుండిన జాతకుడు ప్రభువై 60 సం.లు జీవించును.

17. హోరాజన్మాధినాథౌ నిధనముపగతౌ మృత్యునాథే చ కేంద్రే ।
యోగేజాతో నరోస్మిన్ జయతి నరవరః కీర్తివిత్తాన్వితశ్చ ॥
జన్మలగ్న జన్మరాశ్యధిపతులు అష్టమమున ఉండి, అష్టమాధిపతి కేంద్రగతుడయిన జాతకుడు కీర్తి ధనయుక్తుడైన నరశ్రేష్ఠుడై 66 సం.లు జీవించును.

18. షష్ఠ్యాం షడ్భిర్యుతాయాం నిధనమభిహితం నందకోక్తాదధీతం ।
లగ్నాత్పాపైర్యుక్తైః గ్రహాస్స్యుతుర్యగగురుణ సహితే భార్గవే కేంద్రయాతే ।
షష్ఠ్యామబ్దే సుశీలస్సుభవనికటే దేవలోకం ప్రయాతి ॥
చతుర్థమున సున్న గ్రహములుండి, గురుయుక్తుడైన శుక్రుడు కేంద్రవర్తియైనా, లగ్నమందున్నా జాతకుడు మంచి స్వభావము కలవాడై 60 సం.న దేవలోకము చేరును.

19. జీవేవిలగ్నే బుధసూర్యయుక్తే మీనే శనౌ ద్వాదశశీతరశ్మౌ ।
అస్మిన్ యోగే చార్థవాన్మృత్యుకాల్యాత్ షట్ షష్ట్యబ్దే సర్వవిద్యావిశేషపటుశ్చ ॥

లగ్నమున గురుడుండి, రవిబుధయుక్తుడై, మీనమున శని, చంద్రుడు వ్యయ మున, ఉన్న జాతకుడు ధనవంతు సర్వ విద్యా పటువునై 66 సం లు జీవించును.

20. చంద్రేలగ్నేస్వోచ్చగేహంప్రయాతేనీచేమందేభాస్కరేసప్తమేచ ।
జాతోయోగేచార్థవాన్మృత్యుభాజ్యాజీవేత్షష్ట్యాంషడ్యుతాయాం
మనుష్యః ॥

చంద్రుడు లగ్నమున ఉచ్చస్థుడైయుండి, శని నీచయందుండి, రవి సప్తమమున ఉన్న, జాతకుడు ధనవంతుడై 66 సం.లు జీవించును.

21. నీచేమందేకేంద్రగేవాత్రికోణేసౌమ్యైఃకేంద్రేభాస్కరేవాసౌమ్యే ।
అస్మిన్జాతోమానవోజ్ఞానిముఖ్యోజీవేత్షష్టింపంచభిస్సంప్రయుక్తాం ॥

నీచస్థుడైన కేంద్రకోణ గతుడై, శుభగ్రహములు కేంద్రగతులయినా, రవి శుభగ్రహయుక్తుడై కేంద్రమునందున్నా జాతకుడు జ్ఞాని ముఖ్యుడై 65 సం.లు జీవించును.

22. అర్కేభామేభానుపుత్రేత్వరిశేకేంద్రేజీవేచంద్రరిప్ఫాష్టహీనే ।
యోగేజాతఃపండితోధర్మశీలోజ్ఞానీప్రాజ్ఞస్సప్తతిర్వత్సరాణాం ॥

రవి, శని, కుజ షష్టాధిపతులు కేంద్రమందుండి, గురుడు చంద్రునకు అష్టమ, వ్యయములందు లేకున్న, జాతకుడు పండితుడు, ధర్మశీలుడు, జ్ఞాని ప్రాజ్ఞుడై 70 సం.లు జీవించును.

23. ప్రబలేకేంద్రగేసౌమ్యేనిధనేసౌమ్యవర్జితే ।
లగ్నాధిపేనసంద్రృష్టేయావజ్జీవతిసప్తతిః ॥

ప్రబలమైన శుభగ్రహము కేంద్రమందుండి, అష్టమమున శుభగ్రహము లేకుండి, లగ్నాధిపతిచే చూడబడిన జాతకుడు 70 సం.లు జీవించును.

24. పంచమస్థేధరాసూనౌనీచేమందేస్తగేరవౌ ।
అస్మిన్జాతోమనుష్యస్తుసప్తత్యాంనిధనంవ్రజేత్ ॥

కుజుడు పంచమమందుండి, నీచయందు శని యుండి, రవి సప్తమ మంద దున్న జాతకుడు 70 సం.లు జీవించును.

25. ఇత్యేవంబహుధామయాచకథితాయోగాస్త్వసంఖ్యాఇమే ।
యేప్రోక్తాయవనాదిభిర్మునిగుణై ర్నిశ్చిత్యయోగాంస్తుతాన్ ।
జ్ఞాత్వాసమ్యగుదాహరంతిమనసాతేయాంతికీర్తింపరా ।
మేవంప్రశ్నవిధౌచజన్మనమయేవైవాహికేకర్మణి ॥

యవనాదులచే చెప్పబడిన యోగములను అనేకములను నేను చెప్పితిని. వీటిని

తెలిసికొని, ఉదాహరించినవారు కీర్తి పొందుదురు. ప్రశ్నలోను, వివాహాదులకును వీదిని చెప్పవచ్చును.

ఇది మధ్యాయుర్యోగము.

26. దీర్ఘాయురాప్నోతిఖగాస్సమస్తాశ్శుభాశుభాఃషడ్భవనాంతరస్థాః ।
లగ్నాత్తథైవాపరభాగయుక్తాశ్శుభాశుభాస్తద్విపరీతమన్యత్ ॥

ఇక పూర్ణాయుర్యోగముల జెప్పుచున్నాడు. శుభపాపగ్రహము లన్నియు, లగ్నాది ఆరు భావములందున్నా, సప్తమాది వ్యయాంత అపర భాగమునఉన్నా జాతకుడు పూర్ణాయుపగును. అట్లుగాక కొందరటు కొందరిటు ఉన్న ఆ యోగము కలుగదు.

27. లగ్నాదిషట్కేశుభఖేచరేంద్రాఃసర్వేబలాఢ్యాస్త్వపరేతుపాపాః ।
ప్రదీప్తిమంతోగుణవాంత్సుశీలఃశ్రీమానశీత్యాంనిధనంప్రయాతి ॥

పూర్వషట్కమున-లగ్నాదిగా ఆరు రాశులలో, శుభగ్రహములన్నియు ఉండి, అపర భాగము (7-12) పాపగ్రహము లన్నియు ఉన్న జాతకుడు గుణవంతుడు, సుశీలుడు, శ్రీమంతుడునై ఎనుబదేళ్ళు జీవించును.

28. లగ్నేంద్రేశశినుతేకోణేచంద్రేశుభేశనౌ ।
జాతస్త్వశీత్యాంమునిభిర్వర్షైర్జీవతితత్సుఖం ॥

లగ్నమున బుధుడు, కోణమున చంద్రుడు, శని నవమమున ఉండగా పుట్టినవాడు 80 ఏళ్ళు జీవించును.

29. ఓజరాశిగతాస్సర్వేపూర్ణచంద్రసమన్వితాః ।
ఓజేలగ్నేపరంభాగ్యందీర్ఘమాయురుపైతిసః ॥

అన్ని గ్రహములును, పూర్ణచంద్రయుక్తులై ఓజ రాశులందుండి, ఓజరాశి లగ్నమైన అధిక భాగ్యవంతుడై దీర్ఘాయువగును.

30. సమరాశిగతాస్సర్వేకృష్ణచంద్రసమన్వితాః ।
స్త్రీణాంతుజనసేయుగ్మలగ్నేభాగ్యముపైతిసః ॥

గ్రహములన్ని సమరాశులందుండి, కృష్ణపక్ష చంద్రుడై సరిరాశి లగ్నమైన వాడు స్త్రీల భాగ్యము పొందును.

31. భాగ్యయోగేషుదీర్ఘాయుర్వదంతియవనాదయః ।
తత్పృథక్పృథగేవాయుర్వదంతిమిహిరాదయః ॥

యవనాదులు భాగ్యయోగమున్న దీర్ఘాయువుకల్గు నందురు. వరాహమిహిరాదులు అదివేరు, ఇదివేరు అందురు. పేదలైనా దీర్ఘాయుష్మంతు లుండుటవలన దానికి దీనికి సంబంధము లేదందురు.

32. యత్రతత్రద్వయోర్యోగంతదిష్టంమమసమ్మతం ।
కదాచిత్కథితోయోగస్సర్వదానభవేత్తథా ॥

ఆ యవన వరాహ మిహిరాచార్య సమ్మతమైన యోగములనే నేను చెప్పితిని. ఎక్కడయినా ఒక్కటున్నా ఉండవచ్చును.

33. జీవేనచంద్రేకేంద్రస్థేసౌమ్యదృష్టేపరేగ్రహాః ।
దశమాత్పరతోయుక్తాఅశీత్యాంనిధనంవ్రజేత్ ॥

గురుకు చంద్రయుక్తుడై కేంద్రమందున్న శుభగ్రహ దృష్టుడైన, తక్కిన గ్రహములు దశమముకన్న పరమందున్న జాతకుడు 80 ఏళ్ళు జీవించును.

34. చతుష్టయగతాస్సౌమ్యాఃపాపాశ్చాష్టారివర్జితాః ।
చంద్రోవిలగ్నాత్షష్ఠస్థఃషడశీత్యాయుషంవదేత్ ॥

శుభగ్రహములన్ని కేంద్రగతులై, పాపగ్రహములు షష్టాష్టమములలేకున్న, చంద్రుడు షష్టమున ఉన్న జాతకుడు 86 సం.లు జీవించును.

35. పాపాస్త్రిషష్ఠలాభస్థాఃచంద్రష్షష్టాష్టమంగతః ।
కేంద్రేగురౌత్రిసాహస్రగ్రామనాథశ్చిరాయుషః ॥

పాపగ్రహములు 3,6,11 లందుండి, చంద్రుడు 6,8 లందుండగా, గురుడు కేంద్రమందున్న జాతకుడు మూడువేలగ్రామముల కధిపతియై దీర్ఘాయుష్మంతు డగును.

36. లగ్నాత్త్రికోణేనిధనేచకేంద్రేగ్రహాస్త్రయఃపంచచతుష్టయేవా ।
జాతశ్శ్రియంప్రాప్యజితేంద్రియస్తుజీచ్ఛతాద్వత్పరతఃపరంతు ॥

లగ్నాత్తు కోణమునగాని, అష్టమమునగాని, కేంద్రమునగాని మూడు గ్రహము లున్నా, కేంద్రములందు అయిదు గ్రహములున్నా జాతకుడు జితేంద్రియుడై ఐశ్వర్యవంతుడై నూరుకన్న ఎక్కువగా జీవించును.

37. జీవేలగ్నేశ్వరాత్కేంద్రేకేంద్రకోణాదివర్జితాః ।
పాపాస్సుఖానిసంప్రాప్యజీవేద్వర్షశతంనరః ॥

గురుడు లగ్నాధిపతికి కేంద్రమున ఉండి, పాపగ్రహములు, కేంద్రకోణాది వ్యతిరిక్త స్థానములందున్న జాతకుడు సుఖము లనుభవించి నూరేళ్ళు జీవించును.

38. నిశాకరేలగ్నేగతేస్వభాగేమీనస్థితేవాయదివాకుళీరే।
గ్రహైర్విహీనేనిధనేసురేజ్యేకేంద్రేపరంజీవతినష్టతేస్తు ॥

చంద్రుడు లగ్నగతుడై స్వాంశయందున్నా, లేదా మీనమందుగాని కర్కాటకమందు గాని ఉన్నా అష్టమము గ్రహము లేకుండెనేని, గురుడు కేంద్రమందున్న 70 సం ల కన్న ఎక్కువ జీవించును.

39. కేంద్రే గురౌ లగ్నగతే దినేశే భూసూనుయుక్తే యది వామృతిస్థే ।
జాతశ్శ్రియం ప్రాప్య గణాధికారీ శతం తు జీవేచ్ఛరదాం విశేషాత్ ॥
గురుడు కేంద్రమందుండి, రవి కుజునితో కూడి లగ్నమందున్నా, అష్టమ మందున్నా జాతకుడు ఐశ్వర్యవంతుడై గణాధికారియై నూరేండ్లు జీవించును.

40. మీనాంత్యలగ్నే ఖచరైశ్చతుర్భిః కేంద్రస్థితైర్నాగశతం న జీవేత్ ।
సింహే విలగ్నే ఖచరైశ్చతుర్భిస్త్రికోణగైర్జీవతి తావదేవ ॥
మీనాంత్యము లగ్నమై నాల్గు గ్రహములు కేంద్రమందున్నను-లేదా-సింహ లగ్నమై కోణములందు నాల్గు గ్రహములున్నను 108 సం.లు జీవించును.

41. త్రిభిర్గ్రహైస్స్వోచ్చయుతైర్విలగ్నే వృషే కుళీరే న గురౌ తథైవ ।
మృగే కుజే కర్కిణి దేవపూజ్యే కేంద్రేషు శేషైః పరమాయురత్ర ॥
మూడు గ్రహములుచ్చస్థులై, వృషభము లగ్నమై, కర్కాటకము గురు యుక్తమైన జాతకుడు 108 సం.లు జీవించును. మకరమున కుజుడు, కటకమున గురుడు కేంద్రములందు తక్కిన గ్రహములున్నను 108 సం॥లు జీవించును.

42. భృగౌ చతుర్థే న గురౌ విలగ్నే సేందౌ శనౌ కర్మణి పాపహీనే ।
జాతో నరోఽస్మిన్ సముపైతి దీర్ఘమాయుశ్చ విద్యాం యశసా సమేతాం ॥
చతుర్థమున శుక్రుడు, గురుడు లగ్నమందు, చంద్రుడితో కూడి, ఇతర పాప గ్రహములు లేకుండా శని దశమమున ఉండిన జాతకుడు విద్య, కీర్తికల్గి దీర్ఘాయుష్మంతుడగును.

43. లగ్నే మృగాపరార్థే తు పూర్వార్థే కుజసంయుతే ।
లగ్నే శశాంకసహితే గురౌ కేంద్రే వరం వయః ॥
లగ్నము మకరోత్తరార్థమై (16-30 భాగలు) పూర్వార్థమున కుజుడుండి, ఉత్తరార్థమున చంద్రుడుండగా, గురుడు కేంద్రగతుడైన జాతకునకు దీర్ఘాయువు కలుగును.

44. చాపపూర్వార్ధగే జీవే లగ్నే త్వపరభాగగే ।
సౌరేః కేంద్రే భృగౌ పుత్రే న చంద్రే పరమం వయః ॥
గురు ధనుఃపూర్వార్థమున (1-15) ఉండగా, లగ్నము ఉత్తరార్థమై శని యుండు రాశికి కేంద్రమున చంద్రునితో కూడి శుక్రుడున్న జాతకునకు దీర్ఘాయువు కలుగును.

45. కన్యాపూర్వార్థగే సౌమ్యే పరార్థే లగ్నమాగతే ।
గ్రహైస్త్రిభిశ్చతుర్భిర్వా స్వోచ్చస్థైః పరమం వయః ॥
కన్యారాశి పూర్వార్థమున బుధుడుండి, ఉత్తరార్థము లగ్నమై మూడుగాని నాలుగుగాని గ్రహములు ఉచ్చస్థులైన జాతకునకు దీర్ఘాయువు కలుగును.

46. పాపాస్త్రిషష్ఠలాభస్థాఃసౌమ్యేలగ్నాంతభాగగే ।
లగ్నేసౌరేశుభ్రగౌకేంద్రేగురౌవాపరమంవయః ॥

పాపగ్రహములు 3,6,11 లందుండి, బుధుడు లగ్నాంత్య భాగమందుండి, లగ్నమున శని, కేంద్రమున గురుడుగాని, శుక్రుడుగానియున్న పూర్ణాయువు కలుగును.

47. నృయుగ్మపూర్వార్థగతేధరాజేలగ్నాపరార్థేనగురౌవిశేషాత్ ।
కేంద్రేశుభాభ్యాంసహితేచజాతస్సతాత్పరంజీవతిపుణ్యభాక్ ॥

లగ్నమైన మిథునాపరార్థమున గురుడుండి, పూర్వార్ధమున కుజుడుండిన, కేంద్రమందు బుధశుక్రులున్న జాతకుడు పుణ్యాత్ముడై నూరేండ్లకన్న ఎక్కువగా జీవించును.

48. లగ్నేఘటేదేవగురౌఝషస్థేవ్యయేగురౌవానరపౌవిలగ్నే ।
జాతఃపరబ్రహ్మపదంప్రయాతిరసాయనాద్యైర్ధశవర్థితంతత్ ॥

కుంభము లగ్నమై రవియుక్తమై, గురుడు ద్వితీయమునగాని, వ్యయమున గాని ఉండిన జాతకుడు రసాయనాదులచే వెయ్యేండ్లు జీవించి, పరబ్రహ్మపదము నందును.

49. సింహేవిలగ్నేసగురౌశుభ్రగౌతుకుళీరగేసోమసుతేధనస్థే ।
పాపగ్రహైషట్త్రిదశాయగైశ్చసహస్రవర్షంనముపైతిజాతః ॥

సింహలగ్నమై గురుయుక్తమై, శుక్రుడు కర్కాటకమున, బుధుడు ద్వితీయమున, పాపగ్రహములు 3,6,10,11 లందున్న జాతకుడు వేయేండ్లు బ్రతుకును.

50. దినేశభౌమౌహిబుకేవిలగ్నేమందాన్వితేఖోగిపతౌవ్యయస్థే ।
శేషైర్గ్రహైశ్చార్థగృహంప్రపన్నైస్సహస్రవర్షద్వయమత్రజాతః ॥

రవికుజులు చతుర్థమందుండి, లగ్నము శనియుక్తమై, వ్యయమున రాహు వుండి, తక్కిన గ్రహములు ద్వితీయగతులైన జాతకుడు రెండువేల యేండ్లు జీవించును.

51. అజేవిలగ్నేసరవౌసుభేతుమానేగురౌభూమిసుతేకళత్రే ।
రిప్పేశశాంకేపరిపూర్ణయుక్తేరసాయనాద్యైదిన్సహస్రజీవీ ॥

మేషము లగ్నమై రవియుక్తమైన, శుభగ్రహయుక్తమై, గురుడు దశమమున, కుజుడు సప్తమమున, వ్యయమున పూర్ణచంద్రుడు ఉన్న జాతకుడు రసాయనాదులచే రెండువేల ఏండ్లు జీవించును.

52. వృషేశశాంకేతనుగేవిశేషాత్సమన్వితేచంద్రజజీవశుక్రైః ।
జాతస్తుదేవేంద్రపదంప్రయాతిశేషైర్గ్రహైరర్థసమన్వితైర్వా॥
వృషభము లగ్నమై చంద్రుడుండి, బుధ, గురు, శుక్రులతో కూడియున్నను, లేదా తక్కిన గ్రహములు ద్వితీయమందున్నను జాతకుడు ఇంద్రపదము స్వర్గము, చేరును.

53. జీవేవిలగ్నేస్వగృహంప్రపన్నే కూన్యేన్యయుగ్మేభృగుజేచకేంద్రే ।
రసాయనాద్యైర్బహువర్షజీవీజాతస్తుదేవేంద్రపదంప్రయాతి ॥
గురుక్షేత్రము లగ్నమై అందు గురుడుండి, మిధునము గ్రహవర్జితమై, శుక్రుడు కేంద్రమందున్న జాతకుడు రసాయనాది సేవచే చిరకాలము జీవించి, ఇంద్రపదము నందును.

54. ఏకర్షగైఃవ్యోమచరైస్సమస్తైస్త్రికోణగైః కేంద్రచతుష్టయస్థైః ।
జాతశ్శిశుర్నశ్యతిజాతమాత్రోజీవేద్యుగాన్తంయదిమంత్రసిద్ధ్యా ॥
శుభపాపగ్రహములన్నియు ఒకే రాశియందుండి, అది కేంద్రకోణములైన జాతకుడు పుట్టగానే చనిపోవును. ప్రతికెనా మంత్రసిద్ధుడై చిరకాలము జీవించును.

55. త్రికోణేపాపనిర్ముక్తేకేంద్రేశుభవివర్జితే ।
నిధనేపాపరహితేజాతస్త్వమరసన్నిభః ॥
కోణములందు (5,9) పాపులులేక, కేంద్రమున శుభగ్రహములే అష్టమము పాపరహితమైన జాతకుడు దేవసముడగును.

56. లగ్నేవృషేశుక్రయుతేగురౌతుకేంద్రాన్వితేష ట్త్రిదశాయసంస్థైః ।
రసానాద్యైరిహమంత్రసిద్ధ్యాజాతస్తుదేవేంద్రపదంప్రయాతి ॥
వృషభము లగ్నమై శుక్రుడుండి, గురుడు కేంద్రగతుడై, తక్కిన గ్రహములు 3,6,10,11 లందున్న జాతకుడు రసాయనాదులచేతను మంత్రసిద్ధిచేతను దేవేంద్రపదవి నందును.

57. శనౌతులాయాంమకరేంద్రపూజ్యేలగ్నేకుళీరేవృషభేశశాంకే ।
జాతస్సుధీబ్రహ్మపదంప్రయాతిరసాయనాద్యైరిహమంత్రసిద్ధ్యా ॥
లగ్నము కటకమై, శని తులయందు, గురుడు మకరమున, చంద్రుడు వృషభమున ఉండిన జాతకుడు రసాయనాది సేవచేతను, మంత్రసిద్ధిచేతను బ్రహ్మపదమునందును.

58. వర్గోత్తమేలగ్నగతేకుళీరేకేంద్రేగురౌభూమిసుతేకళత్రే ।
సింహాసనాంశేభృగుజేసివిశేషాద్రసాయనాద్యైరమితాయురేతి ॥
కర్కాటక వర్గోత్తమాంశలగ్నమై గురుడు కేంద్రమున ఉండి, కుజుడు సప్త

మమున, శుక్రుడు సింహాసనాంశ యందుండిన జాతకుడు రసాయనాదులచే అమి తాయువు నందును.

59. కన్యాంతలగ్నేనబుధేకళత్రేజీవేయదాగోపురభాగయుక్తే ।
మృద్వంశకేవాదిసనాథపుత్రేజాతస్త్వసంఖ్యాయురుపైతిసూనుః ॥

కన్యాంత్యము లగ్నమై అందు బుధుడుండి, గురుడు సప్తమమున గోపు రాంశ యందుండి, శని మృద్వంశ యందుండిన జాతకుడు లెక్కలేనన్నేళ్లు బ్రతుకును.

60. దేవలోకాంశగేశుక్రేకేంద్రస్థేధరణీసుతే ।
సింహాసనాంశేజీవేచజాతస్త్వమరసన్నిభః ॥

శుక్రుడు దేవలోకాంశ యందుండి, కుజుడు కేంద్రవర్తియై, గురుడు సింహాస నాంశయందున్న జాతకుడు దేవసముడగును.

61. ఉత్తమాంశేభృగౌకేంద్రేశనౌపారావతాంశకే ।
స్వర్గలోకేగురౌకేంద్రేత్వౌషధాద్యైరసంఖ్యకః ॥

శుక్రుడుత్తమాంశగతుడై కేంద్రమున ఉండి, శని పారావతాంశమున, గురుడు స్వర్గలోకాంశమందుండి కేంద్రమందున్న జాతకుడు ఔషధాదులచే అసంఖ్యాక వర్షములు జీవించును.

62. గోపురాంశేగురౌకేంద్రేశుక్రేపారావతాంశకే ॥
త్రికోణేకర్కిలగ్నేతుయుగాంతంసతుజీవతి ॥

గురుడు కేంద్రమందుండి, గోపురాంశగతుడై, శుక్రుడు పంచమ, నవమము లందు పారావతాంశ యందుండి, కర్కాటకలగ్న జాతుడు యుగాంతకాలము జీవిం చును.

63. చాపాంశేకర్కిలగ్నేచతస్మిన్దేవేంద్రపూజితే ।
త్రిచతుర్భిర్గ్రహైఃకేంద్రేజాతోబ్రహ్మపదంలభేత్ ॥

లగ్నము కర్కాటకమై ధనుర్నవాంశతో జననమై, అక్కడ గురుడుండగా, మూడునాల్గు గ్రహాలు కేంద్రములందున్న జాతకుడు బ్రహ్మపదమందును.

64. తృతీయైకాదశేశుక్రేగోపురాద్యంశకాన్వితే ।
వృషేవర్గోత్తమేలగ్నేబ్రహ్మణఃపరమంపదం ।

వృషభలగ్న వర్గోత్తమ నవాంశజన్మమై తృతీయైకాదశముల శుక్రుడుండి, గోపురాంశగతుడయిన జాతకుడు బ్రహ్మపదము నందును.

65. లగ్నేశుక్రేగురౌకామేకన్యాయామ్బుధనాయకే ।
చాపేమేషాంశకేలగ్నేజాతోయాతిపరంపదం ॥

ధనుస్సులో మేష నవాంశ జన్మమై లగ్నమున శుక్రుడు, సప్తమమున గురుడు, చంద్రుడు కన్యలోను ఉన్న జాతకుడు పరమపదము నందును.

66. పంచమేబుధనంయుక్తేగోపురాద్యంశకాన్వితే ।
గురౌఘటేవిలగ్నేస్మిఞ్జాతోబ్రహ్మపదంలభేత్ ॥

కుంభరాశి లగ్నమై గురుయుక్తమై, పంచమము బుధయుక్తమైన గోపురాంశ యందున్న జాతకుడు బ్రహ్మపదము నందును.

67. కేంద్రేగురౌలాభగతేర్కపుత్రేధనేరవౌచంద్రయుతేకళత్రే ।
భాగ్యేధరానూనుగతేప్రజాతోయుగాంతకాలంనముపైతిమంత్రైః ॥

కేంద్రమున గురుడు, లాభమున శని, ద్వితీయమున రవి, సప్తమమున చంద్రుడు, నవమమున కుజుడు ఉన్న జాతకుడు మంత్రములచే యుగాంతకాలము వరకు జీవించును.

68. త్రికోణగౌజీవబుధౌవిశేషాల్లగ్నేవృషేతత్రయుతేధరాజే ।
నిశాకరేగోపురభాగయుక్తేజాతస్సహస్రద్వయవర్షమేతి ॥

గురుబుధులు కోణగతులై, వృషభము లగ్నమై, అందు కుజుడుండి, చంద్రుడు గోపురాంశ గతుడయిన జాతకుడు రెండువేల యేళ్ళు జీవించును.

69. పక్షేసితేజన్మయదాహ్నికాలేకేంద్రేగురౌవాశశిభేవిలగ్నే ।
దారేకుజేభానుసుతేసుఖస్థేజాతస్తుజీవేదయుతంహివర్షం ॥

శుక్లపక్షమున పగలు జన్మమై, గురుడు కేంద్రమందున్నా, శుక్లపక్ష పగటి కాలమున కర్కాటకము లగ్నమై, సప్తమమున కుజుడు, చతుర్థమున శనియున్నా, రెండువేలేళ్ళు జీవించును.

70. జీవమందారశుక్రాణామన్యోన్యం కేంద్రసంభవే ।
త్రికోణేవాయదాజాతోజీవేదయుతవత్సరం ॥

గురుశనికుజశుక్రుల కన్యోన్య కేంద్రస్థితి కలిగినా, కోణస్థితియున్నా జాతకుడు 10 వేల ఏళ్ళు జీవించును. గురునకు శనికుజశుక్రులు కేంద్రమందున్న - వారికి అన్యోన్య కేంద్రత్వమునూ, గురునకు శనికుజశుక్రులు కోణమందున్న అన్యోన్య కోణత్వమును సంభవించును.

71. శుభైర్యుక్తేచతుష్కేంద్రేపాపైష్షట్త్రిధనాన్వితైః ।
సింహలగ్నేయదాజాతోజీవేత్షడయుతానినః ॥

సింహలగ్నమై నాలుగు కేంద్రములందును శుభగ్రహములుండి, పాపులు 3,2,6 లందున్న జాతకుడు 60 వేల యేళ్ళు బ్రతుకును.

72. కర్కాద్యాదిషు సైర్గ్రహైస్సర్వైర్గురుచంద్రాదిభిర్యదా।
కన్యంతైఃపరమోచ్చస్థైర్మునితుల్యోభవేన్నరః ॥

కర్కాటకాది రాశులందు గురుచంద్రాదులుండి, అందరుగ్రహములు పర మోచ్చ భాగమందున్న జాతకుడు మునితుల్యుడగును.

73. కన్యాదిభౌమపర్యంతంలగ్నాదిఖచరాస్థ్సితాః ।
వైశేషికాంశసంయుక్తాఃజాతస్త్వమరసన్నిభః ॥

శని మొదలు కుజుని వరకు గ్రహములు లగ్నాదిక్రమమున ఉండి, వారు వైశేషికాంశగతులైన జాతకుడు దేవసముడగును.

74. ఆకల్పంజీవతినరోమృగేలగ్నేకుజాదితః ।
రవ్యంతాఃఖేచరాస్సర్వే సేందౌజీవేహ్నిజన్మని ॥

మకరలగ్నమై అదిమొదలు కుజాదిరవిపర్యంత గ్రహములుండి, చంద్రుడు గురునితో కూడి, పగలు జన్మమైన జాతకుడు ఆకల్పాంతము జీవించును.

75. మేషాంత్యలగ్నేసగురౌశృగౌవానిశాకరేగోధనురర్ధయాతే ।
సింహాసనాంశేయదివాధరాజేజాతస్త్వసంఖ్యాబ్దముపైతిమంత్రైః ॥

మేషాంత్యము లగ్నమై, అక్కడ గురుడుగాని శుక్రుడుగాని ఉండి, చంద్రుడు వృషభమునగాని, ధనుఃపూర్వార్ధమునగాని ఉండి, కుజుడు సింహాసనాంశగతుడుకాగా జాతకుడు మంత్రశక్తిచే లెక్కలేనన్ని సంవత్సరములు జీవించును.

76. సింహేరవౌసోమసుతేనయక్తేచంద్రేవృషస్థేమిథునేచశుక్రే।
గురౌకుళీరేయదివావిలగ్నేశనౌతులాయామృషిసామ్యమేతి ॥

సింహమున రవిబుధులు, వృషభమున చంద్రుడు, మిధునమున శుక్రుడు, గురుడు కర్కాటకమునగాని, లగ్నమునగాని, శని తులయందు ఉన్న జాతకుడు ఋషిసామ్యము పొందును.

77. దేవలోకాంశకేమందేభౌమేపారావతాంశగే ।
సింహాసనేరవౌలగ్నేజాతోమునినమోభవేత్ ॥

శని దేవలోకాంశమున, కుజుడు పారావతాంశమున, రవిలగ్నమున సింహాసనాంశమున, ఉండెనేని జాతకుడు మునిసముడగును.

78. మేషలగ్నేరవౌమానేజీవేస్వోచ్చసమన్వితే ।
త్రిషడాయగతైఃపాపైర్జాతోమునినమోభవేత్ ॥

లగ్నము మేషమై, దశమమున రవి, గురుడు కర్కాటకమున, పాపగ్రహములు 3,6,11 లందున్న జాతకుడు మునిసముడగును.

79. ఇతిచింతామణౌప్రోక్తంసమ్యగాయుర్మనీషిభిః ।
యదుక్తంపూర్వికైస్సర్వంతత్తదేవమయాధునా ॥
ఇట్లు పూర్వులైన విద్వాంసులచే చెప్పబడిన దీర్ఘాయుర్యోగములు సర్వమును నాచే సర్వార్థ చింతామణిలో చెప్పబడినవి.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున దీర్ఘాయుర్యోగమను సప్తదశాధ్యాయము

# అష్టదశాధ్యాయము

1. దశానురోధేనఫలంవదంతిమునీశ్వరాజాతశుభాశుభంహియత్ ।
సారంసముత్కృష్యతదేవవచ్మిభేదంయథావిస్తరతోదశానాం ॥
మునీశ్వరులు జాతునికి దశానుసారముగా శుభాశుభఫలము చెప్పుదురు. కాన వారు చెప్పినదాని సారము గ్రహించి దశాభేదమును చెప్పుదును.

2. దీప్తస్స్వస్థస్తుముదితశ్శాంతోహీనస్తుదుఃఖితః ।
వికలశ్చఖలఃకోపినవధాఖేచరోభవేత్ ।
గ్రహము అవస్థానుసారమున తొమ్మిది విధములు- దీప్తుడు, స్వస్థుడు, ముదితుడు, శాంతుడు, హీనుడు, దుఃఖితుడు, వికలుడు, ఖలుడు, కోపి-అని.

3. ఉచ్చస్థఃఖేచరోదీప్తస్స్వస్వక్షేస్వస్థోధిమిత్రభే ।
ముదితోమిత్రభేశాంతోసమక్షేహీనఉచ్యతే ॥
ఉచ్చస్థానమందున్న గ్రహము దీప్తుడు; స్వక్షేత్రమందున్న స్వస్థుడు, అధిమిత్రక్షేత్ర మందున్న ముదితుడు, మిత్రక్షేత్రమందున్న శాంతుడు, సమక్షేత్రమున ఉన్న హీనుడు;

4. శత్రుభేదుఃఖనంయుక్తోవికలఃపాపసంయుతః ॥
ఖలఃపరాజితోజ్ఞేయఃకోపీస్యాదర్కసంయుతః ॥
శత్రుక్షేత్రమందున్న దుఃఖితుడు, పాపగ్రహయుక్తుడు వికలుడు, యుద్ధమున పరాజయమందినవాడు ఖలుడు; రవితోకూడిన-అస్తంగతుడు కోపి;

5. పృథక్పృథక్ఫలంతేషాందశాకాలేవిశేషతః ।
తత్తన్నామానురోధేనపరిపాకేవదంతిహి ॥

వారిపేర్ల ననుసరించి వేర్వేరుగా దశాకాలమున ఫలము నిత్తురు.

6. పాకే ప్రదీప్తస్య ధరాధిపత్యముత్సాహశౌర్యం ధనవాహనంచ ।
స్త్రీపుత్రలాభం సుఖబంధుపూజ్యం క్షితీశ్వరాన్మానము పైతిజాతః ॥

దీప్తదశయందు - భూమ్యాధిపత్యము, ఉత్సాహము, శౌర్యము, ధనము, వాహనము, స్త్రీ పుత్రలాభము, సుఖము, బంధుపూజ్యము, రాజ సన్మానము పొందును.

7. స్వస్థస్య ఖేటస్య దశావిపాకే స్వస్థాన్నృపాల్లబ్ధధనాదిసౌఖ్యం ।
విద్యాయశఃకీర్తిమహత్వతాంచ దారార్థభూపాత్మజధర్మమేతి ॥

స్వస్థదశయందు - రాజువలన ధనాది సౌఖ్యము, విద్య, కీర్తి, గౌరవము, భార్య, ధనము, రాజపుత్ర ధర్మమును పొందును.

8. ముదాన్వితస్యాపి దశావిపాకే వస్త్రాదిభూగంధసుతార్థధైర్యం ।
పురాణధర్మశ్రవణాదిగానం దానాదియానాంబరభూషణాప్తిం ॥

ముదితునిదశలో - వస్త్రాదులు, భూమి, గంధము, పుత్రులు, ధనము, ధైర్యము, పురాణ, ధర్మ శ్రవణము, సంగీతము, దానము, వాహనము, భూషణములు పొందును.

9. దశావిపాకే సుఖధైర్యమేతి శాంతస్య భూపుత్రకళత్రయానం ।
విద్యావినోదాన్వితధర్మశాస్త్రం బహ్వర్థదేశాధిపపూజ్యతాంచః ॥

శాంతుని దశలో - సుఖము, ధైర్యము, భూమి, పుత్రులు, భార్య, వాహనము, విద్య, వినోదము, ధర్మశాస్త్రము, రాజసన్మానము, ధనము పొందును.

10. స్థానచ్యుతిర్బంధువిరోధతా చ హీనస్య ఖేటస్య దశావిపాకే ॥
జీవత్యసౌ తుచ్ఛతహీనవృత్యా త్యక్తో జనైరోగనిపీడితస్స్యాత్ ॥

హీనుని దశలో - స్థానభ్రంశము, బంధువిరోధము, హీనవృత్తి జీవనము, వ్యాధిపీడ కలుగును.

11. దుఃఖాన్వితస్యాపి దశావిపాకే నానావిధం దుఃఖముపైతి నిత్యం ।
విదేశగో బంధుజనైర్విహీనో చోరాగ్నిభూపైర్భయమేతి తప్తః ॥

దుఃఖితుని దశలో-దుఃఖము, పరదేశమేగుట, బంధుహీనత, చోరాగ్ని రాజబాధ కలుగును.

12. వైకల్యఖేటస్య దశావిపాకే వైకల్యతాం యాతిమనోవికారం ।
పితాదికానాం మరణం విశేషాత్ స్త్రీపుత్రయానాంబరచోరపీడాం ॥

వికలుని దశలో-వైకల్యము, మనోవికారము, పితాది మరణము, భార్యా పుత్ర వాహనవస్త్రములకు చోరబాధ కలుగును.

13. దశావిపాకేకలహైర్వియోగంఖలస్యఖేటస్యపితుర్వియోగం ।
శత్రుర్ధనానాంధనభూమినాశముపైతినిత్యంస్వజనైశ్చనిందాం ॥
ఖలదశలో-కలహములచే భార్యాపుత్ర వియోగము, పితృవియోగము, శత్రువుల వలన ధనభూనాశనము, స్వజననింద కలుగుచుండును.

14. కోపాన్వితస్యాపిదశావిపాకేపాపంసమంయాతిబహుప్రకారైః ।
విద్యాయశస్త్రీధనభూమినాశంరాజాచవిత్తంహరతేత్రరోగీ ॥
కోపియైన గ్రహదశలో - పాపకర్మప్రాప్తి, విద్య, కీర్తి, స్త్రీ, ధన, భూనాశములు, రాజు ధనమును హరించుట, రోగము వచ్చుట జరుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున దశాభేదమను
అష్టాదశాధ్యాయము



# ఏకోనవింశాధ్యాయము

1. భానోర్దశాయాంపరమోచ్చగస్యభూమ్యర్థదారాత్మజకీర్తిశౌర్యం ।
సమ్మానసంభూమిపతేస్సకాశాదుపైతిసంచారవినోదగోష్ఠిం ।
పరమోచ్చగతుడైన రవిదశలో భూమి, ధనము, భార్యాపుత్రాభివృద్ధి, కీర్తి, శౌర్యము, రాజసన్మానము, సంచారవినోద గోష్ఠి కలుగును.

2. ఉచ్చాన్వితస్యాపిరవేర్దశాయాంగోపుష్టిధాన్యార్థపరిశ్రమంచ ।
సంచారయుక్స్వంధుజనైర్విరోధందేశాద్విదేశంచరతిప్రకోపాత్ ॥
ఉచ్చరాశిస్థుడైన రవిదశలో గోవృద్ధి, ధాన్యధన పరిశ్రమము, సంచారము చేయుట, బంధు విరోధము, కోపమువచ్చి దేశమునుండి విదేశమునకు పోవును.

3. ప్రచండవేశ్యాగమనంక్షితీశాదుపైతివిత్తంరతికేళిగానం ।
మృదంగభేరీరవయుక్తయానమన్యోన్యవైరంలభతేమనుష్యః ॥
ఇంకను, ప్రచండమైన వేశ్యాగమనము, రాజువలన ధనప్రాప్తి, రతికేళి, గాన సుఖములు, మృదంగ భేర్యాదివాద్య ఘోషతోకూడిన వాహనసౌఖ్యము, అన్యోన్య వైరము కలుగును.

4. ఆరోహిణీవానరనాయకస్యదశామహత్వంకురుతేతుసౌఖ్యం ।
పరోపకారంసుతదారభూమింగోవాజిమాతంగకృషిక్రియాది ॥

రవి ఆరోహదశలో - గౌరవము, సౌఖ్యము, పరోపకారము, భార్యాపుత్ర సుఖము, భూమి, గోవులు, అశ్వములు, గజములు (ఇప్పుడివి అక్కరలేదు. ఈ స్థానే స్కూటర్లు, మోటార్లు అని చెప్పవలెను) వ్యవసాయము - పీడలో ఫలలాభ సౌఖ్యములు పొందుసు.

5. దశావరోహాదిననాయకస్యకృషిక్రియావిత్తగృహేష్టనాశం ।
చోరాగ్నిపీడాంకలహంవిరోధంనరేశకోపంకురుతేవిదేశం ॥

సూర్యుని అవరోహదశ - కృషి, ధన, గృహాది నాశమును, చోరాగ్నిపీడ, కలహము, విరోధము, రాజకోపము, విదేశగమనము, కలుగజేయును. ఆరోహదశ అనగా నీచనుండి ఉచ్చరాశికి వెళ్ళే రవిదశ, అవరోహదశ అనగా ఉచ్చనుండి నీచకు వెళ్ళే రవిదశ.

6. నీచస్థితస్యాపిరవేర్విపాకేమానార్థహానింక్షితిపాలకోపాత్ ।
స్వబంధునాశంసుతదారమిత్రపిత్రాదికానామపకీర్తిమేతి ॥

నీచస్థుడైన రవిదశలో రాజకోపము వలన ధనకీర్తులకు హాని, బంధునాశము, భార్యాపుత్రపితృమిత్రాదులకు కష్టములు, అపకీర్తి కలుగును.

7. అత్యంతనీచాన్వితసూర్యదాయేవిపత్తిమాప్నోతిగృహచ్యుతించ ।
విదేశయానంమరణంగురూణాంస్త్రీపుత్రగోభూమికృషేర్వినాశం ॥

పరమ నీచయందున్న రవిదశలో - ఆపత్తు, గృహనాశము, విదేశగమనము, పితృమాతృ మరణము, భార్యాపుత్రులకు కష్టములు, గోభూ కృషిఫలనాశము కలుగును.

8. మూలత్రికోణస్థరవేర్విపాకేక్షేత్రార్థదారాత్మజబంధుసౌఖ్యం ।
రాజాశ్రయంగోధనమిత్రలాభంస్వస్థానయానాదికమేతిరాజ్యం ॥

మూలత్రికోణమునఉన్న రవిదశలో - భార్యాపుత్రులు, భూమి, ధనము, బంధువులు-వీనివలన సౌఖ్యము రాజాశ్రయము, మిత్రలాభము వాహనాది సౌఖ్యము కలుగును.

9. స్వక్షేత్రగస్యాపిరవేర్దశాయాంస్వబంధుసౌఖ్యంకృషివిత్తకీర్తిం ।
విద్యాయశఃప్రార్థితరాజపూజ్యంసుభూమిలాభంసముపైతివిద్వాం ॥

స్వక్షేత్రమున ఉన్న రవిదశలో - బంధు సాఖ్యము, కృషి, ధన, కీర్తులు, విద్యాకీర్తిద్వారా రాజపూజ్యత, భూవిద్యా లాభములను పొందును.

10. దశావిపాకేత్వతిశత్రుగస్యరవేః ప్రణష్టారకశత్రపుత్రః ।
గోమిత్రపిత్రాదిశరీరకష్టంశత్రుత్వమాయాతిజనైస్స్వనంపైః ॥

అది శత్రుక్షేత్రవర్తియైన రవి దశలో-భార్యాధనపుత్ర కష్టము, గోవులు, మిత్రులకు కష్టము, దేహశ్రమ, స్వజన విరోధము కలుగును.

11. సపత్నరాశిస్థితసూర్యదాయేదుఃఖంపరిభ్రష్టసుతార్థదారః ।
నృపాగ్నిచోరైర్విపదంవివాదంపత్నీవిరోధంత్వథవాంత్యమేతి ॥
శత్రుస్థానస్థుడైన రవిదశలో–దుఃఖము, భార్యాపుత్రులకు కష్టము, ధన నష్టము, రాజ, అగ్ని చోరపీడ, ఆపద, వివాదము, పత్నీ విరోధము కలుగును.

12. స్వమిత్రరాశిస్థితసూర్యదాయేస్వభృత్యమిత్రాత్మజరాజపూజ్యం ।
స్వగేహవాసంస్వజనైశ్చసఖ్యంయానాదిభూషాంబరతామ్రలాభం ॥
మిత్రరాశిలోనున్న రవిదశలో – భృత్యులు, మిత్రులు, పుత్రులవద్ద గౌరవము, రాజపూజ్యత, స్వగృహ నివాసము, స్వజనమైత్రి, వాహన, భూషణ, వస్త్ర, తామ్రప్రాప్తి లాభములు కలుగును.

13. అత్యంతమిత్రర్గగతస్యభానోర్దశావిపాకేత్వతిసౌఖ్యమేతి ।
స్త్రీపుత్రదానార్థమనోవిలాసంతథాచయానాంబరభూషణాని ॥
అధిమిత్ర క్షేత్రమందున్న రవిదశలో- అతిసౌఖ్యము, భార్యాపుత్ర సుఖము, ధ్యాన, ధన, వాహనాది వస్త్ర భూషణలాభము, మనోవిలాసము కలుగును.

14. సమగ్రహస్యాపిరవేర్దశాయాంసమంజనేషుకృషిభూమిధాన్యం ।
గోవాజియానాంబరదేహసౌఖ్యంస్త్రీపుత్రతోషంఋణపీడితస్స్యాత్ ॥
సముడైన గ్రహముయొక్క క్షేత్రమందున్న రవిదశలో – జనులతో సమముగా ఉండుట, కృషి, భూ, ధాన్య లాభములు, గో, అశ్వ, వాహన, వస్త్రాది లాభము, దేహసౌఖ్యము, భార్యాపుత్ర సంతోషము కలుగును, గాని ఋణబాధ యుండును.

15. నీచాన్వితస్యాపిరవేర్దశాయాంనీచానువృత్త్యాకునఖీకుశీలః ।
స్త్రీపుత్రధాన్యార్థకృషిక్రియాదిమనోవికారంసముపైతిహేయః ॥
నీచగతుడయిన గ్రహముతో కూడియున్న రవిదశలో-నీచకార్యములు చేయువానితో మైత్రి, పుప్పిగోళ్ళు, దుష్టశీలము, భార్యాపుత్రాదులవలన, ధాన్య, ధన, కృషి క్రియాదులవలన, మనోవికారము హేయముగా (అసహ్యముగా) ఉండుట జరుగును.

16. ఉచ్చాన్వితస్యాపిరవేర్దశాయాంమనోవిలాసంలభతేసువృత్త్యా ।
తీర్థాభిషేకంహరికీర్తనంచప్రాకారకూపాదిపురాణశాస్త్రం ॥
ఉచ్చగ్రహముతోకూడిన రవిదశలో – మనోవిలాసము, మంచివృత్తిచే జీవనము, తీర్థస్నానము, హరికీర్తనము, ప్రాకార కూపాది నిర్మాణము, పురాణశాస్త్రాది వినోదము కలుగును.

17. పాపాన్వితస్యద్యుమణేర్విపాకేనిత్యంమనఃక్లిశ్యతిహేయబుద్ధ్యా ।
శుభేజనంకుత్సితవస్త్రహీనంకుశీలవృత్త్యాత్వవనంకృత్వం ॥

పాపగ్రహముతోకూడిన రవిదశలో - నిత్యమును మనః క్లేశము, హేయబుద్ధి, అభక్ష్య భక్షణము, అశుభ్రవస్త్రములు, కులశీల వృత్తులలో హీనముగా ఉండుట, చిక్కుట జరుగును.

18. దినాధినాథస్యశుభాన్వితస్యపాకేధనంభూమిధనాదివస్త్రం ।
ఇష్టైర్విలాసంస్వజనైస్సమానంకల్యాణవాగ్జాలవినోదగోష్ఠిం ॥
శుభగ్రహయుక్తుడైన రవిదశలో-ధనము, భూమి, వస్త్రముల లాభము, ఇష్ట జనులతో విలాసము, స్వజనులతో సమానముగా నుండుట, కల్యాణ సౌఖ్యము, సరదాగా మాటలతో వినోదగోష్ఠి జరుగును.

19. పాపేక్షితస్యాపినహప్రభానోర్దశావిపాకేపరమంచదుఃఖం ।
పిత్రోర్వినాశంసుతదారకష్టంచోరాగ్నిభూపాలకృతంకృశత్వం ॥
పాపునిచే చూడబడిన రవిదశలో-పరమదుఃఖము, తల్లిదండ్రులకుబాధ, భార్యాపుత్రులకు కష్టము, చోరాగ్ని రాజబాధ, చిక్కుట జరుగును.

20. కరోతిభానుశ్శుభవీక్షితశ్చేద్విద్యాయశస్త్రీసుతవాగ్విలాసం ।
కాంతింప్రతాపంరతికేళిసౌఖ్యంపిత్రోస్సుఖంభూపతిమాననంచ ॥
శుభవీక్షితుడయిన రవి తన దశలో-విద్య, కీర్తి, భార్యాపుత్రులతో సల్లాపములు, కాంతి, ప్రతాపము, రతికేళి సుఖము, తల్లిదండ్రులకు సుఖము, రాజసన్మానము కలగజేయును.

21. కేంద్రాన్వితస్యాపిదివాకరస్యదశావిపాకేసుఖభంగదుఃఖం ।
స్థానచ్యుతింబంధువియోగమేతిభంగంకృషేశ్చిత్తపరిభ్రమంచ ॥
కేంద్రమందున్న రవిదశలో-సుఖము లేకపోవుట, దుఃఖము కలుగుట, స్థానభ్రంశము, బంధువియోగము, కృషిలో భంగము, చిత్తభ్రమ కలుగును.

22. త్రికోణసంయుక్తరవేర్విపాకేబుద్ధిభ్రమంరాజపరాభవంచ ।
సౌఖ్యాదిహీనంనిధనంపితుశ్చకర్మాదివైకల్యముపైతికాలే ॥
కోణమందున్న రవిదశాకాలమున-బుద్ధి భ్రమించుట, రాజావమానము, సౌఖ్యము లేకపోవుట, పితృమరణము, పుణ్యకర్మలకు వైకల్యము కలుగును.

23. ఉచ్చాంశగస్యచదశావిదధాతివృద్ధింనిత్యంప్రతాపజనితాంమహతీం శ్రియంచ ।
నానావినోదలలితంరతికేళిసౌఖ్యంస్త్రీవస్త్రలాభమనిశంపితృవర్గనాశం ॥
ఉచ్చాంశ గతుడయిన రవిదశ - అభివృద్ధి, ప్రతాపాతిశయము, సంపద, వినోదములు, రతికేళి సౌఖ్యము, స్త్రీ వస్త్ర లాభము పితృవర్గనాశము చేయును.

24. నీచాంశనందయుక్తరవేర్దశాయాంభార్యార్థభూపుత్రవినాశయానం ।
త్యక్తోజనైర్బంధువిరోధమేతిమనోవికారంజ్వరమేహరోగం ॥

నీచాంశగతుడయిన రవిదశలో-భార్యాపుత్రులకు కష్టము, భూధననాశము, ప్రయాణము, జనులచే విడువబడుట, బంధు విరోధము, మనోవికారము, జ్వరము, మేహరోగము కలుగును.

25. ఆదౌసూర్యదశాయాందుఃఖంపితృరోగకృత్భయంత్వాధిః ।
మధ్యేపశుధనహానిశ్చాంతేవిద్యామహత్త్వంచ ॥

రవిదశలో-ఆరంభమున-దుఃఖము, పితృవ్యాధి, చిక్కుట, మనోవ్యాధి కలుగును. మధ్యలో పశు ధనహాని కలుగును. చివరన విద్యచే గొప్పతనము కలుగును.

26. దశావిపాకేధనహానిమేతిషష్ఠస్థభానోరతిదుఃఖజాలం ।
గుల్మక్షయోద్భూతపవిత్రరోగంమూత్రాదికృచ్ఛ్రంత్వథవా
ప్రమేహం ॥

షష్ఠమందున్న రవి దశలో-ధనహాని, ఎక్కువ కష్టములు, గుల్మరోగము, మూత్ర కృచ్ఛ్రము, ప్రమేహము కలుగును.

27. రంధ్రస్థభానోరపివాదశాయాందేహస్యకష్టంత్వథవాదరిద్రం ।
చాతుర్థికంనేత్రవికారతాపంజ్వరాతిసారంస్వపదచ్యుతించ ॥

అష్టమస్థుడైన రవిదశలో-దేహకష్టము, దరిద్రము, చాతుర్థిక జ్వరము, నేత్ర రోగము, తాపము, జ్వరము, అతిసారము, స్థాన చలనము కలుగును.

28. భానోర్వ్యయదశరాశిగస్యచదశాక్లేశార్థహానింకృత ।
స్త్రీబంధ్వాత్మజభూమినాశమథవాపిత్రోర్వినాశంకలిం ॥
స్థానాత్స్థానపరిభ్రమంవిషకృతంరాజ్ఞాంభయంపాదరు ।
గ్విద్యావాదవినోదగోష్ఠికలహంగోవాజినాంపీడనం ॥

వ్యయస్థుడైన రవి దశ-దుఃఖము, ద్రవ్యహాని, భార్య, పుత్ర, బంధుహాని, తల్లిదండ్రులకు కష్టము, పాపము, ఒకచోటినుండి మరొకచోటికి మారుట, విష భయము, రాజభయము, కాళ్ళకు రోగము, విద్యావినోద గోష్ఠులవలన కలహము, పశుపీడ కలుగజేయును.

29. పుత్రోత్పత్తివిపత్తిమిత్రకురుతేభానోర్ధనస్థస్యవా ।
క్లేశంబంధువియోగదుఃఖకలహంవాగ్దూషణంక్రోధనం ।
స్త్రీనాశంధననాశనంనృపభయంభూపుత్రయోనాంబరం ।
నిత్యంనాశముపైతిత్రకుభయుగ్వాచ్యంనచైవంఫలం ॥

ద్వితీయమునఉన్న రవిదశలో-పుత్రోత్పత్తిద్వారా ఆపత్తు, దుఃఖము, బంధు వియోగము-కలహము, వాగ్దూషణము (తిట్లు) కోపము, స్త్రీనాశము, ధననాశము, రాజభయము, భూ, వాహన, వస్త్రనాశనము, కలుగును. రవి శుభగ్రహయుక్తుడైన-పైన చెప్పిన ఫలములు చెప్పరాదు. మంచి ఫలము జరుగును.

30. భానోర్విక్రమయు క్తస్యదశాధైర్యంమహత్సుఖం ।
నృపమాననమర్థాప్తింభ్రాతృద్వేషంవిప త్తథా ॥

తృతీయమందున్న రవిదశ - ధైర్యము, సుఖము, రాజ సన్మానము, ధన ప్రాప్తి, భాతృ ద్వేషము, ఆపదలను కలుగజేయును.

31. సుఖస్థితస్యాపిరవేర్దశాయాందేహార్థభూపుత్రకళత్రహానిం ।
క్షేత్రాదినాశంన్వపదచ్యుతించయానచ్యుతించోరవిషాగ్నిశస్త్రైః ॥

చతుర్థమందున్న రవిదశ - భార్యాపుత్రకష్టము, భూ, ధన, నాశము, దేహ కష్టము, క్షేత్రాది నాశము, స్థానచలనము, వాహన భంగము, చోర, విష, అగ్ని, శస్త్రబాధ కలుగజేయును.

32. దారాన్వితస్యాపిరవేర్దశాయాంకళత్రరోగంత్వథవామృతిస్స్యాత్ ।
కుభోజనంకుత్సితపాకజాతంక్షీరాజ్యదధ్యాదివిహీనమన్నం ॥

సప్తమమున రవి దశలో - కళత్రవ్యాధి, లేదా మృతి, కుత్సిత భోజనము, పక్వముకాని, పాలు, నెయ్యి, పెరుగు లేని భోజనము కలుగును.

33. మానస్థితస్యాపిరవేర్దశాయాంరాజ్యార్థలాభంము పైతిధైర్యం ।
ఉద్యోగసిద్ధింయశసానమేతంజయంవివాదేనృపమాననంచ ॥

దశమ మందున్న రవిదశలో-రాజువలన ధనలాభము, ధైర్యము, ఉద్యోగ సిద్ధి, కీర్తి, జయము, వివాదజయము, రాజ సన్మానము గలుగును.

34. ఆయస్థితస్యాపిదశావిపాకేభానోర్ధనాప్తింశుభకర్మలాభం ।
ఉద్యోగసిద్ధింసుతదారసౌఖ్యంయానాదిభూషాంబరదేహసౌఖ్యం ॥

ఏకాదశమందున్న రవిదశలో- ధనప్రాప్తి, శుభకర్మలాభము, ఉద్యోగప్రాప్తి, భార్యా పుత్రసౌఖ్యము, వాహన భూషణ వస్త్ర లాభము కలుగును.

35. సంజ్ఞాధ్యాయేయస్యయద్ద్రవ్యముక్తంకర్మాజీవేయస్యయచ్చోపదిష్టం ।
భావస్థానాలోకయోగోద్భవంచతత్సర్వంతస్యయోజ్యందశాసు ॥

సంజ్ఞాధ్యాయములో ఏగ్రహమున కే పదార్థము చెప్పబడినదో, ఏగ్రహమునకే జీవనము చెప్పబడినదో, భావఫలం, స్థానఫలం, దృష్టిఫలం, యోగఫలం కలిపి ఆలోచించి, ఆ గ్రహదశలో అవి చెప్పవలెను.

36. సూర్యేస్థానబలాధికేకృషిధనంగోభూమియానాంబరం ।
సౌఖ్యంరాజసుమాననంపరధనైస్స్వంయుజ్యతేకాంతిమాన్ ।
తత్పాకేశయనాంబరాదిలభతేసర్వోపకారంమహ ।
కీర్తిభూషణమిష్టబంధుసహితంతీర్థాభిషేకంమహత్ ॥

రవి స్థానబలము కలవాడయిన-అతనిదశలో-కృషిధనము, గోవులు, భూమి, వాహనము, వస్త్రములు, సౌఖ్యము, రాజసన్మానము, ఇతరుల ధనము కలియుట వంటివి కలుగును. ఇంకను, కాంతిమంతుడు, శయనాదిప్రాప్తి, జనోపకారము చేయుట, కీర్తి, నగలు, బంధు సమాగమము, పుణ్యతీర్థ స్నానము-ఈ ఫలములు కలుగును.

37. రవౌయదాస్థానబలేనహీనోతత్పాకకాలేబలమర్థనాశం ।
స్థానచ్యుతింబంధువిరోధతాంచదేశాద్విదేశంనముపైతిదుఃఖం ॥

స్థాన బలహీనుడయిన రవిదశలో-బలహీనత, ధననాశము, స్థానచలనము, బంధు విరోధము, విదేశగమనము, దుఃఖము కలుగును.

38. దిగ్వీర్యయుక్తేదివసేశ్వరేతుదిగంతరాక్రాంతధనానిసౌఖ్యం ।
తత్తద్దిశఃప్రాప్యయశోర్థభూమింనోచేత్తదాతాదృశమత్రనాస్తి ॥

దిగ్బలముకల రవిదశలో – ఇతర దిక్కులనుండి వచ్చిన ధనములు, సౌఖ్యము, కీర్తి, ధన, భూ లాభము పొందును. దిగ్బలము లేకున్న ఈ ఫలిత మేమియు జరుగదు.

39. తత్కాలమానాత్తసుతేబలిష్ఠేరవౌవిపాకేకృషిభూమివిత్తం ।
ఉద్యోగసిద్ధింనృపమాననంచహీనేరవౌకాలబలేననాశం ॥

కాలబలము కలిగిన రవిదశలో-భూమి, ధన, కృషిలాభము, ఉద్యోగసిద్ధి, రాజసన్మానము, కలుగును. కాల బలహీనుడయిన ఈ ఫలమేమియు జరుగదు.

40. నివర్గతస్సర్వముపైతికాలేరవౌతునైసర్గికవీర్యయుక్తే ।
ధనార్థభూషాంబరదేహసౌఖ్యంహీనేరవౌచోరనృపాగ్నిభీతిం ॥

రవి నైసర్గిక బలము కలిగియున్న, అతని దశలో-అన్ని కార్యములు అప్రయత్నముగా సిద్ధించును. ధన, భూషణ, వస్త్ర, దేహసౌఖ్యములు కలుగును. నైసర్గిక బలము లేకున్న చోర, రాజ, అగ్ని భయము కలుగును.

41. రవౌతుచేష్టాధికవీర్యయుక్తేస్వచేష్టితార్థాగమనేతిసౌఖ్యం ।
నృపసన్మానంసుతదారసౌఖ్యంకృష్యాదియానాంబరమత్రహీనే ॥

చేష్టాబలయుక్తుడైన రవిదశలో-తమపనికి తగిన ఫలము దక్కుట, అధిక

సౌఖ్యము, రాజసన్మానము, భార్యాపుత్ర సౌఖ్యము, కృషి వాహన, వస్త్ర లాభములు కలుగును. చేష్టా బలహీనుడయిన యీ ఫలము లేవియు కలుగవు.

42. రవౌ ఖగానాంబలదృష్టియుక్తే త్వచింత్యలాభంసకలంచసౌఖ్యం ।
తజ్ఞాయతేతత్పరిపాకకాలేతే నైవహీనేసకలంవినాశం ॥

గ్రహదృష్టి బలయుక్తుడైన రవిదశలో-అనుకోనిరీతిగా లాభము, సకల సౌఖ్యము కలుగును. దృష్టిబలము లేకున్న సర్వము లేకుండును.

43. క్రూరాదిషష్ఠ్యంశరవేర్దశాయాంస్థానచ్యుతింవానృపచోరభీతిం।
కోపాధికంతత్రశిరోరుజంచపిత్రాదినాశంత్వథవాతదీయం ॥

క్రూరాది షష్ట్యంశగతుడయిన రవిదశలో-స్థానచలనము, రాజచోరభీతి, అధిక కోపము, శిరోవ్యాధి, తండ్రికిరోగాని, తండ్రివైపువారికి కాని బాధ కలుగును.

44. పారావతాద్యంశయుతస్యభానోర్దశావిపాకేసుమతించకీర్తిం ।
బహ్వర్థదేశాధిపమాననాదిపుత్రాదిసన్మిత్రకళత్రలాభం ॥

పారావతాద్యంశయుతుడయిన రవిదశలో-మంచిబుద్ధి, కీర్తి, బహుధనప్రాప్తి, రాజ సన్మానము, పుత్ర, మిత్ర, కళత్రాది వృద్ధి కలుగును.

45. స్వోచ్చాదిజన్యంఫలమాహురాదౌపశ్చాత్ఫలంఖేచరదృష్టిజన్యం ।
మధ్యేఫలంస్థానఫలంతథైవపాపగ్రహాణామిహయోజనీయం ॥

గ్రహదశ మొదటి భాగమున ఉచ్చాది ఫలమున్ను, మధ్య భాగమున స్థానబల ఫలము, అంత్యభాగమున గ్రహదృష్టిఫలము కలుగును. పాపగ్రహ ఫలమునిట్లే తెలియునది.

46. భుజంగమత్ర్యంశయుతస్యభార్దశావిపాకేహిభయంవిషాద్వా ।
కూపాగ్నిపాతాద్యమనేకదుఃఖంపాశాదిదృత్త్రింశయుతస్యచైవం ॥

సర్ప ద్రేక్కాణముననున్న రవిదశ- సర్పభయమును, విష భయమును, నూతిలోపడుట మున్నగు దుఃఖములు కలిగించును. పాశాది ద్రేక్కాణమున నున్న ఇదే ఫలము కలుగును.

47. స్వోచ్చస్థోపిదినేశోనీచగతశ్చేత్కళత్రహానికరః ।
స్వతులజబంధువిరోధంపిత్రాదీనాంతథైవమునివాక్యం ॥

రవి ఉచ్చరాశియందున్నను, నీచనవాంశ (తులానవాంశ) యందున్నచో కళత్రహాని కల్గజేయును. బంధు విరోధమును, పుత్రాది విరోధమును కల్గజేయునని ముని వాక్యము.

48\. ఉచ్చాంశసహితోఖానుర్నీచస్థోపిమహత్సుఖం ।
కరోతిరాజ్యభారంచదశాంతేవిపదంకృశం ॥

నీచరాశియందున్నా ఉచ్చాంశయందున్నచో రవి - తన దశలో - అధిక సౌఖ్యము, రాజప్రాప్తి కలిగించి, దశాంత్యమున ఆపత్తును, కృశించుటను కలగ జేయును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున రవిదశాఫలమను
ఏకోనవింశాధ్యాయము



# వింశాధ్యాయము

1\. అత్యుచ్చగస్యాపినిశాకరస్యదశావిపాకేకుసుమాంబరంచ।
మహత్వతామేతికళత్రలాభంధనాయతింపుత్రమనోవిలాసం ॥

పరమోచ్చ రాశియందున్న చంద్రుని దశలో-కుసుమవస్త్ర లాభము, గౌరవము, కళత్రలాభము, పుత్రులకుత్సాహము కలుగును.

2\. ఉచ్చస్థితస్యాపినిశాకరస్యపాకేదశాయాంసుతదారవిత్తం ।
మృష్టాన్నపానాంబరభూషణాప్తింవిదేశయానంస్వజనైర్విరోధం॥

ఉచ్చస్థుడైన చంద్రదశలో-భార్యాపుత్రసంపద, క్షీరాన్న, వస్త్ర, భూషణ ప్రాప్తి, విదేశయానము, స్వజనవిరోధము కలుగును.

3\. ఆరోహిణీచంద్రదశాప్రపన్నాస్త్రీపుత్రవిత్తాంబరసౌఖ్యకాంతిం ।
కరోతిరాజ్యంసుఖభోజనంచదేవార్చనంభూసురతర్పణంచ ॥

చంద్రుని ఆరోహదశలో—భార్యాపుత్రులకు సుఖము, ధన, వస్త్రలాభము, సుఖము, రాజ్యము, సుఖభోజనము, దేవతార్చనము, బ్రాహ్మణ సంతర్పణము కలగ జేయును.

4\. నిశాకరస్యాప్యవరోహకాలేస్త్రీపుత్రవిత్తాంబరసౌఖ్యహానిం ।
మనోవికారంస్వజనైర్విరోధంచోరాగ్నిభూపైఃపతనంతటాకే ॥

అవరోహ చంద్రునిదశలో-భార్యాపుత్రులకు కష్టము, ధన, వస్త్ర, సౌఖ్యము లకుహాని, మనోవికారము. స్వజన విరోధము, చోరాగ్ని రాజభయము, చెరువులో పడుట జరుగును.

5. నీచాంశగస్యాపినిశాకరస్య ప్రాప్తౌదశాయావివిధార్థంహాని ।
కుభోజనంకుత్సితరాజసేవామనోవికారంసముపైతినిద్రాం ॥
నీచనవాంశ గతుడయిన చంద్రునిదశలో-అన్ని కార్యములు భంగపడుట, కుత్సిత భోజనము, కుత్సితుడైన రాజసేవ, మనోవికారము, నిద్రకలుగును.

6. మూలత్రికోణాన్వితచంద్రదాయేనృపాద్ధనంభూమిసుతార్థలాభం ।
ప్రాప్నోతిభూషాంబరయానలాభంసుఖంజనన్యారతికేళిలోలం ॥
మూలత్రికోణమందున్న చంద్రుని దశలో-రాజువలన ధనప్రాప్తి, భూమి, ధనము, పుత్రలాభము, భూషణ, వస్త్ర, వాహనలాభము, మాతృసౌఖ్యము, రతికేళి లోలులత, కలుగును.

7. స్వక్షేత్రగస్యాపినిశాకరస్యకృషేర్ధనప్రాప్తిముపైతిసౌఖ్యం ।
ప్రచండవేశ్యాగమనంక్షితీశాత్సంమాననంస్త్రీసుతబంధుసౌఖ్యం ॥
స్వక్షేత్రమందున్న చంద్రుని దశలో-కృషివలన ధనప్రాప్తి, ధనసౌఖ్యము, వేశ్యా స్త్రీ సౌఖ్యము, రాజసన్మానము, భార్యా పుత్ర బంధుసౌఖ్యము కలుగును.

8. నిశాకరస్యాప్యతిశత్రురాశిగతస్యదాయేకలహార్థనాశం ।
కువస్త్రతాంకుత్సితభోజనంచక్షేత్రార్థదారాత్మజతోయయానం॥
అధి శత్రుక్షేత్రమందున్న చంద్రుని దశలో-కలహమువలన ధనహాని, కువస్త్రము, కుత్సితభోజనము, భార్యాపుత్ర ధనములు, జలవాహన సుఖము కలుగును.

9. విత్తాంబరాలంకరణాదిహీనంవిదేశయానంపరిచారకత్వం ।
దేశాంతరేయాన్యతిబంధుహీనోదుఃఖైఃపరిక్లిశ్యతిశత్రుదాయే ॥
శత్రుక్షేత్రగతుడయిన చంద్రదశలో-ధననాశము, వస్త్ర, అలంకరణహీనత, విదేశసంచారము, పరిచారకవృత్తి, బంధుహీనత, దేశాంతరమున దుఃఖములనుభవించును.

10. మిత్రర్క్షగస్యాపినిశాకరస్యతార్థలాభంక్షితిపాలమైత్రీం ।
ఉద్యోగసిద్ధింజలవస్తులాభంచిత్రాంబరంభూషితవాగ్విలాసం ॥
మిత్రక్షేత్రగతుడయిన చంద్రునిదశలో - ధనలాభము, రాజస్నేహము, ఉద్యోగసిద్ధి, జలవస్తులాభము, విచిత్రాంబరములు, మంచి వాగ్విలాసము కలుగును.

11. సుధాకరస్యాప్యతిమిత్రరాశిగతస్యదాయేత్వతిసౌఖ్యమేతి ।
విద్యావినోదాంకితరాజపూజాక్షేత్రార్థదారాత్మజకామలాభం ॥
అధిమిత్రక్షేత్రగతుడైన చంద్రదశలో - సౌఖ్యము, విద్యావినోదములతో రాజసభలో పూజనందుట, భార్యాపుత్ర, క్షేత్రధనాదిసిద్ధి కలుగును.

12. దశావిపాకేనమరాశిగస్యకళానిధేఃకాంచనభూమిలాభం ।
కించిత్సుఖంబాంధవరోగపీడావిదేశయానంలభతేమనుష్యః ॥

సముదయిన గ్రహరాశిలోనున్న చంద్రదశలో - స్వర్ణభూలాభము, అల్ప సుఖము, బంధుజనరోగపీడ, అన్యదేశ సంచారము, కలుగును.

13. నీచంగతస్యచదశావిపదంమహార్తింక్లేశాదిదుఃఖవనవాసముపైతికాలే।
కారాగృహేనిగళపాశకృశాన్నహీనచోరాగ్నిభూపతిభయంసుత దారదోషం ॥

నీచస్థాన గతుడయిన చంద్రదశలో-విపత్తు, ఎక్కువబాధ, అరణ్యవాసము, కారాగృహవాసము, సంకెలలచే కట్టుబడుట, కృశించుట, దుఃఖము, అన్నములేక పోవుట, రాజ, చోర, అగ్ని బాధలు, భార్యా పుత్రబాధ కలుగును.

14. క్షీణేందుపాకేనకలంవిహీనంరాజ్యార్థభూపుత్రకళత్రమిత్రం ।
ఉన్మాదచిత్తంస్వజనైర్విరోధమృణిత్వమాయాతికుశీలవృత్త్యా ॥

క్షీణచంద్రదశలో-రాజ్య, ధన, భూమిహీనత, పుత్ర కళత్ర మిత్రావిబాధ, మతిచెడుట, స్వజననిరోధము, కుత్సితశీల వృత్తిచే ఋణబాధ కలుగును.

15. పూర్ణేందుపాకేపరిపూర్ణమేతివిద్యావినోదాంకితరాజపూజాం ।
స్త్రీపుత్రమిత్రార్థమనోవిలాసంవిశేషతశ్శోభనకర్మలాభం ॥

పూర్ణచంద్రదశలో-సకలఫల పరిపూర్ణత, విద్యావినోదములతో రాజ సన్మానము, భార్యాపుత్రమిత్రాది సుఖము, మనోవిలాసము, విశేషముగా శుభకర్మలు జరుగుట అగును.

16. తేనాపితుంగస్థవియచ్చరేణయుక్తస్యచంద్రస్యదశావిపాకే ।
మనఃప్రసాదంమదనాభిరామంస్త్రీపుత్రమిత్రాదివినోదగోష్ఠిం ॥

ఉచ్చస్థుడైన గ్రహముతోకూడిన చంద్రునిదశలో - మనోనైర్మల్యము, కామ కేళివిలాసము, స్త్రీ పుత్రమిత్రాదిసుఖము, వినోదగోష్ఠి జరుగును.

17. పాపాన్వితస్యాపినిశాకరస్యపాకేగ్నిచోరక్షితిపాలకోపైః ।
దుఃఖంసుతస్త్రీసుఖబంధుహీనంవిదేశయానంత్వశుభాదికర్మ ॥

పాపగ్రహయుక్తుడైన చంద్రునిదశలో-రాజ, చోర, అగ్నిబాధలు, భార్యా పుత్ర కష్టము, బంధుహీనత, పరదేశయానము, అశుభకర్మలు కలుగును.

18. చంద్రస్యసౌమ్యగ్రహసంయుతస్యప్రాప్తేదశాయాంశుభకర్మలాభం ।
గోభూహిరణ్యాంబరభూషణానితీర్థాభిషేకంపరదారసౌఖ్యం ॥

శుభగ్రహయుక్తుడయిన చంద్రదశలో-శుభకర్మలు, గోవులు, భూమి, హిరణ్యము, వస్త్రములు, నగలు లభించుట, తీర్థస్నానము, పరస్త్రీ గమనము కలుగును.

19. పాపేక్షితస్యాపినిశాకరస్యదశావిపాకేవిఫలంతుకర్మ ।
కోపాధికంకుత్సితభోజనంచమాతుర్వియోగంత్వథవాతదీయం ॥

పాపగ్రహముచే చూడబడిన చంద్రదశలో – కార్యములు సిద్ధింపకుండుట, అధిక కోపము, కుత్సిత భోజనము, మాతృ వియోగము, తల్లి సంబంధమైన వస్తువులయినా పోవును.

20. నిశాకరస్యాపిశుభేక్షితస్యపరోపకారంమహతీంచకీర్తిం ।
ఇష్టార్థబంధ్వాగమభూపమాన్యంజలక్రియావస్తుమనోవిలాసం ॥

శుభగ్రహదృష్టియున్న చంద్రుని దశలో - పరోపకారము, అధిక కీర్తి, ఇష్టార్థసిద్ధి, బంధు సమాగమము, రాజ సన్మానము, జలకార్యవస్తువులద్వారా మనోవిలాసము కలుగును.

21. మూలత్రికోణభేందోర్దశాంప్రపన్నోనరస్సుబహుకోశం ।
బహుపుత్రవాజివినీతోబంధువిరోధంప్రధానతాంయాతి ॥

మూలత్రికోణమున నున్న చంద్రుని దశలో-ఎక్కువ ధనము, బహుపుత్రులు, వైరాగ్యము, బంధు విరోధము, కలిగి ప్రధానుడగును.

22. సుఖస్థితస్యాపినిశాకరస్యమాతుర్వియోగంసుఖయానభూమిం ।
కృషేర్ధనాప్తింగృహకర్మలాభంకీర్తింస్వనామాంకితగద్యపద్యం ॥

చతుర్థమందున్న చంద్రునిదశలో- మాతృ వియోగము, సుఖము, వాహనము, భూమి, కృషి లాభము, గృహ, కార్యలాభములు, తనపేరుతోఉన్న గద్యపద్యములు కలుగును.

23. దారాన్వితస్యాపినిశాకరస్యపాకేకళత్రాప్తిముదాహరంతి ।
స్త్రీపుత్రసౌఖ్యంశయనాంబరంచప్రమేహమూత్రాదికృశం
మనోరుజం ॥

సప్తమమందున్న చంద్రదశలో - కళత్రసౌఖ్యము, భార్యా పుత్రసౌఖ్యములు, శయన, వస్త్రలాభము, మేహ, అతిమూత్రంవ్యాధులవలన చిక్కుట, మనోవ్యాధి కలుగును.

24. కర్మస్థితస్యాపిదశాప్రపన్నాచంద్రస్యకీర్తింలభతేసువిద్యాం ।
యజ్ఞాదికర్మాప్తిమనేకసౌఖ్యంభూపుత్రయానాంబరబంధుపూజ్యం ॥

దశమమందున్న చంద్రుని దశలో-కీర్తి, మంచి విద్య, యాగాది పుణ్యకర్మలు, వివిధ సౌఖ్యములు, భూ, పుత్ర, వాహనములు, బంధు సన్మానముకల్గును.

25. నీచాంశస్యాపిదశాదదాతిశోకంబృహత్తరంచేందోః ।
పాదాక్షిరోగపీడాంయుద్ధేషుపరాజయంమనోత్సాహం ॥
నీచనవాంశగతుడయిన చంద్రునిదశలో-దుఃఖము, పాదములకు, నేత్రములకు వ్యాధి, కలహమున అపజయము, మానసోత్సాహము కలుగును.

26. ఉచ్చాంశస్యాపిదశాదదాతిసౌఖ్యంమహత్తరంచేందోః ॥
నానావిధధనలాభంభూపతిసన్మానదేహపుష్టించ ॥
ఉచ్చనవాంశయందున్న చంద్రునిదశలో - ఎక్కువసౌఖ్యము, ధనలాభము, రాజసన్మానము, దేహపుష్టి కలుగును.

27. చంద్రదశాయామాదౌనరపతిసన్మానకీర్తిసౌఖ్యంచ ।
మధ్యేస్త్రీసుతనాశంధనసౌఖ్యంచాంబరంచాంత్యే ॥
చంద్రదశలో - మొదట రాజసన్మానము, కీర్తి సౌఖ్యములు కలుగును. మధ్యలో భార్యాపుత్రులకు కష్టము కలుగును. ప్రాంత్యమున ధనసౌఖ్యములు వస్త్రలాభము కలుగును.

28. షష్ఠస్థచంద్రస్యదశాప్రపన్నాకరోతిదుఃఖంకలహంవిరోధం ।
చోరాగ్నిభూపాలభయంజలేనమూత్రాదికృచ్ఛ్రంధనలాభమాహుః ॥
షష్టస్థ చంద్రునిదశలో-దుఃఖము, కలహము, విరోధము, రాజ, చోర, అగ్ని భయము, జలభయము, అతి మూత్రవ్యాధి, ధనలాభము కలుగును.

29. రంధ్రస్థితస్యాపిదశాప్రపన్నాదేహస్యకార్శ్యంజలభీతిదుఃఖం ।
విదేశయానంసకలైర్విరోధంకుభోజనంమాతృజనేషునాశం ॥
అష్టమస్థుడైన చంద్రుని దశలో-శరీరము చిక్కుట, జలభీతి, దుఃఖము, విదేశ గమనము, జనవిరోధము, కుత్సిత భోజనము, మాతృజనహానియు కలుగును.

30. రిప్ఫగచంద్రదశాయాఃప్రాప్తౌభూనాశనంకురుతే ।
రాజహృతంధనధాన్యంస్థానవినాశంమహత్తరందుఃఖం ॥
వ్యయమందున్న చంద్రునిదశలో-భూనాశము, ధనధాన్యములు రాజుచే నపహరించబడుట, స్థాన నాశనము, మహాదుఃఖము కలుగును.

31. చంద్రస్యవిత్తాన్వితపాకకాలేవిత్తాత్మజస్త్రీసుఖభోగభాగ్యం ।
మృష్టాన్నపానంరతికేళిసౌఖ్యంధనాగమంపుణ్యజలాభిషేకం ॥
ద్వితీయమందున్న చంద్రుని దశాకాలమున- భార్యాపుత్ర సౌఖ్యము, భోగ భాగ్యములు, క్షీరాన్నపానము, రతికేళిసౌఖ్యము, ధనలాభము, పుణ్యజలస్నానము కలుగును.

32. తృతీయభావస్థనిశాకరస్యదశామహత్సౌఖ్యమనేకవిత్తం ।
మనోదృఢం(భాతృజనాదిసౌఖ్యంకృష్యన్నపానాంబరభూషణాప్తిం॥
తృతీయమందున్న చంద్రదశలో-అధిక సౌఖ్యము, వివిధ ధనలాభము, మనో దార్ఢ్యము, భాతృ జనసౌఖ్యము, కృషి, అన్నము, క్షీరాన్నము, భూషణములు కలుగును.

33. లాభాన్వితస్యాపినిశాకరస్యప్రాప్తౌదశాయాంవివిధార్థలాభం ।
మృద్వన్నపానాంబరకేళిలోలంస్త్రీపుత్రలాభంతుమనోవిలాసం ॥
లాభమందున్న చంద్రునిదశలో-నానాపదార్థ లాభము, మంచి అన్నము, క్షీరపానము, మంచి వస్త్రములు, కేళీలోలత, భార్యాపుత్రలాభము, మనోవిలాసము కలుగును.

34. దినేశరశ్మ్యాహతచంద్రదాయేప్రాప్నోతిదుఃఖంస్వజనైర్విరోధం ।
భాగ్యక్షయంభూపవృహాగ్నిచోరైర్మాతుర్వియోగంకృషిధాన్య
నాశం ॥
రవితో కలిసిన-అస్తంగతుడైన-చంద్రదశలో-దుఃఖము, స్వజన విరోధము, భాగ్యనాశము, రాజాగ్నిభీతి, మాతృవియోగము, కృషిధాన్య నాశము కలుగును.

35. చంద్రేస్థానబలాధికేధనసుఖేకీర్తించవిద్యాగమం ।
దేవబ్రాహ్మణతర్పణంనృపజనాత్ప్రాప్నోతిభూవల్లభం ।
స్త్రీరత్నాంబరభూషణంకృషిధనంగోవిక్రయంసేవనం ।
మృష్టాన్నానిరసాయనంఫలయుతందధ్యాజ్యమాల్యాదికం ॥
చంద్రుడు స్థాన బలాధికుడైన-వానిదశలో-ధనసౌఖ్యములు, కీర్తి, విద్యా లాభము, దేవ బ్రాహ్మణ సంతర్పణము, రాజజనులవలన అధికారము, స్త్రీ రత్న వస్త్ర భూషణలాభము, కృషిధనములు, గోవిక్రయము, గోసేవ, క్షీరాన్నపానము, మధురరసపానము, పెరుగు, నెయ్యి, పుష్పమాలాదులు లభించును.

36. నిశాకరేస్థానబలైర్విహీనేస్థానార్థనాశంస్వపదచ్యుతించ ।
స్వబంధునాశంత్వథవావియోగంకృషేర్వినాశంసముపైతిశాలే ॥
చంద్రుడు స్థానబలములేకున్న, వానిదశలో-స్థాన ధననాశము, స్థానచలనము, బంధుజనహాని, బంధువియోగము, కృషినాశము జరుగును.

37. నిశాకరేదిగ్బలసంయుతేస్మిన్దిగంతరాదాగతవస్తుజాలం ।
విద్యాగమంభూపతిమిత్రతాంచస్వబంధుపూజ్యంగజవాజిభూమిం ॥
దిగ్బలయుక్తుడైన చంద్రునిదశలో-దేశాంతర వస్తులాభము, విద్యాప్రాప్తి, రాజమైత్రి, స్వబంధుపూజ్యత, గజ, అశ్వ, భూ లాభము కలుగును.

38. చంద్రేతదాకాలబలాన్వితేస్మిఁ తురంగయానంకృషిగోమహిళ్ళ ।
వాద్యాదిఘోషంనఖకేశదంతచర్మాంబరాలంకృతవాహనంచ ॥
కాలబలవంతుడైన చంద్రుని దశలో - అశ్వారోహణము, కృషి, గో, భూలాభము, వాద్యాది ఘోషణము, నఖ, కేశ, దంత, చర్మ, అంబరాలంకృతమైన వాహన లాభము కలుగును.

39. నిసర్గవీర్యాన్వితచంద్రదాయేనిసర్గతశ్చాపికరోతిభాగ్యం ।
అయత్నతోవాహనదేశలాభంనృపాలపూజ్యంబహువాహనంచ ॥
చంద్రుడు నైసర్గికబలము కలిగియున్న, అతని దశలో-అయత్నసిద్ధముగా భాగ్యము, వాహన, దేశ, లాభము, రాజపూజ్యత, బహు వాహనములు కలుగును.

40. చంద్రేయదాదృగ్బలవీర్యయుక్తేకృపాకటాక్షేణనరేశ్వరస్య ।
సమస్తభాగ్యంసముపైతినిత్యంపరోపకారంచమనోభిలాషం ॥
చంద్రుడు దృష్టిబలయుక్తుడైన, వానిదశలో-రాజకృపవలన సమస్త భాగ్యమును, నిత్యము పరోపకారమును, కోరిన కోర్కెలను పొందును.

41. క్రూరాదిషష్ఠ్యంశసమన్వితస్యదాయేశశాంకస్యమహత్వదుఃఖం ।
స్త్రీపుత్రనాశంక్షితిపాలకోపంవిద్యావివాదంకలహైర్జనైర్వా ॥
చంద్రుడు క్రూర షష్ఠ్యంశగతుడయిన, వానిదశలో-దుఃఖము, భార్యాపుత్ర కష్టము, రాజకోపము, విద్యావివాదమున జనులతో కలహమగును.

42. మృద్వంశషష్ఠ్యంశసమన్వితస్యచంద్రస్యదాయేబహుపుత్రలాభం ।
భృత్యార్థలాభంవిజయంసుఖంచకీర్తించవిద్యాంలభతేవిశేషాత్ ॥
చంద్రుడు మృద్వంశగతుడయిన-వానిదశలో-బహుపుత్రలాభము, భృత్య, ధనలాభము, విజయము, సుఖము, కీర్తి, విశేషించి విద్యయు లభించును.

43. పారావతాద్యంశసమన్వితస్యచంద్రస్యదాయేమహతీంచకీర్తిం ।
విద్యావినోదంలభతేచసౌఖ్యందేవార్చనంపుణ్యజలాభిషేకం ॥
చంద్రుడు పారావతాద్యంశగతుడయిన-దానిదశలో-అధికకీర్తి, విద్యావినోదములు, సౌఖ్యము, దేవార్చనము, పుణ్యతీర్థస్నానము కలుగును.

44. క్రూరద్రేక్కాణయుక్తస్తుచంద్రోదిశతిరోగతాం ।
శౌర్యంపాపసమాయుక్తంగోబ్రాహ్మణనిపీడనం ॥
క్రూరద్రేక్కాణయుతుడైన చంద్రుని దశలో-రోగము, పాపకర్మలుచేయు శౌర్యము, గోబ్రాహ్మణపీడ కలుగును.

45. ఆదౌఖావఫలంప్రోక్తంస్థానజన్యంతతఃపరం ।
అంశోద్భవఫలంపశ్చాద్గ్రహజాతఫలంతథా ॥

చంద్రదశ మొదటి ఖండమున స్థాన బలఫలము, ద్వితీయ ఖండమున, అంశ బల ఫలము, తృతీయ ఖండమున-గ్రహజన్య ఫలము కలుగును.

ఇది సర్వార్థచింతామణి ఆంధ్రతాత్పర్యమున, చంద్రదశాఫలమను వింశాధ్యాయము



# ఏకవింశాధ్యాయము

1. అత్యుచ్చభూనందనదాయకాలేక్షేత్రస్యలాభంనమరేజయంచ ।
అధిక్యమప్యేతినరేశమానంసహోదరస్త్రీసుతవాగ్విలాసం ॥

పరమోచ్చస్థితుడయిన కుజదశలో-భూలాభము, కలహము, జయము, గౌరవము, రాజసన్మానము, సోదర, భార్యా, పుత్ర వాగ్విలాసము ఉండును.

2. ఉచ్చంగతస్యాపిదశాధరణీసుతస్యప్రాప్నోతిరాజ్యమథవాక్షితిపాల మిత్రం ।
భూమ్యర్థదారసుతబంధుసమాగమంచయానాధిరోహణవిశేషవి దేశవాసం ॥

ఉచ్చస్థితుడయిన, కుజదశలో-రాజ్యము, రాజస్నేహము, భూమి, ధనము, భార్యా, పుత్ర, బంధు వినోదము, వాహన సౌఖ్యము, విదేశవాసము కలుగును.

3. ఆరోహిణీభూమిసుతస్యసౌఖ్యందశాతనోత్యత్రనరేశపూజ్యం ।
ప్రధానతాంధైర్యమనోభిలాషంభాగ్యోత్తరంగోగజవాజిసౌఖ్యం ॥

కుజుని ఆరోహ దశలో-రాజపూజ్యము, ప్రధానత, ధైర్యము, ఇష్టార్థసిద్ధి, ఉత్సాకాలమునకుండు భాగ్యము, గోవులు, ఏనుగులు, గుర్రాలు-వీటివలన సౌఖ్యము కలుగును.

4. ధరాసుతస్యాప్యవరోహకాలేస్థానార్థనాశంకలికోపదుఃఖం ।
విదేశవాసంస్వజనైర్విరోధంచోరాగ్నిభూపైర్భయమేతికష్టం ॥

కుజుని అవరోహణ దశలో-స్థానభ్రంశము, ధననాశము, పాపము, కోపము, దుఃఖము, పరదేశవాసము, స్వజన విరోధము, చోర, అగ్ని, రాజపీడ, కష్టములు కలుగును.

5. నీచస్థితస్యాపిధరాసుతస్యదాయేకువృత్త్యాన్వజనాదిరక్షాం ।
కుభోజనంగోగజవాజినాశంన్వబంధునాశంనృపవహ్నిచోరైః ॥
నీచస్థుడైన కుజుని దశలో - కుత్సిత వృత్తిచే కుటుంబపోషణ, కుత్సితాన్న భోజనము, పశునాశము, రాజాగ్ని చోర భీతికలుగును.

6. మూలత్రికోణాన్వితభౌమదాయేమృష్టాన్నపానాంబరభూషణాప్తిం ।
పురాణధర్మశ్రవణంమనోజ్ఞంభ్రాత్రాదిసౌఖ్యంకృషిలాభమేతి ॥
మూలత్రికోణమునఉన్న కుజునిదశలో-క్షీరాన్నపానము, వస్త్రభూషణప్రాప్తి, పురాణధర్మ శ్రవణము, సోదరసౌఖ్యము, కృషిలాభము కలుగును.

7. స్వక్షేత్రగస్యాపిధరాసుతస్యదశావిపాకేలభతేర్థభూమిం ।
స్థానాధిపత్యంసుఖవాహనంచనామద్వయంభ్రాతృసుఖంధనాప్తిం ॥
స్వక్షేత్రగతుడయిన కుజునిదశలో - ధనభూలాభము, స్థానాధిపత్యము, సుఖ వాహనము, రెండు పేర్లుండుట, సోదరసౌఖ్యము, ధనప్రాప్తి కలుగును.

8. ధరాసుతస్యాప్యతిశత్రురాశిగతస్యదాయేకలహాదిదుఃఖం ।
నరేశవంశస్యనైర్విరోధంభూమ్యర్థదారాత్మజమిత్రరోగం ॥
అధి శత్రుక్షేత్రమందున్న కుజుని దశాపాకమున-కలహము, దుఃఖము, రాజ జనులతో విరోధము, భూధనమిత్రనాశము, భార్యాపుత్ర కష్టము, రోగము కలుగును.

9. భూనందనస్యాప్యరిరాశిగస్యదశావిపాకేనమరేరిపీడాం ।
చోరాగ్నిభూపాలవిషైఃప్రమాదంవిణ్మూత్రకృచ్ఛ్రాదిగుదాక్షిరోగం ॥
శత్రుస్థానగతుడయిన కుజునిదశలో-కలహము, శత్రుపీడ, చోర, అగ్ని, రాజ, విషములబాధ, పురీష, మూత్ర కృచ్ఛ్రములవలన గుద, అక్షిరోగములు కలుగును.

10. మిత్రర్క్షగస్యాపికుజస్యదాయేమిత్రత్వమాయాతిసపత్నసంఘైః ।
చోరాగ్నిమాంద్యాతవివాదభూమింకృష్యాదినాశంకలికోపదుఃఖం ॥
మిత్రక్షేత్రగతుడయిన కుజునిదశలో-శత్రువులతో మైత్రి, చోర, అగ్ని భయము, అగ్ని మాంద్యము, జూదరులతో వివాదము, భూవివాదము, కృషినాశము, కోపము, దుఃఖము కలుగును.

11. కుజస్యదాయేత్వతిమిత్రరాశిగతస్యభూపాలకృతార్థభూమిం ।
వస్త్రాన్నయజ్ఞాదివివాహదీక్షాముపైతిదేశాంతరలబ్ధభాగ్యం ॥
అధిమిత్ర రాశిగతుడయిన కుజునిదశలో—రాజుచే ధనభూలాభములు, వస్త్రములు, అన్నము, యజ్ఞదీక్ష, వివాహము, దేశాంతరములనుండి వచ్చిన భాగ్యము కలుగును.

12. ధరాసుతస్యాపిసమర్ధగస్యగృహోపకార్యంత్వశనం ప్రమాదాత్ ।
స్త్రీపుత్రభృత్యాత్మసహోదరాణాంశత్రుత్వమాప్నోతినృపాగ్ని
పీడాం ॥

సమక్షేత్రమందున్న కుజదశలో-గృహోపకార్యములు, ప్రమాద భోజనము, భార్యాపుత్రులతోను, భృత్య, భ్రాతృజనముతోను విరోధము, రాజాగ్నిపీడ కల్గును.

13. నీచగ్రహేణాపిసమన్వితస్యధరాసుతస్యాపిమనోవికారం ।
ప్రేష్యత్వవృత్తింపరకీయమన్నంస్త్రీపుత్రనాశంనృపవహ్నిచోరైః ॥

నీచగ్రహముతో కూడిన కుజదశలో-మనోవికారము, పరిచారకవృత్తి, పరాన్నభక్షణము, భార్యాపుత్రకష్టము, రాజాగ్నిచోరుల వలన భయము కల్గును.

14. కించిత్సుఖంభోజనవస్త్రపానంకృచ్ఛ్రేణవృత్తింనృపపూజనంచ ।
ఉచ్చాన్వితేనాపిసమన్వితస్యభౌమస్యదాయేసుతదారపీడాం ॥

ఉచ్చగ్రహముతో కూడిన కుజునిదశలో-స్వల్ప సౌఖ్యము, భోజన వస్త్ర పానములు, కష్టముగా జీవించుట, రాజపూజ్యము, భార్యాపుత్రకష్టము కలుగును.

15. పాపాన్వితస్యాపికుజస్యదాయేపాపానికర్మాణికరోతినిత్యం ।
దేవద్విజానాంపశుదేవతానాంసహోదరాణాంచకుమార్గవృత్త్యా ॥

పాపగ్రహముతో కూడిన కుజదశలో-నిత్యము చెడుపనులుచేయుట, దేవ బ్రాహ్మణ పశు, దేవతలకు, సోదరులకును అపకారములు చేయుట జరుగును.

16. శుభాన్వితస్యాపికుజస్యదాయేకించిత్సుఖందేహకృశాంగరోగం ।
భూమేర్వివాదంసమరేజయంచవిద్యావివాదంపరదేశవాసం ॥

శుభగ్రహయుక్తుడైన కుజుని దశాకాలమున-కొద్దిసుఖము, శరీరము చిక్కుట, అవయవ వ్యాధులు, భూవివాదము, కలహమున విజయము, విద్యావివాదము, పరదేశ నివాసము, కలుగును.

17. శుభేక్షితధరాసూనోర్దాయేభూమ్యర్థనాశనం ।
తస్మిన్ గోచరసంయుక్తేత్వత్యంతంశుభదంభవేత్ ॥

శుభగ్రహదృష్టుడైన కుజునిదశలో-భూధననాశము, కుజుఉచ్చస్థ గ్రహముతో ఉన్న అత్యంత శుభఫలము కలుగును.

18. అరస్యపాపగ్రహవీక్షితస్యప్రాప్తేదశాయాంబహుదుఃఖకష్టం ॥
కళత్రమిత్రాదిజనైర్విముక్తోదేశాంతరస్థఃక్షితిపాలకోపాత్ ॥

పాపగ్రహదృష్టుడైన కుజునిదశలో-బహుకష్టములు, దుఃఖము, రాజకోపమున భార్యాపుత్రులను విడిచి, దేశాంతరమున ఉండి కష్టపడుట జరుగును.

19. కేంద్రగతభౌమదాయేచోరవిషాభ్యాముపైతిదుఃఖాని ।
కలహాయాసవిరోధంలభతేదేశాంతరంయాతి ॥

కేంద్రగతుడయిన, కుజుని దశలో-చోర విషభయము, కలహము, ఆయాసము, విరోధము, దేశాంతరవాసము కలుగును.

20. చతుర్థకేంద్రస్థితభౌమదాయేస్థానచ్యుతింబంధువిరోధతాంచ ।
చోరాగ్నిపీడాంనృపతేస్సకాశాత్ భీతింమహాదుర్గపథాప్రయాతి ॥

చతుర్థమందున్న కుజదశలో-స్థానచలనము, బంధు విరోధము, చోరాగ్ని పీడ, రాజభయము, మహారణ్యగమనము కలుగును.

21. కళత్రయుక్తస్యకుజస్యదాయేకళత్రహానింగుదమూత్రకృఛ్రం ।
అగోచరస్థస్యతదేవ్రకంఫలంతదన్యథాచేత్ఫలమన్యథైవ ॥

సప్తమస్థుడైన కుజదశలో-కళత్రహాని, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రవ్యాధి. అస్తంగతుడైయున్నను ఇదేఫలము, గోచరుడైన శుభఫలములు కలుగును.

22. కర్మస్థితస్యాపికుజస్యదాయేకర్మాదివైకల్యముపైతిదుఃఖం ।
ఉద్యోగభంగంత్వపకీర్తిమేతివిద్యాధవాస్త్రీసుతమానహానిః ॥

దశమస్థుడైన కుజునిదశలో-పుణ్యకర్మల వైకల్యము, దుఃఖము, ఉద్యోగ భంగము, అపకీర్తి, విద్యాహాని, భార్యాపుత్ర మానహాని జరుగును.

23. అర్కగభౌమదశాయాందదాతిశోకంస్త్రియావిరోధంచ ।
రాజ్యచ్యుతోరిపక్షిద్దేశాద్దేశాంతరంయి

అస్తంగతుడయిన కుజదశలో-శోకము, భార్యావిరోధము, రాజ్యభ్రంశము, శత్రుపీడవలన దేశాంతరమేగుట జరుగును.

24. విత్తగతభౌమదశాయాస్సంప్రాప్తిసస్యవృ
ద్ధ్వకులాఢ్యత్వంలభతేనృపహృతవిత్తంము.

ధనస్థానమునఉన్న కుజదశలో-సస్యవృద్ధి, తనకులములో ప్రధానుడగుట, రాజకోపమువలన ధననాశము, నేత్రరోగము, ముఖరోగము కలుగును.

25. భ్రాతృస్థానగతస్యసౌఖ్యఫలదాభూనందనస్యేతివాగ్ధైర్యంవిత్తసు
నార్థపారసహైస్సంగంనృపాత్పూజ్యతాం ।
పుత్రస్థానగతస్యపుత్రమరణంబుద్ధిభ్రమంజాడ్యతాంశత్రుక్షేత్రగత
స్యయాతివహైర్దుఃఖంమహారోగభాక్ ॥

తృతీయ స్థానమునఉన్న కుజదశలో-సౌఖ్యము, ధైర్యము, ధనము, సుఖము, భార్యాపుత్ర సుఖము, సోదరులతో కలయిక, రాజపూజ్యత, కలుగును. పంచమ

స్థానమునఉన్న కుజదశలో-పుత్రమరణము, మతిచెడుట, జాడ్యము (మందబుద్ధి) శత్రుక్షేత్రగతుడయిన-సోదరులవలన బాధ, దుఃఖము, రోగము కలుగును.

26. పంచమస్థధరాసూనోర్దాయేకీర్తింవివేకితాం ।
నేత్రరోగంత్వర్థనాశంవిద్యాంకలహమేవవా ॥

పంచమస్థుడయిన కుజదశాకాలమున-కీర్తి, వివేకము, నేత్రవ్యాధి, విద్యా కలహము కలుగును.

27. మరణపదేస్థోభౌమఃకరోతిదుఃఖంమహద్భయంపాకే ।
స్ఫోటకమన్నవిరోధంస్థానవినాశంవిదేశయానంచ ॥

అష్టమస్థుడయిన కుజునిదశలో-దుఃఖము,భయము, స్ఫోటక భయము, అన్నం మీద అహితము, స్థాన భ్రంశము, విదేశగమనము జరుగును.

28. నవమస్థధరాసూనోర్దశాకాలేపదచ్యుతిం ।
గురూణాంమరణంకష్టంతపోవిఘ్నంమహద్భయం ॥

నవమమునఉన్న కుజదశలో-స్థానచలనము, తల్లిదండ్రులకు మరణము, కష్టము, తపోవిఘ్నము, మహాభయము కలుగును.

29. కరోతిరాజ్యార్థభూవనన్మానం ।
ంవాగుపకారంమనోజయంకాంతి ॥

ఏకాదశమునఉన్న కుజదశలో-రాజ్యము, ధనము, రాజసన్మానము, యుద్ధ విజయము, ప్రతాపము, వాక్సహాయము, మనోజయము, కాంతి కలుగును.

30. దశాయాంసంప్రాప్తౌధనహానింనృపాద్భీతిం ।
నాశంభ్రాతృణాంవావిదేశవాసంచ ॥

వ్యయమందున్న కుజదశలో-ధననాశము, రాజభయము, స్థాననాశము, పుత్ర భార్యాకష్టము, సోదరులకుగాని, తనకుగాని విదేశవాసము కలుగును.

31. ఉచ్చాంశసంయుక్తధరాజకాలేమనోభిలాషంవిజయంసుఖంచ ।
ప్రచండదాసీగమనంన్నపస్యప్రయాతితాంయాతిసుగద్యపద్యం ।

ఉచ్చాంశలోఉన్న కుజదశలో-అభిలాషాసిద్ధి, విజయము, సుఖము, రాజదాసీ గమనము, గద్యపద్యాంకితము పుచ్చుకొనుట జరుగును.

32. నీచాంశభౌమదాయేనీచముపైత్యత్రవైకల్యం ॥
ధనహానిభూపతిదండాచ్ఛిన్నోదరపరాయణోశిలః ॥

నీచనవాంశయందున్న కుజునిదశలో-నీచత్వము, వైకల్యము, రాజదండన

వలన ధననాశము, శిశ్నోదర పరాయణత్వము (తినుట, పడుకుండుట మాత్రమేపనిగా) ఉండును.

33. భౌమదశాయామాదౌఖతేవివిధార్థహానించ ।
మధ్యేగ్ని భూపచోరై ర్భీతింతత్రైవనిర్దిశేన్మతిమాఞ్ ।
కుజదశలో మొదటి ఖండమున-నానావిధ కార్యహాని, మధ్యలో రాజాగ్ని చోర భయము కలుగును.

34. అంత్యేభ్రాతృవియోగంసుతధనదారాగ్నిగుల్మమూత్రాది ।
భౌమేవ్యపరంనభవేద్గోచరయుక్తేవిశేషతఃకథయేత్ ॥
దశాంత్యమున-సోదరవియోగము, భార్యాపుత్రకష్టము, గుల్మవ్యాధి, మూత్ర రోగము, కుజుడు అస్తంగతుడైనపుడు ముఖ్యముగా ఈ ఫలితములు కలుగును.

35. భౌమస్యనంస్థానబలాన్వితశ్యదశావిపాకేర్థకళత్రసౌఖ్యం ।
స్థానాదిలాభంసుఖకీర్తిసౌఖ్యముద్యోగదుఃఖంత్వయనాదుపైతి ॥
కుజుడు స్థానబలయుక్తుడయిన-వాని దశలో-కళత్ర సౌఖ్యము, ధనము, స్థాన లాభము, సుఖము, కీర్తి, ఉద్యోగ దుఃఖము కలుగును.

36. స్థానవీర్యవిహీనైస్తుకురుతేన్వపదచ్యుతిం ।
కుజఃకుశీలవృత్త్యాచజీవనంభవతిధ్రువం ॥
స్థాన బలహీనుడయిన కుజునిదశలో-స్థాన చలనము, కుత్సితవృత్తిచే జీవనము కలుగును.

37. దిగ్వీర్యయుక్తస్యకుజస్యదాయేనృపాత్ప్రలబ్ధార్థరణప్రతాపం ।
గోభూమికృష్యంబరయానలాభందిగంతరాక్రాంతయశఃప్రతాపం ॥
దిగ్బలమున్న కుజునిదశలో-రాజానుగ్రహమున పొందిన ధనము, యుద్ధ ప్రతాపము. గోభూ కృషిలాభము, వస్త్రవాహనములు, దిగంతవ్యాప్తమైనకీర్తి ప్రతాపములు కలుగును.

38. కాలవీర్యయుతభౌమదశాయాంకామ్యలబ్ధిమతిసౌఖ్యముపైతి ।
పట్టవస్త్రమణిమౌక్తికలాభంఛత్రవస్త్రకృషిగోగజలాభం ॥
కాలబలయుక్తుడైన కుజదశలో-ఇష్టపదార్థప్రాప్తి, సౌఖ్యము, పట్టువస్త్రములు, మణిమౌక్తికముల లాభము, ఛత్ర, గో, కృషిలాభములు కలుగును.

39. నిసర్గవీర్యాన్వితభౌమదాయేకృపాకటాక్షైఃమహీపతీనాం ।
సమస్తభాగ్యాత్మజమిత్రబంధుగోభూమిభూషాంబరదేహసౌఖ్యం ॥

నైసర్గిక బలయుతుడయిన కుజదశలో-రాజానుగ్రహమున భాగ్యము, పుత్ర మిత్రాది సౌఖ్యము, బంధు, గో, భూమి, భూషణాది సుఖము కలుగును.

**40. నిసర్గతస్థానధనాక్షినాశంవిత్తాదికంకుత్సితభోజనంచ ।**
**కురూపదారఃసుతభీపితృఘ్నఃసహోదరాణామపిదేహపీడాం ॥**

నైసర్గిక బలములేని కుజదశలో-ధన, నేత్రనాశము, స్థానచలనము, కుత్సిత భోజనము, భార్యకు కుత్సిత రూపము, పుత్రిగోష్ఠ, తండ్రిని హింసించుట, సోదరుల బాధించుట జరుగును.

**41. వక్రాన్వితస్యభౌమస్యదశాకాలేమహద్భయం ।**
**చోరాగ్నిసర్పపీడాచవనవాసమవద్యుతిః ॥**

వక్రియైన కుజునిదశలో-మహాభయము, చోర, అగ్ని సర్పపీడ, వనవాసము, కాంతి తగ్గుట జరుగును.

**42. దృగ్వీర్యయుక్తక్షితజస్యదాయేకృపాకటాక్షేణమహీపతీనాం ।**
**సమస్తభాగ్యాత్మజమిత్రబంధుగోభూమిభూషాంబరదేహసౌఖ్యం ॥**

దృగ్బలమున్న కుజదశలో-రాజకృపవలన భాగ్యము, పుత్ర, మిత్ర, బంధు సుఖము, గో, భూ, భూషణ వస్త్ర దేహసౌఖ్యములు కలుగును.

**43. క్రూరషష్ట్యంశసంయుక్తభౌమదాయేరిపీడనం ।**
**కారాగృహప్రవేశంచసమస్తవిభవక్షయం ॥**

క్రూరషష్ట్యంశయుక్తుడైన కుజునిదశలో-శత్రుపీడ, కారాగారవాసము, ఐశ్వర్య నాశము కలుగును.

**44. సౌమ్యషష్ట్యంశసంయుక్తభౌమదాయేశుభంవదేత్ ।**
**వివాహదీక్షాంయజ్ఞంచసర్వేషాముపకారకం ॥**

శుభషష్ట్యంశలోఉన్న కుజునిదశలో-శుభము జరుగును. యజ్ఞదీక్ష, వివాహ దీక్ష, పరోపకారమువంటి శుభములు జరుగును.

**45. పారావతాదిసంయుక్తభౌమదాయేమహచ్ఛుభం ।**
**భూమ్యర్థదారసంపత్తిధనవాహనభోజనం ॥**

పారావతాద్యంశయుక్తుడైన కుజునిదశలో-ఎక్కువశుభము, భార్యాపుత్రులకు సుఖము, భూమి, ధన, వాహన, భోజన సౌఖ్యములు కలుగును.

**46. క్రూరద్రేక్కాణసంయుక్తకుజదాయేమనోవ్యథా ।**
**నిగళంవిషభీతించపాశబంధనమేదవా ॥**

క్రూరగ్రహముల ద్రేక్కాణగతుడైన కుజదశలో-మనోదుఃఖము, బంధనము, విషభయము, పాశబంధనము కలుగును.

47. ఉచ్చస్థోపిధరానూనుర్నీచాంశకసమన్వితః ।
తత్పాకే[?]భ్రాతృమరణంనృపవహ్నివిషాద్భయం ॥
ఉచ్చస్థుడయినా నీచనవాంశలోఉన్న కుజుడు తనదశలో-భ్రాతృమరణము, రాజ, అగ్ని విషభయము కలుగజేయును.

48. భూమిపుత్రోపినీచస్థఃఉచ్చాంశకసమన్వితః ।
తత్పాకేభూమిదారార్థపుత్రమిత్రవివర్ధనం ॥
నీచరాశియందున్నను, ఉచ్చ నవాంశయందున్న కుజదశలో-భార్య, ధనము, భూమి, పుత్ర, మిత్రులకు వృద్ధికలుగును.

ఇది సర్వార్థచింతామణి ఆంధ్రతాత్పర్యమున కుజదశాఫలములను
ఏకవింశాధ్యాయము



# బు ధ ఫ లా ధ్యా య ము

1. అత్యుచ్చసోమాత్మజదాయకాలేధనాన్వితఃఖ్యాతిముపైతిసౌఖ్యం ।
జ్ఞానంచకీర్తింజననాయకత్వంస్త్రీపుత్రభూమ్యర్థమహోత్సవంచ ॥
పరమోచ్చగతుడయిన బుధదశలో-ధనవంతుడై, కీర్తి, సౌఖ్యము, జ్ఞానము, జననాయకత్వము, భార్యాపుత్ర ధన మహోత్సవములను పొందును.

2. ఉచ్చాన్వితస్యాపిశశాంకసూనోఃదశామహత్త్వంకురుతేర్థసౌఖ్యం ।
దేహస్యపుష్టింధనదారపుత్రగోవాజిమత్తేభమృదంగనాదం ॥
ఉచ్చస్థానస్థితుడయిన, బుధదశలో-గౌరవము, ధనము, సుఖము, దేహపుష్టి, భార్యాపుత్ర సౌఖ్యము, గవాశ్వగజములు, మృదంగధ్వని కలుగును.

3. ఆరోహిణీసౌమ్యదశాప్రపన్నాయజ్ఞోత్సవంగోవృషవాజిసంఘం ।
మృద్వన్నభూషాంబరయానలాభంవాణిజ్యభూమ్యర్థపరోపకారం ॥
ఆరోహణముననున్న బుధదశలో-యజ్ఞము, గోవృషభఅశ్వ సంఘములు, సన్నవన్నము, భూషణములు, వస్త్రములు, వాహనలాభము, వర్తకము, పరోపకారము. కలుగును.

4. శశాంకసూనోస్త్వవరోహిణీయాదశామహత్కష్టతరంచదుఃఖం ।
విజ్ఞానహీనంపరదారసంగంనృపాగ్నిచోరైర్భయమత్రతల్పశ్చం ॥

అవరోహమునమునఉన్న బుధదశలో-మహాకష్టము, దుఃఖము, జ్ఞానహీనత, పరదారసంగము, రాజాగ్ని చోరభయము కలుగును.

5. నీచస్థచంద్రాత్మజదాయకాలేజ్ఞానేనహీనస్స్వజనైర్విరోధం ।
పదచ్యుతింబంధువియుక్తతాంచవిదేశయానంవనవాసమేతి ॥
నీచస్థుడైన బుధదశలో-జ్ఞానహీనత, స్వజనవిరోధము, ఉద్యోగభంగము, బంధువియోగము, విదేశయానము, వనవాసము కలుగును.

6. మూలత్రికోణాన్వితసౌమ్యదాయేరాజ్యంమహత్సౌఖ్యకరంచకీర్తిం ।
విద్యావిలాసంనిగమాంతశీలంపురాణధర్మశ్రవణాదిపుణ్యం ॥
మూలత్రికోణమందున్న బుధునిదశలో-రాజ్యము, మహాసౌఖ్యము, కీర్తి, విద్యావిలాసము, వేదాంతవిచారణ, పురాణధర్మ శ్రవణాది పుణ్యకార్యములు జరుగును.

7. స్వక్షేత్రగస్యాపిశశాంకసూనోశ్రప్రాప్తాదశాయాంధనధాన్యసంపత్ ।
వాణిజ్యగోభూమిసుతార్థదారమృద్వన్నపానాంబరభూషణాప్తిః ॥
స్వక్షేత్రగతుడయిన బుధునిదశలో - ధనధాన్యసంపదలు, వర్తకము, గోభూములు, భార్యాపుత్రసుఖము, ధనప్రాప్తి, సన్నన్నము, క్షీరపానము, వస్త్ర భూషణములు కలుగును.

8. శశాంకసూనోరతిశత్రురాశిగతస్యపాకేవివిధంచదుఃఖం ॥
ఉద్యోగభంగంస్వజనైర్విరోధంయజ్ఞాదివిఘ్నంశుభకర్మనాశం ॥
అధిశత్రురాశియందున్న బుధదశలో-వివిధ దుఃఖములు, ఉద్యోగభంగము, స్వజనవిరోధము, యజ్ఞాదికర్మలకు విఘ్నము, శుభకర్మలకు హానికలుగును.

9. శశాంకసూనోస్త్వరిరాశిగస్యశత్రోర్భయంభూపతికోపజాతం ।
విద్యావిహీనంకులహీనకృత్యంకుభోజనందారసుతార్థనాశం ॥
శత్రుస్థానస్థుడైన బుధునిదశలో-శత్రురాజభయము, విద్యావిహీనత, కులహీన కృత్యము, కుత్సిత భోజనము, భార్యాపుత్ర ధననాశము కలుగును.

10. మిత్రక్షేత్రదశాయాంశశాంకసూనోర్ధనాయతింసౌఖ్యం ।
నామద్వయసంప్రాప్తింస్వనామయోగ్యానిగద్యపద్యాని ॥
మిత్రక్షేత్రమునఉన్న బుధదశలో-ధనలాభము, సౌఖ్యము, పౌరుషనామము (బిరుదు) కలుగుట, తనపేరనఉన్న గద్యపద్యములు కలుగును.

11. అతిమిత్రరాశిగస్యచదశాప్రపన్నామహత్వతాంయాతి ।
భూపతిమైత్రీంచధనంసుతదారసుఖంచబంధుసన్మానం ॥

అధిమిత్రుడయిన గ్రహక్షేత్రమునందున్న బుధునిదశ-గౌరవము, రాజ స్నేహము, ధనము, పుత్ర భార్యాసుఖము, బంధు సన్మానము కలుగును.

12. సమర్క్షగస్యాపిశశాంకసూనోర్దశాసుఖంధాన్యసుతాంబరాణి ।
కరోతిరాజ్యచ్యుతిమన్నవిఘ్నంవిజ్ఞానహీనంపిటకాదిరోగం ॥

సమక్షేత్రమందున్న బుధునిదశలో-సుఖము, ధాన్యము, పుత్రులు, వస్త్రములు, రాజ్యభ్రంశము, అన్నము లేకపోవుట, విజ్ఞానహీనత, పిటకాదిరోగము కలుగును.

13. నీచఖేచరసంయుక్తసౌమ్యదాయేతికష్టతాం ।
పదచ్యుతింబంధునాశంకర్మనాశంమనోరుజం ॥

నీచగతుడయిన బుధదశలో-అతికష్టము, ఉద్యోగభంగము, బంధునాశము, కర్మనాశము, మనోవ్యథ కలుగును.

14. ఉచ్చఖేచరసంయుక్తసౌమ్యదాయేమహత్సుఖం ।
భాగ్యోత్తరంసువిద్యాంచవాణిజ్యంగోకృషిక్రియాం ॥

ఉచ్చస్థితుడయిన గ్రహముతోకూడిన బుధదశలో-అధికసుఖము, ఉత్తరకాలమునకువచ్చు భాగ్యము, విద్య, వర్తకము, గో కృషికర్మల వలన లాభము కలుగును.

15. విదఃపాపయుతస్యాపిదాయేపాపముపైతిచ ।
క్షేత్రార్థదారపుత్రాదికృషిగోభూమినాశనం ॥

పాపగ్రహయుక్తుడైన బుధునిదశలో-పాపకర్మలుచేయుట, భార్యాపుత్రకష్టము, కృషి, క్షేత్ర, గోభూనాశము కలుగును.

16. విదస్సౌమ్యయుతస్యాపిపరిపాకేమహత్సుఖం ।
రాజభోగ్యంసుఖంకీర్తిందారపుత్రనృపైస్సుఖం ॥

శుభగ్రహయుక్తుడైన బుధునిదశలో-మహాసుఖము, రాజభోగ్యము, సుఖము, కీర్తి, భార్యాపుత్రులతోను, రాజువలన సుఖము కలుగును.

17. సౌమ్యేక్షితస్యాపిశశాంకసూనోర్దశావిపాకేమహతీంచకీర్తిం ।
విద్యావిలాసోద్భవరాజపూజ్యంకాంతిప్రతాపంయశసానమేతం ।

శుభగ్రహదృష్టుడైన బుధునిదశలో-అధికకీర్తి, విద్యావిలాసమువలన రాజపూజ్యత, కాంతి ప్రతాపములు కలుగును.

18. పాపేక్షితస్యాపిశశాంకసూనోర్దాన్యత్యయంబంధుజనైర్విరోధంయుక్తః ।
విదేశయానంస్వపదచ్యుతంవాప్రేష్యానువృత్త్యాకలహోత్ర
కృచ్ఛ్రం ॥

పాపగ్రహదృష్టుడైన బుధునిదశలో-ధాన్యక్షయము, బంధువియోగము, పరదేశయానము, స్థానచలనము, సేవకవృత్తిలో కలహము, కష్టఫలములు కలుగును.

**19.** కేంద్రంగతస్యహిదశాశశినందనస్యభూపాలమిత్రధనధాన్యకళత్రపుత్రాన్ ।
యజ్ఞాదికర్మనృపమానయశఃప్రలబ్ధమృద్వన్నపానశయనాంబరభూషణాని ॥

కేంద్రగతుడయిన బుధుని దశాకాలమున-రాజప్రీతి, ధన, ధాన్య, కళత్ర, పుత్రసుఖము, యజ్ఞాదికర్మలు, రాజసన్మానము, కీర్తి, సన్నన్నము, రసపానము, శయనము, వస్త్రములు, భూషణములు లభించును.

**20.** లగ్నంగతస్యహిదశాజననాయకత్వగోపాలమానయశఃకృషిలబ్ధభాగ్యం ।
భేరీరవాదిపరిఘోషితయానమార్గంతీర్థాభిషేకమథవాజగతిప్రసిద్ధం ॥

లగ్నమందున్న బుధునిదశలో-జననాయకత్వము, గోపాలకత్వము, సన్మానము, కీర్తి, కృషి, భాగ్యము, భేర్యాది ఘోషకలిగిన వాహనమార్గము, పుణ్యతీర్థస్నానము, ప్రఖ్యాతి కలుగును.

**21.** విత్తగసౌమ్యదశాయాంవిద్యాప్రాప్తింమహత్వకీర్తించ ।
భూపతిరాజ్యసమానోరాజ్యస్థానేప్రధానతాంయాతి ॥

ద్వితీయమందున్న బుధునిదశలో-విద్యాప్రాప్తి, గౌరవము, కీర్తి, రాజసమానుడై రాజ్యము ప్రధానత్వము కలుగును.

**22.** తృతీయరాశిస్థితచంద్రసూనోర్దశావిపాకేజడతాంసమేతి ।
ఉద్గానమాజీవనగుల్మరోగంభ్రాతుర్వియోగేనృపమాననంచ ॥

తృతీయరాశియందున్న బుధునిదశలో-జడత్వము, వమన, అజీర్ణ, గుల్మరోగములు, భ్రాతృవియోగము, రాజసన్మానము కలుగును.

**23.** శశాంకసూనోర్హిబుకస్థితస్యదశాప్రపన్నాగృహధాన్యనాశం ।
సౌఖ్యాదిహీనంహిబుకేచమృత్యుముద్యోగభంగంస్వపదచ్యుతించ ॥

చతుర్థమందున్న బుధునిదశలో-గృహ, ధాన్యనాశములు, సుఖములేకపోవుట, ఉద్యోగభంగము, స్థానచలనము కలుగును.

**24.** పంచమస్థశశినందనస్యవాక్రూరబుద్ధిరతికష్టతాభవేత్ ।
హీనవృత్తిరపిదాజసేవయాకృచ్ఛ్రలబ్ధధనమేతినంపదం ॥

పంచమమందున్న బుధునిదశలో-ప్రచారబుద్ధి, అతికష్టముపై ధనసంపాదన కలుగును.

25. షష్ఠాష్టమాంత్యస్థితసౌమ్యదాయేత్వగ్దోషజాతంబహురోగమేతి ।
విచర్చికాపైత్తికపాండురోగంనృపాగ్నిచోరైర్మరణంకృశత్వం ॥

షష్ట, అష్టమ, ద్వాదశములందున్న బుధదశలో-దేహమున వాతపైత్యశ్లేష్మ రోగములు, గజ్జి, తీట, పైత్యము, పాండురోగము, రాజ, అగ్ని, చోరభయము, కృశత్వము, అపమృత్యుభయము కలుగును.

26. దేహాంగవైకల్యకళత్రబంధువిద్వేషణంభూపతిదత్తకోపం ।
ఆకస్మికంమృత్యుభయంప్రమాదంరిఃఫస్థితస్యాపిశశాంకసూనోః ॥

వ్యయస్థితుడయిన బుధునిదశలో-అవయవ వైకల్యము, కళత్ర బంధుద్వేషము, రాజకోపమువలన భయము, ఆకస్మిక మృత్యుభయము, ప్రమాదము కలుగును.

27. దారస్థితస్యాపిశశాంకసూనోర్దశావిపాకేసుతదారవిత్తం ।
విద్యావినోదంవిమలాంబరంచనామద్వయంభూపతిమైత్రతాంచ ॥

సప్తమమందున్న బుధునిదశలో-భార్యాపుత్ర సుఖము, ధనలాభము, విద్యా వినోదము, స్వచ్ఛమైన వస్త్రములు, తనకు పేరు కలుగుట, రాజమైత్రి కలుగును.

28. భాగ్యస్థితస్యాపిశశాంకసూనోర్భాగ్యోత్తరందారసుతార్థలాభం ।
తీర్థాభిషేకంజపహోమదానంయజ్ఞాదికర్మాణిలభేన్మనుష్యః ॥

భాగ్యస్థితుడయిన బుధునిదశలో-భాగ్యప్రాప్తి, భార్యాపుత్రసుఖము, ధన ప్రాప్తి, పుణ్యతీర్థస్నానము, జపహోమదానములు, యజ్ఞాది పుణ్యకర్మలు కలుగును.

29. కర్మస్థితస్యాపిశశాంకసూనోర్దశావిపాకేనృపతౌల్యమేతి ।
సౌఖ్యంస్వనామాంకితగద్యపద్యంనామాంతరందారసుతార్థలాభం ॥

దశమస్థుడైన బుధునిదశలో-రాజుతో సమానముగా నుండుట, సౌఖ్యము, తనపేరున అంకితమైన గద్యపద్యములుండుట, బిరుదు లభించుట, భార్యాపుత్ర, ధన లాభము కలుగును.

30. ప్రపూజనందేవమహీసురాణాంసామ్రాజ్యలాభంజననాయకత్వం ।
కవిత్వమార్గంనముపైతికాలేయజ్ఞాదిదీక్షాంస్వజనైర్విశేషాత్ ॥

మరియు, దేవబ్రాహ్మణపూజ, సామ్రాజ్యలాభము, జననాయకత్వము, కవిత్వ మార్గము, యజ్ఞాదిదీక్ష, స్వజనస్నేహము కలుగును.

31. ఉపాంత్యరాశిస్థితిసౌమ్యదాయేత్వనేకధావిత్తముపైతికాలే ।
దానేనవాభూపతిమానసాద్వాకృషేశ్చవాణిజ్యవిచారతోవా ॥

లాభస్థితుడైన బుధదశలో-అనేకరీతులుగా ధనప్రాప్తి, దానమునగాని, రాజసన్మానమునగాని, కృషిఫలనగాని, వర్తకమునగాని ధనాగమమగును.

32. ఉచ్చాంశసంయుక్తశశాంకసూనోర్దశావిశేషేసుతభూషణాప్తిం ।
మనోవిలాసంమదనాభిరామంఉత్సాహశౌర్యంచజలాభిషేకం ॥

ఉచ్చాంశలోఉన్న బుధదశలో-పుత్ర, భూషణప్రాప్తి, మనోవిలాసము, కామసుఖము, ఉత్సాహము, శౌర్యము, పుణ్యతీర్థస్నానము లభించును.

33. నీచాంశకయుతేసౌమ్యేనీచవృత్త్యనుజీవనం ।
ప్రేష్యత్వంపరిచారంచదశాయాంచకరోతితత్ ॥

నీచాంశలోఉన్న బుధునిదశలో-నీచవృత్తిచే జీవించుట, సేవకుడై యుండుట, పరిచారకుడగుట జరుగును.

34. సౌమ్యదశాయామాదౌలభతేధనధాన్యసంపదంపురుషః ।
అంతేస్వజనవిరోధంమధ్యేదాయేనరేశసన్మానం ॥

బుధదశలో ఆదిలో ధనధాన్యసంపదలు కలుగును. ద్వితీయ ఖండమున రాజసన్మానము, తృతీయ ఖండమున స్వజన విరోధము కలుగును.

35. అర్కాగసౌమ్యదశాయాంలభతేవివిధాపదంమనోదుఃఖం ।
స్వకులజననృపవిరోధంనిందాభయమాక్షికంరోగం ॥

రవితోకూడిన బుధుని దశలో-వివిధ ఆపదలు, మనోదుఃఖము, స్వకులజన విరోధము, రాజవిరోధము, నింద, నేత్రరోగము కలుగును.

36. స్థానవీర్యయుతేసౌమ్యేతత్పాకేకీర్తిరాజ్యదం ।
మనోధైర్యంమహోత్సాహంయజ్ఞదీక్షాంశుభప్రదం ॥

బుధుడు స్థానబలయుక్తుడుకాగా, అతనిదశలో-కీర్తి, రాజ్యము, మనోధైర్యము, మహోత్సాహము, యజ్ఞదీక్ష, శుభము కలుగును.

37. తద్విహీనేబుధేస్థానదారపుత్రమహద్భయం ।
విదేశవాసదుఃఖంచనానాపరిభవక్రియాం ॥

స్థానబలహీనుడయిన బుధునిదశలో-స్థాన నాశము, భార్యాపుత్ర భయము, విదేశవాసదుఃఖము, అవమానములు కలుగును.

38. దిగ్వీర్యసహితసౌమ్యేదిగంతాద్ధనికస్సుఖీ ।
సామంతరాజమైత్రత్వంగంధమాల్యానులేపనం ॥

దిగ్బలయుక్తుడైన బుధునిదశలో-దిగంతములనుండి వచ్చిన ధనము కలవాడు, సుఖవంతుడు, సామంతస్నేహము, గంధమాల్యాను లేపనములు కలుగును.

39. కాలవీర్యయుతసౌమ్యదశాయాందేహసౌఖ్యకలహాదివియోగం ।
దారపుత్రనృపమానసమేతిగాంగతోయతనుపూతకృతస్నాత్ ॥
కాలబలముకల బుధునిదశలో-దేహసౌఖ్యము, కలహము, వియోగము, భార్యాపుత్ర సుఖము, గౌరవము, గంగాస్నానము లభించును.

40. నిసర్గవీర్యాన్వితసౌమ్యదాయేనిసర్గతస్స్యాచ్ఛుభాదికర్మ ।
విద్యావివాదంస్వజనైర్విరోధంమాతుర్వియోగంత్వథవాతదీయం ॥
నైసర్గికబలమున్న బుధదశలో-అప్రయత్నముగా శుభకర్మసిద్ధి, విద్యా వివాదము, స్వజన విరోధము, మాతృ వియోగముకాని తల్లితరఫువారి వియోగముగాని కలుగును.

41. వక్రచేష్టాయుతేసౌమ్యేదారభాగ్యసుతార్థభాక్ ।
పురాణదానదీక్షాదిసముద్రస్నానమాచరేత్ ॥
వక్రచేష్టాయుతుడయిన బుధునిదశలో - భార్యాపుత్ర భాగ్యము కలుగుట, పురాణశ్రవణము, దానము, దీక్ష, సముద్రస్నానము సిద్ధించును,

42. దృగ్బలేనయుతేసౌమ్యేసర్వభూతేషుసామ్యతాం ।
కరోతిరతికేళించరాజభాగ్యసమన్వితః ॥
దృగ్బలయుక్తుడైన బుధునిదశలో-సర్వసమత్వము, రతికేళి సౌఖ్యము, రాజభాగ్యము కలుగును.

43. క్రూరషష్ట్యంశసౌమ్యస్యదశాకాలేమహద్భయం ।
చోరాగ్నిభూపైర్భీతిస్స్యాచ్ఛుభదృగ్యోగవర్జితే ॥
క్రూరషష్ట్యంశయుక్తుడైన బుధునిదశలో-అధికభయము, చోర, అగ్ని, రాజభీతి, శుభదృష్టిలేకున్న ఇన్నియు కలుగును.

44. మృద్వంశాదియుతేసౌమ్యేరాజ్యలాభంమహత్సుఖం ।
మార్దవంసర్వభూతేషుకృషిపుత్రార్థసంపదం ॥
మృద్వంశాదియుతుడయిన బుధదశలో-రాజ్యలాభము, అధిక సౌఖ్యము, మృదు స్వభావము, సర్వభూత మృదుత్వము, కృషిపుత్ర ధనసంపదలు కల్గును.

45. సౌమ్యే వైశేషికాంశస్థేవిశేషాద్రాజపూజ్యతాం ।
సుగంధాంబరమాల్యంచవిద్యాగోష్ఠీరహస్సుఖం ॥
వైశేషికాంశయందున్న బుధునిదశలో-విశేషముగా రాజపూజ్యత, సుగంధము, వస్త్రములు, మాల్యములు, విద్యాగోష్ఠి, రహస్య సుఖము కలుగును.

46. క్రూర ద్రేక్కాణయుక్తస్య చంద్రసూనుర్యదా తదా ।
చోరాగ్ని భూపతి భయం స్థాననాశం మహద్భయం ॥
క్రూర ద్రేక్కాణయుతుడయిన బుధదశలో-చోరాగ్ని రాజభయము, స్థాన భ్రంశము, అధిక భయము కలుగును.

47. ఉచ్చరాశిగతస్యాప్యో నీచభాగగతో పిసన్ ।
రాజ్యం సుఖం మహత్కీర్తిం వినాశయతి తద్దశాత్ ॥
ఉచ్చరాశిలోనున్నను నీచాంశలోనున్న బుధదశలో-రాజ్యము, ధనము, కీర్తి నశించును.

48. చంద్రాత్మజో పి నీచస్థ ఉచ్చాంశక సమన్వితః ।
అశుభం ఫలమాదౌ తు శుభమంతే ప్రయచ్ఛతి ॥
నీచస్థుడయినా ఉచ్చాంశలోనున్న బుధునిదశలో-ఆదిలో అశుభఫలమిచ్చినా, చివరన శుభఫలమిచ్చును.

ఇది సర్వార్థ చింతామణి—ఆంధ్రతాత్పర్యమున—బుధదశాఫల మను ద్వావింశాధ్యాయము

# త్ర యో విం శా ధ్యా య ము

1. గురోర్దశాయాం పరమోచ్చగస్య రాజ్యం మహత్సౌఖ్యముపైతి కీర్తిం ।
మనోవిలాసం గజవాజిసంఘం నృపాభిషేకం స్వకులాధిపత్యం ॥
పరమోచ్చ స్థానమందున్న గురుదశలో-రాజ్యము, మహాసౌఖ్యము, కీర్తి, మనోవిలాసము, గజవాజిసంఘమును, రాజ్యాభిషేకమును, స్వకులాధిపత్యమును పొందును.

2. కుళీరగస్యాపి గురోర్దశాయాం భాగ్యోత్తరం భూపతిమాననాద్వా ।
విదేశయానం మహదాధిపత్యం దుఃఖైః పరిక్లిష్టతనుం మనుష్యం ॥
ఉచ్చస్థుడై-కర్కటకమందున్న గురునిదశలో - భాగ్యోత్తరమును, రాజ సమ్మానమువలన భాగ్యప్రాప్తి, విదేశ ప్రయాణము, అధికారము, దుఃఖకృశమైన శరీరము కలుగును.

3. ఆరోహిణీదేవగురోర్మహత్వందశాప్రపన్నాకురుతేర్థభూమిం ।
గానక్రియాస్త్రీసుతరాజరాజంన్స్వవిద్యయాప్రాప్తయశఃప్రతాపం ॥

ఆరోహణమునఉన్న గురుదశలో-గౌరవము, ధన భూలాభము, సంగీతము, భార్యాపుత్రసౌఖ్యము, రాజులచే సుఖము, స్వవిద్యచే కీర్తి ప్రతాపములు పొందుట జరుగును.

4. శివదశాయామిశో గ్రామాణాంమండలాధినాథోవా ।
ద్విజభూపాల్లబ్ధధనో మేధావీకాంతిమాన్ వినీతజ్ఞః ॥

గురుదశలో - గ్రామాధిపతికాని, మండలాధిపతిగాని, బ్రాహ్మణరాజువలన పొందబడిన ధనము కలవాడై, మేధావి, కాంతిమంతుడు వినయముకలవాడై యుండును.

5. దేవేంద్రపూజ్యస్యదశావరోహాకరోతిసౌఖ్యంసకృదేవనాశం ।
సకృద్యశఃకాంతివిశేషజాలంనరేశ్వరత్వంసకృదేవయాతి ॥

అవరోహణమునఉన్న గురుదశలో-ఒకసారి సౌఖ్యము, ఒకసారి కీర్తి, ఒకసారి కాంతి. ఒకసారి రాజరికము ఒకప్పుడు లేకుండుట కలుగును.

6. అతినీచభాగభాజోగురోర్దశాయాంప్రభగ్నగృహపుంజః ।
అన్యోన్యహృదయవైరంకృషినాశంయాతిపరభృత్యః ॥

పరమ నీచాంశము పొందిన గురునిదశలో-గృహము భగ్నమగుట, మనో విరోధము, కృషినాశము, పరులకు భృత్యుడగుట జరుగును.

7. మూలత్రికోణనిలయస్యగురోర్దశాయాంరాజ్యార్థభూమిసుతదార
విశేషసౌఖ్యం ।
యానాదిరోహణమపిస్వబలాత్తవిత్తంయజ్ఞాదికర్మజనపూజిత
పాదపీఠం ॥

మూలత్రికోణమందున్న గురుదశలో-రాజ్యము, ధనము, భూమి, భార్యాపుత్ర సౌఖ్యము, వాహనము, స్వశక్తితో సంపాదించిన ధనము, యజ్ఞాది పుణ్యకర్మలు, జనపూజితమైన పాదపీఠములు కలవాడగును.

8. గురోర్దశాయాంస్వగృహంగతస్యరాజ్యార్థభూధాన్యసుఖాంబరంచ ।
మృష్టాన్నగోవాజిమనోవిలాసంకావ్యాదిపుణ్యాగమవేదశాస్త్రం ॥

స్వక్షేత్రగతుడయిన గురునిదశలో-రాజ్యము, ధనము, భూమి, ధాన్యము, సుఖము, వస్త్రము, మృష్టాన్నము, గోవులు, అశ్వములు, మనోవిలాసము, కావ్యాది గోష్ఠి, పుణ్యాగమ వేదపాఠము కలుగును.

9. గురోర్దశాయామతిశత్రురాశింగతస్యదుఃఖంనముపైతిశోకం ।
వివాదభూమ్యర్థకళత్రపుత్రనృపాగ్నిచోరైర్భయమక్షిపీడాం ॥
అధి శత్రుస్థానమందున్న గురునిదశలో-దుఃఖము, మనోవ్యాకులత, భూమి వివాదము, పుత్రకళత్రహాని, ధనహాని, రాజాగ్నిచోరభయము, నేత్రపీడ కలుగును.

10. గురోర్దశాయామరిరాశిగస్యక్షేత్రాదివిత్తంశయనాంబరంచ ।
నరేశసన్మానముపైతినిత్యంస్త్రీపుత్రభృత్యాత్మసహోదరార్తిం ॥
శత్రుక్షేత్రగతుడయిన గురునిదశలో - ధనము, క్షేత్రము, శయ్య, వస్త్ర సౌఖ్యము, రాజసన్మానము కలుగును. భార్యాపుత్ర భృత్య సోదరులకు, దుఃఖము కలుగును.

11. ప్రాప్తౌదశాయామతిమిత్రరాశిగతస్యజీవస్యనరేశపూజ్యం ।
మృదంగభేరీరవయానఘోషందిగంతరాక్రాంతనమస్తభాగ్యం ॥
అధి మిత్రరాశిగతుడయిన గురునిదశలో-రాజపూజ్యము, మృదంగ భేరీ ఘోషకల వాహనము, దిగంతముల సంపాదింపబడిన ధనము, భాగ్యము కలుగును.

12. మిత్రర్థగస్యాపిగురోర్దశాయాంనరేశమిత్రంనముపైతికీర్తిం ।
విద్యావివాదేజయమన్నసౌఖ్యంసుగంధమృద్వన్నపరోపకారం ॥
మిత్రరాశిలోఉన్న గురునిదశలో-రాజమైత్రి, కీర్తి, విద్యావివాదమున విజయము, భోజన సౌఖ్యము, సుగంధ ద్రవ్యములు, సన్నన్నము, పరోపకారము కలుగును.

13. సమర్థగస్యాపిగురోర్దశాయాంసామాన్యతోభూపతిదత్తభాగ్యం ।
కృష్యర్థగోభూమిమనోవిలాసంచిత్రాంబరాలంకృతభూషణాప్తిం ॥
సమగ్రహరాశిలోనున్న గురునిదశలో-రాజానుగ్రహమున భాగ్యము, కృషి, గో, భూమి లాభము, మనోవిలాసము, చిత్రవస్త్ర అలంకృత భూషణప్రాప్తి కలుగును

14. నీచఖేచరసంయుక్తగురోర్దాయేమనోరుజః ।
పరప్రేష్యాపవాదంచస్త్రీపుత్రాణాంవిరోధతా ॥
నీచగ్రహముతో కూడిన గురునిదశలో-వ్యాధి, పరులకు భృత్యుడగుట, అపవాద భయము, భార్యాపుత్రులకు విరోధిఅగుట సంభవించును.

15. ఉచ్చఖేచరసంయుక్తగురోర్దాయేమహత్సుఖం ।
తటాకగోపురాదీనాంనిర్మాణంనృపపూజ్యతాం ॥
ఉచ్చస్థుడైన గ్రహముతోకూడిన గురునిదశలో-మహాసుఖము, తటాక గోపురాది నిర్మాణము, రాజపూజ్యత కలుగును.

16. పాపాన్వితస్యాపిగురోర్దశాయాంకరోతిపాపంహృదయాంతరస్థం ।
గూఢంబహిఃపుణ్యఫలంవిశేషాత్భూమ్యర్థదారాత్మజసౌఖ్యమేతి ॥

పాపగ్రహముతోకూడిన గురునిదశలో - పాపకర్మచేయవలెనని యుండుట, పైకి పుణ్యకార్యములుచేయుట, భూధనలాభము, భార్యాపుత్ర సుఖము కలుగును.

17. శుభాన్వితస్యాపిగురోర్దశాయాంనరేశయానంమృదులాంబరంచ ।
దానేనవిత్తంనృపమాననాద్యాయజ్ఞాదిసత్కర్మవిశేషలాభం ॥

శుభగ్రహయుక్తుడైన గురునిదశలో-రాజుతో ప్రయాణము, సన్నవస్త్రము, దానము, ధనలాభము, రాజసన్మానము, యజ్ఞాది పుణ్యకర్మలు కలుగును.

18. పాపేక్షితస్యాపిగురోర్దశాయాంప్రాప్తంసుఖంకించిదుపైతిధైర్యం ।
క్వచిద్యశఃక్వచిధంతసౌఖ్యంక్వచిద్ధనంనాశముపైతిచోరైః ॥

పాపగ్రహదృష్టుడైన గురునిదశలో-కొద్దిసుఖము, కొద్దిధైర్యము, ఒకప్పుడు కీర్తి, ఒకప్పుడు సుఖము, ఒకప్పుడు కొద్ది ధనప్రాప్తి, చోరులచే ధననాశము కలుగును.

19. శుభేక్షితస్యాపిగురోర్దశాయాందేశాంతరేవిత్తముపైతిభూపాత్ ।
దేవార్చనంభూసురతర్పణంచతీర్థాభిషేకంగురుపూజనంచ ॥

శుభదృష్టుడైన గురునిదశలో-దేశాంతరమందు రాజువలన ధనము పొందును. దేవతార్చన, బ్రాహ్మణ సంతర్పణ, పుణ్యతీర్థ స్నానము, గురుపూజ కలుగును.

20. కేంద్రగతజీవదాయేరాజ్యంభూదారరాజమానంచ ।
వివిధసుఖానందకరంబహుజనభరణప్రధానతాంయాతి ॥

కేంద్రగతుడయిన గురునిదశలో-రాజ్యము, భూమి, భార్యాసౌఖ్యము, రాజసన్మానము, వివిధ సుఖములు, ఆనందము, బహుజనులను భరించుటలో ప్రధానుడగుట జరుగును.

21. లగ్నంగతస్యహిదశాపురుషంకరోతిజీవస్యసౌఖ్యమమలాంబరభూషణాప్తిం ॥
యానాదివాహనమృదంగగణారవైశ్చమత్తేభవాజిభటసంఘయుతంకరోతి ॥

లగ్నగతుడయిన గురునిదశలో-సుఖము, శుభ్రవస్త్రములు, భూషణములు, నరవాహనము (పల్లకీ) మృదంగశబ్దములతో ప్రయాణము, గజవాజిభట సంఘములు కలుగును.

22. చతుర్థకేంద్రస్థితజీవదాయేయానత్రయంభూపతిమిత్రలాభం ।
భూపాలయోగేయదిభూపతిత్వంనోచేత్తదాతత్సదృశంకరోతి ॥

చతుర్థమందున్న గురుదశలో-వాహనత్రయము, మిత్రులు, రాజయోగమున పుట్టిన రాజ్యము, లేక తత్తుల్యమైన అధికారాదులు కలుగును.

**23.** కళత్రరాశిస్థితజీవదాయేకళత్రపుత్రాత్మసుఖంప్రయాతి ।
విదేశయానంనమరేజయంచధ్యానంపరబ్రహ్మణిపుణ్యకర్మ ॥

సప్తమమందున్న గురుదశలో-భార్యాపుత్ర సుఖము, విదేశయానము, యుద్ధ విజయము, పరబ్రహ్మధ్యానము, పుణ్యకర్మాచరణము కలుగును.

**24.** కర్మస్థితస్యాపిగురోర్విపాకేరాజ్యార్థమాహుర్మునయస్తదానీం ।
భూపాలయోగేత్వథవార్థపుత్రకళత్రసత్కర్మసురాజయోగం ॥

దశమమందున్న గురునిదశలో-రాజ్యధనలాభము, రాజయోగమున పుట్టిన రాజ్యప్రాప్తి, లేదా, భార్యాపుత్ర ధనపుణ్య కర్మలందు రాజయోగము కలుగును.

**25.** త్రికోణసంస్థస్యగురోర్దశాయాంస్త్రీపుత్రధాన్యార్థవివేకబుద్ధిం ।
మృద్వన్నపానాంబరపట్టవస్త్రయానాదిలాభంసముపైతిసౌఖ్యం ॥

త్రికోణములందున్న గురునిదశలో-భార్యాపుత్రులు, ధనధాన్యములు, వివేక బుద్ధి, సన్నన్నము, క్షీరపానము, పట్టువస్త్రములు, వాహనాదిలాభము, సౌఖ్యము కలుగును.

**26.** పంచమస్థగురోర్దాయేమంత్రోపాస్తిమహత్సుఖం ।
సుతాప్తింరాజపూజ్యంచవేదాంతశ్రవణాదికం ।

పంచమమందున్న గురునిదశలో-మంత్రోపాసన, మహాసుఖము, పుత్రప్రాప్తి, రాజపూజ్యం, వేదాంత శ్రవణాదికము కలుగును.

**27.** ఉచ్చాంశసంయుక్తగురోర్దశాయాంభాగ్యోత్తరంరాజసమానమేతి ।
ప్రవాళముక్తామణిరత్నలాభంసర్వేషుసఖ్యంసముపైతిసౌఖ్యం ॥

ఉచ్చాంశయందున్న గురునిదశలో-రాజసమానమైన భాగ్యము, పగడాలు, ముత్యాలు, మణిరత్నాలు, సర్వవిధాలా సౌఖ్యము సఖ్యము కలుగును.

**28.** నీచాంశయుక్తస్యగురోర్విపాకేభూపాద్భయంగుల్మవిచర్చికాదౌ ।
స్థానచ్యుతింబంధువిరోధితాంచనృపాగ్నిచోరైస్స్వకులోద్భవంచ ॥

నీచయందున్న గురునిదశలో-రాజభయము, గుల్మవ్యాధి, గజ్జి, స్థానభ్రంశము, బంధు విరోధము, రాజాగ్నిచోరభయము, స్వకులభయము కలుగును.

**29.** అర్కాగజీవదశాయాంసహసాజ్వరపీడితోభవేత్క్షీణః ।
ఊర్ధ్వాంగరోగతప్తోదుశ్శీలత్వంప్రభగ్నసంసారం ॥

సూర్యునితో కలిసిన గురునిదశలో-జ్వరపీడితుడై క్షీణించును. నాభికి పై

భాగమున రోగతాపము కలిగియుండుట, దుశ్శీలము, సంసారము భగ్నమగుట కలుగును.

30. ఆదౌగురోర్దశాకాలేనృపపూజామహత్సుఖం ।
మధ్యేస్త్రీపుత్రలాభాదిచాంతేకష్టంవినిర్దిశేత్ ॥

గురుదశలో ఆదిలో రాజపూజ్యం, మహాసుఖమున్ను, మధ్యలో భార్యాపుత్ర లాభమున్ను, దశాంతమున కష్టము కలుగునని చెప్పవలెను.

31. ధనస్థితస్యాపిగురోర్విపాకేధనాయతింభూపతిమాననంవా ।
విద్యావివాదాంకితరాజగోష్ఠింపరోపకారంవిజయంసుఖంచ ॥

ధనస్థుడైన గురునిదశలో-ధనలాభము, రాజసన్మానము, విద్యావివాదమున్న రాజగోష్ఠి, పరోపకారము, విజయము, సుఖము కలుగును

32. నృపకృతబహుమానంభ్రాతృభిర్భూమిలాభంపరయువతిజనైర్వాదత్తగోభూమివిత్తం ।
అశనవసనభూషాగంధమాల్యాంబరాణిపరకృతిముపకారంబుద్ధితామేతిశౌర్యం ॥

మరియు, రాజకృత బహుమానము, సోదరకృత భూలాభము, పరస్త్రీలిచ్చిన గోభూలాభము, ఆహారము, వస్త్రములు, నగలు, గంధమాల్యములు, పరులకుచేసిన ఉపకారము, బుద్ధిశౌర్యము కలుగును.

33. తృతీయస్థగురోర్దాయేభ్రాతృణాంచసుఖంధనం ।
నృపదత్తధనంసౌఖ్యంగంధమాల్యాంబరాదికం ॥

తృతీయమందున్న గురుదశలో-సోదరసౌఖ్యము, ధనప్రాప్తి, రాజదత్త ధనము, సౌఖ్యము, గంధమాల్యాంబరాదికము కలుగును.

34. నీరోగతాపుత్రకళత్రలాభంలగ్నాదిపుష్టస్థగురోర్దశాయాం ।
ఆదౌభవేదేవమథాంత్యపాకేదారార్థచోరాదిభయంసరోగం ॥

షష్ఠస్థుడైన గురుదశలో-ఆరోగ్యము, పుత్రకళత్రలాభము, దశాదిలో జరుగును. దశాంత్యమున-భార్యాధనములకు చోరాదిభయము, రోగము కలుగును.

35. జీవోమరణపదస్థఃకరోతిసౌఖ్యంస్వబంధుజనహానిం ।
స్థానచ్యుతింవిదేశంఅంత్యేస్త్రీపుత్రరాజసమ్మానం ॥

అష్టమస్థుడైన గురునిదశలో-సుఖము, బంధు జనహాని, స్థానభ్రంశము, విదేశయానము, దశాంత్యమున-భార్యాపుత్రసుఖము, రాజసమ్మానము కలుగును.

36 లాభగజీవదశాయాన్నంప్రాప్తిరాజ్యలాభముపయాతి ।
బహ్వర్థదారపుత్రాద్భూపవిరోధంస్వబంధువిద్వేషం ॥

లాభమందున్న గురుదశలో-రాజ్యలాభము, బహుధనము, భార్యాపుత్రుల మూలకముగా రాజవిరోధము, బంధుజనద్వేషము కలుగును.

37. వ్యయగతజీవదశాయాన్సంప్రాప్తౌవాహనాదిముపయాతి ।
లభతేవిదేశయానంనానాక్లేశైశ్చపరిభూతః ॥

వ్యయగతుడయిన గురునిదశలో-వాహనాదిలాభను, విదేశయానము, అనేక దుఃఖములు, పరాభవము కలుగును.

38. పాకేస్థానబలాన్వితస్యచగురోఃక్షేత్రాదిదారాత్మజాన్ ।
సంప్రాప్నోతిగజాశ్వవస్త్రకనకంచిత్రాంబరంభూషణం ।
దిగ్వీర్యాన్వితదేవనాయకగురౌలోకేప్రసిద్ధంతదా ।
జీవేకాలబలాధికేనృపవధూసమ్మానతాంయాతిచ ॥

స్థానబలమున్న గురునిదశలో-క్షేత్రము, భార్యాపుత్రులు, గజ, అశ్వ, కనక, వస్త్రములు, చిత్రాంబరములు, నగలు లభించును. దిగ్వీర్యమున్న గురుదశలో లోకప్రసిద్ధి, కాలబలాధికుడయిన గురువిదశలో-రాజస్త్రీ సన్మానము పొందును.

39. నిసర్గవీర్యాన్వితజీవదాయేనిసర్గతశ్చాపిసుఖంమహత్వం ।
విద్యావిలాసంరతికేళిసౌఖ్యంగంగాదితోయాదికృతాభిషేకం ॥

నైసర్గికబలమున్న గురునిదశలో—అప్రయత్నముగా సుఖము, గౌరవము, విద్యావిలాసము, రతికేళిసౌఖ్యము, గంగాస్నానము కలుగును.

40. వక్రంగతస్యాపిగురోర్దశాయాంమహార్థతాంయాతిసుతార్థదారాన్ ।
యుద్ధేజయంభూపతిమిత్రతాంచసుగంధచీనాంబరవాగ్విలాసం ॥

వక్రియైన గురునిదశలో—మహాధనము, భార్యాపుత్ర సుఖము, ధనప్రాప్తి, యుద్ధజయము, రాజమైత్రి, సుగంధద్రవ్యములు, చీనాంబరములు, వాగ్విలాసము కలుగును.

41. దృగ్వీర్యయుక్తస్యగురోర్విపాకేకృపాకటాక్షైర్మహిపతీనాం ।
సమస్తభాగ్యంసముపైతినిత్యందేశాంతరేభ్రామ్యతికించిదేవ ॥

దృగ్బలమున్న గురునిదశలో-రాజానుగ్రహమున సమస్త భాగ్యమును పొందును. దేశాంతరమున ఎప్పుడును సంచరించుచుండును.

42. క్రూరషష్ట్యంశసంయుక్తగురోర్దాయేతికష్టతాం ।
రాజకోపావమానాదిలభతేనాత్రసంశయః ॥

క్రూరషష్ట్యంశమునసున్న గురునిదశలో-అతికష్టము, రాజకోపమున అవమానమును పొందును.

43. సౌమ్యషష్ట్యంశసంయుక్తగురోర్దాయేతిసౌమ్యతాం ।
వాహనంబంధుసమ్మానంయజ్ఞంవైవాహికంశుభం ॥
సౌమ్యషష్ట్యంశమందున్న గురునిదశలో-శుభము, వాహనము, బంధుసమ్మానము, యజ్ఞము, వివాహశుభము జరుగును.

44. పారావతాంశయుక్తస్యగురోఃపాకేమహత్సుఖం ।
మృద్వన్నపట్టివస్త్రంచహేమవిద్రుమభూషణం ॥
పారావతాంశయందున్న గురునిదశలో-మహాసుఖము, సన్నన్నము, పట్టువస్త్రము, బంగారము, పగడాలు, భూషణములు లాభించును.

45. పాపద్రేక్కాణయుక్తస్యగురోర్దాయేచబంధనం ।
కారాగృహప్రవేశంచనిగళందారవిగ్రహం ॥
పాపద్రేక్కాణమునఉన్న గురునిదశలో-బంధనము, కారాగార ప్రవేశము, నిగళము, భార్యతో కలహము కలుగును.

46. ఉచ్చస్థేపిగురౌనీచరాశ్యంశకసమన్వితే ।
మహాభాగ్యేతుసంప్రాప్తేతత్‌క్షణాదేవనశ్యతి ॥
ఉచ్చస్థుడైనను నీచాంశలోనున్న గురునిదశలో - మహాభాగ్యము కలిగినను తక్షణమే నశించును.

47. నీచస్థేదేవపూజ్యేతుస్వోచ్చాంశకసమన్వితే ।
భాగ్యక్షయేతుసంప్రాప్తేభాగ్యంయాతితథానరః ॥
నీచస్థుడైనను ఉచ్చాంశయందున్న గురునిదశలో-నశించుచున్న భాగ్యము కూడా వృద్ధిపొందును.

ఇది సర్వార్థ చింతామణి-ఆంధ్ర తాత్పర్యమున-గురుదశాఫల మను త్రయోవింశాధ్యాయము

---

# చతుర్వింశాధ్యాయము

1. అత్యుచ్చభృగుదశాయాంమత్తవిలాసప్రియార్థభోగీస్యాత్ ।
వస్త్రాచ్ఛాదనభోజనశయనస్త్రీపుత్రరత్నయుతః ॥
పరమోచ్చ భాగస్థుడైన శుక్రునిదశలో-మత్తురాలై విలాసముకల భార్యతో

భోగించును. వస్త్రములు, భోజనము, శయనము, భార్యాపుత్రులు, సుఖము కలుగును.

2. నీచ్చస్థితస్యాపిభృగోర్దశాయాంస్త్రీసంగనష్టార్థవిరుద్ధధర్మం।
పిత్రోర్వినాశంనమపైతిదుఃఖంశిరోరుజంభూపతిమాననంచ ॥
ఉచ్చస్థుడైన శుక్రునిదశలో–స్త్రీ సంగమముచే ధనము నష్టమగును, లోక విరుద్ధమైన ధర్మముచేయును. తల్లిదండ్రులకు నాశము, తలనొప్పి, రాజసన్మానము పొందును.

3. ఆరోహిణీశుక్రదశాప్రపన్నాధాన్యాంబరాలంకృతకాంతిపూజ్యం।
సద్వృత్తిసిద్ధంస్వజనైర్విరోధంమాతుర్వినాశంపరదారసంగం ॥
ఆరోహణమందున్న శుక్రదశలో-ధాన్యము, వస్త్రములు, అలంకారము, కాంతి, పూజత్వము, సద్వృత్తివలన వచ్చిన ధనము, స్వజన విరోధము, తల్లికి కష్టము, పరదారసంగమము కలుగును.

4. భృగోస్సుతస్యావ్యవరోహకాలేప్రచండవేశ్యాగమనంధనాప్తిం।
స్త్రీపుత్రబంధ్వార్తిమనోవికారంహృచ్ఛూలరోగంమదనార్తిమేతి ॥
అవరోహణమునఉన్న శుక్రునిదశలో–ప్రచండమైన వేశ్యాసంగమము, ధనప్రాప్తి, భార్యాపుత్రులకు దుఃఖము, మనోవికారము, హృదయశూల, రోగము, మన్మథదుఃఖము కలుగును.

5. ఉద్వేగరోగతప్తఃకర్మసువిఫలేషునర్వదాభీతః।
అతినీచగస్యదాయేశుక్రస్యాత్మార్థదారపుత్రార్తం ॥
పరమ నీచయందున్న శుక్రునిదశలో–వేగవంతమైన రోగబాధ, కార్యవైఫల్యము, సర్వదాభీతి, తనకోసము, భార్యాపుత్రులకోసము విచారము కలుగును.

6. మూలత్రికోణభాజోభృగోర్దశాయాంమహాధిపత్యంచ।
క్రయవిక్రయతృన్నారీధనవాన్కీర్త్యాన్వితోవిభిజ్ఞశ్చ ॥
మూలత్రికోణమునఉన్న శుక్రునిదశలో–గొప్ప అధికారప్రాప్తి, క్రయవిక్రయ వ్యాపారము, స్త్రీధనము, కీర్తి, విదిజ్ఞత కలుగును.

7. శుక్రక్షేత్రదశాయాంలభతేస్త్రీపుత్రమిత్రధనశౌర్యం।
నిత్యోత్సవమద్వేషంపరోపకారంమహత్త్వంచ ॥
స్వక్షేత్రమందున్న శుక్రునిదశలో–భార్యాపుత్రులు, మిత్రులు, ధనము, శౌర్యము, నిత్యోత్సవము, ద్వేషము లేకుండుట, పరోపకారము, గొప్పతనము కలుగును.

8. భృగోర్దశాయామతిశత్రురాశిగతస్యపుత్రార్థకళత్రహానిం ।
ప్రవిభగ్నసంసారవిశీర్ణదేహంగుల్మాక్షిరోగంగ్రహణిప్రకోపం ॥

అధిశత్రురాశిలోఉన్న శుక్రదశలో భార్యాపుత్రనష్టము, ధనహాని, సంసారభంగము, చిక్కిపోవుట, గుల్మ, అక్షిరోగములు, గ్రహణి యెక్కువగుట జరుగును.

9. శత్రుక్షేత్రదశాయాంభృగోరపత్యార్థదారహానిస్స్యాత్ ।
భూపతికోపంకురుతేమత్తవిలాసార్థమాత్మకర్మాణి ॥

శత్రుక్షేత్రమందున్న శుక్రదశలో—భార్యాపుత్రులకుహాని, ధనహాని, రాజకోపము, మదవిలాసమునకై పనులుచేయుట జరుగును

10. మిత్రక్షేత్రదశాయాంపరోపకారీకళాద్యభిజ్ఞశ్చ ।
కూపతటాకారామకృషిస్స్యాదేవేశ్వరోర్థశ్చ ॥

మిత్రక్షేత్రముననున్న శుక్రునిదశలో—పరోపకారము, కళాభిజ్ఞత, కూప, తటాక, ఆరామ నిర్మాణము, కృషి, ప్రభుత్వము కలుగును.

11. అతిమిత్రశుక్రదాయేభూపతిసమ్మానమానసౌఖ్యంచ ।
గోధనవాజినమేతంగజభటసంఘైస్సమస్తఘోషైశ్చ ॥

అధిమిత్ర స్థానముననున్న శుక్రునిదశలో - రాజసన్మానము, గౌరవము, సౌఖ్యము, గోవులు, ధనము, అశ్వములు, గజములు, భటులు, భేర్యాది ఘోషములు కలుగును.

12. సమర్గగస్యాపిభృగోర్విపాకేప్రమేహగుల్మాక్షిగుదప్రరోగం ।
కించిత్సుఖంభూపతివహ్నిచోరైర్భయంస్వనామాంకితగద్యపద్యం ॥

సమగ్రహక్షేత్రముననున్న శుక్రదశలో- ప్రమేహము, గుల్మరోగము, నేత్రరోగము, మూలవ్యాధి, కొద్ది సుఖము, రాజఅగ్నిచోరబాధ, తనపేరనున్న గద్యపద్యాలు ఉండును.

13. నీచఖేచరసంయుక్తభృగోర్దాయేమహద్భయం ।
అపవాదకృతందోషంలభతేపాతకంమహత్ ॥

నీచగ్రహముతోకూడిన శుక్రునిదశలో—మహాభయము, అపవాదము, మహాపాతకము కలుగును.

14. స్వోచ్చస్థితేనసహితస్యభృగోర్విపాకేరాజ్యంమహత్వమమరాధిపతిత్వమేతి ।
హేమాంబరాదిమణిభూషణయానలాభంభేరీమృదంగపణవారవవాద్యఘోషైః ॥

ఉచ్చస్థగ్రహముతోకూడిన శుక్రునిదశలో-రాజ్యము, గొప్పతనము, దేవేంద్రత్వము, బంగారము, వస్త్రమణి భూషణములు, వాహనము, మృదంగాది ఘోషయు కలుగును.

15. పాపాన్వితస్యాపిభృగోర్దశాయాంస్థానచ్యుతింబంధుజనైర్విరోధం ।
ఆచారహీనంకలహప్రయత్నంకృష్యర్థభూమ్యాత్మజదారనాశం ॥
పాపగ్రహముతో కూడిన శుక్రదశలో-స్థానభ్రంశము, బంధుజన విరోధము, ఆచారహీనత, కలహప్రయత్నము, కృషి, ధన, భార్యాపుత్రనాశము కలుగును.

16. శుభాన్వితస్యాపిభృగోర్దశాయాంసౌభాగ్యమిత్రాత్మజధాన్యలాభం ।
నరేశపూజ్యంగజవాజిసంఘంప్రవాళముక్తామణియానలాభం ॥
శుభగ్రహముతో కూడిన శుక్రునిదశలో-సౌభాగ్యము, మిత్రులు, పుత్రులు, ధాన్యలాభము, రాజపూజ్యము, గజాశ్వములు, ముత్యాలు, పగడాలు, మణులు, పల్లకి, లభించును.

17. పాపేక్షితస్యాపిభృగోర్దశాయాంమానార్థహానింసముపైతిదుఃఖం ।
స్త్రీయావిరోధంస్వపదచ్యుతించవిదేశవాసంనిజకర్మహీనం ॥
పాపగ్రహముచే చూడబడెడి శుక్రునిదశయందు-గౌరవ, ధనహాని, దుఃఖప్రాప్తి, భార్యాకలహము, స్వస్థానభంగము, పరదేశవాసము, స్వకులకర్మహీనత కలుగును.

18. శుభేక్షితస్యాపిభృగోర్దశాయాంధనాయతింభూపతిపూజనంచ ।
జనాధిపత్యంస్వశరీరకాంతింకళత్రమిత్రాత్మజసౌఖ్యమేతి ॥
శుభగ్రహదృష్టుడైన శుక్రునిదశలో-ధనలాభము, రాజపూజ్యము, జనాధిపత్యము, స్వశరీరకాంతి, భార్యాపుత్ర మిత్రసౌఖ్యము కలుగును.

19. కేంద్రగతస్యహిదశాభృగునందనస్యయానాంబరాదిమణిభూషణదేహకాంతిం ।
రాజ్యార్థభూమికృషివాహనపట్టవస్త్రందుర్గాధియానవరదారజలాభిషేకం ॥
కేంద్రగతుడయిన శుక్రునిదశలో-నరవాహనము-పట్టువస్త్రము, మణిభూషణములు, దేహకాంతి, రాజ్యము, ధనము, భూమికృషిలాభము, వాహనము, దుర్గము, భార్యతో జలక్రీడ లభించును.

20. లగ్నగశుక్రదశాయాస్సంప్రాప్తిరాజమాననంలభతే ।
మణిధనకృషిలాభంవాపరోపకారంమనోత్సాహం ॥

లగ్నస్థుడైన శుక్రునిదశలో-రాజసన్మానము, మణులు, ధనము. వ్యవసాయము, వీని లాభము, పరోపకారము, మానసోత్సాహము కలుగును.

**21.** చతుర్థరాశిస్థితశుక్రదాయేరాజ్యంమహత్సౌఖ్యము పైతియానం ।
కృషిక్రియావిత్తపశుప్రజానాంవృద్ధింప్రతాపాన్వితకీర్తిజాలం ॥

చతుర్థమందున్న శుక్రునిదశలో-రాజ్యము, సౌఖ్యము, నరవాహనము,(పల్లకి) కృషి, ధన, పశులాభము, స్వజన వృద్ధి, ప్రతాపము, కీర్తి కలుగును.

**22.** కళత్రరాశిస్థితశుక్రదాయేకళత్రనాశంత్వధవావిదేశం ।
ప్రమేహగుల్మాదికరోగజాలంప్రశగ్నవిత్తాత్మజబంధురాజిం ॥

సప్తమమందున్న శుక్రునిదశలో-కళత్రనాశముగాని, అన్యదేశగమనముగాని, మేహము, గుల్మము, అనేక వ్యాధులు, బంధు, పుత్రవర్గమునకుహాని, ధనహాని కలుగును.

**23.** కర్మస్థశుక్రస్యదశావిపాకేయజ్ఞాదికర్మార్థనరేశరాజ్యం ।
భాగ్యోత్తరంపాలితదేహకాంతిందిగంతరప్రాప్తయశఃప్రతాపం ॥

దశమమందున్న శుక్రునిదశలో-యాగాది పుణ్యకర్మలు, ధనలాభము, రాజానుగ్రహమున రాజ్యప్రాప్తి, లేని భాగ్యము కలుగుట, దేహకాంతి, దిగంతములు వ్యాపించిన కీర్తి ప్రతాపములు కలుగును.

**24.** పంచమస్థభృగోర్దాయేపుత్రప్రాప్తింవినిర్దిశేత్ ।
కీర్తించరాజపూజ్యంచసర్వేషాముపకారకం ॥

పంచమమునఉన్న శుక్రదశలో-పుత్రప్రాప్తి, కీర్తి, రాజపూజ్యము, అందరికి ఉపకారముచేయుట కలుగును.

**25.** ద్విత్రికోణగతశ్శుక్రఃకరోతినృపపూజ్యతాం ।
యజ్ఞాదికర్మలాభంచగురుపిత్రోస్సుఖంయశః ॥

నవమస్థుడైన శుక్రునిదశలో-రాజపూజ్యత, యజ్ఞాది పుణ్యకర్మలు, గురుపులకు, తల్లిదండ్రులకు సుఖము కలుగును.

**26.** విత్తగశుక్రదశాయాంధనపతిమాహుర్ధనాయతించాపి ।
అన్నసుఖవాగ్విలాసంపరోపకారంనరేశసమ్మానం ॥

ద్వితీయమందున్న శుక్రునిదశలో - ధనాగారాధిపతి అగుట, ధనలాభము, అన్నసుఖము, వాగ్విలాసము, పరోపకారము, రాజసమ్మానము కలుగును.

**27.** తృతీయరాశిస్థితశుక్రదాయే ధైర్యంమనోత్సాహమదీనసత్వం ।
చిత్రాంబరాలంకృతవాహనాప్తింసహోదరాణాంబహుభాగ్యలాభం ॥

తృతీయమునఉన్న శుక్రునిదశలో-ధైర్యము, మానసోత్సాహము, ఎక్కువ బలము, చిత్రాంబరాలంకృత వాహనము, సోదరభాగ్యము కలుగును.

28. భృగోర్విపాకేరిగతస్యనాశంధాన్యార్థబంధ్వాత్మజసోదరాణాం ।
రోగంమహత్కార్యవినాశనంచశత్రోర్భయంభూపతివహ్నిచోరైః ॥

షష్టమందున్న శుక్రునిదశలో ధన, ధాన్య, బంధు, పుత్ర, సోదరులకు నష్టము, స్త్రీమూలక వ్యాధి, కార్యనాశము, శత్రుచోర రాజభయము కలుగును.

29. రంధ్రస్థితస్యాపిభృగోర్విపాకేశస్త్రాగ్నిచోరక్షతమన్నవిఘ్నం ।
క్వచిత్సుఖంకించిదుపైతివిత్తంక్వచిన్నరేశాత్తయశఃప్రతాపం ॥

అష్టమమందున్న శుక్రునిదశలో-శస్త్ర, అగ్ని, చోరులవలన కత్తిదెబ్బలు, అన్నవిఘ్నము, ఒకప్పుడు సుఖము, కొంచెము ధనము, ఒకప్పుడు రాజువలన కీర్తి ప్రతాపములు కలుగును.

30. లాభస్థితస్యాపిభృగోర్విపాకేసుగంధమాల్యాంబరరాజపూజ్యం।
పుత్రార్థసౌఖ్యంకృషివిక్రయంచదానంస్వనామాంకితపద్యజాలం ।

లాభమందున్న శుక్రునిదశలో-సుగంధము, మాల్యములు, వస్త్రములు, రాజ పూజ్యము, పుత్ర, ధనసౌఖ్యము, కృషి, విక్రయము, దానము, తనపేరున గద్య పద్యాలు కలుగును.

31. వ్యయగతశుక్రదశాయాంలభతేధాన్యార్థరాజసమ్మానం ।
స్థానచ్యుతింప్రవాసంమాతృవియోగంమనోవికారంచ ॥

వ్యయమందున్న శుక్రునిదశలో-ధనము, ధాన్యము, రాజసమ్మానము, స్థాన భ్రంశము, నిత్యసంచారము, మాతృవియోగము, మనోవికారము కలుగును.

32. జీవాంశగతస్యభృగోస్త్రీపుత్రవినాశనంకురుతే ।
కర్మసునిత్యంవిఘ్నోజననీక్లేశాన్వితోమనోదుఃఖం ॥

గురునవాంశగతుడయిన శుక్రునిదశలో-భార్యాపుత్రనాశము పుణ్యకర్మలకు విఘ్నము, తల్లికి క్లేశము, మనోదుఃఖము కలుగును.

33. సింహగశుక్రదశాయాంలభతేవివిధాపదంమనోదుఃఖం ।
ఉద్వేగరోగతప్తఃకర్మసుసఫలేషుసర్వదాభిరతః ॥

సింహగతుడయిన శుక్రునిదశలో-నానా ఆపదలు, మనోదుఃఖము, ఉద్వేగము కలిగించురోగముచే పరితాపము, సఫలమైన కర్మలందాసక్తి కలుగును.

34. అర్కగశుక్రదశాయాంజీర్ణగృహావాసజనవిరోధంచ ।
లభతేదారవినాశంభ్రాతృవియోగంచకలహంచ ॥

సూర్యునితోకూడిన శుక్రదశలో-ప్రాతబడిన ఇంటిలో నివాసము, జనవిరోధము, దారవినాశము, భాతృవియోగము, కలహము కలుగును.

35. శుక్రేస్థానబలాధికేనరపతేస్సన్మానసంభూషణంవిద్యావాదవినోదగోష్ఠిరనిశంనామద్వయంసంభవం ।
తస్మిణ్ దిక్ప్రబలాన్వితేబహుయశః పుత్రార్థదారాంబరంశుక్రేకాలబలాన్వితేసుఖధనంకీర్తించనామాంకితం ॥

స్థానబలము కలవాడైన శుక్రునిదశలో - రాజసమ్మానము, భూషణప్రాప్తి, విద్యావివాదగోష్ఠి, బిరుదుకలుగుట - దిగ్బలముకలిగిన శుక్రునిదశలో - అధికకీర్తి, భార్యాపుత్రులు, ధనము, సుఖము, వస్త్రములు, కలుగును. కాలబలముకల్గిన-సుఖము, ధనకీర్తులు, గౌరవబిరుదము, కలుగును.

36. నిసర్గవీర్యయుక్తస్యభృగోర్దాయేమహత్సుఖం ।
కృషిగోభూమివిత్తాదిభ్రాతృమాతృసుఖంభవేత్ ॥

నైసర్గికబలమున్న శుక్రదశలో-మహాసుఖము, గో, భూమి, కృషి, విత్తలాభము, భ్రాతృ, మాతృ సుఖము కలుగును.

37. వక్రంగతస్యాపిభృగోస్సుతస్యదశావిపాకేత్వతిరాజపూజ్యం ।
మృదంగభేరీరవయుక్తయానంవిచిత్రవస్త్రాభరణానిరాజ్యం ॥

వక్రియైన శుక్రునిదశలో-రాజపూజ్యము. మృదంగ. భేరీరవయుక్తమైన వాహనము, విచిత్రవస్త్రాభరణములు, రాజ్యము కలుగును.

38. దృగ్వీర్యయుక్తస్యభృగోర్విపాకేయజ్ఞాదికర్మాణికరోతికాలే ।
విద్యావిలాసంశయనాంబరంచనృపాభిషేకంకలహంవిరోధం ॥

దృగ్బలమున్న శుక్రునిదశలో-యజ్ఞయాగాది పుణ్యకర్మలు, విద్యావిలాసము, శయ్యా, పట్టువస్త్రముల సుఖము, రాజ్యాభిషేకము, కలహము, స్వజన విరోధము కలుగును.

39. క్రూరషష్ట్యంశసంయుక్తభృగోర్దాయేవిపద్భయం ।
చోరాగ్నిరాజభీతించకృషిగోభూమినాశనం ॥

క్రూరషష్ట్యంశయందున్న శుక్రునిదశలో-ఆపదలు, భయము, చోరాగ్నిరాజభీతి, గో, భూమి, కృషి, నాశము కలుగును.

40. సౌమ్యషష్ట్యంశసంయుక్తభృగోఃపాకేమహత్ఫలం ।
భూపారామతటాకానాంనిరా.జందేవపూజనం ।

సౌమ్య షష్ట్యంశయుక్తుడైన శుక్రునిదశలో-మహాఫలము, కూప, ఆరామ, తటాక నిర్మాణము, దేవపూజ జరుగును.

41. వైశేషికాంశసంయుక్తశ్శృగోర్దాయేమహత్సుఖం ।
వాహనంభూపసమ్మానంభ్రాతృస్త్రీధనసంపదః ॥

వైశేషికాంశమందున్న శుక్రునిదశలో-మహాసుఖము, వాహనప్రాప్తి, సంతోషము, రాజబహుమానము, సోదరస్త్రీ ధనము లభించుట జరుగును.

42. ఉచ్చాంశకసమాయుక్తోనీచరాశిసమన్వితః ।
కృషిగోభూమివాణిజ్యధనధాన్యవివర్ధనం ॥

శుక్రుడు ఉచ్చాంశలో ఉండి నీచరాశిలోఉన్నా - వ్యవసాయము, గోవులు, భూమి, వాణిజ్యము, ధన, ధాన్య వృద్ధి కలుగును.

43. ఉచ్చస్థేపినీచాంశేయుక్తఃశుక్రోతికష్టదః ।
కరోతిరాజ్యనాశంచస్థాననాశమథాపివా ॥

ఉచ్చరాశియైనా నీచాంశలోఉన్న శుక్రునిదశలో-అతికష్టము, రాజ్యనాశము, స్థాననాశము కలుగును.

44. క్రూరద్రేక్కాణసంయుక్తఃశృగోర్దాయేరిభీతిదం ।
కారాగృహంమహత్కష్టంనిగళంచోరపీడనం ॥

క్రూరద్రేక్కాణమునఉన్న శుక్రునిదశలో-అధికభయము, కారాగారప్రాప్తి, అధిక కష్టము, సంకెలలు, చోరపీడ కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున శుక్రదశాఫలమను
చతుర్వింశాధ్యాయము

---

# పంచవింశాధ్యాయము

1. మందోత్యుచ్చదశాయాంగ్రామసభామండలాధిపత్యంస్యాత్ ।
లభతేవినోదశీలంపితృనాశంబంధుకలహంచ ॥

పరమోచ్చరాశిలోనున్న శనిదశలో-గ్రామములకు, సభకు ఆధిపత్యము కలుగును. వినోద స్వభావము, పితృనాశము, బంధు కలహము కలుగును.

2. స్వోచ్చదశాయాంతురుతేదేశభ్రంశంమనోరుజందుఃఖం ।
వాణిజ్యవిత్తహానింకృషినాశంనృపవిరోధంచ ॥
ఉచ్చరాశియందున్న శనిదశలో-దేశముపట్టిపోవుట, మనస్సున రోగభయము, దుఃఖము, వాణిజ్యమున విత్తహాని కలుగుట, కృషినాశము, రాజవిరోధము కలుగును.

3. ఆరోహిణీవానరనాథసూనోర్దశావిపాకేనృపలబ్ధభాగ్యం ।
వాణిజ్యలాభంకృషిభూమిలాభంగోవాజియానంసుతదారలాభం ॥
ఆరోహదశలోఉన్న శనిదశలో-రాజువలన భాగ్యలాభము, వాణిజ్యలాభము, కృషిభూమి లాభము, గోవులు, అశ్వవాహనము, భార్యాపుత్రలాభము కలుగును.

4. దినేశసూనోస్త్వవరోహకాలేరాజ్యచ్యుతిందారసుతార్థనాశం ।
భాగ్యచ్యుతింభూపతికోపయుక్తంప్రేష్యత్వమాయాతిగుదాక్షిరోగం ॥
అవరోహమునసున్న శనిదశలో-రాజ్యభ్రష్టత్వము, భార్యాపుత్ర ధననాశము, భాగ్యనాశము, రాజకోపము, దాసుడుగా పనిచేయుట, మూలవ్యాధి, కంటిరోగము కలుగును.

5. నీచస్థితస్యాపిదినేశసూనోర్దాయేకళత్రాత్మజసోదరాణాం ।
నాశంమహత్కష్టతరంకృషేశ్చనీచానువృత్త్యాచమహైతివృత్తిం ॥
నీచరాశియందున్న శనిదశలో-భార్యాపుత్రులకు, సోదరులకు నాశము, కృషిహాని, కష్టఫలము, నీచులవద్ద పనిచేయుటచే జీవించుట జరుగును.

6. మూలత్రికోణనిలయస్యశనేర్దశాయాందేశాంతరావాసముపైతికాలే ।
నామద్వయంయదినభానగరాధిపత్యంవిద్వేషణంసుతకళత్ర
జనాదిభిర్వా ।
మూలత్రికోణమందున్న శనిదశలో-దేశాంతరవాసము, గౌరవబిరుదనామము కలుగుట, గ్రామ, సభ, దేశముల కాధిపత్యము, స్వపరజనవిరోధము, భార్యాపుత్ర విరోధము కలుగును.

7. స్వక్షేత్రగస్యచదశాదివసేశసూనోర్ద్వేషంకరోతిబలపౌరుషకీర్తిజాలం ।
రాజాశ్రయంకనకభూషణభృత్యలాభంధైర్యంస్వనామసదృశానుగుణం
చసౌఖ్యం ॥
స్వక్షేత్రగతుడయిన శనిదశలో-జనద్వేషము, బలము, పౌరుషము, కీర్తి కలుగును. రాజాశ్రయము, స్వర్ణభూషణప్రాప్తి, సేవకలాభము, ధైర్యశీలత, తన పేరుకు తగిన ఫలము కలుగును.

8. శనేర్దశాయామతిశత్రుగస్యస్థానచ్యుతింబంధువిరోధతాంచ ।
చోరాగ్నిభీతింభయమన్నవిఘ్నంభృత్యార్థదారాత్మజకోపమేతి ।

అధిశత్రుక్షేత్రమునసున్న శనిదశలో - స్థానచలనము, బంధువిరోధము, చోరాగ్నిబాధ, జనపీడ, అన్నవిఘ్నము, భృత్యులతో, భార్యాపుత్రులతో కోపము కలుగును.

9. దినేశసూనోస్త్వరిరాశిగస్యపైశ్యాద్ధనంప్రాప్యతిభూమినాశం ।
కృషేర్వినాశంస్వపదచ్యుతించవైరంసమాయాతినృపాలచోరైః ।

శత్రుస్థాన గతుడయిన శనిదశలో-వైశ్యునివలన ధనలాభము కలుగును. భూనాశము, వ్యవసాయ నష్టము, స్థానభంగము, రాజ, చోరకలహము, స్థానభ్రంశము కలుగును.

10. మిత్రక్షేత్రదశాయాంమందస్యతుశిల్పకర్మగుణవేత్తా ।
జ్ఞానంబలప్రతాపందదాతిదుఃఖంమహత్వంచ ।

మిత్రక్షేత్రమునసున్న శనిదశలో-శిల్పకర్మలోని గుణగ్రాహిత్వము, జ్ఞానము, ప్రబలప్రతాపము, ఎక్కువ దుఃఖము కలుగును.

11. అతిమిత్రమందదాయేదదాతిసౌఖ్యంనరేశసమ్మానం ।
సుతధనదారవిశేషాన్పశుకృషిమహదాదివాణిజ్యం ।

అధిమిత్రక్షేత్రమునసున్న శనిదశలో-సౌఖ్యము, రాజసన్మానము, భార్యాపుత్రులకు సుఖము, ధనప్రాప్తి, పశుకృషిలాభము, వాణిజ్యలాభము కలుగును.

12. సమర్థగస్యాపిశనేర్దశాయాంసమానబుద్ధింసుతదారమిత్రైః ।
భృత్యార్జనంబంధుజనేషువైరందేహస్యకార్శ్యంక్షయపిత్తవాతైః ।

సమక్షేత్రగతుడయిన శనిదశలో-భార్యాపుత్రమిత్రులతో సమబుద్ధికలిగియుండుట, భృత్యునివలన ధనలాభము, బంధువైరము, క్షయపిత్తవాతరోగములు కలుగుటచే శరీరము చిక్కుట జరుగును.

13. నీచఖేచరసంయుక్తశనిదాయేమహాద్భయం ।
విప్రలంభంప్రవాసంచనిజవృత్త్యానుజీవనం ।

నీచస్థగ్రహముతోకూడిన శనిదశలో-అధికభయము, మాటనిలబెట్టుకొనకపోవుట, దేశసంచారము, కులోచితవృత్తిచే జీవనము కలుగును.

14. ఉచ్చఖేచరసంయుక్తశనిదాయేమహత్సుఖం ।
కించిద్రాజ్యంకృషేర్లాభంభృత్యవర్గస్యనాశనం ।

ఉచ్చస్థుడైన గ్రహముతోకూడిన శనిదశలో-మహాసుఖము, కొద్దిగా రాజ్యప్రాప్తి, కృషిలాభము, భృత్యులులేకుండుట, జరుగును.

15. పాపాన్వితస్యాపిశనేర్దశాయాంపాపానిగూఢానికరోతికాలే ।
నీచస్త్రీయానంగమనంవిశేషాత్ చోరాదినీచైఃకలహంవివాదం ॥
పాపగ్రహముతోకలిసి శనిదశలో-గూఢముగా పాపకర్మలు చేయును. నీచ స్త్రీసంగమము, విశేషముగా చోరాదినీచులతో కలహము, వివాదమును సంభవించును.

16. శుభాన్వితస్యాపిశనేర్దశాయాంవిశేషతఃజ్ఞానముపైతికాలే ।
పరోపకారంనృపలబ్ధభాగ్యంకృష్ణానిధాన్యానికృషించలాభం ।
శుభగ్రహముతోకూడిన శనిదశలో—విశేషముగా జ్ఞానము పొందుట, పరోప కారము, రాజానుగ్రహమున భాగ్యము, నల్ల ధాన్యలాభము, కృషిలాభము కలుగును.

17. పాపేక్షితస్యాపిశనేర్దశాయాంభృత్యార్థదారాత్మజసోదరాణాం ।
నాశంసమాయాతిపరాపవాదంకుభోజనంకుత్సితగంధమాల్యం ॥
పాపగ్రహముచే చూడబడిన శనిదశలో-భార్యాపుత్రులకు, సోదరులకు, భృత్యులకు, ధనమునకు నాశము కలుగును. పరాపవాదము, కుత్సితభోజనము, కుత్సితమైన గంధమాల్యములు తటస్థమగును.

18. శుభేక్షితస్యాపిశనేర్దశాయాంస్త్రీపుత్రభృత్యార్థముపైతికాలే ।
పశ్చాదుపైత్యత్రమహత్వకష్టంగోభూమివాణిజ్యకృషేర్వినాశం ।
శుభగ్రహదృష్టుడైన శనిదశలో-భార్యాపుత్రుల సుఖము, భృత్య, ధనలాభము, దశాదిలో ఈ ఫలితములు, తరువాత-అధిక కష్టాలు, గో, భూ, వాణిజ్య, కృషిల వినాశము కలుగును.

19. కేంద్రాన్వితశనేర్దాయేకలహాయాసపీడనం ।
పుత్రమిత్రార్థదారాదిబహూనాంమరణంధ్రువం ॥
కేంద్రములందున్న శనిదశలో - కలహము, ఆయాసము, పీడ భార్యాపుత్ర మిత్రులబాధ కలుగును. (మరణమన్న బాధయే).

20. లగ్నసంస్థశనేర్దాయేదేహకృచ్ఛ్రముపైతిచ ।
స్థానచ్యుతింప్రవాసంచమాతృతద్వర్గనాశనం ॥
లగ్నమందున్న శనిదశలో-శరీరకష్టము, స్థానభ్రంశము, దేశసంచారము, తల్లికిగాని, తల్లివైపువారికిగాని కష్టము కలుగును.

21. చతుర్థస్థశనేర్దాయేరాజకోపంశిరోరుజం ।
గృహదాహంపదభ్రంశంచోరాత్తిన్నృపపీడనం ॥
చతుర్థమందున్న శనిదశలో-రాజకోపం, తలనొప్పి, ఇల్లు తగులబడుట, ఉద్యోగముపోవుట, రాజచోర వ్యాధిపీడ కలుగును.

22. దారరాశిగతస్యాపిశనేర్దాయేరిపీడనం ।
మూత్రకృచ్ఛ్రంమహాద్వేషంస్త్రీహేతోర్మరణంధ్రువం ॥
సప్తమమందున్న శనిదశలో-శత్రుపీడ, మూత్రకృచ్ఛ్రము, ద్వేషము, స్త్రీ మూలకంగా మరణము కలుగును.

23. దశమస్థశనేర్దాయేకర్మనాశముపైతిచ ।
దేశాంతరంపదభ్రంశంనిగళంరాజపీడనం ॥
దశమమందున్న శనిదశలో-కర్మనాశము, దేశాంతరగమనము, ఉద్యోగ నాశము, సంకెలలుపడుట, రాజపీడ కలుగును.

24. ద్వితీయస్థశనేర్దాయేవిత్తనాశంగుదాక్షిరుక్ ।
రాజకోపంమనస్తాపంఅన్నద్వేషంమనోరుజం ॥
ద్వితీయమందున్న శనిదశలో-ధననాశము, మూలవ్యాధి, నేత్రవ్యాధి, రాజ కోపము, మనస్తాపము, అన్నద్వేషము, మనోవ్యాధి కలుగును.

25. పంచమస్థశనేర్దాయేపుత్రనాశంమనోరుజం ।
రాజకోపంభృత్యనాశంబంధుస్త్రీచిత్తవిభ్రమం ॥
పంచమమందున్న శనిదశలో-పుత్రనాశము, మనోవ్యాధి, రాజకోపము, భృత్యులులేకుండుట, బంధువులకు, భార్యకు మతిచెడుట జరుగును.

26. షష్ఠగరవిసూనోస్తుదశాకాలేరిపీడనం ।
వ్యాధిచోరవిషైర్బాధాగృహక్షేత్రవినాశనం ।
షష్ఠమందున్న శనిదశలో-శత్రుపీడ, వ్యాధి, చోర, విషబాధ, గృహక్షేత్ర నాశము కలుగును.

27. తృతీయస్థశనేర్దాయేకృషిగోధనసంపదః ।
మనోధైర్యంమహోత్సాహంభ్రాతషడ్వర్గనాశనం ॥
తృతీయమందున్న శనిదశలో-కృషి, గోధన సంపత్తులు, మనోధైర్యము, మహోత్సాహము, భ్రాతషడ్వర్గము నశించును.

28. మరణపదస్థోమందఃకరోతినిత్యంసుతార్థనాశంచ ।
రాజ్యంభృత్యజనానాంగోమహిషీభూమిదారనాశంవా ॥
అష్టమమందున్న శనిదశలో-పుత్రులకు, ధనమునకు నిత్యమునాశము, లేదా రాజభృత్యజనులకు, గో, మహిషీ భూములకు, భార్యకును నాశముకాని అగును.

29. నవమగతమందదాయేపిత్రోర్నాశంగురోస్తథైవాపి ।
లభతేవిదేశయానంస్వకులోజ్ఞాతేర్వినాశముపయాతి ॥

నవమమందున్న శనిదశలో - తల్లిదండ్రులకు నాశము, గురువుకున్ను నాశము, విదేశయానము, తనకులమువారికి నాశము కలుగును.

30. లాభగమందదశాయాంలభతేవివిధార్థసౌఖ్యసమ్మానం ।
సుతదారభృత్యసౌఖ్యంమనోవిలాసంకృషేశ్చలబ్ధధనం ।

లాభమందున్న శనిదశలో-నానా విధములయిన పదార్థములు, సౌఖ్యము, సన్మానము, భార్యాపుత్ర భృత్యుల సుఖము, మనోవిలాసము, కృషివలన లాభము కలుగును.

31. వ్యయగతమందదశాయాంహీనంచోరాగ్నిభూపసంఘైశ్చ ।
వివిధాపదంచదుఃఖంవిదేయానంచబంధునాశంచ ॥

వ్యయగతుడయిన శనిదశలో-చోర, అగ్ని, రాజులచే బాధింపబడి ద్రవ్యహీనతయు, అనేక ఆపదలు, దుఃఖము, విదేశయానము, బంధునాశము కలుగును.

32. అర్కగమందదశాయాంస్వజనైర్ద్వేషంపరస్త్రియంలభతే ।
భృత్యాపత్యవిరోధంమహోద్యమందోషపరిభూతం ॥

రవితో కలిసిన శనిదశలో-స్వజనద్వేషము, పరస్త్రీ సంగమము, భృత్యులతోను, సంతానముతోను విరోధము, చెడుకార్యముచేయ నుత్సాహించుట జరుగును.

33. నీచాంశమందదాయేనీచాచారాచ్చజీవనంలభతే ।
సర్వేషాంప్రేష్యత్వంధనసుతదారైశ్చవిగ్రహందుఃఖం ॥

నీచనవాంశను పొందిన శనిదశలో-నీచమైన ఆచారముచే జీవనము గడపును. అందరికి భృత్యుడై, భార్యాపుత్రులతో విరోధము, దుఃఖము కలుగును.

34. ఉచ్చాంశమందదాయేవివిధసుఖానందభోగభాగ్యైశ్చ ।
కురుతేవిదేశయానంగ్రామసభామండలాధిపత్యంవా ॥

ఉచ్చాంశలోనున్న శనిదశలో-వివిధమైన సుఖానంద భోగభాగ్యములు, విదేశయానము, లేదా గ్రామ, సభా, మండలాధిపత్యముగాని కలుగును.

35. ఆదౌశనేర్దశాయాంకష్టంతుభ్రాతృనాశనంకురుతే ।
మధ్యేవిదేశయానంపరగృహవాసంపరాన్నభుక్త్యంతే ॥

శనిదశ ఆదిలో-కష్టము, భ్రాతృనాశము చేయును. మధ్యలో-విదేశయానము, పరగృహవాసము, అంతమున-పరాన్నభుక్తి కలుగును.

36. స్థానవీర్యయుతమందదశాయాందారపుత్రధనకీర్తిముపైతి ।
చోరశత్రునృపవహ్నిభయంవాబంధునాశనమథాక్షిగుదార్తిం ॥

స్థానబలమున్న శనిదశలో-భార్యాపుత్ర ధనములతో కీర్తి పొందును. చోర, రాజాగ్ని భయముగాని, బంధునాశముగాని, మూలరోగము, అక్షిరోగము కలుగును.

37. మందస్యదిగ్వీర్యయుతస్యదాయేదిగంతరాదా ప్తసుఖాత్మకీర్తిం ।
భూఖృత్యదారాత్మజసోదరాణాంవినాశనంబంధుజనైర్విరోధం ॥
దిగ్బలమున్న శనిదశలో-దిగంతముల వ్యాపించిన కీర్తి, భూనాశము, భార్యాపుత్ర, భృత్యసోదరులకు నాశము, బంధు విరోధము కలుగును.

38. కాలవీర్యయుతమందదశాయాంకాలకూటవిషభీతిముపైతి ।
దారపుత్రనృపచోరభయంవాధాన్యభూమికృషివాహనలాభం ॥
కాలబలమున్న శనిదశలో-విషభయము, భార్యాపుత్రభయము, నృపచోరాగ్నిభయము, ధాన్య, భూమి, కృషి, వాహనలాభము కలుగును.

39. వక్రచారగతోమందఃకరోతివిఫలక్రియాం ।
ఉద్యోగభంగందుఃఖంచసోదరార్థవినాశనం ॥
వక్రచారములోఉన్న శనిదశలో-క్రియలు వ్యర్థములగుట, ఉద్యోగము పోవుట, దుఃఖము, సోదరులు, ధనము నశించుట జరుగును.

40. క్రూరషష్ట్యంశసంయుక్తశనిదాయేమహద్భయం ।
నృపకోపంపదభ్రంశంకారాగృహనివేశనం ॥
క్రూర షష్ట్యంశలోనున్న శనిదశలో-మహాభయము, రాజకోపము, పదవి పోవుట, కారాగారవాసము జరుగును.

41. సౌమ్యషష్ట్యంశసంయుక్తశనిదాయేమహత్సుఖం ।
దారపుత్రార్థసంపత్తింలభతేబంధువిగ్రహః ॥
సౌమ్యషష్ట్యంశలోఉన్న శనిదశలో-మహాసుఖము, భార్యాపుత్ర ధనసంపత్తి, బంధు విరోధము కలుగును.

42. వైశేషికాంశసంయుక్తశ్శనిస్సౌఖ్యంకరోతిచ ।
విశేషాద్రాజసన్మానంవిచిత్రాంబరభూషణం ॥
వైశేషికాంశలోఉన్న శనిదశలో-సౌఖ్యము, విశేషించి రాజసన్మానము, విచిత్ర వస్త్రములు, భూషణములు లభించును.

43. క్రూరద్రేక్కాణసంయుక్తశనిదాయేమహద్భయం ।
ఉద్బంధనంవిషాద్భీతింనృపచోరాగ్నిజంభయం ॥
క్రూరద్రేక్కాణమునఉన్న శనిదశలో - మహాభయము, ఉరితీసికొనుట, విషమువలన, రాజచోరాగ్నులవలన భయము కలుగును.

44. నీచరాశిగతోమందస్స్వోచ్చాంశకసమన్వితః ।
దశాదౌదుఃఖమాసాద్యదశాంతేత్వతిసౌఖ్యదః॥

శనినీచరాశిలోఉన్నా, ఉచ్చాంశలోఉన్నయెడల-దశాదిలో దుఃఖముకల్గజేసి, దశాంతమున అతిసౌఖ్యము నిచ్చును.

45. ఉచ్చరాశిగతోమందోనీచాంశకసమన్వితః ।
దశాదౌసుఖమాసాద్యదశాంతేకష్టతాభవేత్ ॥

శని ఉచ్చరాశిలోఉన్నా నీచాంశలోఉన్నట్లయిన - దశాదిలో సుఖమునిచ్చి, దశాంతమున కష్టము నిచ్చును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున-శనిదశాఫలమను
పంచవింశాధ్యాయము

## షడ్వింశాధ్యాయము

1. రాహోర్వృషశ్చకేతోస్తువృశ్చికంతుంగసంజ్ఞికం ।
మూలత్రికోణంకర్కిచక్రియామిత్రభముచ్యతే ॥

రాహువునకు వృషభము, కేతువునకు వృశ్చికము ఉచ్చరాశులు; కర్కాటకము, మూలత్రికోణమున్ను, మేషము మిత్రక్షేత్రము రాహువునకు.

2. ఏతత్సప్తమరాశిస్తుకేతోర్మూలత్రికోణభం ।
షష్ఠాష్టరిప్ఫగేరాహౌతద్దాయేకష్టదోభవేత్ ॥

మకరము కేతువునకు మూలత్రికోణరాశి యగును. 6, 8, 12 లందున్న రాహుదశ కష్టఫలము నిచ్చును.

3. ఉచ్చస్థసైంహికేయస్తుతద్దాయేసుఖదోభవేత్ ।
రాజ్యంకరోతిపుత్రాప్తింధనధాన్యాభివర్ధనం ॥

ఉచ్చస్థుడైన రాహుదశ సౌఖ్యమును, రాజ్యప్రాప్తిని, పుత్రసంతానమును, ధన, ధాన్యాభివృద్ధిని ఇచ్చును.

4. రాహుర్నీచస్థితోదాయేచోరాగ్నినృపభీతిదః ।
ఉద్బంధనవిషాద్భీతింకురుతేసింహికాసుతః ॥

నీచస్థుడైన రాహుదశలో-రాజచోరాగ్ని భయము, ఉరి, విషభయములు కలుగును.

5. రాహోర్దశాయాన్సంప్రాప్తౌనృపచోరాగ్నిపీడనం ।
విదేశయానందుఃఖార్తింవనవాసాద్భయంధ్రువం ॥

రాహుదశలో సామాన్యముగా-రాజచోరాగ్నిపీడ, విదేశయానము, దుఃఖము, వనవాసభయము కలుగును. శుభవర్గమున ఉన్నపుడు, శుభమును, పాపవర్గమునఉన్నపుడు పాపఫలమునిచ్చుట అందరికి సహజమే అట్లుగాక-నైజముగా రాహుదశ కష్టముల నిచ్చుననెడి అభిప్రాయముతో ఇట్లు చెప్పియున్నాడు గ్రంథకర్త అని తోచును.

6. లగ్నగతరాహుదాయేబుద్ధివిహీనంవిషాగ్నిశస్త్రాద్యైః ।
బంధువినాశంలభతేదుఃఖార్తిపరాజయంసమరే ॥

లగ్నము నందున్న రాహుదశలో-బుద్ధిహీనత, విష, అగ్ని, శస్త్రాదులచే బంధునాశము, దుఃఖబాధ యుద్ధమున పరాజయము కలుగును.

7. రాహోర్దశాయాంధనరాశిగస్యరాజ్యంచవిత్తంహరతేవిశేషాత్ ।
కుభోజనంతుప్తితరాజసేవాంమనోవికారంత్వనృతంప్రకోపం ॥

ద్వితీయమందున్న రాహుదశలో-రాజ్య, ధననాశము, కుభోజనము, నీచరాజసేవ, మనోవికారము, అసత్యము, కోపము కలుగును.

8. తృతీయరాశిస్థితరాహుదాయేపుత్రార్థదారాత్మజసోదరాణాం ।
సౌఖ్యంకృషేర్వర్ధనమాధిపత్యంవిదేశయానంనరపాలపూజ్యం ॥

తృతీయమందున్న రాహుదశలో-భార్యాపుత్ర, ధన, సోదరులకు సౌఖ్యము, కృషివృద్ధి, అధికారము, విదేశయానము, రాజపూజ్యత కలుగును.

9. చతుర్థరాశిస్థితరాహుకాలేమాతుర్వియోగంత్వథవాతదీయం ।
క్షేత్రార్థనాశంనృపతేఃప్రకోపంయానాదిపాతిత్యమనేకదుఃఖం ॥

చతుర్థమందున్న రాహుదశలో-మాతృ వియోగము, లేదా తల్లితరపు బంధు వియోగము, భూ, ధననాశము, రాజకోపము, వాహనమునుండిపడుట, అనేక దుఃఖములు కలుగును.

10. చోరాగ్నిబంధ్వార్తిమనోవికారందారాత్మజానామపిరోగపీడాం ।
చతుర్థరాశిస్థితరాహుదాయేప్రభగ్నపుత్రాదికళత్రవర్గం ॥

మరియు, చతుర్థమున ఉన్నపుడు-చోర, అగ్ని, బంధువులవలన బాధ, మనోవికారము, భార్యాపుత్రులకు రోగపీడ, పుత్రకళత్రవర్గమునకు కష్టము కలుగును.

11. బుద్ధిభ్రమంభోజనసౌఖ్యనాశంమహావివాదంకలహంచదుఃఖం ।
కోపంనరేంద్రస్యసుతస్యనాశంరాహుస్సుతస్థోపిదశావిపాకే ॥

పంచమమందున్న రాహుదశలో-మతితిరగడం, భోజనసౌఖ్యము లేకుండుట, వివాదము, కలహము, దుఃఖము, రాజకోపము, పుత్రనాశము కలుగును.

12. దశావిపాకేత్వరిగస్యరాహోశ్చౌరాగ్నిభూపైర్భయమాప్తనాశం ।
ప్రమేహగుల్మక్షయపిత్తరోగంత్వగ్దోషరోగంత్వథవామృతిర్వా ॥
షష్టమందున్న రాహుదశలో-రాజాగ్ని చోరబాధ, మిత్రనాశము, ప్రమేహము, గుల్మవ్యాధి, పైత్యరోగము, చర్మరోగము లేదా మరణము కలుగును.

13. కళత్రరాశిస్థితరాహుదాయేకళత్రనాశంనముపైతిశీఘ్రం ।
విదేశయానంకృషిభాగ్యహానిస్సర్పాద్భయంభృత్యసుతార్థనాశం ॥
సప్తమమందున్న రాహుదశలో-భార్యానాశము, విదేశయానము, భాగ్యము, కృషి నశించుట, సర్పభయము, భృత్య, సుత, ధననాశము కలుగును.

14. రాహోర్దశాయాంనిధనస్థితస్యయమాలయంయాతిసుతార్థనాశం ।
చోరాగ్నిభూపైఃస్వకులోద్భవైశ్చభయంమృగైర్వావనవాసదుఃఖం ॥
అష్టమమందున్న రాహుదశలో-మరణము కలుగును. పుత్రధననాశము, చోర, రాజ, అగ్ని జ్ఞాతులవలన భయము, మృగభయము, వనవాస దుఃఖము కలుగును.

15. రాహోర్దశాయాంనవమస్థితస్యపిత్రోర్వినాశంలభతేమనుష్యః ।
విదేశయానంగురుబంధునాశంస్నానంసముద్రస్యసుతార్థనాశం ॥
నవమస్థిత రాహుదశలో-తల్లిదండ్రులు చనిపోవుట, విదేశయానము, గురు, బంధునాశము, సముద్రస్నానము, పుత్ర, ధననాశము కలుగును.

16. మానస్థితస్యాపిదశావిపాకేరాహోఃప్రవృత్తింలభతేమనుష్యః ।
పురాణధర్మశ్రవణాదిభిశ్చగాంగేయతోయైరతిశుద్ధదేహః ॥
దశమమందున్న రాహుదశలో-పురాణ ధర్మశ్రవణము, గంగాస్నానము, లభించును

17. సౌమ్యర్క్షసంస్థేశుభభావేద్ధిప్రోక్తంయదేతత్ఫలంతదేవ ।
పాపర్క్షగశ్చేచ్ఛుభమన్యథాస్యాత్‌దేశాంతరావాసముపైతికాలే ॥
దశమము శుభక్షేత్రమైన పైన చెప్పిన ఫలము కలుగును. పాపరాశియైన దేశాంతరవాసము, అశుభము జరుగును.

18. పాపక్షేత్రగతేరాహౌకర్మస్థేపాపసంయుతే ।
అఖిలస్త్రస్తదాకాలేపుత్రదారాగ్నిపీడనం ॥
రాహువు పాపక్షేత్రమైన దశమమున ఉండగా-వానిదశలో-పరస్త్రీగమనము. బ్రహ్మహత్యాదులచే దూషింపబడుట, భార్యాపుత్ర, అగ్నిపీడ కలుగును.

19. ఆయరాశిగతోరాహుఃతత్పాకేరాజమానసం ।
ధనాప్తింధాన్యలాభంచగృహక్షేత్రార్థసంపదః ॥
లాభరాశిగతుడయిన రాహుదశలో-రాజసన్మానము, ధన, ధాన్యలాభము, గృహ, భూ, ధనసంపత్తులు కలుగును.

20. వ్యయగతరాహుదశాయాందేశభ్రంశంమనోరుజంలభతే ।
విచ్ఛిన్నదారపుత్రంకృషిపశుధనధాన్యసంపదాంనాశం ॥
వ్యయమందున్న రాహుదశలో-స్వదేశము విడిచిపోవుట, మనోవ్యాధి, భార్యా పుత్రులకు విచ్ఛిత్తి, కృషి, పశు, ధన, ధాన్య, సంపత్తులకు నాశము కలుగును.

21. కుళీరగోమేషయుతస్యరాహోర్దశావిపాకేధనలాభమేతి ।
విద్యావినోదంనృపమానసంచకళత్రభృత్యాత్మసుఖంప్రయాతి ॥
కర్కాటక, వృషభ, మేషములందున్న రాహుదశలో-ధనలాభము, విద్యా వినోదము, రాజసన్మానము, కళత్ర, భృత్యులకు, తనకు సుఖము కలుగును.

22. పాథోనమీనాశ్వయుతస్యరాహోర్దశావిపాకేసుతదారలాభం ।
దేశాధిపత్యంనరవాహనంచదశావసానేసకలంవినాశం ॥
కన్యా, మీన, ధనూరాశులలోఉన్న రాహుదశలో-భార్యాపుత్రసుఖము, దేశాధి పత్యము, నరవాహనము (పల్లకి) కలుగును. దశాంతమున అన్నియు నశించును.

23. పాపర్షయుక్తస్యఫణీంద్రదాయేదేహస్యకార్శ్యంస్వకులస్యనాశం ।
భూపాద్భయంవంచనచోరభీతింప్రమేహకాసక్షయమూత్రకృచ్ఛ్రం ॥
పాపరాశియందున్న రాహుదశలో-శరీరము చిక్కుట, స్వకులనాశము, రాజ భయము, వంచకుల, చోరులభయము, ప్రమేహము, కాసశ్వాసలు, క్షయ, మూత్ర కృచ్ఛ్రము కలుగును.

24. పాపదృష్టియుతోరాహుఃకర్మనాశంకరోతిచ ।
ఉద్యోగభంగందేహార్తించోరాగ్నినృపపీడమ్ ॥
పాపదృష్టుడైన రాహుదశలో-కర్మనాశము, ఉద్యోగభంగము, దేహబాధ, రాజ, చోర, అగ్నిబాధ కలుగును.

25. శుభదృష్టియుతోరాహుఃకరోతిసఫలక్రియాం ।
రాజమానసమర్థాప్తింబంధూనాంమరణంధ్రువం ॥
శుభదృష్టి కలిగిన రాహుదశలో-కార్యములు సఫలమగును, రాజసన్మానము, ధనప్రాప్తి, బంధుమరణము కలుగును.

26. ఉచ్చగ్రహయుతోరాహుఃరాజ్యలాభంకరోతిచ ।
స్త్రీపుత్రధనసంయుక్తంవస్త్రాభరణలేపనం ॥

ఉచ్చస్థగ్రహముతోకూడిన రాహువు రాజ్యలాభమును, భార్యాపుత్ర ధనము లను, వస్త్ర, ఆభరణ, లేపనములను కలగజేయును.

27. నీచగ్రహయుతోవాపినీచవృత్త్యానుజీవనం ।
కుభోజనంకుదారంచపుత్రాన్ లభతేతథా ॥

నీచస్థ గ్రహయుతుడయిన రాహుదశలో-నీచవృత్తిచే జీవించుట, కుత్సిత భోజనము, కుత్సితమైనభార్య, కుత్సితులైన పుత్రులు కలుగుదురు.

28. దశాదౌదుఃఖమాప్నోతిదశామధ్యేసుఖంయశః ।
దశాంతేస్థాననాశంచగురుపిత్రాదినాశనం ॥

రాహుదశలో సాధారణముగా-దశాదిలో సుఖము, కీర్తి, దశాంతమున-స్థాన భ్రంశము, గురు, పితాదినాశనము కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున రాహుదశాఫలమను
షడ్వింశాధ్యాయము

## సప్తవింశాధ్యాయము

1. భార్యాపుత్రవినాశనంనరపతేర్భీతింమహత్కష్టతాం ।
విద్యాబంధుధనాప్తిమిత్రనిహతించోరాగ్నిమిత్రైర్భయం ।
యానారోహణపాతనంవిషజలైశ్శస్త్రాగ్నిభిర్వాభయం ।
దేశాద్దేశవివాసనంకలిరుజంనభ్యాదిభిర్వాభయం ॥

కేతుమహాదశలో సామాన్యముగా-భార్యాపుత్రులకు కష్టము, రాజభయము, మహాకష్టము, విద్యా, బంధు, ధనబాధము, మిత్రహాని, చోర, అగ్ని, మిత్రులవలన భయము, వాహనమునుండి పడుట, విష, జల, శస్త్ర, అగ్నిభయము, స్వదేశము నుండి విదేశము వెళ్లుట, పాపవ్యాధి భయము, స్నేహితులవలన భయము కల్గును.

2. కేతోర్దశాయాస్సంప్రాప్తౌదారపుత్రవినాశనం ।
రాజకోపంమనస్తాపంచోరాగ్నికృషినాశనం ॥

కేతుదశ వచ్చినదనగానే-భార్యాపుత్రులకు కష్టము, రాజకోపము, మనఃపరి తాపము, చోర, అగ్నిబాధ, కృషినాశనము కలుగును.

3. కేంద్రస్థస్యదశాకేతోః కరోతివిఫలక్రియాం ।
రాజ్యార్థసుతదారాణాంనాశనంఫలక్రియాం ॥
కేంద్రమందున్న కేతుదశలో-కార్యములు విఫలములగుట, రాజ్య, ధన, భార్యాపుత్రులకు నష్టము కలుగును.

4. లగ్నకేంద్రగతస్యాపి కేతోర్దాయేమహద్భయం ।
జ్వరాతిసారమేహంచస్ఫోటకాదివిషూచికాం॥
లగ్నగతుడయిన కేతుదశలో - మహాభయము, జ్వరము, అతిసారము, మేహము, స్ఫోటకము, విషూచివ్యాధి కలుగును

5. ధనరాశిగతస్యాపి కేతోర్దాయేధనవ్యయం ।
వాక్పారుష్యంమనోదుఃఖంకుత్సితాన్నంశిరోరుజం ॥
ధనరాశిలోనున్న కేతుదశలో-ధనవ్యయము, వాక్పారుష్యము, మనోదుఃఖము, కుత్సితాన్నము, శిరోబాధ కలుగును.

6. తృతీయరాశిగస్యాపి కేతోర్దాయేమహత్సుఖం ।
మనోవిద్వేషమాయాతిభ్రాతృవిద్వేషణంకలిం ॥
తృతీయమందున్న కేతుదశలో-అధికసుఖము, మనస్సులో ద్వేషము, సోదర కలహము, పాపకర్మలుచేయుట జరుగును.

7. చతుర్థరాశిగస్యాపి కేతోర్దాయేసుఖక్షయం ।
ప్రభగ్నదారపుత్రాదిగృహధాన్యప్రహర్షితం ॥
చతుర్థమందున్న కేతుదశలో-సుఖనాశము, భార్యాపుత్రాదులకు కష్టము, గృహ, ధాన్య సంతోషములు కలుగును.

8. పంచమస్థస్యకేతోస్తుదశాకాలేసుతక్షయం ।
బుద్ధిభ్రంశంవిశేషేణరాజకోపాద్ధనక్షయం ॥
పంచమస్థుడయిన కేతుదశలో-పుత్రనాశము, మతిభ్రంశము, విశేషించి రాజకోపమున ధననాశము కలుగును.

9. కేతోస్త్వరిగతస్యాపిదశాయాంమహదాపదం ।
చోరాగ్నివిషభీతింతదృణాప్తింసముపైతిచ ॥
షష్ఠమందున్న కేతుదశలో-మహాపదలు, చోరాగ్ని విషభీతి, ఋణము చేయుట జరుగును.

10. కళత్రరాశిసంయుక్తకేతోర్దాయేమహద్భయం ।
దారపుత్రార్థనాశంచమూత్రకృచ్ఛ్రింమనోరుజం ॥

సప్తమమందున్న కేతుదశలో-మహాభయము, భార్యాపుత్రులకు కష్టము, ధన నాశము, మూత్రకృచ్ఛ్రము, మనోరోగము కలుగును.

11. కేతోరష్టమయుక్తస్యదశాకాలేమహద్భయం ।
స్థాననాశఃపితుర్మృత్యుఃశ్వాసకాసక్షయాన్వితః ॥

అష్టమమందున్న కేతుదశలో-మహాభయము, స్థానభ్రంశము, పితృమరణము, శ్వాసకాసలు, క్షయ కలుగును.

12. నవమస్థస్యకేతోస్తుదశాపాకేపితుర్విపత్ ।
గురోర్వావిపదందుఃఖంశుభకర్మవినాశనం ॥

నవమస్థుడైన కేతుదశలో-పితృదుఃఖము, పెద్దలకైనా విపత్తు, దుఃఖము, శుభకర్మ చెడుట జరుగును.

13. కర్మస్థకేతోర్దాయేతుదశాయాందుఃఖమేతిచ ।
మానహానిర్మనోజాడ్యంత్వపకీర్తింమనోరుజం ॥

దశమమందున్న కేతుదశలో-దుఃఖము, మానహాని, మనోవ్యాధి, అపకీర్తి, కలుగును.

14. లాభస్థకేతోస్సంప్రాప్తేదాయేసౌఖ్యంకరోతిచ ।
భ్రాతృవర్గాదిసౌఖ్యంచయజ్ఞదానవివర్ధనం ॥

లాభమందున్న కేతుదశలో-సౌఖ్యము, సోదరసౌఖ్యము, యజ్ఞ దానాదివృద్ధి కలుగును.

15. రిపుస్థకేతోఃసంప్రాప్తేదాయేకష్టతరంభవేత్ ।
స్థానచ్యుతింప్రవాసంచరాజపీడాక్షినాశనం ॥

వ్యయమందున్న కేతుదశలో-కష్టతరము, స్థానభ్రంశము, విదేశములకు పోవుట, రాజపీడ, కంటికినాశము కలుగును.

16. దశాదౌదుఃఖమాప్నోతిదశామధ్యేమహద్భయం ।
దశాంతేరాజభీతిస్స్యాత్ దేహనాశమథాపివా ॥

కేతు దశాదిలో దుఃఖము, దశామధ్యలో మహాభయము, దశాంతమున రాజ భయము, లేదా దేహనాశము-మరణము కలుగును.

17. శుభవీక్షణయుక్తస్యకేతుస్సౌఖ్యంకరోతిచ ।
రాజ్యార్థగృహకాంతించరాజపూజ్యమహాదృఢం ॥

శుభదృష్టి కలిగిన కేతుదశలో-సౌఖ్యము, రాజ్య, ధన, కాంతులు, రాజ పూజ్యత, బుద్ధి దృఢముగానుండుట జరుగును.

18. పాపేక్షితేయుతేవాపిపితృదుఃఖంకరోతిచ ।
జ్వరాతిసారమేహంచత్వగ్రోగంచారిపీడనం ॥
పాపునితో కలిసినా, చూడబడినా-తండ్రికి దుఃఖము, జ్వరము, అతిసారము, మేహము, చర్మరోగము, శత్రుపీడ కలుగును.

ఇది సర్వార్థ చింతామణి-ఆంధ్ర తాత్పర్యమున—కేతుదశాఫలమను
సప్తవింశాధ్యాయము



# అ ష్టా వి ం శా ధ్యా య ము

1. తేజస్వినమతిసుఖినంసుస్థిరవిభవంనృపాచ్ఛలబ్ధధనం ।
స్వనవాంశకబలయుక్తః పురుషంకుర్యాద్ధనాన్వితంఖ్యాతం ॥
స్వనవాంశయందుండు గ్రహము తన అంతర్దశలో—జాతకునకు తేజస్సును, సుఖమును, స్థిరసంపదను, కీర్తిని , రాజువలన ధనమును కలుగజేయును.

2. శుభదర్శనబలయుక్తః పురుషంకుర్యాద్ధనాన్వితంఖ్యాతం ।
సుభగంప్రధానమమలంస్వరూపబోధంచదేహసౌఖ్యంచ ॥
శుభగ్రహదృష్టితో బలము కలిగిన గ్రహము, ధనము, కీర్తి, అందము, ప్రాధాన్యము, స్వచ్ఛత, ఆత్మజ్ఞానము, దేహసౌఖ్యము కలుగజేయును.

3. అన్యోన్యషష్ఠాష్టమదాయకాలేనృపాద్భయంశత్రుజనైర్విరోధం ।
స్త్రీయావిరోధంసుతదారనాశంచోరాగ్నిబంధ్వార్తిమనోవికారం ॥
దశాంతర్దనాధులకు పరస్పరము షష్టాష్టకమున్న – రాజభయము, శత్రువిరోధము, స్త్రీ విరోధము, భార్యాపుత్రకష్టము, చోరాగ్నిబాధ, బంధుబాధ, మనోవికారము కలుగును.

4. పాకేశ్వరాదంత్యగతన్యభుక్తౌస్థానచ్యుతింబంధుజనైర్విరోధం ।
విదేశయానంస్వజనైర్విరోధంపాదాక్షిహృద్రోగముపైతికాలే ॥
దశానాధునకు వ్యయమందున్న—ఇద్దరికి ద్విర్ద్వాదశమగును. అట్టిస్థితిలో స్థానచలనము, బంధునిరోధము, విదేశయానము, స్వజనవిరోధము, పాదములకు, కన్నులకు, హృదయమునకు రోగము కలుగును.

5. దశాధిపేనాపియుతస్యభుక్తౌ స్త్రీపుత్రభృత్యార్థకృషిర్వినాశం ।
ఉద్యోగభంగంస్వజనస్యకష్టమాకస్మికందూషణమేతికాలే ॥
దశానాధునితో కూడియున్న గ్రహము అంతర్దశలో-భార్యా, పుత్ర, కృషి, వినాశము, ఉద్యోగభంగము, తనవారికి కష్టము, అనుకోకుండా తిట్లు కలుగును.

6. దశాధిపాద్విత్తగతస్యభుక్తౌమృష్టాన్నపానాంబరగంధమాల్యం ।
పరోపకారంస్వజనస్యసౌఖ్యంస్త్రీపుత్రబంధ్వాత్మమనోవిలాసం ॥
దశానాధునకు ద్వితీయమందున్న గ్రహము అంతర్దశలో-మృష్టాన్న పాన ములు, గంధమాల్యములు, పరోపకారము, స్వజనసౌఖ్యము, భార్యాపుత్ర బంధుపు లకు, తనకును, మనోవిలాసము కలుగును.

7. దశాధిపాత్సోదరరాశిగస్యభుక్తౌనృపాద్విత్తముపైతిసౌఖ్యం ।
సుగంధమాల్యాంబరభూషణంచసుహృద్భవంభోజనసౌఖ్యపుష్టిం ॥
దశాధిపునికి తృతీయగతుడయిన వాని అంతరమున - ధనము, సౌఖ్యము, సుగంధ, మాల్య, అంబర, భూషణాదులు. మిత్రుడు పెట్టిన భోజనపుష్టి కలుగును.

8. దాయేశ్వరాద్బంధుగతస్యభుక్తౌదారాత్మజార్థంగృహబంధుయానం ।
మృష్టాన్నపానాంబరభూషణంచాశుభగ్రహశ్చేత్ఫలమన్యథాస్యాత్ ॥
దశానాధునికి చతుర్థమందున్న గ్రహభుక్తిలో-భార్యాపుత్రసౌఖ్యము, ధన లాభము, గృహము, బంధువులు, వాహనము, మృష్టాన్న పానములు, వస్త్ర భూష ణములు, శుభగ్రహములయినచో ఇవి కలుగును. పాపగ్రహములయిన విపరీతము-కష్టము కలుగును.

9. పాపగ్రహోపిశుభదఃఖలుదాయనాథోబంధుస్థితస్స్వభవనోచ్చ బలాదియుక్తః ।
సౌమ్యగ్రహోప్యశుభదస్సుఖరాశియుక్తోదాయేశ్వరస్స్వభవనోచ్చ బలాదిహీనః ॥
దశానాధునకు చతుర్థమందున్న గ్రహము పాపగ్రహమైనను స్వక్షేత్ర, ఉచ్చస్థానములందుండి బలవంతుడయిన శుభఫలము నిచ్చును. శుభగ్రహమైనను ఉచ్చాది శుభరాశిగాక, బలహీనుడయిన అశుభఫలమునే యిచ్చును.

10. దశానాథాత్పుత్రస్థస్యభుక్తౌపుత్రాప్తిమాదిశేత్ ।
శుభగ్రహస్యసౌమ్యంచపాపభుక్తౌసుతక్షయం ॥
దశానాధునికి పంచమమందున్న శుభగ్రహభుక్తిలో-పుత్రలాభమును, పాప గ్రహమైన-పుత్రనాశము చెప్పవలెను.

11. అంతర్దశాయాంపాపస్యషష్ఠస్యదశేశ్వరాత్ ।
చోరాదివ్రణదేహార్తింలభతేపదవిభ్రమం ॥

దశానాధునికి షష్ఠస్థుడైన పాపగ్రహభుక్తిలో-చోర, వ్రణబాధ, పదవీభ్రంశము కలుగును.

12. తస్మిన్షష్ఠస్యసౌమ్యస్యదాయేశాత్సుఖవర్ధనం ।
లభతేపుత్రమిత్రాప్తింసోచ్చమూలాదిగస్యతు ॥

షష్ఠమస్థుడు శుభగ్రహమైన-సుఖవృద్ధి, పుత్ర, మిత్రలాభము, ఉచ్చాది గతుడయిన ఇచ్చును.

13. దాయేశాత్సప్తమస్థస్యపాపస్యాపహృతిర్యదా ।
దారార్థపుత్రబంధూనాంనాశంభూపతినాభయం ॥

దశానాధునకు సప్తమస్థుడైన పాపగ్రహభుక్తిలో-భార్యా, పుత్ర, బంధు, ధననాశము, రాజభయము కలుగును.

14. సప్తమస్థశుభస్యాపిహృతౌసౌఖ్యందశాధిపాత్ ।
శత్రునీచవిహీనస్యాన్నసమృద్ధ్యన్నాంబరభూషణం ॥

సప్తమస్థుడు శత్రునీచాదివర్జితుడైన శుభగ్రహమైన—సౌఖ్యము, సన్నన్నము, సన్నని వస్త్రములు, భూషణములు కలుగును.

15. పాతేశాదష్టమస్థస్యపాపస్యాపిహృతౌభయం ।
నిధనంకుత్సితాన్నంచచోరాగ్నినృపపీడనం ॥

దశానాధునికి అష్టమమునఉన్న పాపభుక్తిలో-భయము, మరణము, కుత్సితభోజనము, రాజచోరాగ్నిపీడ కలుగును.

16. పాతేశాదష్టమస్థస్యసౌమ్యస్యాపహృతౌసుఖం ।
భుక్త్యాదౌశోభనంప్రోక్తమంత్యేకష్టంవినిర్దిశేత్ ॥

అష్టమస్థుడు శుభగ్రహమైన-సుఖము, దశాదిలో శుభము, దశాంత్యమున కష్టము కలుగును.

17. దాయేశాన్నవమస్థస్యపాపస్యాపహృతిర్యదా ।
అశుభంలభతేకర్మస్థానభ్రంశంమనోరుజం ।

దశానాధునికి నవమమందున్న పాపభుక్తిలో-అశుభకర్మ సంప్రాప్తమగును. స్థానభ్రంశము, మనోవ్యాధి కలుగును.

18. ప్రధానతస్సుభస్థస్యసౌమ్యస్యాపహృతౌయదా ।
వివాహంయజ్ఞదీక్షాంచదానాప్తింలభతేనరః ॥

ఆ నవమస్థుడు శుభుడైన-వివాహాది శుభకార్యములు, యజ్ఞదీక్ష దానధర్మములు కలుగును.

**19.** కర్మస్థపాపఖేటస్యహృతౌపాకేశ్వరాద్యదా ।
కర్మనాశమవాప్నోతిదుష్కీర్తింవివిధాపదం ॥

దశానాధునికి దశమమునఉన్న పాపగ్రహభుక్తిలో-కర్మనాశము, దుష్కీర్తి, వివిధాపదలు కలుగును.

**20.** తస్మాత్కర్మస్థసౌమ్యస్యహృతౌసౌఖ్యంవినిర్దిశేత్ ।
తటాకగోపురాదీనాంపుణ్యకర్మాదిసంగ్రహం ॥

దశమస్థుడు శుభుడైన-సౌఖ్యము, తటాకగోపురాది నిర్మాణము, పుణ్యకర్మలు కలుగును.

**21.** లాభస్థస్యదశానాథాత్పాపస్యాపహృతౌధనం ।
లభతేపుత్రమిత్రాదీన్స్థానప్రాప్తించశాశ్వతం ॥

దశానాధునికి లాభమందున్న పాపగ్రహభుక్తిలో-ధనము, పుత్ర మిత్రాదులను, శాశ్వత స్థానమును పొందును.

**22.** పాకేశాల్లాభయుక్తస్యసౌమ్యస్యాపహృతౌధనం ।
భాగ్యోత్తమంనృపాత్ప్రీతిఃదారపుత్రవివర్ధనం ॥

ఆలాభస్థుడు శుభుడైన-ధనము, ఉత్తమ భాగ్యము, రాజప్రీతి, భార్యాపుత్ర వృద్ధి కలుగును.

**23.** వ్యయస్థస్యహృతౌదుఃఖంపాపస్యతుదశాధిపాత్ ।
అర్థనాశంనృపాత్క్రోధందుస్థానమపరిభ్రమం ॥

దశానాధునికి వ్యయమందున్న పాపగ్రహభుక్తిలో - దుఃఖము, ధననాశము, రాజక్రోధము, దుష్టస్థానప్రాప్తి, సంచారము లేకుండుట జరుగును.

**24.** పాకేశ్వరాద్వ్యయస్థస్యసౌమ్యస్యాపహృతిర్యదా ।
వాహనంభోగభాగ్యంచవస్త్రాభరణభూషణం ॥

వ్యయగతుడు శుభుడైన-వాహనము, భోగభాగ్యములు, వస్త్ర, ఆభరణ, భూషణములు కలుగును.

**25.** తత్తద్దశాయాంసంయోజ్యమేవమేవవిశేషతః ।
స్వర్క్షోచ్చమిత్రవర్గాదివినాసర్వత్రయోజయేత్ ॥

ఆయాదశలలో సర్వత్ర ఇట్లే చెప్పుకోవలెను. కాని ఉచ్చ, స్వక్షేత్ర, మిత్ర క్షేత్రములయినా, స్వవర్గ మిత్రవర్గములయినా ఇట్లు చెప్పరాదు. అప్పుడు శుభఫలములు కల్గును.

26. లగ్నార్థనోత్థగస్యాపిపాపస్యాపహృతౌయదా ।
పాకేశాద్దుఃఖమాప్నోతిసౌమ్యభుక్తౌశుభంవదేత్ ॥

దశానాధుని లగ్న, ద్వితీయ, తృతీయములందున్న పాపభుక్తిలో దుఃఖము, శుభగ్రహ భుక్తిలో శుభమును కలుగును.

27. అంతర్దశాసుంక్రూరస్యక్రూరదాయేమహద్భయం ।
స్థానాక్షిబంధుపుత్రార్థదారనాశంనృపాద్భయం ॥

పాపగ్రహ మహాదశలో పాపగ్రహ అంతర్దశ ప్రాప్తించిన- మహాభయము, స్థానశాశము, నేత్రనాశం, బంధు, భార్యా, పుత్ర, ధననాశములు, రాజభయము కలుగును.

28. శుభభుక్తౌశుభేదాయేస్థానవాహనభూషణం ।
సౌమ్యభుక్తౌపాపదాయేత్వాదౌసౌఖ్యంపరంభయం ॥

శుభగ్రహము మహాదశలో శుభభుక్తిలో స్థాన, వాహన, భూషణములు శుభము కలుగును. పాపదశలో శుభభుక్తిలో దశాదిలో సౌఖ్యము, తర్వాత భయము కలుగును.

29. సౌమ్యదాయేపాపభుక్తౌత్వాదౌకష్టంతతస్సుఖం ॥
శీర్షోదయర్క్షగాఃఖేటాస్త్వాదౌచాంత్యేచబుభఃగాః ॥

శుభదశలో పాపభుక్తిలో-దశాదిలో కష్టము, తదనాత సుఖము కలుగును. శీర్షోదయ రాశులలోనున్న గ్రహములు తామిచ్చు ఫలములను దశాదిలో నిత్తురు. తక్కిన పృష్టోదయ, ఉభయోదయ రాశులలోనున్న గ్రహములు దశాంత్యమున తమ ఫలముల నిత్తురు.

30. యత్రసంపదిబాహుళ్యంయోజయిత్వాఫలంవదేత్ ।
అపిసంవాదకార్యేషుయథోక్తంఫలమాదిశేత్ ॥

విరుద్ధఫలములు వచ్చినచోట బలాబలనిర్ణయముచేసి, బలవత్ఫలము చెప్పవలెను. ఫలితములలో విసంవాదము-అదా ఇదాఅని, వచ్చినపుడు గ్రంథోక్తమే చెప్పనగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్ర తాత్పర్యమున సాముదాయికాంతర్దశాఫలమను అష్టావింశాధ్యాయము



# ఏకోనత్రింశాధ్యాయము

1. లగ్నగస్యరవేఃపాకేభౌమార్కి-శశిభోగినాం ।
అంతర్దశాయాందుఃఖంచరాజ్యార్థగృహనాశనం ॥

లగ్నమందున్న రవిదశలో కుజ, శని చంద్ర రాహువుల అంతర్దశలో-దుఃఖము, రాజ్యము; ధనము, గృహముల నాశనము, కలుగును.

2. తేషామగోచరస్థానాందినేశాత్ఫలమీదృశం ।
గోచరస్థఫలంసౌమ్యంసర్వార్థాఃపాకవద్గ్రహే ॥

వారు అగోచర స్థానస్థితులైయున్నప్పటి ఫలమది. గోచరస్థాన గతులైన-ఇంటిలోని పదార్థములు పాకమున పచ్యమైనట్లు శుభఫలము కలుగును.

3. గోచరత్వంనామఃస్వక్షేతుంగత్రికోణస్థఃషడష్టాంత్యభవర్జితః ।
అనస్తగోతిమిత్రస్తుగోచరస్థోభవేద్గ్రహః ॥

గోచరత్వమనగా - స్వక్షేత్ర, మిత్రక్షేత్ర, మూలత్రికోణములందుండి, అస్తంగతత్వము లేనిదై, అధిమిత్రక్షేత్రమందున్న గ్రహము గోచరస్థము. షష్టాష్టమ ద్వాదశ స్థితము కారాదు.

4. అస్తగోనీచగోవాపిస్వోచ్చమూలాదివర్జితః ।
షష్ఠాష్టమవ్యస్థోవాయఃఖేటోయమగోచరః ॥

అగోచరత్వమనగా-అస్తంగతము, నీచరాశిగతము, షష్ట, అష్టమ, ద్వాదశస్థము, ఉచ్చాది స్వ, మిత్ర, అధిమిత్ర, మూలత్రికోణస్థముకానిది అగోచరగ్రహము.

5. లగ్నస్థవాసరేశస్యదశాయామిజ్యశుక్రయోః ।
శశాంకసౌమ్యయోర్భుక్తౌకృషిగోసుతదారభూః ॥

లగ్నస్థ రవిదశలో - గురు, శుక్ర, చంద్ర, బుధుల అంతర్దశలో - వ్యవసాయము, గో, పుత్రులు, భార్య, భూమి-వీటి లాభము కలుగును.

6. ధనస్థవాసరేశస్యపాపభుక్తౌధనక్షయం ।
వాక్పారుష్యంమనోదుఃఖంనేత్రరోగంమహద్భయం ॥

ద్వితీయమందున్న రవిమహాదశలో - పాపగ్రహ భుక్తిలో - ధననాశము, వాక్పారుష్యము, మనోదుఃఖము, నేత్రరోగము, మహాభయము, కలుగును.

7. సౌమ్యభుక్తౌరవేఃపాకేధనస్థస్యమహత్సుఖం ।
విద్యాలాభంనృపాత్ప్రీతింవస్త్రవాహనభూషణం ॥

ద్వితీయ రవిదశలో-శుభభుక్తిలో-ఎక్కువ సుఖము, విద్యాలాభము, రాజప్రీతి, వస్త్ర, వాహన; భూషణములు కలుగును.

8. తృతీయస్థస్యచరవేఃపాకేపాపహృతిర్యదా ।
గోచరస్థేమహత్సౌఖ్యంనోచేత్పాపఫలంలభేత్ ॥

తృతీయస్థ రవిదశలో పాపభుక్తిలో-గోచరస్థుడైన మహాసౌఖ్యము, కాకున్న పాపఫలము కలుగును.

9. తత్రస్థశానుపాకేచశుభభుక్తౌమహత్సుఖం।
ధైర్యంవిత్తసుతాప్తించసమరేజయమాప్నుయాత్ ॥

ఆ దశలోనే శుభభుక్తిలో-మహాసుఖము, ధైర్యము, సుత, ధన, ప్రాప్తి, విజయము కలుగును.

10. దినేశస్యసుఖస్థస్యదశాయాంపాపినాఃహృతౌ ।
మాతృనాశంమనోదుఃఖంచోరాగ్నినృపపీడనం ॥

చతుర్థస్థుడైన రవిదశలో పాపభుక్తిలో - మాతృనాశనము, మనోదుఃఖము, చోరాగ్ని రాజపీడ కలుగును.

11. శుభగ్రహాణాంభుక్తౌచరవేఃపంచమగస్యతు ।
పరిపాకేసుతాప్తించరాజ్యవాహనభూషణం ॥

పంచమస్థ రవిమహాదశలో శుభగ్రహాంతర్దశలో - పుత్రప్రాప్తి, రాజ్యము, వాహన, భూషణములు కలుగును.

12. షష్ఠస్థసూర్యదాయేస్మిన్నపహారేతుపాపినాం ।
ఋణచోరాగ్నిభూపైస్తుభీతిరావశ్యకీతథా ॥

షష్ఠమందున్న రవి దశలో-పాపభుక్తిలో-ఋణ, చోర, అగ్నిపీడ, రాజభీతి కలుగును.

13. సౌమ్యానామపహారేతుభాస్కరస్యారిగస్యచ ।
పరిపాకేశుభంపూర్వంపశ్చాద్దుఃఖంవినిర్దిశేత్ ॥

ఆ దశలోనే శుభభుక్తిలో-మొదట శుభఫలము, తరువాత దుఃఖము కలుగును.

14. సప్తమస్థరవేఃపాకేశుక్రేజ్యాబ్జవిదాంహృతౌ ।
దారలాభంమనోత్సాహంయానాంబరవిభూషణం ॥

సప్తమస్థుడైన రవిదశలో-శుక్రగురుచంద్రబుధుల భుక్తిలో - భార్యాసుఖము, మానసోత్సాహము, వాహనము, వస్త్రములు, భూషణముల లాభము కలుగును.

15. తథావిధరవేఃపాకేదుఃఖంస్యాత్పాపినాంహృతౌ ।
జ్వరాతిసారకృచ్ఛ్రంచమేహపిత్తాదిపీడనం ॥

ఆ రవిదశలోనే పాపభుక్తిలో-జ్వరము, అతిసారము, మూత్రకృచ్ఛ్రము, మేహపిత్తాది పీడ కలుగును.

16. అష్టమస్థరవేః పాకే శుభభుక్తౌ శుభం భవేత్ ।
కించిద్దుఃఖం సుఖాధిక్యం శయనాంబరభూషణం ॥

అష్టమమందున్న రవిదశలో-శుభభుక్తిలో శుభఫలము కలుగును. స్వల్ప దుఃఖము, ఎక్కువ సుఖము, శయన, వస్త్ర, భూషణాది లాభము కలుగును.

17. తథావిధరవేర్దాయే పాపభుక్తౌ మహద్భయం ।
మరణం వ్యాధిపీడాం వా పరప్రేష్యత్వమేవ వా ॥

ఆ రవిదశలో పాపభుక్తిలో-మహాభయము, మరణము, రోగపీడగాని, ఇతరులకు సేవకుడుగా ఉండుటగాని జరుగును.

18. శుభస్థానగతస్యాపి రవేః పాకే హ్యతిర్యదా ।
సౌమ్యానాం శుభకర్మాప్తిం దానయజ్ఞమహోత్సవం ॥

నవమమందున్న రవిదశలో-శుభభుక్తిలో-శుభకర్మలు, దానము, యజ్ఞము కలుగును.

19. నవమస్థరవేః పాకే పాపభుక్తిర్భవేద్యదా ।
కరోతి కర్మబాహుళ్యం గురుపితాదినాశనం ॥

ఆ రవిదశలోనే పాపభుక్తిలో-ఎక్కువ పనులు చేయుట, తల్లిదండ్రులకు కష్టము కలుగును.

20. కర్మస్థరవిదాయే తు పాపభుక్తిర్యదా తదా ।
కరోతి కర్మనాశం చ చోరాగ్నినృపపీడనం ।

దశమమందున్న రవిదశలో-పాపభుక్తిలో-కర్మనాశము, రాజచోరాగ్ని పీడ కలుగును.

21. తథావిధరవేః పాకే శుభభుక్తిర్యదా తదా ।
కరోతి విపులం రాజ్యం కీర్తిమాచంద్రతారకం ॥

ఆ దశలో శుభభుక్తిలో-విపులరాజ్యము, చిరస్థాయియైన కీర్తి కలుగును.

22. లాభరాశిగతస్యాపి రవేః పాకే శుభేతరా ।
భుక్తిర్యదాధికం దుఃఖం పశ్చాత్సౌఖ్యం కరోతి చ ॥

లాభస్థుడైన రవిదశలో-పాపభుక్తిలో ఆదిలో దుఃఖము, తర్వాత సుఖము కలుగును

23. తథావిధరవేః పాకే శుభభుక్తిర్యదా తదా ।
ధనాప్తిం రాజసన్మానం దారపుత్రనృపాత్ప్రియం ॥

ఆ దశలో-శుభభుక్తిలో-ధనప్రాప్తి, రాజసన్మానం, రాజువలన భార్యాపుత్రులకు ప్రియము కలుగును.

24. ద్వాదశస్థరవేఃపాకేపాపభుక్తౌమహద్భయం ।
స్థానచ్యుతింప్రవాసంచనృపకోపాద్విషాన్మృతిః ॥
ద్వాదశమందున్న రవిదశలో-పాపభుక్తిలో-మహాభయము, స్థానభ్రంశము, పరదేశవాసము, రాజకోపమువలన విషముతిని మరణము కలుగును.

25. తథావిధరవేఃపాకేశుభభుక్తౌమహత్సుఖం ।
గోభూమివస్త్రధాన్యాదిమణివిద్రుమభూషణం ॥
ఆ రవిదశలో - శుభభుక్తిలో - మహాసుఖము, గో, భూమి, వస్త్ర, ధాన్యాది లాభము, మణి, పగడాలు, భూషణాల లాభము కలుగును.

26 శుభభుక్తౌవ్యయస్థస్యవస్త్రమాల్యాదిభూషణం ।
దారార్థపుత్రమిత్రాణామథవాహనంసుఖం ॥
వ్యయస్థ రవిదశలో శుభభుక్తిలో వస్త్రమాల్యాదులు, భూషణము, భార్యాపుత్ర, మిత్ర, ధనములకు సుఖము, వాహన సుఖము కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున రవిదశాంతర్దశాఫలమను
ఏకోనత్రింశాధ్యాయము

---

# త్రింశాధ్యాయము

1. మూర్తిస్థచంద్రదాయేశుక్రజీవవిదాంహృతౌ ।
దేహారోగ్యంనృపప్రీతింవాహనాంబరభూషణం ॥
లగ్నస్థ చంద్రదశలో శుక్రగురుబుధుల అంతర్దశలో-దేహారోగ్యము, రాజప్రీతి, వాహనము, వస్త్ర భూషణములు కలుగును.

2. తథావిధస్యచంద్రస్యపతిపాకేశుభేతరాః ।
హృతౌకరోతిభృత్యంచకృషిగోభూమినాశనం ॥
ఆ దశలో-పాపుల అంతర్దశలో-పరులకు భృత్యుడగుట, వ్యవసాయ, గో, భూమినాశము కలుగును.

3. ద్వితీయస్థనిశానాథపరిపాకేశుభేతరాః ।
కళత్రపుత్రబంధూనాంనృపాద్భీతింకరోతిచ ॥
ద్వితీయమందున్న చంద్రుని దశలో - పాపగ్రహభుక్తిలో - రాజభయము, కళత్ర, పుత్ర, బంధువులకు భయము కలుగును.

4. సౌమ్యభుక్తౌద్వితీయస్థచంద్రదాయేమహత్సుఖం ।
భోజనాంబరపానంచమనోత్సాహంకరోతిచ ॥
ఆ చంద్రదశలో-శుభభుక్తిలో-మహాసుఖము, భోజనము, వస్త్రము, పానము, ఉత్సాహము కలుగును.

5. తృతీయస్థనిశానాథపరిపాకేమహత్సుఖం ।
శుభగ్రహాణాంభుక్తిస్తుకరోతినృపమాననం ॥
తృతీయమందున్న చంద్రదశలో-శుభభుక్తిలో రాజసన్మానము, మొదలగు శుభములు కలుగును.

6. తథావిధనిశానాథపరిపాకేశుభేతరాం ।
హృతిఃకరోతివైకల్యంభ్రాతృధైర్యవినాశనం ॥
ఆ దశలో-పాపభుక్తిలో-వైకల్యము, సోదరులకుభీతి మున్నగు అశుభములు కలుగును.

7. చతుర్థస్థనిశానాథపరిపాకేమహత్సుఖం ।
శుభభుక్తౌనృపాత్ప్రీతిర్జాయతేవివిధంసుఖం ॥
చతుర్థమందున్న చంద్రదశలో-శుభభుక్తిలో—రాజప్రీతి, వివిధ సుఖములు కలుగును.

8. పాపభుక్తౌమహత్కష్టంగృహదారార్థనాశనం ।
చోరాగ్నినృపభీతించతాదృగబ్జదశాంతరే॥
పాపభుక్తిలో-మహాకష్టము, చోరాగ్ని రాజపీడలు, భార్యాగృహధన నాశము కల్గును.

9. పంచమస్థనిశానాథరిపాకేమహత్సుఖం ।
సౌమ్యభుక్తౌకళత్రార్థపుత్రమిత్రాంబరాణిచ ॥
పంచమస్థుడైన చంద్రదశలో-శుభభుక్తిలో-మహాసుఖము, భార్యాపుత్ర మిత్ర ధనలాభములు కలుగును.

10. తథావిధనిశానాథదాయేపాపహృతౌతదా ।
బుద్ధిక్షోభంమనస్తాపందారపుత్రనృపాద్భయం ॥

ఆ చంద్రదశలో పాపభుక్తిలో-మనఃక్షోభ, మనస్తాపము, భార్యాపుత్రులకు రాజువలన భయము కలుగును.

11. కృషినాశంఋణంగ్రస్తంషష్ఠస్థితనిశాకరాత్ ।
స్యాత్పాపినాంహృతౌదుఃఖంప్రమేహక్షయపాండుభిః ॥

షష్ఠస్థ చంద్రదశలో - పాపభుక్తిలో - కృషినాశము, ఋణము, దుఃఖము, మేహము, క్షయ, పాండురోగములబాధ కలుగును.

12. రిపుస్థితనిశానాథాత్సౌమ్యానాంతుహృతిర్యదా।
కరోతిసర్వతోమైత్రించోరాగ్నిరిపునాశనం॥

ఆ దశలో-శుభభుక్తిలో-సర్వత్రమైత్రి, చోరాగ్ని శత్రునాశము కలుగును.

13. కళత్రస్థనిశానాథాద్యదాసౌమ్యహృతిస్తదా ।
కళత్రపుత్రసంపత్తింవాహనాంబరభూషణం ॥

సప్తమమందున్న చంద్రదశలో - శుభభుక్తిలో - కళత్రపుత్ర సంపత్తి, వాహన, వస్త్ర, భూషణములు కలుగును.

14. తథావిధనిశానాథాత్పాపినాంతుహృతిర్యదా ।
విదేశయానంపుత్రార్థదారబంధువినాశనం ॥

ఆ చంద్రదశలో-పాపభుక్తిలో-విదేశ ప్రయాణము, భార్యాపుత్ర, బంధు ధననాశము కలుగును.

15. అష్టమస్థనిశానాథాత్పాపభుక్తౌమహద్భయం ।
మరణందారపుత్రాణాంకుత్సితాన్నంపరాజయం ॥

అష్టమమందున్న చంద్రదశలో-పాపభుక్తిలో-మహాభయము, భార్యాపుత్రాదులకు మరణము, కుత్సితాన్నము, పరాజయము కలుగును.

16. రంధ్రస్థితనిశానాథాత్పరిపాకేమహత్సుఖం ।
సౌమ్యభుక్తౌమహత్కీర్తింధైర్యవాహనభూషణం ॥

ఆ చంద్రదశలో-శుభభుక్తిలో-మహాసుఖము, కీర్తి, ధైర్యము, వాహనము, భూషణము కలుగును.

17. ధర్మస్థితనిశానాథాచ్ఛుభభుక్తౌమహత్సుఖం ।
ధర్మంయజ్ఞంవివాహంచరాజ్యశ్రీధనసంపదః ॥

నవమమందున్న చంద్రదశలో-శుభభుక్తిలో - మహాసుఖము, ధర్మము, యజ్ఞము, వివాహము, రాజ్యసంపద, ధన సంపత్తులు కలుగును.

18. తథావిధనిశానాథాత్పాపినాంతుహృతిర్యదా ।
ధర్మహానిర్మనోదుఃఖంరాజ్యార్థగృహనాశనం ॥

ఆ చంద్రదశలో-పాపభుక్తిలో - ధర్మహాని, మనోదుఃఖము, రాజ్య ధన, గృహనాశము జరుగును.

19. కర్మస్థచంద్రదాయేతుసౌమ్యభుక్తౌకరోతిచ ।
స్వకర్మనిరతంశాంతంధర్మదానపరాయణం ॥

దశమమందున్న చంద్రదశలో-శుభభుక్తిలో-స్వకర్మాసక్తి, శాంతి, ధర్మ పరాయణత కలుగును.

20. కర్మస్థితనిశానాథాత్పాపభుక్తిర్యదాతదా ।
కర్మనాశంకరోత్యత్రఅపకీర్తిమహద్భయం ॥

ఆ చంద్రదశలో - పాపభుక్తిలో - కర్మనాశము, అపకీర్తి, మహాభయము కలుగును.

21. లాభచంద్రేశుభైర్యుక్తేధనధాన్యాంబరాణిచ ।
వాహనంరాజ్యలాభంచకరోతివివిధంసుఖం ॥

లాభమందున్న చంద్రుడు శుభయుక్తుడైన-ధన, ధాన్య, వస్త్రములు, వాహనము, రాజ్యము, ధనలాభము, నానావిధసుఖాలు కలుగును.

22. లాభేచంద్రేపాపభుక్తౌధననాశముపైతిచ ।
కృషిధాన్యాదిదేహార్తింనృపచోరాగ్నిపీడనం ॥

లాభచంద్రదశలో-పాపభుక్తిలో-ధననాశము, కృషి, ధాన్యనాశము, దేహ, నేత్రబాధ, రాజచోర, అగ్నిపీడ కలుగును.

23. ద్వాదశస్థనిశానాథాత్పరిపాకేర్థనాశనం ।
పాపభుక్తౌమహత్కష్టంసర్వశత్రుత్వమేతిచ ॥

వ్యయస్థ చంద్రదశలో-పాపభుక్తిలో-ధననాశము, మహాకష్టము, అందరితోను శత్రుత్వము కలుగును.

24. శుభభుక్తౌవ్యయస్థస్యవస్త్రమాల్యాదిభూషణం ।
దారార్థపుత్రమిత్రాణాందానవాహనజంసుఖం ॥

ఆ చంద్రదశలో-శుభభుక్తిలో-వస్త్రమాల్యాది, భూషణప్రాప్తి, భార్యాపుత్రులకును, మిత్రులకును, దానవాహనములవలన కలిగిన సుఖమబ్బును.

ఇది సర్వార్థ చింతామణిఆంధ్రతాత్పర్యమున - చంద్రదశాంతర్దశా ఫలమను త్రింశాధ్యాయము

# ఏకత్రింశాధ్యాయము

1. లగ్నస్థితధరాసూనోః పరిపాకే వ్రణక్షతిః ।
పాపభుక్తౌ మహత్కష్టం దుర్జనాదిమహద్భయం ॥

లగ్నస్థుడైన కుజుని మహాదశలో – పాపగ్రహ అంతర్దశలో – వ్రణమువల్ల గాయములు, మహాకష్టము, దుర్జనాదులవలన మహాభయము కలుగును.

2. శుభభుక్తౌ నృపాత్ప్రీతిం భ్రాతృవర్గసుఖం శుభం ।
తథావిధధరాసూనోః దశాయాం క్షేత్రవాహనం ॥

ఆ కుజదశలో-శుభ అంతర్దశలో-రాజప్రీతి, సోదరులకు శుభము, సుఖము, భూమి, వాహన లాభము కలుగును.

3. ధనస్థితధరాసూనోశ్శుభభుక్తౌ యదా తదా ।
భ్రాతృసౌఖ్యం మనోత్సాహం విద్యావాహనభూషణం ॥

ద్వితీయమందున్న కుజదశలో-శుభభుక్తిలో-సోదర సౌఖ్యము, మానసోత్సాహము, విద్య, వాహనము, భూషణప్రాప్తి కలుగును.

4. ధనస్థితధరాసూనోః పాపభుక్తిర్యదా తదా ।
పూర్వవిత్తవినాశంచ రాజకోపాజ్జ్వరాదిభిః ॥

ఆ కుజదశలో-పాపభుక్తిలో-పూర్వమున్న ధనము నశించుట, రాజకోపము వలన, జ్వరాదులవలన నానాకష్టములు, ధననాశము కలుగును.

5. తృతీయస్థధరాసూనోః పాకే పాపహృతిర్యదా ।
మనోవైకల్యమాప్నోతి భ్రాతృవర్గవినాశనం ॥

తృతీయమందున్న కుజదశలో-పాపభుక్తిలో-మనోవైకల్యము, సోదరనాశము కలుగును.

6. తథావిధధరాసూనోః పాకే సౌమ్యహృతిర్యదా ।
భోజనాంబరసౌఖ్యంచ కృషిభూషణవాహనం ॥

ఆ కుజదశలో-శుభభుక్తిలో-భోజనసౌఖ్యము, వస్త్రములు, కృషి, భూషణములు, వాహనసౌఖ్యము కలుగును.

7. చతుర్థస్థధరాసూనోః క్రూరభుక్తౌ మహద్భయం ।
గృహక్షేత్రవినాశంచ నృపచోరాగ్నిపీడనం ॥

చతుర్థస్థ కుజదశలో-పాపభుక్తిలో-మహాభయము, గృహ, భూనాశము, రాజ, చోర, అగ్నిపీడ కలుగును.

8. హిబుకస్థధరాసూనోః పాకేశుభహృతిర్యదా ।
క్షేత్రాంబరసుఖావాప్తింపశువాహనభూషణం ॥
చతుర్థమందున్న కుజదశలో-శుభభుక్తితో-భూమి, వస్త్రములు, సుఖప్రాప్తి, పశు, వాహన, భూషణలాభము కలుగును.

9. పంచమస్థధరాసూనోః పాకేపాపహృతిర్యదా ।
కృషిగోధనధాన్యార్థసుతదారవినాశనం ॥
పంచమమందున్న కుజదశలో-పాపభుక్తిలో-కృషి, గో, ధన, ధాన్య, కార్య, నాశము, భార్యాపుత్రులకు బాధ కలుగును.

10. తథావిధేకుజేసౌమ్యభుక్తౌశోభనమాదిశేత్ ।
రాజపూజ్యంసుతావాప్తింమంత్రోపాస్తిమిహాదిశేత్ ॥
అట్టి కుజదశలో-శుభభుక్తిలో-శోభనము చెప్పవలెను. రాజపూజ్యము, పుత్రప్రాప్తి, మంత్రోపాసన కలుగును.

11. షష్ఠస్థితేకుజేః పాపభుక్తౌకష్టంవినిర్దిశేత్ ।
చోరాగ్నినృపపీడాంచస్ఫోటకక్షయమేహనం ॥
షష్ఠస్థుడైన కుజదశలో-పాపగ్రహ అంతర్దశలో-కష్టము, రాజ, చోర, అగ్ని పీడ, స్ఫోటకము, క్షయ, మేహములబాధ కలుగును.

12. తథావిధేఃకుజస్సౌమ్యభుక్తౌభూపాలమిత్రతాం ।
బంధునాశంమనోదుఃఖంపశ్చాత్సౌఖ్యంవినిర్దిశేత్ ॥
అట్టి కుజదశలో-శుభభుక్తిలో- రాజమైత్రి, బంధునాశము, మనోదుఃఖము తర్వాత సౌఖ్యము కలుగును.

13. కళత్రస్థేఃకుజేఃపాపభుక్తౌస్త్రీసుతరాజ్యహృత్ ।
శుభభుక్తౌమహత్సౌఖ్యంనృపవాహవభూషణం ॥
సప్తమస్థుడైన కుజదశలో-పాపభుక్తిలో భార్యాపుత్రులకు కష్టము, రాజ్యనాశనము; శుభభుక్తిలో-మహాసౌఖ్యము, రాజసన్మానము, వాహనము, భూషణప్రాప్తి కలుగును.

14. అష్టమస్థకుజాద్భుక్తౌపాపినాంమరణంకృశం ।
సౌమ్యభుక్తౌమహత్సౌఖ్యంకృషిగోనృపపూజనం ॥
అష్టమమందున్న కుజదశలో-పాపభుక్తిలో-చిక్కుట, మరణమున్ను; శుభభుక్తిలో-మహాసౌఖ్యము, కృషి, గోలాభము, రాజపూజ్యతయు కలుగును.

15. నవమస్థధరాసోర్దాయేపాపహృతిర్యదా ।
పిత్రోర్నాశంగురోర్నాశంధర్మనాశంమనోరుజం ॥

నవమమందున్న కుజదశలో-పాపభుక్తిలో-తండ్రికి, గురుపుసకు నాశము, ధర్మనాశము మనోవ్యాధి కలుగును.

**16. తథావిధకుజాత్సౌమ్యభుక్తౌగోధనసంపదః ।**
**వివాహంయజ్ఞదీక్షాంచదేవభూసురతర్పణం ॥**

నవమస్థ కుజదశలో-శుభభుక్తిలో-గో,ధన సంపత్తులు, వివాహము, యజ్ఞదీక్ష, దేవబ్రాహ్మణ సంతర్పణము చేయును.

**17. కర్మస్థితధరాసూనోర్దుఃఖంస్యాత్పాపినాంహృతౌ ।**
**విదేశయానందుఃఖార్తింబాధతేహిపరాజయం ॥**

దశమమందున్న కుజదశలో-పాపభుక్తిలో-విదేశయానము, దుఃఖము, బాధ, పరాజయము కలుగును

**18. లాభస్థభూమిపుత్రస్యపాకేపాపహృతిర్యదా ।**
**కరోతివిపులంరాజ్యంగంధమాల్యవిభూషణం ॥**

లాభమందున్న కుజమహాదశలో-పాపభుక్తిలో-విపులమైన రాజ్యము, గంధమాల్య, భూషణలాభము కలుగును.

**19. శుక్రేజ్యాబ్జవిదాంభుక్తౌలాభరాశిగతస్యతు ।**
**పరిపాకేమహత్సౌఖ్యందానధర్మాదిసంగ్రహం ॥**

లాభస్థ కుజదశలో-గురుశుక్రచంద్రబుధుల అంతరమున - మహాసౌఖ్యము, దానధర్మాదులు చేయుట జరుగును.

**20. ద్వాదశస్థధరాసూనోఃపరిపాకేహృతిర్యదా ।**
**కుర్వంతిదుఃఖబాహుళ్యంకారాగృహనివేశనం ॥**

వ్యయమందున్న కుజునిదశలో-పాపభుక్తిలో-దుఃఖములెన్నో కలుగుట, కారాగార ప్రవేశము కలుగును.

**21. శుభాపహారేసౌఖ్యంచయానాంబరవిభూషణం ।**
**భుక్త్యంతేరాజకోపంచపదభ్రంశంమనోరుజం ॥**

వ్యయస్థ కుజదశలో-శుభఅంతర్దశలో - సౌఖ్యము, వాహనము, వస్త్రము, భూషణప్రాప్తి, దశాంతమున రాజకోపము, పదభ్రంశము, మనోవ్యాధి కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున కుజదశాంతర్దశాఫలము లను
ఏకత్రింశాధ్యాయము

# ద్వాత్రింశాధ్యాయము

1. కేంద్రస్థితస్యసౌమ్యస్యదశాయాంపాపినాంహృతౌ ।
కర్మవిఘ్నంమహద్దుఃఖంమనశ్చాంచల్యమేవచ ॥
కేంద్రస్థుడైన బుధునిదశలో పాపగ్రహ అంతర్దశలో-కార్యవిఘ్నము, మహా దుఃఖము, మనశ్చాంచల్యము కలుగును.

2. ఉత్సాహభంగంగోభూమిహిరణ్యాంబరనాశనం ।
స్థానచ్యుతింమహాద్వేషంవిద్యానాశంలభేత్సదా ॥
మరియు ఉత్సాహభంగము, గో, భూమి, హిరణ్య, వస్త్రనాశము, స్థానభ్రంశము, మహాద్వేషము, విద్యానాశము జరుగును.

3. శుభభుక్తౌబుధస్యాపిపాకేకేంద్రగతస్యతు ।
వైవాహికంయజ్ఞకర్మదానధర్మజపాదికం ॥
ఆ బుధదశలో-శుభభుక్తిలో-వివాహము, యజ్ఞయాగాదులు, దానధర్మ జపాదులు జరుగును.

4. జ్ఞానాధిక్యంనృపాత్ప్రీతింకృషిగోభూమివర్ధనం ।
ముక్తామణిప్రవాళాదివాహనాంబరభూషణం ॥
మరియు జ్ఞానాధిక్యము, రాజప్రీతి, కృషి, గో, భూమివృద్ధి, ముత్యాలు, పవడాలు, మణులు, వాహనము, వస్త్ర భూషణాది లాభము కలుగును.

5. జ్ఞస్యత్రికోణయుక్తస్యదశాయాంపాపినాంహృతౌ ।
దారపుత్రార్థనాశంచకర్మనాశంమనోరుజం ॥
త్రికోణ గతుడయిన బుధదశలో-భార్యాపుత్ర, ధననాశము, కర్మనాశము, మనోవ్యాధి కలుగును.

6. కృషివాణిజ్యనాశంచబంధునాశమథాపివా ।
పదభ్రష్టంమహద్వేషంబంధుద్వేషంలభేన్నరః ॥
మరియు కృషి, వాణిజ్యనాశము, బంధునాశము, పదభ్రంశము, మహాద్వేషము, బంధుద్వేషము కలుగును.

7. తథావిధిజ్ఞస్యపాకేశుభభుక్తౌనృపాత్ప్రియం ।
ఆరోగ్యమతిసౌఖ్యంచసోమపానాదికంసుఖం ॥
త్రికోణగతుడయిన బుధదశలో-శుభభుక్తిలో-రాజప్రీతి, ఆరోగ్యము, అతి సౌఖ్యము, సోమపానాదికము-అనగా యజ్ఞయాగాదులు, సుఖము కలుగును.

8. స్వనామాంకితపద్యానినామద్వయమథాపివా ।
భోజనాంబరభూషాప్తింనరేశత్వంలభేన్నరః ॥

మరియు తనపేరున అంకితమైన గద్యపద్యాలు, బిరుదు వచ్చుట, భోజనము, వస్త్రములు, భూషణలాభము, అధికారము పొందును.

9. షష్ఠాష్టమస్థితజ్ఞస్యపరిపాకేతుపాపినాం ।
హృతౌచోరారిపీడాంచజ్వరాతీసారపీడనం ॥

షష్టాష్టమములందున్న బుధదశలో - పాపభుక్తిలో - చోర, శత్రుబాధ, జ్వరము, అతిసారపీడ,

10. స్వబంధుమరణంక్లేశంభృత్యస్త్రీపుత్రనాశనం।
వివాదవిగ్రహంనర్వైర్బంధుభిర్లభతేనరః ॥

మరియు స్వబంధుమరణము, క్లేశము, భార్యాపుత్ర, భృత్యనాశము, వివాదము, బంధు కలహము కలుగును.

11. తథావిధజ్ఞస్యపాకేశుభభుక్తౌమహద్యశః ।
ఆరోగ్యంకాంతిలాభంచదేవభూసురతర్పణం ॥

ఆ బుధదశలోనే-శుభభుక్తిలో-కీర్తి, ఆరోగ్యము, కాంతి, దేవబ్రాహ్మణ సంతర్పణ కలుగును.

12. దశాదౌఫలమేవంచదశాంతేసుఖనాశనం ।
గోమహిష్యాదిపీడాంచవాక్పారుష్యంనృపాద్భయం ॥

దశాదిలో ఇట్లు శుభఫలముకల్గి, దశాంత్యమున-సుఖనాశము, గోమహిషాదిపీడ, వాక్పారుష్యము-పరుషముగా మాట్లాడుట, రాజభయము కలుగును.

13. తృతీయాయగతజ్ఞస్యశుభభుక్తౌశుభంవదేత్ ।
మనోధైర్యంమహోత్సాహంవిదేశాద్ద్రవ్యసంచయం ॥

తృతీయ లాభములందున్న బుధదశలో - శుభభుక్తిలో-శుభము, మనోధైర్యము, మహోత్సాహము, విదేశములనుండి ద్రవ్య సంచయము ప్రోవుచేయుట జరుగును.

14. విద్యాజయంనృపాత్ప్రీతింభోజనంపౌష్టికంతథా ।
యజ్ఞంవైవాహికంకర్మపురాణశ్రవణాదికం ॥

మరియు విద్యలో జయము, రాజప్రీతి, పుష్టికరమైన భోజనము, యజ్ఞము, వివాహోత్సవము, పురాణశ్రవణాది ధర్మకార్యములు జరుగును.

15. తథావిధ్యజన్యపాకేపాపభుక్తౌమనోభయం ॥
భ్రాతృవర్గవినాశంచ వైకల్యంనృపపీడనం ॥
అట్టి బుధదశలో-పాపభుక్తిలో-మనోభయము, సోదరవర్గమునకు నాశము, మనోవైకల్యము, రాజపీడ-

16. చోరాదివహ్నిభీతించశుస్త్రీభవనసేవనం ।
కర్మహీనంకృషేర్నాశంగజాశ్వానాంతుపీడనం ॥
మరియు-చోర, శత్రు, అగ్నిపీడ, చెడుస్త్రీని, ప్రాతయింటిని సేవించుట కర్మహీనత, కృషినాశము, గజాశ్వ-పశుపీడ కలుగును.

17. ధనస్థితాజ్ఞపుత్రస్యపరిపాకేశుభేతరః ।
కరోతిరాజదండంచబంధనంనిగళంతథా ॥
ధనస్థితుడైన బుధునిదశలో - పాపభుక్తిలో - రాజదండము, బంధనము నిగళము-

18. విషార్తింబంధువిద్వేషంకృషిగోభూమినాశనం ।
శత్రుత్వంసకలైస్సార్ధంనిజాచారవివర్జితం ॥
మరియును, విషబాధ, బంధుద్వేషము, కృషి, గో, భూమినాశము, జన ద్వేషము, నిజాచారము పోవుట కలుగును.

19. ద్వితీయస్థస్యసౌమ్యస్యపరిపాకేర్థలాభభాక్ ।
శుభభుక్తౌమహత్ప్రీతిందేవభూసురతర్పణం ॥
ద్వితీయస్థ బుధదశలో-శుభభుక్తిలో-ధనలాభము, మహాప్రీతి, దేవబ్రాహ్మ సంతర్పణ.

20. అధ్వరంచమహాధర్మందానహోమజపాదికం ।
బంధుపూజ్యంమహోత్సాహంవిద్యాలాభంయశోనరః ॥
మరియు యజ్ఞము, మహాధర్మకార్యములు, దానము, హోమము, జపాదికము బంధుపూజ్యత, ఉత్సాహము, విద్యాలాభము, కీర్తి కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్ర తాత్పర్యమున బుధదశాంతర్దశా ఫలమను ద్వాత్రింశాధ్యాయము



# త్రయస్త్రింశాధ్యాయము

1. కేంద్రస్థితస్యచేజ్యస్యదశాయాంపాపినాంహృతౌ ।
దేహార్తింలభతేదుఃఖంరాజకోపాద్ధనక్షయం ॥

కేంద్రగతుడైన గురుమహాదశలో-పాప అంతర్దశలో-దేహబాధ, దుఃఖము, రాజకోపమున ధననాశము-

2. కృషిగోభూమినాశంచవిరోధంబంధుభిస్సహ ।
ఉత్సాహభంగంవైకల్యమాదౌచాంత్యేశుభంభవేత్ ॥

మరియు కృషి, గో, భూమినాశము, బంధువిరోధము, ఉత్సాహభంగము, దశాదిలో వైకల్యము-అసగా కష్టములు, దశాంత్యమున సుఖము కలుగును.

3. భుక్తౌశుభానాంతత్కాలేగురౌకేంద్రగతస్యతు ।
రాజ్యలాభంమనోత్సాహంవస్త్రవాహనభూషణం ॥

ఆ గురుదశలో-శుభభుక్తిలో-రాజ్యలాభము, మానసోత్సాహము, వస్త్ర, వాహన, భూషణములు-

4. దానహోమజపాద్ధర్మంనృపలాలనమానసం ।
సర్వోపకారంకల్యాణంవిచిత్రాంబరకాంచనం ॥

దానము, హోమము, జపాదికము, ధర్మము, రాజసమ్మానము, సర్వులకు ఉపకారము, ఇంటిలో కల్యాణము, విచిత్ర వస్త్రములు, బంగారము లభించును.

5. త్రికోణస్థగురోఃపాకేశుభభుక్తౌమహత్సుఖం ।
ప్రాకారగోపురాదీనాంనిర్మాణందేవతర్పణం ॥

త్రికోణగతుడయిన గురునిదశలో—శుభభుక్తిలో-మహాసుఖము, ప్రాకారగోపురాది నిర్మాణము, దేవపూజ కలుగును.

6. భాగ్యోత్తమంమహత్ప్రీతిందారపుత్రార్థసంగ్రహం ।
విదేశయానాదర్థాప్తింయశోవిద్యాంజయంసుఖం ॥

మరియు అట్టి దశాంతర్దశలో—ఉత్తమ భాగ్యము, ప్రీతి, భార్యాపుత్ర, ధన సంగ్రహము-ప్రోగుచేయుట, విదేశ ప్రయాణమువలన ధనప్రాప్తి, కీర్తి, విద్య, జయము, సుఖము కలుగును.

7. తత్రస్థితగురోఃపాకేపాపినాంచహృతిర్యదా ।
దారపుత్రనృపక్రోధంబంధూనాంమరణంధ్రువం ॥

ఆ గురుదశలో—పాపభుక్తిలో-భార్యాపుత్ర కష్టము, రాజకోపము, బంధు మరణము కలుగును.

8. బుద్ధిభ్రమంపదభ్రంశంకార్యవిఘ్నకరంతథా ।
చోరాదిదేహపీడాంచకురుతేనాత్రసంశయః ॥
మరియును—మతిచెడుట, ఉద్యోగముపోవుట, కార్యము విఘ్నములతో చెడుట, చోర, అగ్నిపీడ, దేహబాధ కలుగును.

9. స్వకులాచారహీనంచపరదారాభిమర్శనం ।
చంచలంమానహానించమణివిద్రుమనాశనం ॥
మరియు స్వకులాచారము చెడుట, పరదారగమనము, చాంచల్యము, మాన హాని, మణి విద్రుమాదినాశము కలుగును.

10. షష్ఠాష్టమవ్యయస్థస్యగురోఃపాకేశుభేతరః ।
కరోతిస్వకులాచారహీనంరాజ్యార్థనాశనం ॥
షష్ఠాష్టమ వ్యయములలో (6,8,12) ఉన్న గురునిదశలో-పాపభుక్తిలో-స్వకులాచారహీనత, రాజ్యము-ఉద్యోగ నాశము, ధననాశము కలుగును.

11. ఆత్మార్థంబంధుమరణంవిదేశంచనృపాద్భయం ।
భూవివాదంమనోదుఃఖంవ్యాధినాభయమేవవా ॥
మరియును, బంధుమరణము, విదేశ ప్రయాణము, రాజభయము, భూమి వివాదము, మనోదుఃఖము, వ్యాధిచే భయముగాని కలుగును.

12. గురోర్నాశగతస్యాపిపరిపాకేమహత్సుఖం ।
దేశగ్రామాధిపత్యంచశుభభుక్తౌమహద్యశః ॥
అష్టమమందున్న గురునిదశలో-శుభభుక్తిలో - సుఖము, దేశ, గ్రామాధిపత్యము, కీర్తి, కలుగును.

13. దేహారోగ్యంకరంకించిద్గజాశ్వాద్యంబరాణిచ ।
సుఖభోజనముల్లాసంక్షీరదధ్యాజ్యశర్కరాః ॥
మరియు దేహారోగ్యము, గజ, అశ్వాదిలాభము, వస్త్రములు, సుఖభోజనము, ఉల్లాసము, పాలు, పెరుగు, నెయ్యి, శర్కరల భోజనమున సుఖము కలుగును.

14. తృతీయాయగతస్యాపిగురోఃపాకేమహద్యశః ।
సౌమ్యానాంభుక్తికాలేతువస్త్రవాహనభూషణం ॥
తృతీయ లాభగతుడయిన గురునిదశలో—శుభభుక్తిలో-కీర్తి, వస్త్ర, వాహన, భూషణప్రాప్తి-

15. మణివిద్రుమముక్తాశ్చకాంచనాన్యంబరాణిచ ।
దేశాధిపత్యంమంత్రిత్వంలభతేనాత్రసంశయః ॥

మరియు మణులు, పగడాలు, ముత్యాలు, బంగారము, వస్త్రాలు, దేశాధిపత్యము, మంత్రిత్వము లభించును.

16. తాదృశస్యగురోర్దాయేపాపభుక్తౌమహద్భయం ।
ఆచారహీనంకురుతేస్వకులోద్భవనాశనం ॥

ఆ గురుదశలోనే-పాపభుక్తిలో-మహాభయము, ఆచారహీనత, కులనాశనము జరుగును.

17. విదేశవాసంకష్టంచనానాదుఃఖపరిభ్రమం ।
ఏవమాదౌదశాంతేచసుఖవాహనభోజనం ॥

మరియు విదేశవాసము, కష్టము, నానాదుఃఖములు, తిరుగుడు, ఇవి దశాదిలో జరుగును. దశాంత్యమున-సుఖము, వాహనప్రాప్తి, భోజనప్రాప్తి కల్గును.

18. ధనస్థితగురోర్దాయేశుభభుక్తౌధనాగమం ।
విద్యాలాభంజయంసౌఖ్యందారపుత్రనృపాత్సుఖం ॥

ద్వితీయస్థుడయిన గురుదశలో-శుభభుక్తిలో - ధనలాభము, విద్యాలాభము, జయము, సౌఖ్యము, భార్యాపుత్రులకు, రాజువలన సుఖము కలుగును.

19. సర్వేషాముపకారిత్వంధనాధిక్యంమహత్ప్రియం ।
భోజనంపౌష్టికంచైవధర్మదానాధ్వరాదికం ॥

మరియు పరోపకారము, అధికధనము, ప్రియత్వము, పుష్టిభోజనము, దానధర్మాదులు, యజ్ఞయాగాదులు చేయును.

20. ద్వితీయస్థగురోఃకాలేపాపభుక్తిర్యదాతదా ।
కరోతిదుఃఖబాహుళ్యంరాజ్ఞాంహృతధనంతదా ॥

ఆ గురుదశలో-పాపభుక్తిలో- అనేక దుఃఖములు, రాజుచే ధనమపహరింపబడుట-

21. బంధుద్వేషంమనోద్వేగంవాచాకాఠిన్యమేవచ ।
కుభోజనాదిదుష్కర్మకుత్సితప్రేష్యభావతాం॥

మరియును-బంధుద్వేషము, మనస్సున కుద్వేగము, వాక్పారుష్యము, కుత్సిత భోజనము, దుష్కర్మలుచేయుట, నీచునివద్ద సేవకత్వము కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్ర తాత్పర్యమున గురుదశాంతర్దశాఫలమను
త్రయస్త్రింశాధ్యాయము



# చతుస్త్రింశాధ్యాయము

1. కేంద్రస్థితస్యశుక్రస్యసౌమ్యానాంతుహ్యతిర్యదా ।
రాజ్యాప్తింరాజసన్మానంయానాంబరవిభూషణం ॥
కేంద్రమందున్న శుక్రదశలో-శుభభుక్తిలో-రాజ్యలాభము, రాజసన్మానము వాహనము, వస్త్రము, అలంకారప్రాప్తి కలుగును.

2. ఉత్సాహంకీర్తిసంపన్నంస్త్రీపుత్రధనసంపదః ।
భాగ్యోత్తరంమనోధైర్యంరాజద్వారాధిపత్యకం ॥
మరియు ఉత్సాహము, కీర్తి, భార్యాపుత్ర సుఖము, ధన,సంపదలు, ఉత్తర భాగ్యము, మనోధైర్యము, రాజద్వారమున అధిపత్యము కలుగును.

3. తథావిధస్యశుక్రస్యపాపభుక్తౌధనక్షయం ।
కుభోజనంతువస్త్రంచశుభకర్మవినాశనం ॥
ఆ శుక్రదశలో-పాపభుక్తిలో-ధననాశము, కుత్సితభోజనము, మాసినబట్ట, శుభకర్మనాశము కలుగును.

4. శుక్త్యాదౌఫలమేవంస్యాదంత్యేశోభనమాదిశేత్ ।
గోభూమిధనలాభంచదూరదేశాద్ధనాయతిం ।
దశాదిలో చెడుఫలములున్నా, దశాంత్యమున-శుభము, గో, భూమి, ధన లాభము, దూరదేశము నుండి వచ్చిన ధనప్రాప్తి కలుగును.

5. త్రికోణస్థస్యశుక్రస్యశుభభుక్తౌశుభక్రియా ।
దేవభూసురభక్తించసుతదారవివర్ధనం ॥
త్రికోణములందున్న శుక్రదశలో-శుభభుక్తిలో-శుభకర్మలు, దేవబ్రాహ్మణ భక్తి, భార్యాపుత్ర వృద్ధియు-

6. యజ్ఞకర్మాదిలాభంచసుభూషణజయావహం ।
ఆరోగ్యందేహకాంతించచింతితార్థంమనోరథం ॥
మరియును యజ్ఞకర్మాదులు, మంచి అలంకారములు, జయము, ఆరోగ్యము, దేహకాంతి, అనుకొన్న పనులు నెరవేరుట జరుగును.

7. తథావిధస్యశుక్రస్యపాపభుక్తౌమనోరుజం ।
అనారోగ్యమమర్యాదంనృపచోరాగ్నిపీడనం ॥
అట్టి శుక్రదశలో-పాపభుక్తిలో-మనోవ్యాధి, అనారోగ్యము, అమర్యాద, రాజచోరాగ్నిపీడ-

8. కుస్త్రీవశంతువార్తాంచబంధుద్వేషంమతిభ్రమం ।
దుస్స్వప్నంగౌశిపతనమపకీర్తింలభేన్నరః ॥
మరియు, కుత్సిత స్త్రీకి వశుడగుట, దుర్వార్తలు, బంధుద్వేషము, మతి భ్రమణము, దుస్స్వప్నము, బల్లిపడుట, అపకీర్తి కలుగును.

9. పాకేదుస్థస్యశుక్రస్యశుభభుక్తౌమహద్యశః ।
రాజసన్మానమర్థాప్తింపుత్రస్త్రీధనసంపదః ॥
షష్టాష్టమవ్యయము(6,8,12)లందున్న శుక్రదశలో-శుభభుక్తిలో-కీర్తి, రాజసన్మానము, ధనప్రాప్తి, భార్యా పుత్రసుఖము, ధన, సంపదలు కలుగును.

10. వస్త్రవాహనభూషాప్తిమాదౌచాంతేమనోరుజం ।
బంధుద్వేషంగురోర్బాధాంస్వకులోద్భవనాశనం ॥
మరియు వస్త్ర, వాహన, భూషణప్రాప్తి, ఇవి దశాదిలో జరుగును. దశాంతమున-మనోవ్యథ, బంధుద్వేషము, పెద్దలకుబాధ, స్వకులనాశము కలుగును.

11. శుభగ్రహాణాంభుక్తౌచదేహారోగ్యంమహత్సుఖం ।
పరాన్నపరవస్త్రాప్తింగంధమాల్యాదిభూషణం ॥
6,8,12 లందున్న శుక్రదశలో-శుభభుక్తిలో-దేహారోగ్యము, మహాసుఖము, పరాన్నభోజనము, పరవస్త్రప్రాప్తి, గంధమాల్యాదులు, భూషణములు లభించును.

12. భుక్త్యాదౌఫమేలవంస్యాదంతేక్లేశకరంభవేత్ ।
చోరాగ్నిదేహపీడాంచస్వబంధుజననాశనం ॥
దశాదిలో ఇట్లుండును. కాని దశాంతమున క్లేశము నిచ్చును. చోరాగ్నిపీడ, బంధునాశము కలుగును.

13. తృతీయాయస్థశుక్రస్యపరిపాకేశుభేతరే ।
హృతౌదుఃఖమవాప్నోతిధనధాన్యవినాశనం ॥
తృతీయస్థుడయిన శుక్రదశలో-పాపభుక్తిలో-దుఃఖము, ధనధాన్య నాశము కలుగును.

14. ఉద్యోగభంగంక్లేశంచచోరాగ్నినృపపీడనం ।
భూవివాదంస్వబంధూనాంనాశనంస్వపదచ్యుతిం ॥
మరియు ఉద్యోగము పోవుట, క్లేశము, రాజచోరాగ్నిపీడ, భూవివాదము, బంధునాశము, స్వస్థానచలనము కలుగును.

15. తథావిధస్యశుక్రస్యశుభభుక్తౌమహత్ప్రియం ।
దారపుత్రార్థలాభంచస్వబంధుజనరక్షణం ॥

అట్టి శుక్రదశలో-శుభభుక్తిలో-ప్రియమైన పనులు, భార్యాపుత్ర ధన లాభము, బంధు రక్షణ కలుగును.

16. విద్యాజయంమనోల్లాసందేవభూసురతర్పణం ।
యజ్ఞాదికర్మలాభంచలభేన్నామద్వయంతథా ॥

మరియు, విద్యాజయము, మనస్సున కుల్లాసము, దేవబ్రాహ్మణ సంతర్పణము, యజ్ఞాదిక్రియలు, నిరుదునామము కలుగుట జరుగును.

17. ధనస్థితస్యశుక్రస్యపాపభుక్తౌఫలంవదేత్ ।
రాజదండంమనోదుఃఖంహృద్గుదాక్షిప్రపీడనం ॥

ధనస్థానస్థితుడయిన శుక్రదశలో-పాపభుక్తిలో- రాజదండన, మనోదుఃఖము, హృదయమునకు కన్నులకు పీడ, మూలవ్యాధియు కలుగును.

18. విద్యావాదంకృషేర్నాశంకార్యహానింపదభ్రమం ।
వహ్నిచోరాదిభీతించలభతేనాత్రసంశయః ॥

అట్టి దశలో-విద్యావాదము, కృషినాశము, కార్యహాని, స్థానచలనము, అగ్నిచోరాదిపీడ కలుగును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున-శుక్రదశాంతర్దశాఫలంబను
చతుస్త్రింశాధ్యాయము



# పంచత్రింశాధ్యాయము

1. కేంద్రస్థితశనేర్దాయేయదాపాపహృతిస్తదా ।
స్థానచ్యుతింప్రవాసంచనృపచోరాగ్నిపీడనం ॥

కేంద్రమందున్న శనిదశలో-పాపభుక్తిలో-స్థానభ్రంశము, విదేశగమనము, రాజచోరాగ్నిపీడ కలుగును.

2. దారార్థసుతబంధూనాంమరణంకర్మనాశనం ।
పరప్రేష్యంమనోదుఃఖంగుల్మశూలాదిపీడనం ॥

భార్యాపుత్రులకు కష్టము, బంధు మరణము, కర్మనాశము, పరులకు సేవ చేయుట, గుల్మరోగము, శూలరోగబాధ కలుగును.

3. తథావిధశనేర్దాయేశుభభుక్తౌమహత్సుఖం ।
నృపాభిషేకమర్థాప్తిందేశగ్రామాధిపత్యకం ॥
కేంద్ర శనిదశలో- శుభభుక్తిలో-మహాసుఖము, రాజాభిషేకము, ధనప్రాప్తి, దేశ, గ్రామాధిపత్యము-

4. ఫలమీదృశమాదౌతుభుక్త్యంతేరోగపీడనం ।
పరాపవాదంబంధూనాంమరణంధననాశనం ॥
ఈ ఫలము దశాదిలో కలుగును దశాంతమున-రోగపీడ, పరాపవాదము, బంధు మరణము, ధననాశము కలుగును.

5. త్రికోణస్థశనేర్దాయేపితృపుత్రవినాశనం ।
పాపభుక్తౌమహత్కష్టంకర్మనాశమథాపివా ॥
త్రికోణమందున్న శనిదశలో-పాపభుక్తిలో-పితృ, పుత్ర నాశము, మహా కష్టము, కర్మనాశము కలుగును.

6. వాతాక్షిరోగమూలంచస్వబంధుకలహంతథా ।
ఉద్యోగభంగందుఃఖంచస్థలధాన్యవినాశనం ॥
మరియు వాతవ్యాధి, కంటిరోగము, మూలవ్యాధి, బంధు కలహము, ఉద్యోగ భంగము, దుఃఖము, స్థల, ధాన్యనాశము జరుగును.

7. తథావిధశనేర్దాయేశుభభుక్తౌమహత్సుఖం ।
రాజపూజ్యంకృషేర్లాభంస్థలధాన్యవివర్ధనం ॥
కోణ శనిదశలో-శుభభుక్తిలో-మహాసుఖము, రాజపూజ్యము, కృషిలాభము, స్థల ధ్యానవృద్ధి కలుగును.

8. స్వబంధుదారపుత్రాణామారోగ్యంభూషణాదికం ।
భృత్యమిత్రార్థసంపత్తిర్లభతేకర్మసంగ్రహం ॥
మరియు భార్యాపుత్రులకు, బంధువుల కారోగ్యము, భూషణాదిప్రాప్తి, భృత్య, మిత్ర, ధన, సంపత్తి, పుణ్యకర్మలు చేయుట జరుగును.

9. షష్ఠాష్టమవ్యయస్థస్యశనిపాకేఖలస్యతు ।
హృతౌదుఃఖంమహత్కష్టంస్థాననాశంధనక్షయం ॥
షష్టాష్టమ వ్యయములందున్న శనిదశలో-పాపభుక్తిలో-దుఃఖము, కష్టము, స్థాననాశము, ధన క్షయము కలుగును.

10. గుహ్యరోగంవిషార్తించజ్వరవహ్నినృపాద్భయం ।
అత్యార్తబంధుమరణముద్యోగస్యవినాశనం ॥

మరియు గుహ్యస్థానమునకు రోగము, విషమువలన దుఃఖము, రాజ, జ్వర, అగ్నిపీడ, అత్యాప్తబంధు మరణము, ఉద్యోగముచెడుట జరుగును.

11. షష్ఠాష్టమవ్యయస్థన్యశుభభుక్తౌశనేర్యదా ।
పాకేశుభఫలంప్రోక్తంలాభారోగ్యసుభూషణం ॥

దుస్థానస్థ శనిదశలో (6,8,12) శుభభుక్తిలో-శుభఫలము, లాభము, ఆరోగ్యము, నగలు-

12. ఆరోగ్యకాంతిమత్వంచదేశగ్రామాధిపత్యకం ।
శత్రునాశంమనోత్సాహంధనధాన్యవివృద్ధిదం ॥

మరియు, ఆరోగ్యము, కాంతి కలుగుట, దేశ, గ్రామ-అధిపత్యము, శత్రు శత్రునాశము, మానసోత్సాహము, ధన, ధాన్యములు వృద్ధిపొందుట కలుగును.

13. తృతీయలాభరాశిస్థశనేఃపాపహృతిర్యదా ।
పాకేధనాప్తిందుఃఖంచభ్రాతృవర్గవినాశనం ॥

తృతీయ లాభములందు శనిదశలో-పాపభుక్తిలో-ధనలాభము, దుఃఖము సోదరవర్గ నాశము కలుగును.

14. విదేశయానంకలహంవైకల్యంభృత్యనాశనం ।
కుభోజనంపరప్రేష్యకునారీగమనంలభేత్ ॥

మరియును పరదేశయానము, కలహము, మనోవైకల్యము, భృత్యనాశము, కుత్సిత భోజనము, పరులకు సేవకుడగుట కుత్సిత నారీ సంగమము కలుగును.

15. ధనస్థితశనేఃపాకేయదాపాపహృతిస్తదా ।
రాజదండంమహద్విఘ్నంకారాగృహనిరోధనం॥

ధనస్థుడైన శనిదశలో-పాపభుక్తిలో-రాజదండన, కార్యవిఘ్నము, కారాగార వాసము-

16. ఉత్సాహభంగందేహార్తింజ్వరాతిసారపీడనం ।
రాజ్యనాశంగజాశ్వానాంమరణంవాహనాద్భయం ॥

మరియు ఉత్సాహ భంగము, దేహబాధ, జ్వరము, అతిసారపీడ, రాజ్యనాశము; గజ, అశ్వమరణము, వాహనభయము కలుగును.

17. ద్వితీయస్థశనేఃపాకేశుభభుక్తౌమనోదృఢం ।
ఉపకర్తృత్వమన్యేషాంద్యూతవిద్యావినోదనం ॥

ద్వితీయ మందున్న శనిదశలో-శుభభుక్తిలో-మనోదార్ఢ్యము, ఇతరులకు ఉపకారముచేయుట, జూదమాడుట, వినోదము కలుగును.

18. గానకేళీరహస్యంచభోజనాంబరభూషణం ।
ఉద్యోగసిద్ధింరాజ్యంచమణివిద్రుమభూషణం ॥
మరియు గానకేళీ రహస్యము, మృష్టభోజనము, వస్త్రభూషణప్రాప్తి, ఉద్యోగ సిద్ధి, రాజ్యము, మణులు, పగడాలు, భూషణములు లభించును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున - శనిదశాంతర్దశాఫలములనెడి పంచత్రింశాధ్యాయము

# షట్త్రింశాధ్యాయము

1. లగ్నస్థసైంహికేయస్యదాయేపాపహృతిర్యదా ।
కరోతిదుఃఖంబాహుళ్యంనృపచోరాగ్నిపీడనం ॥
లగ్నస్థుడైన రాహుప్రదశలో-పాపభుక్తిలో-ఎన్నో దుఃఖాలు, రాజచోరాగ్ని పీడ కలుగును.

2. తత్రతన్థభోగినఃపాకేశుభభుక్తౌశుభంవదేత్ ।
గృహక్షేత్రాభివృద్ధించభోజనాంబరభూషణం ॥
లగ్న రాహుదశలో శుభభుక్తిలో-శుభము, గృహ, భూమి, అభివృద్ధి, భోజనము, వస్త్రములు, భూషణములు లభించును.

3. షడష్టాంత్యగతస్యాహేఃపరిపాకేశుభేతరా ।
హృతిఃకరోతిచోరాగ్నినృపభీతింవృషాద్భయం ॥
షష్టాష్టమ వ్యయగతుడయిన రాహుదశలో-పాపభుక్తిలో-చోర, అగ్ని, రాజ భయము, వృషభమువలన భయము కలుగును.

4. శ్వాసక్షయప్రమేహాదిశూలకాసాదిరోగరుక్ ।
కుభోజనంకువస్త్రంచస్థాననాశంనృపాద్భయం॥
మరియు శ్వాస, కాస, క్షయ, ప్రమేహాదులు, శూలరోగము, కుత్సితభోజము, కుత్సితమైన వస్త్రము, స్థాననాశము, రాజభయము కలుగును.

5. దుస్థస్యచాహినాథస్యపరిపాకేశుభాహృతిః ।
ఆదౌశుభంమహత్సౌఖ్యంనృపమానంధనాగమః ।

దుస్థరాహు (6,8,12) దశలో శుభభుక్తిలో-మొదటి భాగమున-శుభకార్య సిద్ధి, సౌఖ్యము, రాజసన్మానము, ధనప్రాప్తి కలుగును.

6. అంత్యేతురాజభీతిస్స్యాత్ స్థానభ్రంశశ్శిరోరుజః ।
కృషిగోభూమివస్త్రాదిబంధుపుత్రార్థనాశనం ॥

దశాంత్యమున-రెండవభాగమున-రాజభయము, స్థానభ్రంశము, శిరోబాధ, కృషి, గో, భూమి, వస్త్రాదినాశము, బంధు. పుత్ర, ధననాశము కలుగును.

7. కేంద్రస్థితస్యతస్యాహేః పాపినాంతుయదాహృతౌ ।
గృహదాహోక్షిరోగశ్చదారపుత్రమహద్భయం ॥

కేంద్రగతుడయిన రాహుదశలో-పాపభుక్తిలో-ఇల్లు తగులబడుట, కంటి రోగము, భార్యాపుత్రులకు మహాభయము కలుగును

8. స్థానచ్యుతింమనోదుఃఖంనిజాచారవివర్జితం ।
అకస్మాత్కలహంభుక్తౌచోదారిన్నృపపీడనం ॥

మరియు స్థానచలనము, మనస్సులో దుఃఖము, నిజాచారము మానుకొనుట, అకారణ కలహము, రాజచోరాది పీడకలుగును.

9. చతుష్టయగతస్యాహేః పరిపాకేశుభాహృతిః ॥
క్వచిత్సౌఖ్యంక్వచిద్ధాన్యంక్వచిత్కీర్తింక్వచిద్ధనం ॥

కేంద్ర రాహుదశలో-శుభభుక్తిలో-ఒకప్పుడు సౌఖ్యము, ఒకప్పుడు కీర్తి, ఒకప్పుడు ధన, ధాన్యములు కలుగును.

10. ఏవమాదౌ శుభుక్త్యంతేరాజకోపాద్ధనక్షయం ।
యుద్ధేపరాజయంచైవవిద్యావాదంమహద్భయం ।

పైన చెప్పిన ఫలములు మొదటిభాగమున జరుగును. దశాంతమున - రాజ కోపమువలన ధననాశము, యుద్ధమున పరాజయము, విద్యావాదము కలుగును.

11. త్రికోణస్థఫణీంద్రస్యపరిపాకేమహత్కృశం ।
పాపభుక్తౌమహత్కష్టంపాపాచారసమన్వితం ॥

త్రికోణమందున్న రాహుదశలో-పాపభుక్తిలో-ఎక్కువగా చిక్కుట, కష్టము, పాపాచారము కలుగును.

12. అపకీర్తింకుభుక్తించకృషిగోభూమినాశనం ।
విప్రలంభంచశౌర్యంచగౌళ్యాదిపతనంభవేత్ ॥

మరియు అపకీర్తి, కుత్సితాన్నము, కృషి, గో, భూమి నాశము, మాటనిలుపు కోలేకపోవుట, శౌర్యము, బల్లిపడుట జరుగును.

13. తథావిధఫణీంద్రదన్యశుభభుక్తౌశుభక్రియాః ।
సుతదారధనాప్తించభుక్త్యంతేఫలమీదృశం ॥

త్రికోణ రాహుదశలో-శుభభుక్తిలో-శుభకర్మలు, భార్యాపుత్ర సుఖము, ధన ప్రాప్తి, ఈ ఫలములు దశాంతమున జరుగును.

14. కించిత్సుఖంతదాదౌతువిదేశగమనంతథా ।
మంత్రోపాస్తింమహోత్సాహంకళత్రాత్మజభూషణం ॥

అట్టి శుభాంతర్దశలో-ప్రథమ భాగమున-దశాదిలో-స్వల్పసుఖము, విదేశ సంచారము, మంత్రోపాసన, మహోత్సాహము, భార్యాపుత్రసుఖము, భూషణప్రాప్తి కలుగును.

15. తృతీయాయగతస్యాహేఃపరిపాకేమహత్సుఖం ।
పాపభుక్తౌనృపాత్ప్రీతింఫలమీదృశమాదితః ॥

తృతీయ లాభములందున్న రాహుదశలో-పాపభుక్తిలో-మహాసుఖము, రాజ ప్రీతి, దశాదిలో కలుగును.

16. అంత్యేకష్టంవినిర్దిష్టంచోరాదినృపపీడనం ।
బంధుద్వేషంమనోదుఃఖంభ్రాతృవర్గవినాశనం ॥

దశాంతమునందు-కష్టములు, రాజచోరాగ్నిపీడ, బంధుద్వేషము, మనోదుఃఖము, సోదరవర్గ నాశము కలుగును.

17. ధనరాశిగతస్యాహేఃపాపినాంతుహృతిర్యదా ।
ధననాశంమనోదుఃఖంభార్యాపుత్రవినాశనం ॥

ధనస్థానమునున్న రాహుదశలో-పాపభుక్తిలో-ధననాశము, మనోదుఃఖము, భార్యాపుత్రనాశము కలుగును.

18. క్రయవిక్రయనిత్తాప్తింవాగ్భూషణమథాపిచ ।
తథావిధఫణీంద్రదన్యశుభభుక్తౌసుభోజనం ॥

ధన రాహుదశలో - శుభభుక్తిలో - క్రయవిక్రయమూలమున ధనలాభము, చక్కగా మాట్లాడుట, మంచి భోజనము ప్రాప్తించును.

19. వస్త్రవాహనభూషాప్తింక్రయవిక్రయభూషణం ।
ఉద్యోగభంగందేహార్తింగూఢపాపంలభేన్నరః ॥

మరియు వస్త్రములు, వాహనములు, నగలు లభించుట, క్రయ విక్రయములు లాభించుట, ఉద్యోగభంగము, దేహబాధ, రహస్యకృత పాపమును పొందును.

ఇది సర్వార్థ చింతామణి ఆంధ్రతాత్పర్యమున-రాహుదశాంతర్దశాఫలమనెడి
షట్త్రింశాధ్యాయము

# సప్తత్రింశాధ్యాయము

1. కేతోశ్చతుష్టయస్థస్యయదాపాపహృతి స్తదా ।
మానభంగమనోద్వేషంనృపచోరాగ్నిపీడనం ॥
కేంద్రగతుడయిన కేతుదశలో-పాపభుక్తిలో-మానభంగము, మనోద్వేషము, రాజచోరాగ్నిపీడ కలుగును.

2. మాతృనాశంతదీయంవాదారపుత్రవినాశనం ।
కర్మనాశంపదభ్రంశమకస్మాత్కలహంవదేత్ ॥
మరియు మాతృనాశముకాని, తల్లివైపువారికి నాశముకాని, భార్యాపుత్ర నాశము, కర్మనాశము, అకారణ కలహము కలుగును.

3. కేతో స్తథావిధస్యాపిశుభభుక్తౌనృపాత్ప్రియం ।
దేహారోగ్యకరంసౌఖ్యంబంధుభిశ్చసమాగమం ॥
కేంద్రగత కేతుదశలో-శుభభుక్తిలో-రాజప్రీతి, దేహారోగ్యము, సౌఖ్యము, బంధు సమాగమము కలుగును.

4. భోజనాంబరభూషాప్తిమాదౌచాంతేమనోరుజం ।
ఉద్యోగభంగంకామార్తంస్వకులోద్భవనాశనం ॥
మరియు భోజన, వస్త్ర, భూషణప్రాప్తి -- ఇవి దశాదిలో కలుగును. తరువాత ఉద్యోగ భంగము, మనోవ్యాధి, స్వకులనాశము కలుగును.

5. త్రికోణరాశియుక్తస్య కేతోర్దాయేశుభేతరే ।
హృదిస్థమంతరంతాపంకరోతివివిధాపదం ॥
త్రికోణగతుడయిన కేతుదశలో - పాపభుక్తిలో - హృదయమున లోపల తాపము, వివిధాపదలు కలుగును.

6. పుత్రమిత్రాదిమరణంపిత్రోర్నాశమథాపివా ।
స్థానార్థకలహాయాసంమిత్రబంధువిరోధితాం ॥
మరియు పుత్రమిత్రాదిమరణము, తల్లిదండ్రులకు కష్టము, స్థాన, ధనముల నిమిత్తము కలహము, ఆయాసము, మిత్రబంధు విరోధము కలుగును.

7. శుభగ్రహాణాంకేతోస్తుపరిపాకేహృతిర్యదా।
కృషిగోభూమిలాభంచవిద్యాబంధుసమాగమం ॥
కోణగతుడయిన కేతుదశలో-శుభభుక్తిలో-కృషి, గో, భూమి లాభము, విద్య, బంధు సమాగమము-

8. భోజనాంబరసౌఖ్యంచభుక్త్యాదౌఫలమీదృశం ।
భుక్త్యంతేస్థానచలనమకస్మాత్కలహాంలభేత్ ॥

మరియు భోజన, వస్త్ర సౌఖ్యము, దశాదియందు జరుగును దశాంతమున - స్థానచలనము, అకారణ కలహము కలుగును.

9. షష్ఠ్వ్యయాష్టమయుక్తస్యకేతోర్దాయేశుభేతరా ।
హ్యాతిఃకరోతిమరణంవిదేశంవాపదభ్రమం ॥

షష్ఠాష్టమ వ్యయము (6,8,12) అందున్న కేతుదశలో - పాప భుక్తిలో - మరణముగాని, విదేశమునకు పోవుటగాని, స్థానచలనము జరుగును.

10. ప్రమేహమూత్రగుల్మాదిరాజచోరాదిపీడనం ।
ఫలమాదౌతదంతేయత్కించిత్సుఖవివర్ధనం ॥

మరియు మేహము, అతిమూత్రము, గుల్మము, రాజచోరాదిపీడ-ఇది దాశాదిలో కలుగును. దశాంతమున-కొద్ది సుఖవృద్ధి కలుగును.

11. భుక్తౌసౌమ్యగ్రహాణాంతుసుఖంస్త్రీపుత్రవర్ధనం ।
ధాన్యాంబరవిభూషాప్తింమణిప్రవరకాంచనం ॥

దుస్థ (6,8,12) కేతుదశలో-శుభభుక్తిలో-సుఖము, భార్యాపుత్రవృద్ధి, ధాన్య, వస్త్ర, భూషణ ప్రాప్తి, మణులు, బంగారము లాభము కలుగును.

12. స్వబంధుజనశత్రుత్వంశిరోక్షిగుదపీడనం ॥
విప్రలంభంచశౌర్యంచగౌణ్యాదిపతనంతథా ॥

స్వజన, బంధు విరోధము, తల, కన్నులకు, రోగము, మూలవ్యాధి, మాట ప్రకారము నడుచుకోలేకపోవుట, శౌర్యము, అస్థానమున బల్లి పడుట జరుగును.

13. తృతీయలాభయుక్తస్యకేతోఃపాకేపరంసుఖం ।
శుభభుక్తౌనృపాత్ప్రీతింవిచిత్రాంబరభూషణం ।

తృతీయ లాభములందున్న (3,11) కేతుదశలో-శుభభుక్తిలో-సుఖము, రాజప్రీతి, విచిత్ర వస్త్రములు, భూషణములు లభించును.

14. వాహనంభూమిలాభంచగంధమాల్యానులేపనం ।
దూరాచ్చామీకరావాప్తింస్వబంధువనపూజ్యతాం ॥

మరియు వాహనము, భూమిలాభము, గంధమాల్యాను లేపనములు, దూరము-విదేశము నుండి బంగారు లాభము, బంధు జన పూజ్యత కలుగును.

15. పాపభుక్త్యంతరేకేతోఃపాపకర్మసమాచరేత్ ।
సర్వేషాంవిఘ్నకర్తృత్వంబంధుభిస్తన్యజీవనం ॥

తృతీయైకాదశగతుడయిన కేతుదశలో - పాపభుక్తిలో - పాపకర్మాచరణము, అన్ని పనులకు విఘ్నము, బంధువుల దయవలన జీవించుట జరుగును.

16. పరప్రేష్యంతువస్త్రంచభుక్త్యాదౌఫలమీదృశం ।
ముక్త్యంతేసుఖమాప్నోతిదారపుత్రధనాదితః ॥

భుక్త్యాదిలో పరులకు సేవకుడగుట, వస్త్రలాభము కలుగును. దశాంతమున-భార్యాపుత్ర ధనాదులవలన సుఖము పొందును.

17. ధనస్థితధ్వజస్యాపిపతిపాకేతుభేతరే ।
కరోతివివిధందుఃఖంభైక్షమన్నంమనోరుజం ॥

ధనస్థితుడయిన కేతుదశలో-పాపభుక్తిలో-వివిధ దుఃఖములు, భిక్షాలబ్ధమైన అన్నము, మనోవ్యాధి కలుగును.

18. పుత్రమిత్రకళత్రాణాంనాశనంమహదాపదం ।
రాజ్ఞాచోరేణవావిత్తంహ్రియతేబంధునాశనం ॥

మరియు పుత్ర, మిత్ర, కళత్రములకు నాశనము, గొప్ప విపత్తు, రాజుచే గాని, చోరులచేగాని ధనమపహరింపబడుట, బంధునాశము జరుగును.

19. శుభభుక్తౌధవాప్తించవిద్యావాదంజయావహం ।
పరోపకారంసర్వేషాంభోజనాంబరభూషణం ॥

ధనస్థ కేతుదశలో- శుభభుక్తిలో ధనప్రాప్తి, జయము కలుగు విద్యావాదము, పరోపకారము, అందరికి భోజన, వస్త్ర, భూషణప్రాప్తి కలుగును.

20. భుక్త్యాదౌఫలమేవంస్యాదంతేకించిద్ధనాగమం ।
వాక్పారుష్యంమనోవిఘ్నంప్రవృత్తేర్భంగమేవచ ॥

ఈ ఫలము లన్నియు దశాదిలో జరుగును. దశాంతమున కొద్దిగా ధనాగమము, వాక్పారుష్యము, కార్యవిఘ్నము, చేయుపనికి భంగము కలుగును.

21. వెల్నాడువోరుగల్లుశ్రీవేంకటేశ్వరశర్మణా ।
ఇతిసామాన్యతోహోరాఫలభాగస్సమీరితః ॥

ఈ రీతిగా వెల్నాడు, ఓరుగంటి వేంకటేశ్వర దైవజ్ఞశర్మచే హోరా ఫల భాగము సామాన్యముగా చెప్పబడినది.

ఇది . సర్వార్థ చింతామణికి ఆంధ్ర తాత్పర్యమున కేతు దశాంతర్దశా ఫల మను సప్తత్రింశాధ్యాయము.

ఇది శ్రీ శాండిల్య గోత్ర సముద్భూత, కంభంపాట్యుపపద, రామకృష్ణశాస్త్రి వర్య తనూజ "తర్కాచార్య", "భాషాప్రవీణే"త్యాది పరీక్షోపాధివిరాజిత, వేదాంత, జ్యోతిష, ఆయుర్వేదాది శాస్త్రజ్ఞ, ఉభయభాషా కవితా విలాస, "డాక్టరేటు" ఉపాధి శోభిత, పితృ పాద ప్రసాద లబ్ధ జ్యోతిష మర్మతత్వజ్ఞ, రామగోపాల కృష్ణమూర్తి విరచిత మ్మగు నాంధ్ర తాత్పర్యము సర్వము సంపూర్ణము.

## —: కారకత్వములు :—

రవి :- పితృ, రాజ్య, యజ్ఞ, సువర్ణ, అశ్వ, పద్మరాగ, సింహాసన, రక్తఛత్ర, తామ్ర, తృణ, భైషజ్య, రక్తకాలుకా, శోణ, అగ్ని, శౌర్య, నేత్ర, చికిత్సలకు కారకుడు.

చంద్రుడు :- మాతృ, మనస్సు, వస్త్ర, జల, కృషి, స్త్రీ, విత్త, గో, క్షీర, సస్య, వ్రీహి, మణి, శంఖ, జలజ, ధవళా, తపత్ర, చామర, శుక్ల, షష్టి, విపయ, రసవర్గ, ఫలవర్గ, ధాత్రీ, దీప్తి, సంతోషకారకుడు.

కుజుడు :- భ్రాతృ, యువరాజ, పితృ, ఉష్ణ, బాహుబల, సాహస, ధాతు, ప్రహరణ, వినాద, మేష, రక్తకాలకా, రుధిర, కౌరబలి, దావ, మరు, పర్వత, కాంత, తామ్ర, కనక, ప్రవాళ, మాణిక్యముద్రా, బంధ, దండనీతి, సేనా, దుర్గ, శతఘ్ని, విషకీట, వంశ, ఖాదిర, గంధక, కేసరి, వ్యాఘ్ర, ప్రతాపకారకుడు.

బుధుడు :- కౌమార, ప్రజ్ఞా, బుద్ధి, వాణిజ్య, వంచన, యుక్తి, లిపి, గణిత, కావ్య, శిల్ప, తంతువాయ, ముద్గ, మైథున, ప్లవ, సస్య, దహన, వ్యజన, కన్యకా, కోలాహల, చిత్ర, శుక, క్రీడా, తాంబూల, పంజర, పలాశ, మాధ్యస్థ్య, సంధాన, సౌభాగ్యకారకుడు.

గురుడు :- సాచివ్య, మంత్ర, ప్రాధాన్య, వేద, వేదాంత, బ్రాహ్మణ్య, భక్తి, శ్రద్ధ, మేధా, ప్రణవ, పారిశుద్ధ్య, సదాచార, వైష్ణవ, గజ, శిష్ట, కార్తస్వర, శకల, జయపత్రి, కీర్తి, గౌరవ, విద్యా, ప్రవచన, పాండిత్య, దేవాగార, ధర్మ, ధన, బాంధవ్య, సంతాన, సౌఖ్యకారకుడు.

శుక్రుడు :- మంత్రిత్వ, ప్రాబల్య, సాహ్య, మౌక్తిక, స్త్రీ, భోగ, కుటుంబ, కళత్ర, విస్రావ, రజత, ధవళాంబర, దృష్టి, ప్రకాశ, వృష్టి, పుష్టి, సౌహార్ద, కవిత్వ, కౌశల్య, సుభోజన, శయ్యా, వినోద, కేళి, గాన, కామ, పుష్ప, గంధ, భోగకారకుడు.

శని :- ప్రేష్య, దాస్య, బంధన, గ్రహణ, పారిచర్య, కైంకర్య, వాతవ్యాధి, క్షుద్రకృత్య, నైచ్య, కుతంత్ర, దుస్సహవాస, కార్యభంగ, కిరాత, వ్యసన, ద్యూత, పాన, మద, తిల, తైల, భాండ, కిట్టులోహ, నీలవస్త్ర, కంబళ, ఖర, పాదుకా, మౌర్ఖ్య, శిక్షాగార, కష్ట, క్లేశ, ప్రాభవ, శిల్ప, భృతి, మృతికారకుడు.

రాహువు :- ఖండన, దండ, ప్రచండ, కులసర్ప, మేచ్ఛ ధైర్య, ప్రతాప, ధూమ, శ్మశాన, తస్కర, ఖేద, విధవా, వ్యవహార, శిలా, కుట్టన, రంధ్ర, గర్త, వల్మీక, నాడింధమ, చర, కిణ్వకిణ, వృషతపన, హోరామయ, మహోత్పాత, జ్వర, అపస్మార, విషూచీ, సంకోచ, దేశాటన, వైరాగ్య, బలాత్కార భ్రష్టత్వమిశ్ర మహారణ్య ఘోరయుద్ధనార్జన సుఖకష్టకారకుడు

కేతువు :- మత, వైరాగ్య, మూఢభక్తి, పుండ్ర, చిహ్న, డంభనటన, ప్రకరణ, తీర్థాటన, భిక్షాటన, లోభ, పైశాన్య, కలహ, మిత్ర, భేదవికార, ప్రత్తిక జ్ఞాన, విప్లవ, శైవ, దీక్ష, పర్యాయ, కర్మ, గోహాప్రవేశ, నిధ్యంజన, సాధన చిత్రకర్మ, కీర్తి, ప్రతాప, కుక్షింభరిత్వ, మిశ్రాభరణ, కపాలి, కార్తాంతిక, శాకునిక, చికిత్సక, లింగిత్వమోక్ష కారకుడు.

గుళికుడు :- జీవహింసా: పరపీడన, చౌర్య, వ్యభిచార, పాప, పరద్రోహ, పుల్కస, ప్రాణాపహరణ, దౌర్జన్య, బ్రహ్మద్వేష, దైవద్వేష, కులద్రోహ, కౌటిల్య, దురాచార, దుఃఖకారకుడు.

## —: ద్వాదశభావములకు - కారకత్వములు :—

లగ్నము :- శరీర, జీవాత్మ, త్వక్, చర్మ, మాంస, రుధిర, మేదః, మజ్జా, అస్థి, స్నాయు, స్వామి, కర్తృ, అహంకార కారకము.

ద్వితీయము :- కుటుంబ, నేత్ర, ధన, వాక్, ద్రవిణ, కారకము.

తృతీయము :- భ్రాతృ, విక్రమ, జ్ఞాతి, దుశ్చిత్త, యోగక్రియా, ఉపచయ, పాప, జీవన, కనిష్ఠ భ్రాతృజీవిత, కలి, కారకము.

చతుర్థము :- మాతృ, సుఖ, జ్ఞాతి, గృహ, బంధు, వృద్ధి, జల, వాహన, కుటుంబ, ఉచ్చ్రయ, కంటక, సౌఖ్యకారకము.

పంచమము :- పుత్ర, బుద్ధి, హర్ష, జ్ఞాన, వాక్, విద్యా, సాచివ్య, ప్రాధాన్య, కౌశల్య, పాండిత్య, ప్రావీణ్య, శిల్పాది కారకము.

షష్ఠము :- అరి, రోగ, కర్జ, కలి, దుఃఖ, విపత్, భంగ, దోష, ఉపచయ, క్షుద్రోపద్రవ, పీడాకారకము.

సప్తమము:- కళత్ర, క్రీడా, కామ, శృంగారకేళీ, భోజన, విహార, సంసారకారకము.

అష్టమము :- ఆయుష్షు, దురిత, ప్రత్యవాయ, కలి, దుఃఖ, మృత్యు, కారకము.

నవమము :- పితృ, దైవ, గురు, మంత్ర, పుణ్య, శుభ, భాగ్యకారకము.

దశమము :- కర్మ, రాజ్య, వ్యాపార, విభవ, మాన, గౌరవ, జీవన, స్వత్వకారకము.

ఏకాదశము :- లాభ, సర్వాదాయ, శివదీక్ష, పారివ్రజ్య, ప్రవృత్తి, ధర్మ, లౌకిక, ఉపచయకారకము.

ద్వాదశము :- వ్యయ, వినియోగ, దురుపయోగ, పుణ్య, హ్రాస, జీవిత, రక్షణ, దారిద్ర్య, దేహకార్శ్యకారకము.



శ్రీ ర స్తు

మం త్రే శ్వ ర ప్ర ణీ త

జా త క

# ఫ ల దీ పి క

## ( ప్రాచీన జ్యోతిష గ్రంథము )

విపులమైన తెలుగు తాత్పర్య సహితము

వ్యాఖ్యాత : దైవజ్ఞ శ్రీ ఉపద్రష్ట కామేశ్వరరావు

ప్రాచీన సాంప్రదాయ జ్యోతిష గ్రంథములలో "ఫలదీపిక" యొక మహోన్నత గ్రంథము. ఈ గ్రంథము వివిధ విషయములకు అతివివరణలతో మొత్తము 28 అధ్యాయములతో అలరారుచున్నది. గ్రంథకర్త శ్రీమంత్రేశ్వరుడు. తనగ్రంథ మగు ఫలదీపికయందు ప్రతీ విషయమూ అతి జాగరూకతతో యనేకానేక విషయములయొక్క సాంప్రదాయములనూ, యోగవియోగముల ఫలముల సమయాసమయములను అతి విపులముగా విశదీకరించి యుండెను.

జాతకుడు సంపాదన విషయము యోగములనుబట్టి ఏవిధముగా యుండునో, అటులనే స్త్రీకి భర్త లేక పురుషులకు భార్యాసంప్రాప్తమూ, వివిధములగు గ్రహస్థితులనుబట్టి, రూపము, గుణము, ధనము మొదలగు విషయములనేగాక - సంప్రాప్తమగు స్త్రీ, లేక, పురుషునియొక్క జన్మరాశి, నక్షత్రము, ప్రాంతము మొదలగు విషయములను విపులీకరించుటయేగాక మరణవిషయములో జీవి యే లోకమునకు నిర్యాణాంతరము చేరునో, గ్రహగతులనుబట్టి జీవి యే మాసమునందు, ఏ పక్షమున ఏ తిథి, ఏ నక్షత్రమున ఏ దినభాగములో మరణప్రాప్తి మొదలగు విషయములేగాక, గోచార విషయములో ఏ గ్రహము ఏ రాశిలో ఏ భాగలోయున్న యేఫలమొసంగునో మొదలగు అనేక నిగూఢ విషయములను అతి సూక్ష్మపద్ధతిలో శాస్త్ర సమ్మతముగా తెలుసుకొనుటకు ఉపయోగపడు ప్రామాణిక గ్రంథముగా రూపొందించెను.

ఈ గ్రంథము జ్యోతిశాస్త్ర జిజ్ఞాసులు, పండితులు తప్పక చదవవలసిన గ్రంథము. ఆంధ్రానువాదములో వివిధ ప్రాచీన గ్రంథములయందలి విశేషములను కూడా పొందుపరచబడినవి. జ్యోతిశ్శాస్త్రాకాశములో ధృవతారయనదగు యీ గ్రంథము యింతవరకూ అలభ్యముగా యుండి యిప్పుడు దైవజ్ఞుల హస్తభూషణమగుననుటలో సందియము లేదు.

వెల : 48-00

శ్రీ ర స్తు

వేదవేదాంగ విద్వద్వరేణ్యుండును, జ్యోతిషశాస్త్ర పారంగతుడును నైన

కల్యాణవర్మ విరచిత

# సారావళి

( ప్రాచీన జ్యోతిష శాస్త్రగ్రంథము

ఏబది నాలుగు అధ్యాయములు - పూర్తి కేలికోబైండు

విపుల తెలుగు తాత్పర్యసహితము.

**వెల : రు. 63/- (పోస్టు ఖర్చులు అదనము)**

—: వ్యాఖ్యాత :—

శతాధిక గ్రంథకర్త, జ్యోతిష విశారద

## శ్రీ వడ్డాది వీర్రాజు సిద్ధాంతి

జ్యోతిష శాస్త్రములో యిట్టి గ్రంథము వేరొకటి లేదు. జ్యోతిష శాస్త్ర గ్రంథము లన్నిటిలో సారమంతయు తీసి యీ గ్రంథము వ్రాయబడెను,

ఇందు ఏకగ్రహ-ద్విగ్రహ-త్రిగ్రహ-చాతుర్గ్రహ-పంచగ్రహ, షడ్గ్రహ యోగములు-నాభస యోగములు-రాజయోగములు-విపరీత రాజయోగములు - మహాపురుష యోగములు-తను, ధన, భ్రాతృ, విద్య, పుత్ర, కళత్ర, ఆయుర్దాయ, పదవి, లాభ, వ్యయభావములు తెలుసుకొను విధానములతో ఈగ్రంథమును చదివి జాతక ఫలితములు సులభముగ తెలుసుకొనవచ్చును.